Acc. No. 11421

# శ్రీ మద్వాల్మీకి రామాయణోపన్యాసములు

(అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండములు

Vol. 2.

గ్రంథకర్త:

'ఆర్ష ధర్మ ప్రబోధక'

## నండూరు సుబ్రహ్మణ్యశర్మ

ప్రకాశకులు :

## ఆర్షవిజ్ఞాన గ్రంథమాల

శివాలయం వీధి * సత్యనారాయణపురం

విజయవాడ-11.

ప్రథమ ముద్రణ : 1988

ప్రతులు : 1000

Acc. No. 1421

294.592
SUB
Vol 5

ప్రతులకు :

ఆర్ష విజ్ఞాన గ్రంథమాల,
23-22-55; శివాలయం వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ—520 011.

వెల : రు. 30/-

ముద్రణ :

రాఘవేంద్ర ప్రింటింగ్ వర్క్స్,
వ్యాకరణంవారి వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ—11.

# నా మాట

భారతీయులారా!

పాఠకులారా!

నా జననము చాంద్రమాన నలనామ సంవత్సర శ్రావణశుద్ధము. క్రీ. శ. 1916 వ సంవత్సరము.

నా ఈ ధర్మ ప్రచారమునకు ప్రారంభము 1944 వ సంవత్సరము. ఇదియే నా నిత్య జీవనము.

స్వతంత్ర భారత సామ్రాజ్య సంపాదన దీక్షాబద్ధకంకణు లెందరో దేశ స్వాతంత్ర్యమునకై తమ తమ జీవితముల నంకితము గావించినారు. అందు తిలక్ మహాశయులు "స్వాతంత్ర్యము నా జన్మ హక్కు" అను గీతము నాలపించి అస్తమించగా తరువాత గాంధీ మహాశయులు దేశ నాయకులై స్వాతంత్ర్య సమర రంగ మధ్యమున నిలచి రామ రాజ్యము కావలెనని ఉద్బోధించుట క్రొత్త విషయము కాదు. నేటికిని రామ రాజ్యమను పలుకును దేశోద్ధారకుల మనువారు మరు వక జపించుచునే యుండిరి. కాని రామ రాజ్య మెట్లుండెడిది? అను ప్రశ్నకు జవాబు నివ్వవలసిన దెవరు? అనుచో ఈ ప్రశ్నకు సూటిగ సమాధానము నివ్వవల సిన వారు వాల్మీకి మహర్షియే యనియే నిశ్చయించవలెను గాని వేరొక సమా ధానము లేదు

కావున మనకు స్వరాజ్యము రాక పూర్వమే రామ రాజ్య మన నేమియో దేనిని రామ రాజ్యమని వాల్మీకి మహర్షి ప్రకటించిరో దానిని ప్రజానీకమునకు తెలుపుటనే ధ్యేయము గావించుకొని నాకు నేనై బహుళ ప్రచారమును ఆంధ్ర దేశము నందన్ని నగరము లందును సాగించినాను. పల్లెలయందు మాత్రము ఆ యా గ్రామ ప్రజల ఆహ్వానములపైననే నా ప్రచారము సాగినది.

ప్రజా బాహుళ్యము నాకర్షించుటకై కొందరు రామాయణ, భారత, భాగవత గీతా శాస్త్రములను భారతీయ ధర్మశాస్త్రములకు వ్యతిరేకముగా వ్యాఖ్యానించుట గమనించుచున్నాము. కాగా ఆ మార్గము ననుసరించక భారతీయ ధర్మ జిజ్ఞాసువు లకు ఆకర్షణీయమగునట్లు ధర్మ బోధనను గావించుటకై దైవము నాకు ప్రసా దించిన వాగ్వైఖరితో ఉపన్యాస రూపముగ ప్రచారమును గావించినాను.

నేనుపన్యాసముల గావించిన నగరములందలి విద్వత్తల్లజులును, కవులును వారి వారి సహృదయములతో నా ప్రచారము దేశమునకీ నాడు చాల అవసరమని వాక్రువ్వగా మరింత ఉత్సాహితుడనై, వృత్త్యంతరమును స్వీకరింపక ఇంతవరకును నా ప్రచారమును సాగించుచునే యుంటిని. ఆ ప్రసంగ సారాంశములకే అక్షర రూపమును కల్పించి ఈ గ్రంథావళిని ప్రచురించుచుంటిని ఇందొక్క విషయము పాఠకులకు చెప్ప సాహసించుచున్నాను. నేను చెప్పబోవు మాట ఆత్మస్తుతియని మీరు భావించవద్దు.

నా ప్రచారము గురించి నాకు అక్కడక్కడ తమ హృదయముల తెలిపిన ప్రాజ్ఞుల అభిప్రాయములను స్థాలీపులాక న్యాయముగ చూపుచున్నాను. తే 4-4-1953 సింహపురియందు (నెల్లూరు) మోచర్ల రామకృష్ణకవి నా చేత విడిన పంచ రత్నములలోని పద్యము లివ్వి (పౌర సన్మాన సందర్భమున)

"పాయని కౌతుకంబున భవన్ముఖ విష్ణుపద ప్రభూత రా
మాయణ తత్త్వగాంగ రుచిమఞ్జహరీ మహనీయ పుణ్యవా
క్తోయములన్ మునింగి గత దోషులమైతిమి- మా కృతజ్ఞతో
పాయనమున్ గ్రహింపుడు సుధాంశుడు గైకొను నూలుపోగుగాన్
ఈ సరణిన్ విశారదు లహీనవచస్సముదారు లీ యుప
న్యాస సుధా ప్రవాహముల నాంధ్ర మహిన్ వెలయింతురేని వి
శ్వాస విభూతి పెంపున శుభప్రద వైదిక ధర్మ సస్య ల
క్ష్మీనముపాత్తయై తెలుగుకీర్తి పతాక దివంబు ముట్టదే
ఆర్ష ధర్మ ప్రబోధకు లనెడి బిరుద
మొప్పినది మీకు ముమ్మాటికో సుధీంద్ర
వరులలో నాటుకొన్నట్టి నాస్తికతను
ప్రక్కలింపంగ మీ వాక్కు వజ్రధార

ఇట్లే తే 14-8-1956 సం॥ మున అరండల్‌పేట గుంటూరు బ్రో॥గ్రామ ందు నా ఉపన్యాసముల లక్ష్యమును పలికించి చెప్పిన పండితవర్యుని అభిప్రాయ మును గూడ వినిపింతును.

రచయిత - లలిత భారతి- సాహిత్యభూషణ- పండిత డి. లక్ష్మీనరసింహా చార్యులు గారు.

హైందవ సాంప్రదాయాచార మహిమమ్ము
దివిరి యెల్లరకు బోధించు చొకట
భక్తి ప్రపత్తుల పరమ లక్ష్యమ్ము
చెలువు దొల్కాడ భాషించుచొకట
ధర్మతంత్ర క్రియాంతర్య ముజ్జ్వలముగ
శిష్ట వైఖరిని దర్శించు చొకట
పరతత్వ మీమాంస బరికించి ప్రౌఢిమై
యాస్తికేతరము చెండాడు చొకట
వివిధ రీతుల నౌచితి వెలయునటుల
భావ సందర్భ వైఖరి పల్లవింప
భవదుపన్యాస ఫక్కి సంబరము గొలిపె
శ్రోత లుత్తూత లూగగా సూరివర్య

ఇట్లెన్నియో సభలయందు యవతరము కూడ మాకు కనువిప్పైనది. మీ ప్రచారమని స్వయముగ చెప్పిన ఘట్టము లున్నవి.

మీకు నే నిప్పుడు చూపిన పద్యములు నా ప్రచారా వసరమును ప్రజలు గుర్తెరిగిరని చెప్పుటకే.

నే నిన్ని పర్యాయములు రామాయణాది గ్రంధముల నుపన్యసించితినని చెప్పుకొనుట నా హృదయము కాదు.

వైదిక ధర్మ విప్లవ సమయమున నా యధాశక్తిగ వైదిక ధర్మమును ప్రబోధించుటను ప్రజలు గుర్తెరిగిరని చూపుటే, నాటి పద్యములను నేడు నా గ్రంథము నందుదహరించుటకు లక్ష్యము.

ప్రస్తుత విషయ మేమన నా ఉపన్యాసములను గ్రంథస్థము గూడ గావించుట చాల అవసరమని శ్రోతలు కోరగా మొదట గీతా హృదయమును కర్మ, భక్తి యోగములను పేర సంభాషణ రూపమున రచించి అచ్చొత్తించుట జరిగినది. తరువాతవి మహా భారతోపన్యాసములు. అవి అయిదు సంపుటములు. పదునెనిమిది పర్వముల వ్యాసభారతిలోని సారమును,నవిమర్శక కథాకథనముగ వెలువరించినాను.

ప్రస్తుత రామాయణ ప్రచురణకు తిరుపతి తిరుమల దేవస్థానము వారి సాహాయ్యము ముఖ్య ప్రోద్బలకము కాగా, భక్తవరుల విరాళములు మరింత బలమును చేకూర్చినవి. తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతల తెలుపుచు శ్రీ వేంకటేశునకు శిరమును వంచి నమస్కరించుచున్నాడను.

విరాళముల నొసంగిన మహారాజ పోషక, రాజ పోషకులకును, పోషకులకును గూడ రామానుగ్రహమున ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థసిద్ధులను కలుగుగాకయని సీతారాముల ప్రార్థించుచు, ఇంతతో నా మాటను ముగించుచుంటిని. మిగిలిన కాండలును తిరుమలేశుని అనుగ్రహము తోడను, మరల హిందూ ధర్మ రక్షణ సంస్థ వారు గావించు చేయూతతోడను ప్రజల ఆదరమును గూడ అందుకొని నే నందింపగలనని విశ్వసించుచున్నాను. మరొక్కమాట.

శ్రీ మద్వాల్మీకి రామాయణ మహాకావ్యము గాయత్రీ మంత్రార్థవిలసితము. శ్రీ గాయత్రీ మంత్ర వర్ణములు ఆదియందు గల శ్లోకములీ కావ్యము నందంతర్భూతమై యుండుట ఈ కావ్యము యొక్క ప్రత్యేకత. కావున ఈనా ఉపన్యాసముల పఠించుటకు ముందుగాని, ప్రతి నిత్యమును గాని గాయత్రీ రామాయణ శ్లోకముల పారాయణ గావించుచో రామాయణ పఠన ఫలము దక్కును. కావున ఆ శ్లోకములను గూడ పాఠకుల కందించుచున్నాను. ఈ అవకాశమును కూడ పఠితలు ఉపయోగించుకొని తరింతురుగాక.

ఈ ముద్రణను గావించిన రాఘవేంద్ర ప్రింటింగ్ వర్క్స్ వారు యథాశక్తిగా నాకు తోడ్పడి ముద్రించి ఇచ్చినందులకు ముద్రణాలయము వారికి నా కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఎక్కడనైన ప్రమాదమున ముద్రణా స్ఖాలిత్యము లున్నను పఠితలు సంస్కరించుకొందురు గాక.

ఇట్లు
గ్రంథకర్త
ఆర్షధర్మ ప్రబోధక
నండూరు సుబ్రహ్మణ్యశర్మ

# శ్రీ గాయత్రీ రామాయణము

శ్లో॥ "తపస్స్వాధ్యాయ నిరతం, తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్
"సహత్వా రాక్షసాన్, సర్వాన్, యజ్ఞఘ్నాన్ రఘునందనః
ఋషిభిః పూజితస్సమ్యగ్యథేంద్రో విజయీపురా

శ్లో॥ విశ్వామిత్రస్స ధర్మాత్మా, శ్రుత్వాజనక భాషితమ్
వత్సరామ ధనుఃపశ్య ఇతిరాఘవ మబ్రవీత్

శ్లో॥ తుష్టావాస్య తదావంశం ప్రవిశ్య సవిశాం పతేః
శయనీయం నరేంద్ర స్య, తదా సాద్యవ్యతిష్ఠత

శ్లో॥ వనవాసం హిసంఖ్యాయ, వాసాంస్యాభరణానిచ
భర్తార మనుగచ్ఛంత్యై. సీతాయైశ్వశురోదదౌ

శ్లో॥ రాజా సత్యంచ ధర్మశ్చ, రాజా కులవతాం కులమ్
రాజా మాతాపితాచైవ, రాజాహితకరోనృణామ్

శ్లో॥ నిరీక్ష్య సమూర్తంతు, దదర్శ భరతో గురుమ్
ఉటజే రామమాసీనం, జటా మండల ధారిణమ్

శ్లో॥ య దిబుద్ధికృతాద్రష్టు, మగస్త్యంతం మహామునిం
అద్యైవ గమనే బుద్ధిం, రోచయస్వమహాయశః

శ్లో॥ భరతస్యార్యపుత్రస్య, శ్వశ్రూణాం మమచ ప్రభో
మృగ రూప మిదం వ్యక్తం, విస్మయం జనయిష్యతి

శ్లో॥ గచ్ఛ శీఘ్ర మితోరామ, సుగ్రీవం తం మహాబలమ్
వయస్యం తం కురుక్షిప్ర, మితో గత్వాద్య రాఘవ

శ్లో॥ దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే
సుఖదుఃఖ సహఃకాలే, సుగ్రీవ వశగోభవ॥

శ్లో॥ వంద్యాస్తేతు తపస్సిద్ధా, స్తపసావీత కల్మషాః
ప్రష్టవ్యాస్తేపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః

శ్లో॥ స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్
విక్రమేణ మహాతేజా, హనుమాన్ మారుతాత్మజః

శ్లో॥ ధన్యా దేవాస్సగంధర్వా, స్సిద్ధాశ్చ పరమర్షయః
మమపశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్

శ్లో॥ మంగళాభిముఖీతస్య సా తదాసీన్మహా కపిః
ఉపతస్థే విశాలాక్షీ, ప్రయతాహవ్య వాహనమ్

శ్లో॥ హితం మహార్థం మృదుహేతు సంహితం
వ్యతీత కాలాయతి సంప్రతిక్షమమ్
నిశమ్యతద్వాక్యముపస్థిత జ్వరః
ప్రసంగవా నుత్తరమే తదబ్రవీత్

శ్లో॥ ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠస్సంప్రాప్తోయం విభీషణః
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమానయం ప్రాప్నోత్యకంటకమ్

శ్లో॥ యో వజ్రపాతాశని సన్నిపాతా
న్న చక్షుభే నా పిచచాల రాజా
స రామబాణాభిహతో భృశార్త
శ్చ చాల చాపంచ ముమోచవీరః

శ్లో॥ యస్య విక్రమమాసాద్య రాక్షసా నిధనం గతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్

శ్లో॥ న తే దదృశిరే రామం దహంత మరి వాహినీం
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా

శ్లో॥ ప్రణమ్య దేవతాభ్యశ్చ, బ్రాహ్మణేభ్యశ్చమైథిలీ
బద్ధాంజలి పుటాచేదము వాచాగ్ని సమీతః

శ్లో॥ చలనాత్పర్వ తేంద్రస్యగణా దేవాశ్చ కంపితాః
చచాల పార్వతీచాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్

శ్లో॥ దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదన భాజనమ్
సర్వ మేవా విభక్తంనో, భవిష్యతి హరీశ్వర

శ్లో॥ యా మేవరాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారకద్వయమ్

శ్లో॥ ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజ సంయుతమ్
త్రి సంధ్యం యః పఠేన్నిత్యం, సర్వపాపైః ప్రముచ్యతే॥

శ్రీ గాయత్రీ రామాయము సంపూర్ణము

శ్రీ రామచంద్రార్పణమస్తు

ఈ కృతి

ద్వారకా తిరుమలేశుని

(చిన్న తిరుపతి)

పాదపద్మములకు అంకితము

# గంధ కర్త



**నండూరు సుబ్రహ్మణ్య శర్మ**

వారి ధర్మపత్ని

**శేష తిరుమలేశ్వరి**

# మహారాజ పోషకులు



## శ్రీ శ్రీ శ్రీ కాళీమాత ఆశ్రమము

## గాగిళ్ళ పురం

చేర్యాల తాలూకా

వరంగల్ జిల్లా

# రాజపోషకులు



శ్రీ రేకా అంబయ్య శ్రేష్ఠిగారు

వారి సతీమణి

శ్రీమతి సునందమ్మగారు

సిద్దిపేట

రాజపోషకులు



శ్రీ జిల్లా జోగయ్యగారి వెంకటేశంగారు

వారి సతీమణి

శ్రీమతి కనకలక్ష్మిగారు

సిద్దిపేట

# రాజపోషకులు



శ్రీ K. రామరాజుగారు
(న్యాయవాది)

సిద్ధిపేట

# రాజపోషకులు



శ్రీ బుద్దా గురవయ్య గారు
వారి ధర్మపత్ని
శ్రీమతి వజ్రమ్మ గారు

జనగాం

## రా జ పో ష కు లు





శ్రీ కూర వెంకటేశం గారు

మరియు

శ్రీ కొమురవెల్లి లింగంగారు

సిద్ధిపేట

# రాష్ట్రపోషకులు



శ్రీయుత కూర రామన్నగారి అంతయ్యగారు

వారి సతీమణి

**శ్రీమతి దుర్గాంబ**

సిద్ధిపేట

# రాజపోషకులు



బ్రహ్మశ్రీ అభ్రపుడి వెంకటేశ్వర్లు గారు

మిర్యాలగూడ

# రా జ పో ష కు లు



శ్రీ N. కిషన్‌రావు గారు

(న్యాయవాది)

సిద్దిపేట

# రా జ పో ష కు లు



శ్రీ గరిపల్లి జగదీశ్వరయ్య గారు

సిద్ధిపేట

# రాజపోషకులు



శ్రీ॥ శే॥ కొండపల్లి వెంకట నరసింహారావు గారు

వారి జ్ఞాపకార్థం వారి సతీమణి

**కమలమ్మ గారు**

**అనంతగిరి**

నల్గొండ జిల్లా

## రాజపోషకులు





శ్రీ కొండూరి వీరయ్య శ్రేష్ఠి దంపతులు

మిర్యాలగూడ

## రాజపోషకులు



శ్రీ పొట్టి సత్యనారాయణ గారు
విజయ రైస్ కంపెనీ
**విజయవాడ**

# పోషకులు

## జనగామ

శ్రీ బుస్సా నరసయ్యగారు
(శ్రీ ఆంజనేయస్వామి, సంతోషిమాత దేవాలయముల నిర్వాహకనిర్మాత)
శ్రీ కొల్లూరి వీరయ్యగారు
శ్రీ కృష్ణంరాజు గోపాలకృష్ణరావు గారు
శ్రీ కావత్తి నారాయణగారు
శ్రీ చందా యాదగిరిగారు
శ్రీ లకినేపల్లి రంగారావుగారు
శ్రీ ఉపద్రష్ట వెంకట రామశాస్త్రిగారు
శ్రీ మొగుళ్ళపల్లి భద్రయ్యగారు
శ్రీ గంపల పాపిరెడ్డిగారు
శ్రీ కాసం అంజయ్యగారు
శ్రీమతి లలితా శివజ్యోతిగారు

## సిద్ధిపేట

శ్రీ కూర దుర్గయ్యగారి నరసయ్యగారు
శ్రీ కూర దుర్గయ్యగారి విశ్వనాధంగారు
శ్రీమతి బెజుగామ భూమవ్వగారు
శ్రీ S. వెంకట్రావుగారు, అడ్వకేట్.
శ్రీ మారంశెట్టి వెంకటేశంగారు
శ్రీ పరమేశ్వరి అండ్ కో వారు
శ్రీ పాలమాకుల శ్రీమంతరావుగారు
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులుగారు
శ్రీమాన్ మురంగంటి సీతారామాచార్యులుగారు
శ్రీ ఐలే చంద్రయ్యగారు

శ్రీ ముదిగొండ వెంటయ్యగారు

శ్రీ కటుకం అనంతరాజంగారు

శ్రీ గట్టు రాంరాజేశంగారు

శ్రీ ఆకుల వీరేశంగారు

శ్రీ కొమ్మా వెంకటేశంగారు

శ్రీ చీకొటి చంద్రశేఖరంగారు

శ్రీ A. రంగారెడ్డిగారు

శ్రీ V. బాపురావుగారు (బూర్గుపల్లి)

శ్రీ తాటిపాముల హనుమయ్యగారు

శ్రీ హరీంద్రబాబుగారు (లెక్చరర్ Govt. College)

శ్రీ T. శ్రీనివాస్‌గారు ( ,, ,, )

## కోదాడ

శ్రీ కోదాడ వెంకటేశ్వరరావుగారు

శ్రీ చల్లా రామమూర్తిగారు

శ్రీ గన్నవరపు వెంకటేశంగారు

శ్రీ నాగుబండి రామమూర్తిగారు

శ్రీ వంగవీటి వెంకటేశ్వర్లుగారు

శ్రీ కొండపల్లి రామానుజరావుగారు (లెక్చరర్)

శ్రీ మట్టుపల్లి లక్ష్మీనారాయణ శర్మగారు

శ్రీ కొల్లు భాస్కరరావుగారు

శ్రీ వారణాశి రాఘవశర్మగారు

శ్రీ Ch. వీరభద్రాచారిగారు

శ్రీ దేవరగట్ల సీతారావమ్మగారు

శ్రీ కొండపల్లి మురళీధరరావుగారు

శ్రీ తడకమళ్ళ రాఘవరావుగారు

శ్రీ గుండా హరనాధబాబు గారు

శ్రీ స్వయంపాకుల దశరధరామయ్యగారు

శ్రీ క్షీరానుకవచం వెంకటేశ్వర్లుగారు

శ్రీ B.V. రామారావుగారు

శ్రీ మంత్రిప్రగడ భరతరావుగారు

శ్రీ కొమరగిరి రామకోటేశ్వరరావుగారు

శ్రీ చిలుకూరి వెంకటరామ నరసయ్యగారు

శ్రీ యాదా అచ్చయ్యగారు

శ్రీ చిలుకూరి వెంకట ఉపేంద్రరావుగారు

శ్రీ చక్కా ఆగయ్యగారు, బి.ఎ., బి.యి.డి.

శ్రీ కొత్తూరు శాయన్నగారు

శ్రీ యాదా వీరయ్యగారు

శ్రీ చిలుకూరి వెంకట ఉపేంద్రయ్యగారు

డాక్టర్ కోట నారాయణగారు

శ్రీ చంద్రమౌళి సాంబశివరావుగారు

శ్రీ స్వయంపాకుల వెంకటేశ్వర్లుగారు

శ్రీ దేవరశెట్టి నాగభూషణంగారు (బేతవోలు)

శ్రీ మంత్రిప్రగడ లక్ష్మీనరసింహారావుగారు

శ్రీ పరికొండ జానకిరాం రావుగారు

శ్రీమతి జాస్తి శీతారావమ్మగారు

ఒక భక్తురాలు

## శ హా పు రం

శ్రీ పాలచర్ల ఆదినారాయణరావుగారు భార్య అనంతలక్ష్మి గారు

శ్రీ బొల్లం అచ్యుతరామయ్యగారి దంపతులు

శ్రీ వాఖిలినేని వెంకట్రావు గారి దంపతులు

## వి జ య వా డ

శ్రీ వావిలాల సుబ్రహ్మణ్య సోమయాజులు గారు

డాక్టర్ దమ్మాలపాటి రామారావుగారు

శ్రీమతి వేమవరపు లక్ష్మీసరస్వతిగారు

శ్రీమతి కలపటపు విమలమ్మగారు

# విషయసూచిక

## అయోధ్యకాండ



## అరణ్య కాండము



## కిష్కింధ కాండము

ఓమ్

శ్రీ మహా గణాధి పతయే నమః

అయోధ్యాకాండ ప్రథమ దివసోపన్యాసము

# అయోధ్యా కాండము

శ్లో॥ బ్రహ్మాద్యామరసిద్ధజన్మభువనం యన్నాభిపంకేరుహం
శ్రీ నిర్వాణనికేతనం యదుదరం లోకైకశయ్యాగృహం
యద్వక్షః కమలావిలాసభవనం యన్నామ మంత్రం సతాం
వాసాగార మఖండమండలనిధిః పాయాత్సనో రాఘవః॥

ఆర్య మహాశయులారా !

నేటికి మన రామాయణమున బాలకాండ ముగిసినది. మనమిప్పుడు ప్రారంభించబోవునది అయోధ్యాకాండము.

ఇది రామాయణ మహార్ణవమున విస్తృతమగు ఒక అలవంటి కాండము. ఈ కాండను వాల్మీకి మహర్షి నూటపందొమ్మిది సర్గలతో విస్తరించి వర్ణించినారు.

భరతశత్రుఘ్నులు మేనమామల యింటికి పయనమగుటతో ప్రారంభమై రాఘవేశ్వరులు తన పాదుకలను భరతున కందించి చిత్రకూటాద్రి నుంచి సీతాలక్ష్మణులతో అత్రిమహర్షివారి ఆశ్రమమున ప్రవేశించుటతో ముగిసినది.

బాలకాండవలె ఈ కాండమున ఇతర ఉపాఖ్యానములు విస్తరించలేదు. స్వీయ ఇతివృత్తముతోడనే నడచినదీ కాండము

ఇందనేక పాత్రల సన్నివేశములు కథాంతర్భాగములై ఒక్కొక్క సన్నివేశము ఒక్కొక్క ప్రత్యేకతను చాటినది. రాబోవు కాండలకీ కాండలోని కథా భాగము మకుటమై నడచినదనక తప్పదు.

త్రికాల సత్యమై స్వప్రకాశమున భాసిల్లు సచ్చిదానంద బ్రహ్మము అనంత కల్యాణ గుణవిశిష్టమై వైదిక ధర్మమునెట్లు చాటినదో మహర్షి విస్తరించినారు కథాంతర్భాగములు.

కొందరు విమర్శకులు రాముడు దేవుడని వాల్మీకి తన కావ్యమున స్పష్టముగా చెప్పలేదు. వాచ్యముగ వర్ణించలేదందురు. కావ్యము ధ్వని ప్రధానమగుటచే తన కావ్య శిల్పమున రామునికి పురుషోత్తమత్వమును చేకూర్చెనందురు. రాముని మానవ మాత్రునిగనే వాల్మీకి చిత్రించెనందురు. పాత్రల ముఖముగ రాముడు భగవంతుడని చెప్పించెనందురు. అట్టి సందేహమునకు తావులేకుండ రాముడెవ్వడను కొనుచుంటిరో రాముడు సాక్షాన్నారాయణుడే సుమా! అని ఈ కాండమున స్పష్టముగా తాను చెప్పియే కథాభాగమును నడిపించినారు. కథాంతర్భాగము నందక్కడక్కడ తనలోని అద్వితీయ బ్రహ్మతత్వమును రాముడెట్లు ప్రదర్శించెనో గూడ మహర్షి ఈ కాండమున చక్కగ స్పష్టపరచినారు.

అవతారమూర్తియగు రాముడు పితృపాదులయెడ చూపిన భక్తియు సోదరుల యెడచూపిన ప్రేమానురాగ అనురక్తియు, ప్రజావాహుళ్యముపై ప్రసరింపచేసిన రాముని ప్రేమామృత కిరణ ప్రసారమును, చేతనా చేతన ప్రపంచమంతయు రాముని కంటె వేరుకాదని భావింపదగు భావనా విధానమును ఈ కాండముననే మహర్షివర్యులచే స్పష్టము గావింపబడినది.

మహర్షి ఈ కాండమునందొక్కచో ధర్మ సూక్ష్మముల చక్కగ వ్యాఖ్యానించినారు. కథాముఖముగనే అర్థశాస్త్ర రహస్యములుకూడ అట్లే తెలిపినారు. ధర్మానుబంధ కామమును సీతాకళ్యాణమున తెలుపుటచే అంధకార బంధురమగు కామమెంత అనర్థదాయకమో ఈ కాండతో ప్రారంభించినారు. ఇట్లు త్రివర్గముల తెలుపుచునే భంగ్యంతరముగ మోక్షశాస్త్రమున ప్రవేశింప చేసినారీ కాండ చివరి భాగమున. ఇక కథకు వత్తము.

## భరత శత్రుఘ్నుల పయనము

యుధాజిత్తు కైకేయి సోదరుడు. భరతుని మేనమామ. అతడు మిథిలా నగరమున కేతెంచి అచ్చట మేనల్లుని వివాహ మహోత్సవమును దర్శించి వారి తోడనే అయోధ్య కేతెంచినాడు. భరతుని తనతో తీసుకొనిపోవుట అతని కభిమత మైనది. అందుకు దశరథుని ఆజ్ఞయైనది కైకయు సమ్మతించినది. భరతుడును ఇష్టపడినాడు.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురును దశరథ నందనులే అయ్యును రామ లక్ష్మణులొక జంట. భరత శత్రుఘ్నులొక జంట. రాముని వదలి లక్ష్మణు

డుండడు. భరతుని వదలి శత్రుఘ్నుడుండడు. నిజమునకు శత్రుఘ్నుడు లక్ష్మణుని తోటివాడు. కాని అతడు భరతునకు నిత్యసేవకుడు. సేవకుడు కాడు. సేవక శిఖామణి. రామునకు లక్ష్మణుడెంతయో, భరతునకు శత్రుఘ్నుడంతయే. రామ,లక్ష్మణ భరత శత్రుఘ్నుల ఈ విభాగమునుండి మనమేమి గ్రహింపవలెనన్నది ప్రశ్న.

రాముడు భగవంతుడు. భరతుడు భాగవతుడు. భరతుని సామాన్యముగ భాగవతుడనుట చాలదు. ఆతడు పరమ భాగవతుడు. భాగవతశ్రేష్ఠుడు. మానవజాతి కంతకును ఆదర్శమూర్తి.

సత్పురుషులయందగ్రగణ్యులు. సత్పురుషశ్రేష్ఠులు. అట్టి భాగవత శ్రేష్ఠులు. బ్రహ్మవిదులు. బ్రహ్మవిద్వర్యులు. బ్రహ్మ విద్వరిష్ఠులు. తరతమ భేదములతో విరాజిల్లు జ్ఞానులువీరు. భక్తిభాగమున భరతుని శ్రేష్ఠత్వమిట్టిదే.

మానవ జీవితమున తరించవలెనన్న భగవంతుని కంటే కూడా భాగవత శ్రేష్ఠుల ఇతివృత్తములు శిరోధార్యములు కావలెను. ఇది భక్తిసిద్ధాంతమునందు మకుటాయమానమగుమాట. భక్తులు లేక భగవంతుడు లేడు. భగవంతుడిడుగో అని చూపువారు భక్త శేఖరులే. అందుకు భక్తశిఖామణియగు ప్రహ్లాదుడు మనకు సాక్షి.

భరత శత్రుఘ్నుల పయనము తోడనే అయోధ్యాకాండ కథాప్రారంభమును గావించినది. అయోధ్యకాండయందలి మొదటి శ్లోకమిది—

గచ్ఛతా మాతుల కులం భరతేన తదా నఘః
శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః

భక్తి సిద్ధాంతమున బాగుపడదలచిన జీవునకు భాగవత పారతంత్ర్యము పెన్నిధివంటిదని నొక్కి వక్కాణించును ఆ సిద్ధాంతము. భగవానునకు భాగవతులు నిత్యనివాస మందిరములు. ఏ ముముక్షువులగు జీవులు భగవత్పాదార విందముల దర్శించవలెనన్న భగవంతునకు నిత్యనివాసమందిరములగు భాగవతుల వదలియుండ రాదు. భాగవతుల వదలియుండరాదనునది సాధకులనుద్దేశించిన యుపదేశము. సిద్ధులును భాగవతుల నిత్య సన్నిధానమును కోరుకొందురు. భాగవతుల పాదరజము భగవద్భక్తులకు సిద్ధాంజనము.

ఈ ఘట్టమున భాగవతము స్మరణీయము. గోపికలు భాగవతమున ముఖ్య పాత్రలు

మధురా నగరినుండి శ్రీకృష్ణుని ఉద్ధవుని గోపికల వద్దకు పంపగా వా సాన్నిధ్యమున కొంతకాలము గడిపిన ఉద్ధవుడన్నమాట ఇది.

"వందే నందవ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః
యాసాం హరి కథోద్గీతం పునాతి భువనత్రయం

ఆనంద వ్రజమునందలి స్త్రీలకు నమస్కరించినాడు. శిరమును వారి పాదము లపై మోపి. అది చాలలేదు. అడుగుదమ్ములనున్న ధూళిని గూడ ధరించినాడు ఉద్ధవుడు. వారులేకున్న హరికథాగానము భూభాగమున మారుమ్రోగెడిదికాదని నిర్ణయించినాడు. భూభాగమున గోపికల అవతరణమే శ్రీకృష్ణచంద్రుని నిజస్వరూపమును తెల్పినదని ఆనందాశ్రువుల రాల్చినాడు. భక్తుల ప్రభావమిది.

ప్రకృతమను సరామః

భాగవత పారతంత్ర్యమునకై బయలుదేరిన శత్రుఘ్నుని వర్ణనయందు మాత్రము రెండు విశేషణములున్నవి. అనఘః॥ నిత్యశత్రుఘ్నః అను పదములు. అవి శత్రుఘ్నుని పరిశుద్ధతను చక్కగా వివరించునవి.

శత్రుఘ్నుడు విశుద్ధజీవుడు. అంతేకాదు జితేంద్రియుడు-కూడా. ఇంద్రియ యజములేక జీవునకు విశుద్ధత్వములేదు.

ఇక కైకేయ రాజ్యమునకేగిన భరత శత్రుఘ్నుల పరికింతము. వారికది మాతామహస్థానము. స్వర్గసుఖములవంటి సుఖములను వారికి కూర్పదగు స్థానమది. అయ్యును వారక్కడ క్రీడా విశేషములతో విలాస దివసముల గడుపుట లేదనినారు మహర్షి. కారణమేమియట? వారిద్దరి హృదయ సీమలయందును దశరథేశ్వరుని వృద్ధావ్యమును పితృమూర్తి యెడలగల పితృభక్తియు నిత్యమై ప్రవర్తించుచుండుటే అందుకు కారణమట. మహర్షి గీతమిది.

"తత్రాపి నివసంతౌ తౌ తర్ప్యమాణౌ చ కామతః
భ్రాతరౌ స్మరతాం వీరౌ వృద్ధం దశరథం నృపం

ఇక్కడ చమత్కారమేమనగా "తర్ప్యమాణౌ చకామతః" తాతగారును మేనమామయు తల్లితల్లియు వారి కోర్కెలనెల్ల తీర్చుచున్నను వారక్కడ దశరథునే చింతించుట వారియందలి ప్రత్యేకత. మరొక్క విశేషమేమన? మనము మన తండ్రినెప్పుడు చూతుము? చూడగలమా? అన్న ఆతురత వారి హృదయముల నిగూఢమై రాబోవు ఘట్టము వారికి తెలియకుండగనే వారియందు దాగియుండుటను

కవి ఇక్కడ దశరధునకు "వృద్ధం" అన్న విశేషణమును వాడి వాదీద్దరును దశరధుని మరల వారు చూడకపోవుటను సూచించినారు తండ్రిగ చూడకపోవుటయే కాదు 'నృపం' అను విశేషణమున దశరధుని రాజసింహాసనము సందర్శించి యుండగ చూచుట కూడా వారికి దక్కక పోవుటను ధ్వనించినారు. మనకు రాబోవు కొన్ని ఘట్టములు మనకు తెలియకుండగనే మన హృదయముల పరివర్తించుట అసహజముకాదు. తాత్కాలిక సుఖములెన్నిటిని అనుభవించుచున్నను భవిష్యదర్ధములు కల్పించబోవు కల్పనలు స్థూల సూక్ష్మ శరీరముల కన్పట్టుచుండును. ముందుకు పోదము.

ఆ ఆదికవి మరొక్క ప్రత్యేకతను ఈ కధా ఘట్టమున తెలిపినారు. దశరధుని పాత్రను తీసుకొనినారు.

దశరధునకు నలుగురు పుత్రులలో రామునియందెక్కువ ప్రీతి. భార్యల ముగ్గురిలో కైకయందనురాగము. ఇవి రెండును దశరధునియందలి దోషములు. అందొక దోషము పుత్రులయందలి పక్షపాతము. అది చూచుటకు కన్పట్టునేగాని అది యదార్ధమునకు లేదని యిక్కడ స్పష్టపరచుచున్నారు. చక్కని ఉపమానమును చెప్పి. ఏమా ఉపమానము ?

"రాజా పితౌ మహాతేజాస్సస్మార ప్రోషితౌ సుతౌ
ఉభౌ భరత శత్రుఘ్నౌ మహేంద్ర వరుణోపమౌ

అక్కడ భరత శత్రుఘ్నులెట్లుండిరో దశరధుడును ఇక్కడ వారియందట్టి అనురాగము కలిగియే యుండెనట. అనగా నేమి? వారిక్కడ లేకున్నను ఇంద్ర వరుణులతో సమానమగు పరాక్రమము గల భరత శత్రుఘ్నుల నాతడు పిత్యమును స్మరించుచుండెనే గాని అతడు రాముని పైగల ఊార్మితో వారిని మరువలేదు. అందుకు ప్రమాణ ఉపమానము లేమందురా?

"సర్వ ఏవతు తస్యేష్టాశ్చత్వారః పురుషర్షభాః
స్వ శరీరాద్వినిర్వృత్తాశ్చత్వార ఇవ బాహవః

పురుష శ్రేష్ఠులగు ఆ నలుగురు పుత్రులును దశరధునికిష్టులే. ఎట్లు? తన శరీరము నుండి నిర్వర్తించిన నాలుగు చేతులవలెనట. ఈ ఉపమానమొక్క అనర్ఘ రత్నము. ప్రజలయందే పక్షపాత రహితుడై పరిపాలించు ఆ మహారాజు పుత్రుల యందట్టి పక్షపాతమును చూపునా? అతడు చూపలేదను దానిని స్పష్టపరచినారు. ఇంతేగాక రాబోవు రాముని యువరాజ్య పట్టాభిషేకమునకు రామునిపైగల అను

రాగము కారణము కాదని కూడ ఈ ఉపమానము స్పష్టపరచినది. మరియొక విశేషమేమన? దశరథుడు కశ్యప ప్రజాపతి కాగా అదితి కౌసల్యకాగా నారాయణుడే నాలుగుఅంశలతో నలుగురు పుత్రులయ్యెనని ధ్వనించినది ఈ ఉపమానము. ఇక మనమయోధ్యకేతెంతము. రామునిపై చూపు నిలుపుదము.

రాముడు మన కావ్యమునకు కథానాయకుడు మనయందంతర్యామి. స్థావర జంగమాత్మక ప్రపంచమునకు సృష్టికర్త. ఆ యుగము నందాతడీ భూలోకము నందొకరాజై రాజసింహాసనము నలంకరించి ధర్మమును స్థాపింపవచ్చిన శిక్షకుడు. మర్యాదా పురుషోత్తముడు. ఆతడు కాబోవు యువరాజు. నేడు ప్రజలు కోరుకున్న ప్రభువు.

భూదేవి కూడ విష్ణుపత్నియే. శ్రీ మహావిష్ణువునకీమె రెండవ ఇల్లాలు. మహాలక్ష్మి సీతయై రాముని పాణి గ్రహణము కావింపగా భూదేవియు ఈతడెప్పుడు నాకు నాథుడగునా యని ఎదురుచూచుచున్నది. రాముడు సాక్షాన్నారాయణుడని వాల్మీకి ఈ విధముగ స్పష్టపరచినాడు.

"స హి దేవైరుదీర్ణస్య రావణస్య వధార్థిభిః
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః

సనాతనుడగు నారాయణుడే రావణ వధకై దేవతలు ప్రార్థించగా ఈ భూలోకమునందవతరించెనని స్పష్టముగ చెప్పిన శ్లోకమిది. వేరొకపాత్ర ముఖముగ చెప్పిన శ్లోకముకాదు. ధ్వన్యర్థమును కాదు, రాముని దేవుడని వాల్మీకి వాచ్యముగ చెప్పెనా? అన్న జిజ్ఞాసువులకు ప్రమాణ శ్లోకమిది. ఈ శ్లోకమునువ్రాసియే రామునిగుణముల వర్ణించినారు మహర్షి. భగవద్గుణాను వర్ణనమున కృతకృత్యుడనగుదు ననుకొన్న వాల్మీకి మహర్షి తాను వర్ణించబోవు గుణములన్నియు పుంజీభూతమై ఒక సామాన్య మానవుని యందుండెనని ఎట్లు చెప్పును? కావున రాముడు సాక్షాన్నారాయణుడేనని నిర్ణయించియే రాముని గుణవర్ణనను గావించినాడు.

నిజమునకు భగవానుని గుణములు లెక్కకు మిక్కిలియై వర్ణింపనలవికానివే అయ్యెను ఆతని గుణ ప్రపంచము నెన్నినగాని మానవునకు ముక్తి కలుగదు. ఇదియే వ్యాస మునీంద్రులు గావించిన భాగవత రచనలోని రహస్యము.

వ్యాసులు వ్యాకుల చిత్తమున బాధనొందగా అంతటి వేద విభాగ కర్తకీ వ్యాకులము కలుగుటకు కారణము. భగవద్గుణాను వర్ణనను ప్రత్యేకముగ కావించక పోవుటచే. నీకీ కొంచెము పచ్చుచెల్లయని హరిగోనుతింపమి నాన్యపూజతా॥ యని

నారదులు చెప్పినారు పరాశర సూనునకు. ఆ ఘట్టముననే హరికథావర్ణనగల కావ్యము వర్ణించబడినది. అందలి పోతనా మాత్యుల వాణిని స్మరింతము.

మ॥ హరినామ స్తుతిసేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుగొందు శ్రీ
హరి నామ స్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమైయుండ దయోగ్య దుర్మలిన వత్కాకోల గర్తాకృతిన్.

ముందుకు పోదము.

## భారతీయ రాజ్యాంగమున రాజున కుండదగు - అర్హతలు -

రాముడు నిజమునకు భగవంతుడే అయ్యును ఆతడిప్పుడు కాబోవు యువ రాజు. కావున యౌవరాజ్యము నందభిషిక్తుని చేయదగు వానికెట్టి అర్హతలుండ వలెనో ఆ అర్హతలన్నియు మన మహాకావ్యమున వర్ణింపబడినవి. భగవంతుడగు శ్రీ మహావిష్ణువునందున్న గుణములే పరిపాలకుని యందును ఉండదగు గుణము లని భారతీయ సిద్ధాంతము. సృష్టి స్థితిలయ కర్తయగు శ్రీ మహావిష్ణువు యొక్క అంశకలిగియే పృథివీపతియగుటను భారతీయ రాజనీతి శాస్త్రములు వర్ణించినవి. నా విష్ణుః పృథివీపతిః అని.

ఈ జగత్తును పరిపాలించు పరిపాలనా విధాన మొకటియు భూలోకమును పరిపాలించు రాజనీతి వేరొకటియు అనునది భారతీయ సిద్ధాంతము కాదు. శ్రీమహా విష్ణువు నందున్న గుణసముదాయమే అఖండ భూభాగమును పరిపాలించు పరిపాల కుని యందున ఉండవలెనని తెలుపుటకే వాల్మీకి మహర్షి ఈ ఘట్టమున రాముని గుణ ప్రపంచమును విస్తరించినారు. దేవుని ధ్యానముచేసి మన నిత్యజీవిత విధా నము వేరని నేటి చరిత్రకారుల అభిప్రాయము. భారతీయ గ్రంథములట్లు లేవు. నిజమునకు దేవుడే జీవుడు. లేక దేవుని అంశయే జీవుడు. మానవుడు దేవుడై భౌతిక సుఖదుఃఖముల కతీతుడు గావలెననునదే మన రామాయణ మహాకావ్యము నకు ప్రధానమగు లక్ష్యము. ఇక్కడ మీకొక ముఖ్యమగు విషయమును గూడ చెప్పెదను.

నేడు మన రాజనీతిజ్ఞులు నాదెప్పుడో కొనసాగించిన నిరంకుశ పరిపాలనకు

స్వ_స్తిచెప్పి ప్రజాస్వామ్యమును ప్రవేశపెట్టుట విశ్వశ్రేయమని ఉద్ఘాటించగా ప్రజానీకమునూ నేటి ప్రజాస్వామ్యమొక కల్పవృక్షమని నమ్ముచుండుట ఒక అంధవిశ్వాసమని నా విశ్వాసము. ప్రజాస్వామ్య మననేమి? ప్రజాస్వామ్యము నేడు క్రొత్తనై రూపొందినదా? నాడును కలదా? నిరంకుశ పరిపాలనయన నేమి? నాడు నిరంకుశ పరిపాలన ఎట్లుండెడిది? అను విషయములను నేడు ప్రజలు చర్చించుచో నేటి ప్రజాస్వామ్యముసగల విశ్వశ్రేయము కన్నులకు కట్టినట్లుగపడగలదు. అందుకు ముందుగ పరిపాలకునకుండదగు గుణ సముదాయము వర్ణించినాడు వాల్మీకి మహర్షి రామాయణ కావ్య కథానాయకుని యందు. ఇది అయోధ్యాకాండ యను మాటను శ్రోతలు మరువకుడు. తరువాతి కాండలలో నిరంకుశ పరిపాలకుని స్వరూపము వర్ణించబడును. ప్రజాస్వామ్యమున పరిపాలకుని అర్హతలెవ్వియో మీరు జాగరూకులై విని మనది ప్రజాస్వామ్యమగునా? కాదా? యని విజ్ఞులాలోచించుకొనుడు. ముందునాటి ప్రజల విజ్ఞతను చెప్పవలెనా? నాటి ప్రజలు ఎన్నుకున్న పరిపాలకుని గుణముల ప్రవచించవలెనా? అన్నది నాకు ప్రశ్నయైనది. కాని ఆలోచించగా మహర్షి పరిపాలకుని గుణంబుల వర్ణించియే అతని నెన్నుకొన్న ప్రజానీకములోని చైతన్యమును తెలుపగా నాకీ సందేహమెందుకు? నాడు ప్రజలు కోరుకొన్న పరిపాలకుని గుణములనే మీకు విస్తరించెదను. ఆ గుణ వర్ణననిట్లు ప్రారంభించినారు మహర్షి.

స హి రూపోపపన్నశ్చ వీర్యవాననసూయకః
భూమావనుపమస్సూనుః గుణైర్దశరథోపమః

రాముడు తగిన రూపము కలవాడట. పరాక్రమ శాలియట. అసూయ లేని వాడట. భూలోకము నందెక్కడను అతనికి పోల్చదగిన పుత్రుడులేని పుత్రరత్నమట. గుణములన్నియు దశరథునే పోలియుండెనట.

ఈ వర్ణనలోని ప్రత్యేకత ఏమి? మొట్టమొదట ఆకారము వర్ణించబడినది. తరువాతది పరాక్రమము. సాముద్రిక శాస్త్రము బాహ్యావయవ నిర్మాణము ననుసరించియే లోపలి గుణములను తెలుపును. మన గుణమయ దేహమునకును బాహ్య శరీరమునకునుగల అనుబంధమును తెలుపుట యందగ్ర గణ్యమైనది- భారతీయ సాహిత్యము. దీనినే కాళిదాసు రఘువంశ కావ్యమున "ఆకార సదృశ ప్రజ్ఞః" అని నాడు. ఆకృతికి తగిన ప్రజ్ఞ కలిగియుండెనని మరొకచోట దిలీపుని ఇట్లు వర్ణించి

నాడు. "ధనుర్భృతోప్యస్య దయార్ద్ర భావమాఖ్యాత మతః కరత్రైర్విశంకైః" దిలీపుడు నందినీ ధేనువును తోలుకొని ధనుర్ధారియై అరణ్యమునకేగగా అచ్చటి లేళ్ళు ఆయన చేతనున్న ధనస్సుచూచి భయపడుటలేదట. మీదు మిక్కిలి ఆయన శాంతరూపము ఆయనలోని దయను ప్రకటించగా తమకు విశాలమైన నేత్రములు కలిగినందులకు ఆ ఫలము ననుభవించుచున్నవా? అనునట్లు చూచుచున్నవట. "ప్రకామ విస్తార ఫలం హరిణ్యః అని శ్రీరామచంద్రుని రూప సౌభాగ్యమును కవి ముందుగచెప్పి ఆ సౌభాగ్యముతో తులతూగు విక్రమమున్నదనినారు. అనగా రావణోపు దుష్టసంహారమును సూచించినారు. తరువాతది అసూయలేకపోవుటయును ఉత్తమగుణమును కూడ చెప్పినారు. ఇది మొదటి పాదములోని వర్ణనా విశేషము. ఇక రెండవ పాదమును పరికింపుడు. భూమియందీ రామునకు ఉపమింపదగుపుత్రుడే లేడనునది. ఇదిచాల విశిష్టమగు వర్ణనము. ఈ వర్ణనచెప్పిన విశేషమేమి? రామున కంటె ముందెందరో మహారాజుల చరిత్రలుండగా ఉపమించుటకు పుత్రుడే లేక పోయెనా? లేదు. కారణమేమందురా?

సర్వజ్ఞమూర్తియగు శ్రీ మహావిష్ణువే పుత్రుడగుటచే ఈతని జననమున కీతడేసాటి. తన మాయనే తాను ఆధారముగాగొని స్వసంకల్పముచే భక్తానుగ్రహము కొరకు పుత్రభావము నొందిన వ్యక్తి ఈ రఘువీరుడు. ఈతని కీతడు సాటిగాక మరెవ్వరుసాటి? ఈ విషయమును చక్కగ ఉదహరించినారు మహర్షి. తరువాతది తండ్రి గుణములనే ఈతడు కలిగియుండెనను విషయము. అరువదివేల సంవత్సరములు ప్రజలను కన్నబిడ్డలవలె పాలించిన దశరథుని ప్రతిభా విశేషమే అతని తరువాత కాదగిన రాజు యందుండెనని రాముని యువరాజ్యార్హతను ధ్వనించినారు. తరువాత శ్లోకమిది—

"స చ నిత్యం ప్రశాంతాత్మా మృదుపూర్వంతు భాషతే
ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే.

రాముడెప్పుడును ప్రశాంతాత్మయై యుండునట. అతడు మాటాడునప్పుడు కాఠిన్యముండదట. మార్దవ పూర్వకమట అతని సంభాషణము. ఎదిరివారెవ్వరైన కఠినముగ మాట్లాడినను అతడు తన మార్దవమును వీడడట. ఈ వర్ణన రాముని సౌజన్యమును ప్రకటించిన శ్లోకమని మనము సామాన్యముగ ఊహించుట కాక ఈ

శ్లోకమునందలి "న చ నిత్యం ప్రశాంతాత్మా" అను భాగమును పరిశీలించుచో వాల్మీకి యొక్క ప్రత్యేకత మనకు గోచరించగలదు. ఏమా ప్రత్యేకత ?

ఈ శ్లోకమున రాముని దశరథుని నుండి విడదీసి రాముని ప్రశాంతస్థితి నిత్యమని చెప్పినారు. అనగా ఆతడొక కాలమున శాంతాత్ముడై యుండుటయు, వేరొక కాలమున కుపితాత్ముడై యుండుటయు ఇంకొక కాలమున సంతోషము కలిగియుండుటయు, వేరొకకాలమున దుఃఖశోకములతో కూడి యుండుటయు లేదట. భూతభవిష్యద్వర్తమాన కాలములయందు మూడు కాలములయందును ఆతడు శాంతాత్ముడయ్యే యుండుననీ నిత్యశబ్దమును వాడినారు. "యత్సత్యం తన్నిత్యం" అని శ్రుతి. ఏది సత్యమో అది నిత్యము. ఒక కాలము నందుండి వేరొకకాలమున లేకపోవుట సత్యమును నిత్యమును కాదు. కావున రాముడు ఏ కాలమునందును వికారము చెందని ప్రశాంతాత్మగాని, జీవత్వము కలిగి జనన మరణాది వికారములు కలిగినవాడు కాడు. జీవన్ముక్తులయ్యును లోకవ్యవహారమునెట్లు కొనసాగించుటయో ఆదర్శమును చూపిన మనుష్యావతారమిది యని చక్కగ స్మరించి ఆ తరువాత ఆతని సౌజన్యమును వర్ణించినారు. నిజమునకు ఉపనిషత్స్మృతి పాద్యమగు సచ్చిదానంద బ్రహ్మమే మాయామానుష విగ్రహమని చెప్పక చెప్పినారు.

రాముడు సీత కొరకై దుఃఖించెను. కైకేయి వలన నాకీ కష్టములు వచ్చెనని పలుమారులు పలికెను. తన మిత్రుడైన విభీషణునకు పట్టముగట్టి రావణుని ఖండించెను. మరొక్క విశేషమేమన? సీత కొరకై రాముడు కామాత్ముడై విరహపడెను. రాముడు జీవన్ముక్తుడా? జ్ఞానియా? అతడు క్షత్రియులు గావించు అశ్వమేధాది క్రతువుల గావించెను. ఆతడెక్కడి జీవన్ముక్తుడు? జీవన్ముక్తుల కండ్లకీ లోకము కన్పట్టునా? అను ప్రశ్నలు లేకపోలేదు. ఇక్కడనేయున్నది చిత్రము. ఉపనిషద్విజ్ఞానము వలననే తెలియదగు విషయమును మన సామాన్య బుద్ధితో ఆలోచించిన తెలియబడదు.

రాముడు తన పండ్రెండవ ఏటనే వశిష్ఠుని వలన ఆత్మతత్త్వోపదేశము నొందెను. అదియే యోగవాశిష్ఠము. ఈ వాశిష్ఠమును—వాల్మీకి ప్రణీతమనియే వాశిష్ఠము నందున్నది. కావున రాముడు జ్ఞానియయ్యే అవతార జీవితమును గడపినాడు. ఆయన అవతార ధర్మాచరణముగాని, అతడు ప్రదర్శించిన శారీరక ధర్మములు గాని ఆతని ముక్త స్వరూపమునకు అడ్డమురాలేదు. లోక సంగ్రహము నకై ఆచరించు ధర్మ కర్మలును, లోకాతీతుల జ్ఞానస్థితియు రామకృష్ణావతారములు

విక్రమములయ్యే యుండును. అందు కృష్ణావతారమున స్పష్టమై ఆయవతార బాల్య క్రీడల యందును విశ్వరూపాది ప్రదర్శనల యందును కన్పట్టగా రామావతారమునందలి ఆత్మారామత్వము నిగూఢమైయుండును. ఆతడు స్వయముగ చక్రవర్తియై ధర్మపరిపాలనను గావించ వలసి వచ్చుటే అందుకు కారణము.

రాముడు పరమాత్మ యను మాటను మరువక మనము రామాయణ మహాకావ్యమును గ్రహించవలెను. వాల్మీకి మహర్షి అక్కడక్కడ రాముని ఉపమించుటలో ఈ విషయమును స్పష్టపరచినారు. ఈ కాండయందెన్నియోచోట్ల అట్టి ఘట్టములున్నవి. వాటిని ప్రదర్శించుచు కథను చెప్పుట నా లక్ష్యము. జడవాదులు చూచు చూపును రామునిపై ప్రసరించి మీ అంతరాత్మల కలుషితములు గావించు కొనవద్దని నా యుద్దేశము. జడవాద మన నేమందురా?

మానవదేహమెప్పుడు నిర్మితమయ్యెనో ఆదేహమెప్పుడు ప్రకృతి సంబంధమును కల్పించు కొనెనో ఆ కాలమే మానవ చరిత్రకు ప్రారంభ కాలమని చెప్పుట జడవాదము. ఆ కాలమును వారు నిర్ణయించలేరు. మానవుల ప్రారంభ జీవితము ఆటవిక జీవితమని వారి చరిత్రలోని అంశము. మానవ సంఘము కొంతకాలము పిట్టల కొట్టుకొని, ఆ తరువాత కాలమున జంతు మాంసమును తినుట కలవాటుపడి, ఆ జంతువుల చంపుకొనుటకు తగు ఆయుధములను రాతితోను కట్టెలతోను నిర్మించుకొని క్రమక్రమముగ యుద్ధ సామగ్రుల తయారు చేసుకొనుటను నప్పుడైనై సాంఘికముగ ఎక్కువ బలము కలవారు తక్కువ బలము కలవారిని బానిసలగాపించుకొని రాజులై వ్యవహరించిరని ఆ జడవాదుల వాదము. రాతియుగ లోహయుగములి వాదులు చెప్పునవే. నేడనుకొను నిరంకుశ ప్రపాలన మనుమాట ఈ చరిత్రకు సంబంధించినదే. సద్వాదము ననుసరించిన ప్రజాస్వామ్యమును వారెరుగరు. రాముని వర్ణనమున మరొక శ్లోకమును వినుడు.

న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా
కథం చిదుపకారేణ కృతేనైకేన తుష్యతి.

నూరు అపకారములనైన ఇతరులు గావించుచో ఆ అపకారములను తలచనైన తలచడట. ఏదో ఒక ఉపకారము నేమాత్రము గావించినను వారి ఉపకార ఫలమును స్మరించి ఆనందించునట, ఇదియే భగవంతునిలోని ప్రత్యేకత. జీవుల దోషముల నాయన క్షమించును. వారందించు పూజావిధములత్యల్పములైనను

సంతసించి అనుగ్రహించును. రాజు కూడ ఇట్లుండవలెను. ఇట్లెన్నియో గుణములు వర్ణింపబడినవి రాముని యందు. అందొక గుణమిది —

శీల వృద్ధైర్జ్ఞాన వృద్ధైర్వయో వృద్ధైశ్చ సజ్జనైః
కథయన్నాస్త వై నిత్యమస్త్రయోగ్యాంతరేష్వపి

ఆతడెప్పుడును వృద్ధులతోడనే స్నేహమును చేయునట. ఎవరా వృద్ధులు? కేవల వయోవృద్ధులు కాదు. శీల వృద్ధులును, జ్ఞాన వృద్ధులును, సజ్జనులైన వయోవృద్ధులునట. ఈ వర్ణనలోని ప్రత్యేకత ఏమి?

మానవుని పరిశుద్ధ జీవితమును తెలుపునది ఆతని మిత్ర మండలి. ఆత డెవ్వరితో స్నేహము చేయుననునది చాల ముఖ్యమగు విషయము. కావున ఆది కవి రాముడెవ్వరితో మైత్రిని సలిపెడివాడో వర్ణించినాడు.

సజ్జనులు కానివారితో వారెంత వయోవృద్ధులైనను రాముని దృక్పథమున వారు స్నేహపాత్రులు కారు. శీలమన నడవడిక. వక్రమార్గమున నడచు వారెట్టి వారైనను వారివంక తిరిగి చూడడు. శీలవృద్ధులు ఆతని ఆప్తమిత్రులు, నడవడిక వేరు, విజ్ఞానము వేరు, కావున జ్ఞాన వృద్ధుల నాతడు దగ్గరకు తీయునట. ఒక్కొ క్కరి వలన ఒక్కొక్క ప్రయోజన మున్నది. శీలవృద్ధులతో ఆతడు సదాచార ప్రసంగముల గావించును. అనగా వారు ధర్మ శాస్త్ర నిపుణులన్నమాట. నడవడికను చెప్పునవి ధర్మ శాస్త్రములు. ధర్మము రెండు విధములు. సామాన్య ధర్మము, ఆ పద్ధర్మమునని. ఆ రెండు ధర్మముల తెలసి నడవడికను దిద్దుకొనవలెను. జ్ఞాన వృద్ధులతో మోక్ష శాస్త్ర ప్రసంగముల గావించును. వయోవృద్ధులతో వంశా చారముల ప్రసంగించి తెలుసుకొనును. ఇంకొక్క విశేషమున్నది. వారితోటి మాట్లాడు సమయమెప్పుడు? వారి తోటి ప్రసంగములకు ప్రత్యేకముగ ఈ సమయ మని లేదు. తాను ప్రధానముగ అభ్యాసమును చేయు ధనుర్వేదాధ్యయన కాలము నందుకూడ ఏమాత్రము అవకాశము దొరకినను సంభాషించునట.

బుద్ధిమాన్ మధురాభాషీ పూర్వభాషీ ప్రియం వదః
వీర్యవాన్నచ వీర్యేణ మహతా స్వేన విస్మితః

ఆతడు మహా మేధావియును. ఆతని పలుకులు తేనేలొలుకునట. ఎంత తక్కువ వానినైనను తానే ముందుగ మాట్లాడించునట. శత్రువుల యెడకూడ రాముడు ప్రియవచన శీలుడట. శత్రునిరసనము వల్లనాతడు అత్యంత సమర్థుడే

యయ్యెను తన సామర్థ్యమునకు తానే ఆశ్చర్య పడునట. ఇక్కడ కవి విస్మయ పదమును వాడెను. విస్మయమన గర్వము. గర్వము. లేని వాడని భావము. మరొక్క విశేషము-

“నచానృత కథో విద్వాన్ వృద్ధానాం ప్రతి పూజకః
అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చాప్యను రంజతే.

రాముడు చక్కని పండితుడు. కాని అబద్ధపు కథల యందాతడు అనురక్తుడుకాడు. అబద్ధపు కథలననేమి ? కల్పితకథలని అర్థము. (ఈనాటి నవలలు) అసత్కావ్యములు విశ్వశ్రేయములుకావు. మహాకావ్యముల పఠనము అవసరము కాకపోదు. సంస్కృతమున కూడ నవలలు లేకపోలేదు. కాని అవి విశ్వశ్రేయములుకావు. ప్రజల నాతడు ప్రేమించును. ప్రజలచే ఆతడు ప్రేమింపబడునట. ఇవి ఇట్లుండ మరొక్క విశేషము రాముని యందుండెనని మహర్షి ప్రత్యేకించినారు.

కులోచిత మతిః క్షాత్రం ధర్మం స్వం బహుమన్యతే
మన్యతే పరయా కీర్త్యా మహత్స్వర్గఫలం తతః॥

భారతీయ వర్ణధర్మములు అనాది సిద్ధములు గాని సంఘము చేపట్టిన వృత్తుల ననుసరించి వచ్చినవి కావని ఈ శ్లోకము నిర్ణయించు చున్నది. రాముడు తన క్షత్రియ కులమునకు ఉచితమగు క్షాత్రధర్మమునే ఉత్కృష్టమని తలచునట “స్వం క్షాత్రం ధర్మం బహుమన్యతే” అనినారు తన ధర్మాచరణ వలన వచ్చు స్వర్గము నాతడు గొప్పదానినిగా భావించునట. స్వర్గమున్నదని నమ్మిన వారే ఆస్తికులు. రాముడు ఆస్తికుడు. కీర్తికి స్థానమిచ్చుట ధర్మము ననుసరించియేనట. ఇంతియే కాదు. మరి కొన్ని ముఖ్య విశేషముల చెప్పిముగింతును.

ధర్మకామార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్
లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః

రామునకు ధర్మార్థకామముల తత్త్వముతెలుసునట. మరపు లేదట. ఆతని ప్రతిభ నిత్యనూతనమట.

ధర్మార్థకామముల సేవించుటకు శాస్త్రకారులు కాలముల నియమించినారు. ప్రాతఃకాలమున ధర్మమును, మధ్యాహ్నమున అర్థపురుషార్థ సేవనమును, రాత్రి కాలమున కామానుభవమునని. ఇందు ధర్మార్థములు కాలవ్యత్యాసములు

కావచ్చును. ప్రాతఃకాల మధ్యాహ్నములు మారవచ్చును. కామము మారరాదు ఈ విషయముల తెలిపిన తత్త్వవేత్త యట రాముడు. ధర్మార్థ కామములు శాస్త్రాధీనములు. ఆశాస్త్రములును వేదసమ్మితములే. అంతేగాక స్మృతి, ప్రతిభ అను గుణమును ప్రత్యేకములట స్మృతియన శాస్త్రాచరించదగు పనిని మరువ కుండుట. ప్రతిభయన ప్రతికార్యము నందును క్రొత్తదనమును కల్పింపదగు శక్తి. ఇవి గాక లౌకికాచార శిష్టాచారముల యందును ఆపస్తంబాది ముని ప్రణీత శాస్త్రము లందును ఆతడు విశారదుడట. అనగా వాటిని ఆచరింప చేయుట యందు సమర్థుడని అర్థము. మరొక్క విశేషము :

"నిభృత స్సంవృతాకారో గుప్తమంత్రస్సహాయవాన్
అమోఘ క్రోధ హర్షశ్చ త్యాగసంయమ కాలవిత్.

తన హృదయము నందలి విషయములను ఎదిరివారు గ్రహించకుండ దాచు కొనుట యందత్యంత కుశలుడట. అనగా ఆకార చేష్టల వలన పర హృదయమును గుర్తెరుగు వారుందురు. వారికి రాముడు వశుడు కాడట. అట్టి మంత్రులే అతనికి సహాయకులు గూడ. అవియట్లుండ అతనికి వచ్చు క్రోధము గాని సంతసము గాని గడ్డిమంటవలె వెలిగి చల్లారునని కావట. అవి కార్యరూపమును ధరించియే తీరునట. మరొక్క విశేషమేమన? త్యాగమెప్పుడు చూపవలెను? నిగ్రహము నెప్పుడు వాడవలెనను కాలముల నాతడు తెలిసివర్తించు వాడట. అన్నిటికంటె ముఖ్యమగు విషయమొకటున్నది. అది ఆదాయమెట్లు చేయవలెను? వ్యయము నెట్లు చేయవలెను ననునది.

దీనిని భారతీయ అర్థశాస్త్రము చక్కగ చెప్పినది. బృహస్పతి, శుక్రాచార్యుడు సంగ్రహించిన అర్థశాస్త్రమునే కామందకుడు, చాణక్యుడు మొదలగు వారు మరల మరల సంగ్రహించినారు. రాజపుత్రులే, అర్థశాస్త్రాధ్యయనము చేయుట చాలా ముఖ్యముగ జరిగెడిది. దీనిని వాల్మీకి రాముని వర్ణనలో ప్రత్యేకించినారు.

"ఆయకర్మణ్యుపాయజ్ఞస్సందృష్టవ్యయ కర్మవిత్"

ఆదాయమును చేయుట యందు రాముడు చాలా నేర్పరియట. వ్యయమును చేయుట యందాతడు దీర్ఘదర్శియట. "సం" అను ఉపసర్గను వాడినారు. దృశిర్ ధాతువునకు సమ్యక్తై దృష్టః అని అర్థము. వ్యయము చేయుటయందు అతని చూపు ఎంతదూరము పోవునో చెప్పినారు. ఇట్టి గుణముల నెన్నిటినో

వర్ణించినారు మహర్షి. మనకు కాలము చాలదు. ఇక చివ్వరి శ్లోకమును మీకు వినిపించెను. రాముని యందీ గుణ సముదాయ మెట్లుండెనో ఒక చక్కని ఉపమానముతో వర్ణించినారు.

గుణైర్విరుచే రామో దీప్తస్సూర్య ఇవాంశుభిః

ఈ వర్ణించిన గుణములన్నిటితో రాముడు చక్కగ వెలుగొందు చుండె నట. ఎట్లుట ? ప్రకాశవంతుడగు సూర్యుడు తన కిరణములతో వెలుగొందునట్లు రాముడు వెలుగొందు చుండెనట. ఈ ఉపమానములోని ప్రత్యేకత ఏమి?

సూర్యుని కిరణములు సూర్యుని కంటె వేరుకావు. ఆ గుణములకు సూర్యుడే అధిష్ఠానము. సూర్యుడు వేరై గుణములు వేరై లేవు. సృష్టిస్థితి లయముం లకు సూర్యుడాధార భూతుడు, రాముడాతడే. కాని ఇక్కడ ఉదయ భానునిగ పోల్చక "దీప్తః" అను విశేషణమును వాడి ప్రస్తుతమున రాముడు పాలకుడుగా స్థితికాలము నందలి సూర్యునకే పోల్చినారు. సూర్యుడు లోకబాంధవుడయినట్లే రాముడు లోక బాంధవుడని సూచించినారు. సూర్యుడు చీకట్లను పోగొట్టునట్లు రాముడును అజ్ఞానమును తొలగించు ఆత్మారాముడని ధ్వనించినారు.

ఇట్టి రాముని ప్రజలు రాజు కావలెనని కోరినారు. అట్టి రాముని యువ రాజును గావింప దశరథుడు యత్నించినాడు. ఇది నాటి పరిపాలనకు ప్రారంభ ఘట్టము. నేనే తగిన నాయకుడనని ప్రజలకు ప్రజానాయకుడు దోసిలియొగ్గలేదు.

ఈ సందర్భమున నాటి నేటి పరిపాలనా విధానముల పరిశీలింతము.

నేటి పాలనము ప్రజాస్వామ్యము. నేటి ప్రజాస్వామ్యమున రాజను వాడొకడు నియతుడై లేక ప్రతి పరిమితకాలమునందును ప్రజా బాహుళ్యము ఒప్పు కొన్న వ్యక్తి పరిపాలకుడగును.

ఏ వ్యక్తి తాను పరిపాలకుడను కావలెననుకొనునో, ఆ వ్యక్తి తన్ను ఎన్నుకొన్నవారి కీలాభములను నేను చేకూర్తునని ప్రచారము కావించుట కలదు నేటి ప్రజాస్వామ్యమున. ఈ ప్రచారమని ప్రచారమున కయ్యెడి ఖర్చునకు మితము లేదు. ప్రజలను తన కభిముఖము గావించుటకై యత్నించు ప్రయత్నములం దగ్రగణ్యుడు పరిపాలకుడు. ప్రజలు తనను ఎన్నుకొనునట్లు ప్రయత్నించుట రాజకీయ చతురత. ప్రజల పలుకుబడియే పనికి శిక్షకు(?) విజ్ఞానముగాని చరిత్రలోని పవిత్రతగాని న్యాయశాస్త్రాధ్యయనముగాని పితృ పితామహ ప్రయోగమున వచ్చెడి ప్రజ్ఞా విశేషముగాని ప్రధానములు కావు. పరిపాలకుని ఎన్నుకొను

ప్రజలు ఈతనిని ఏమెందుకొరకెన్నుకొనుచుండిరో ఆతనికిగల సామర్థ్యమెట్టిదో తెలియని ప్రజలకు కూడ ఓటుహక్కు ఉన్నది.

సర్వమానవ సమత్వము, సర్వమానవ సౌభ్రాతృత్వము ప్రతి మానవుడును తన ప్రాథమిక హక్కుల పరిరక్షించుకొను స్వేచ్ఛయు ప్రజల సౌఖ్యమని చాటుట ప్రచారకుల ప్రచార సూత్రములు.

సర్వసాధారణముగ ప్రజలలో అధిక సంఖ్యాకులచేత ఎన్నుకొనబడిన ప్రతినిధులచేత నడుపబడు ప్రభుత్వమునకు ప్రజా ప్రభుత్వమని పేరు. (డెమొక్రసీ)

ఏనాడైనను ఏ పరిపాలనయైనను మూడు అంశములుండును. ఒకటి పరిపాలకుడు రెండు పరిపాలింపబడువారు. మూడు పరిపాలనా విధానము.

పరిపాలనా విధానమన చట్టనిర్మాణము, పరిపాలకుడన ఆ చట్టమును అమలుపరచువాడు. పరిపాలింపబడు వారన ఆ చట్టములకు బద్ధులై నడచువారు.

ఒకనాటి పరిపాలనము నిరంకుశపరిపాలనమనియు నాడు ప్రజలు అస్వతంత్రులనియు నేటి ప్రజాస్వామ్యవాదము చెప్పు ముఖ్య విషయము—

అనగా ప్రజలకు స్వాతంత్ర్యము నిచ్చి, వారి అభిమతములను తీర్చుటకు వారి అనుకూల విధానమున పరిపాలించుటయే ప్రజాస్వామ్యములోని అమృత ఖాంశ ప్రద్యామని నేటి ప్రజాస్వామ్యవాదుల వినాదము.

ఈ ఘటమున నా ప్రశ్నలివి.

ప్రజాస్వామ్యమున ప్రజలకు స్వాతంత్ర్యము నిచ్చినదే భాగమునందు? అసలా ప్రజాస్వామ్యపదమునకు అర్థము కుదురునా?

మన ప్రజాస్వామ్యమున ప్రజలకు గల స్వాతంత్ర్యము పాలకుని ఎన్నుకొనుట యందు మాత్రమే కలదుగాని పరిపాలనా విధాన నిర్మాణమునందు లేదు. కాక తమచే ఎన్నుకొనబడిన పరిపాలకులు గావించు శాసనములను ధిక్కరించుట నేరము కూడ. ఇది ఇట్లుండ —

ప్రజాస్వామ్యమున నేను చెప్పునది గాని నీవు చెప్పునదికాదను వారి సమ్మేళనములలో ఆ నిర్ణయము ముక్కలు ముక్కలై ఆ ప్రజాస్వామ్యము యావ [illegible] దిద్దుకొనలేని స్థితికి దిగజారి దేశదౌర్భాగ్యమునకు మాత్రమే కారణ

మైనదనుట నిర్వివాదము. నేనిప్పుడు చెప్పినమాట బుద్ధిమంతు లొప్పుకొననిదికాదు. ఒప్పుకొనక తప్పని మాట కూడ.

ఒప్పుకొననిచో పాలకుని అర్హతలనిర్ణయించు గీటురాయి ఏదియట? భిన్నభిన్నములగు పార్టీల విధానములను తూచుకొను త్రాసు ఏమున్నది? పార్టీలకును మితములేదు. ప్రతివాని పైత్యమును ఒక పార్టీయైనది.

ప్రజాబాహుళ్యము ఒప్పుకొనుమట అధికార నిర్ణయమగునా? బంగారమిది యని నిర్ణయించునది ప్రజావాణియేనా?

ఒక దేశద్రోహి నేతేచ్చిన లోహమును బంగారమని మీరందరన్నచో మీకు చాలినంత ద్రవ్యము నిత్తుననును. ఆ ద్రవ్యలోభులు చాలమంది తాత్కాలిక లాభము నపేక్షించి అతని మాటకే ఓటు నిచ్చినచో అది బంగారమనుట విజ్ఞానమగునా? ప్రజాస్వామ్యమన ఎక్కువమంది ఒప్పినదేగదా? బంగారమగుట? ఇంతకంటె తెలివి తక్కువ తన మేమున్నది? పరిశీలింపుడు —

అసలు ప్రజాస్వామ్య పదము దోషభూయిష్ఠము. రక్షకుడును రక్షింపబడువాడును ఒక్కడెట్లగును?

రక్షణయనునది క్రియాపదము. ఇది ఆత్మనేపది ధాతువు ధాతువు. చేత బోధితమగు ఫలము ఇతరులకు చెందుచో అది పరస్మైపది ధాతువు. ధాతువుచే బోధితమగు ఫలము కర్తకు చెందుచో అది ఆత్మనేపది ధాతువగును. ఆత్మనేపది యగు రక్షణ ధాతువుయొక్క ఫలము రక్షింపబడువానికి చెందవలెనుగాని రక్షకునకెట్లు చెందును? రక్షణ క్రియకు కర్తయు, కర్మయు ఒక్కటి కాజాలదు కావున శాసన క్రియాఫలము ననుభవించువాడు వేరైశాసనకర్త వేరైయుండవలెనుగాని శాసనకర్తయు, శాసన క్రియాఫల భోక్తయు ఒక్కడు కారాదు. ఇది ప్రజాస్వామ్య పదములోని దోషము.

ఇక నాటి రాజ్యాంగ విధానమును పరిశీలింతము.

భారతీయ రాజ్యాంగమున పరిపాలకుడగు రాజును పరిపాలింపబడు ప్రజలును అస్వతంత్రులే. స్వతంత్రులుకారు. పరిపాలన అనుపదమునకు పరిపాలకునకంటె ముందే యున్న విధానమును పాలించుట అని అర్థముగాని ఎన్న

కొనబడిన ప్రతి ఒక్కరును ఇష్టము వచ్చినట్టు పాలనా విధానమును సృష్టించుట పాలన అను పదమునకు అర్థము కాదు.

పాలనా విధానమునకు సృష్టికర్త వేరై పాలకుడు వేరైయుండి సమాజమునకు వచ్చు కల్లోలములకు తావివ్వక కల్లోలములు కలిగినప్పుడు ధర్మాను సరణమగు రాజనీతిని అనుసరించుటయే నాటి పరిపాలనలోని సౌజన్యము. బ్రహ్మ సృష్టికర్త కాగా విష్ణువు పాలకుడయ్యెను. నేము చేయునది ధర్మమేనని గాని కాదని గాని ధర్మాధర్మనిర్ణేతలు ప్రజలేయగుచో న్యాయస్థానము లెందుకు ? నాటి పాలనా విధానమున ధర్మాధర్మముల నిర్ణయించునవి వేదశాస్త్ర ములు.

సూర్యుడు దయించునది తూర్పుదిక్కు అస్తమించునది పడమర అను నిర్ణయము ఎవరికి వారే చేసుకొనుట నాటివిధానమునలేదు. "వేదోఖిలోధర్మ మూలం" అనునది సిద్ధాంతము. పుణ్యపాపముల నిర్ణయములు వేదమూలకములు. ధర్మోవిశ్వస్య జగతః ప్రతిష్ఠా" అను వాక్యమాధారముగా నాటిపాలనావ్యవస్థ నడచినది.నాటి వ్యవస్థావిధానమిది.

లక్షాధికారి మొదలు భిక్షాధికారి వరకును గల అన్ని వృత్తుల యందును లోక శాస్త్రనిందితములగు జారత్వ, చోరత్వ, మద్యపాన ద్యూతాది వృత్తులతో జీవించు వారిని వదలి పాలకుడు ప్రతివారికిని యోగక్షేమముల కల్పించవలెను.

తమ బ్రతుకుతెరువు వరకే జీవన విధానమును నడుపుకొనువారికి పన్నులు లేవు. నిల్వచేయదగిన ఆదాయము లేనివారికి రక్షణను మాత్రమే కల్పించ వలెనుగాని పన్నుల భారము వారిపైమోపరాదు.

అధికాదాయము కలవారికి ఆరవవంతు పన్నును వేయవలెను. ఇట్టివెన్నియో నిర్ణయములున్నవి. అట్టి నిర్ణయములతో నాటి వ్యవస్థ సాగినది. మరొక్క విశేష మును చెప్పివిరమింతును. నేను చెప్పబోవునది చాలా ముఖ్యమగు మాట. నాడు గ్రామాధికారి మొదలు అఖండ భారతమును పరిపాలించు ప్రభువు వరకును వారు అధ్యయనము గావింపదగు పాఠ్యగ్రంథము లుండెడివి. అవి ప్రతిసంవత్స రమును మారునవికావు. తర్క వ్యాకరణ మీమాంసా శాస్త్రాదిను బంధములుగ నుండెడివి. ఆగ్రంథముల పఠించియే ప్రజాప్రతినిధులుగ నిలువవలెను. నేటి తాలూకా, జిల్లా రాష్ట్ర విభాగముల వలెనే మండల ఉపమండల రాష్ట్ర, దేశనామ ములతో వ్యవహరింపబడెడివి. ఈ మండలాదులకు పాలకుల నిర్ణయము ఆదేశ

ప్రధానియే నిర్ణయించెడివాడు. పరిపాలనాధికారమును గుర్తించదగు ప్రజలకును ఆనిర్ణయమున అధికారముండెడిది కాని నాటి పరిపాలనా వ్యవస్థ ఏ క్షణమున కాక్షణముననే మారుచుండెడిది.కాదు. ప్రజాప్రతినిధులకు వేతనము లుండెడివికావు. గౌరవవేతనములుండెడివి. గ్రామ రాష్ట్రాది పాలకులు ఆయిదు సంవత్సరముల పరిమితి కలిగి, క్రొత్తవారికి ఎన్నికలుడెండివి. క్రొత్తవారి దొరకనిచో పాత వారు అంగీకరించినచో పూర్వులైన ఎన్నుకొన వచ్చును. ఒక విధముగ చెప్ప వలసి వచ్చుచో నిస్వార్థ దేశభక్తులకే ఆయా పరిపాలనాధికారము లభించెడిది. పదవీ వ్యామోహితులకు స్థానముండెడిదికాదు. ఉపమంత్రి మంత్రి నిర్ణయములలో ఎవ్వడు ఏశాఖకు సంబంధించిన శాస్త్రమునందు పారంగతుడో వానికే ఆమంత్రి పదవి యుండెడిది. ఇట్లు చెప్పవలసి వచ్చుచో మరెక గ్రంధ మగును. ముఖ్యముగ చెప్పతగినమాట ఎన్నికల ఖర్చులు, ఎన్నికల సంరంభములు కొట్లాటలు, రక్షణ శాఖతో ఎన్నికలు జరుపుట నాడులేవు. నేటి ప్రజాస్వామ్యము బూరుగచెట్టు పూవు వంటిది.

చిలుక బూరుగచెట్టు పువ్వును చూచినది. అది పెద్దగ కనుపించగా దీని పండును ఇట్లే యుండుననుకొన్నది. చివరకాపువ్వు పండైచిలుక కంటబడినది. దానిని చిలుక ముక్కుతో పొడిచినది. ఆపండునందున్నది దూదిగాని రసముకాదు. కండయు లేదు. ఆదూదియు ఆచిలుకకు దక్కలేదు. ఆదూది గాలికెగిరిపోయినది. ఇదియే నేటి ప్రజా స్వామ్యఫలితము. కథకు వత్తము.

దశరధుని వార్ధక్యము వరించినది. యౌవనమాతని నిర్దాక్షిణ్యముగ వదలినది. అతడిక తన రాజ్యభారమును దింపుకొనదలచినాడు. చచ్చువరకును నేనే రాజునై యుండవలెనను దురాశ అతనిని సమీపించలేదు. కావున తాను దించు కొన దలచిన రాజ్యభారమును మోయగలవాడు రాముడని ఆతడు నిశ్చయించు కొనినాడు. అప్పటికి దశరధునకు అరువదివేల వత్సరములు.

కాని ఆ భావమును కార్యరూపము నొందించవలెనన్నవాడును నేడును రాజు (లేక) తత్కాల ప్రభుత్వము స్వాతంత్ర్యము కలిగిలేదు. ప్రజావాణికి రాజు నాడును బద్ధుడే. ప్రజల యనుమతి లేక రాజపీఠమున మరియొక రాజును స్థాపింపదగు అర్హత రాజునకు లేదు. ఈ చట్టము సనాతన సిద్ధాంతము లోనిదే. పుత్రుడెట్టివాడైనను తండ్రి రాజ్యమును ఆతనాజ్యేష్ఠ పుత్రునకే సంక్రమించ

వలెనను నియమము నాడులేదు. పుత్రుడు గుణ జ్యేష్ఠుడైననే పరిపాలనా దక్షత్వము కలిగి యున్ననే ఆతనిని తండ్రి యువరాజును గావింపవలెను. గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుని రాజుని చేయలేదు నాటి భారత రాజ్యాంగము. ప్రస్తుత కథాంశమున దశరథుని దృక్పథమున రాముడు నిలచినాడు. ఇక ప్రజావాణి ఆతనిని వరించి ఎన్నుకొనవలెను. అందుకు ముందుగ మంత్రులతో మంతనముల గావించినాడు. మంత్రులగు వారి నిశ్చయమును ప్రజావాణి స్పష్టము గావించవలెను. ప్రజావాణి యన — ఆ నగరవాసుల వాణి యొక్కటే కాదు. నానాదేశాగత రాజ బృందమును, పౌర జానపదులును పరిషద్గణమై పరిషన్మధ్యమున నిలచి ఏకగ్రీవ మున తన అభిప్రాయమును బలపరచవలెను. దశరథుడట్లే పరిషత్తునేర్పాటు గావించినాడు. ఆతని సంల్పహయములు పరుగులెత్తగా ఆతడు కాల విలంబనను గావించలేదు. దశరథుని హృదయ పీఠమందేదియో ఒక మహాభయముండి యుండ వచ్చును. రాష్ట్రపతుల రాకకై ప్రతి రాష్ట్రమునకును దశరథుని సందేశ మందినది. గ్రామ సీమలిందు విడువబడలేదు. ఆటవిక రాజులకును, మ్లేచ్ఛరాజ్య ములకును గూడ సందేశములందినవి. కాలవ్యవధి లేక పోవుటచే కేకయ రాజు నకును, జనక చక్రవర్తికిని మాత్రము కబురందలేదు. "పశ్చాత్తా శ్రోష్యతః ప్రియం" తరువాతనైన వారు సంతోషింతురని తలచినాడు దశరథేశ్వరుడు.

అతి శీఘ్రముగ పరిషత్తు ఏర్పాటైనది. ఆ మహా పరిషత్తునకు రాని వారు లేరు. ఎందరో పండిత ప్రకాండులు విచ్చేసినారు. కవులును లేక పోలేదు. మునివర్యులు తమకు తగిన పీఠముల నలంకరించినారు. వివిధ రాష్ట్ర ప్రతినిధులును సామంత ప్రభువులను, జానపదులును గూడ ఆ మహా పరిషత్తు నలంకరించినారు. ఇక నా పరిషన్మధ్యమున వృద్ధభూపతియగు దశరథ రాజేంద్రుడు తన రాజ పీఠము నలంకరింప వలెను. అతడును రాజపీఠమున ఆసీనుడయ్యెను.

అదియొక భవన రాజము. ప్రజాసంఘసంతతియు నిశ్శబ్దమై నిస్తరంగ సముద్రమువలె ప్రశాంతముగ నున్నది. దశరథేశ్వరుడేమి మాట్లాడునోయని. ఆ రాజు కంఠనినాదము మేఘగంభీర ధ్వానమై సభాసదుల ముగ్ధుల గావించుచు వారిని సంబోధించిన అతని ఆహ్వానము సభాస్థలి కంఠతను నందించినది.

పౌరులారా!

మా పూర్వులందరును మిమ్ము కన్నబిడ్డలవలె దీర్ఘకాలముగ పరిపాలించినారు. పవిత్రమగు ఇక్ష్వాకు వంశమున పుట్టిన నేనును పరమ పావనులగు

మా ఇక్ష్వాకు వంశజుల మర్యాద ననుసరించి వారి కీర్తి ప్రతిష్ఠలకు భంగము కాకుండ ఇంత వరకును రాజ్య పరిపాలనను చేయగలిగితిని. ఇప్పటికి నాకు అరువది వేల వత్సరములు నిండినవి. నాకిక రాజ్యము భారమైనది. ఏమరుపాటును నన్ను వరించినది. ధైర్య స్థైర్యములతో జితేంద్రియుడనై ధర్మ స్వభావము నుండి వెనుకకుమరలకయే దీర్ఘ కాలముగ మోసిన ఈరాజ్యభారమ్మును దించుకొనక నాయంతరంగము సుఖించుట లేదు. ఇది నాకు విశ్రాంతి కాలము, మీ యనుజ్ఞను బడయక నేనీ రాజ్యభారమును దించుకొన సమర్థుడను కాను. రాజ్యము గతియే మందురా ? జ్యేష్ఠుడై నా గర్భమున బుట్టిన రాముడు సకల గుణాభిరాముడు. సర్వజన ప్రియదర్శనుడు. రాజకార్యములందు మేటి. ధర్మార్థవేది. సమాచారముల నెరిగిన ప్రౌఢ, కాలమునకు పరుడు కాడు. లోకోత్తర గుణ విరాజితుడు. ఆ రఘువీరుని అనుగ్రహానుగ్రహములు వ్యర్థములు కావు. కులోచితమగు క్షాత్ర ధర్మ ప్రకారము వర్తించుటచే కలుగు కీర్తియే మోక్షమిచ్చునని ఆ ధర్మాత్ముని సిద్ధాంతము. వేదవేదాంగముల సారము నెరిగిన రసజ్ఞుడు. యుద్ధము నందజేయుడు. బుద్ధి కౌశలమున బృహస్పతియే. అట్టి రాముడు ఇచ్చట గల సభాసదులెల్ల నిండు మన్ననలతో నంగీకరించెదరేని, షోడశ కళా పరిపూర్ణుడై పుష్యమి నక్షత్రముతో కూడిన కుముద బాంధవుని భంగి యువరాజ్య పట్టాభిషేక సింహాసనాసీనుడై ప్రజాహితుడై రాజ్యపాలన చేయగలడు. రాముడు పాలింపదగినది ఈ అల్ప రాజ్యమేనని మీరు భావింపకుడు. త్రిలోక సామ్రాజ్యలక్ష్మి నెవ్వని వరించి నాధునిగా గొని నాధవంతురాలు కాగలదో అట్టిరాముని మీకు నప్పగించి నేనీ సింహాసనము నుండి దిగ దలచినానని తన గంభీర వాక్య సరణిని ముగించి మౌన ముద్రను వహించినాడా వృద్ధ భూపతి.

రాముడు ముల్లోకముల పరిపాలింప సమర్థుడని పలికిన దశరథుని పలుకును వినుడు___

> అనురూపస్సవై నాథో లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః
> త్రైలోక్యమపి నాథేన యేన స్యాన్నాథవత్తరం.

ఇది వాల్మీకి వాణి, శ్రోతలారా ! ఇందు కవి తన కావ్య నాయకుని ఎవ్వడని ప్రకటించెను? ఇంద్ర యమ వరుణ కుబేరాది దిక్పాలురకెల్ల పాలకుడని స్పష్టపరచెను. దశరథుడంతతో ఆగలేదు. ప్రజలకు రాముని గుణముల విని

పించి రాముడు సమర్థుడని తెలిపియు మీరు నిశ్చయింపుడని వారిపై నెందుకు పెట్టెను? అదియే మన మిక్కడ గ్రహింపదగు విషయము.

అనురాగము దోషమును చూడనివ్వదు. ద్వేషము గుణమును గ్రహించ నివ్వదు. కావున రాగద్వేష రహితుని నిర్ణయము తగిన నిర్ణయము. అందుచేతనే దశరథుడు ప్రజలపై పెట్టి మీరు నిర్ణయింపుడని వారికి స్వేచ్ఛ నిచ్చినాడు.

యద్యప్యేషా మమ ప్రీతిర్హితమన్యద్విచింత్యతాం
అన్యా మధ్యస్థ చింతా హి విమర్దాభ్యధి కోదయా

వెనుక ముందుల బాగుగ విచారించుట చాల అవసరమని—స్పష్టపరచినాడు. అనగ తనను రాజుగ భావించుటగాక నన్ను కార్యనిర్వాహకునిగ భావించి, మీరును మధ్యస్థులై విచారించి నిర్ణయింపుడనినాడు. ఇదియే రాజున కుండదగు అత్యుదారమగు భావము.

ఇక ప్రజల దగ్గరకు పోదము. వారి అభిప్రాయమును విందము—

వాల్మీకి మహర్షి ప్రజల హృదయ సీమల ప్రవేశించినారు. రాముని యువరాజును చేతునన్న వార్తను విని ఉప్పొంగి పోయినవారి సంతుష్ట స్వాంతముల తిలకించినారు. వర్షాకాల మేఘమును దర్శించిన మయూరముల వలె నాట్యములు సలుపుచున్నవి వారి మనస్సులు. యువరాజై భద్రగజము నధిరోహించి, శ్వేతచ్ఛత్రము—రాముని ముఖమండల శోభకు అలంకారమును గూర్చగా అట్టి రాముని ఊరిగింపుతో ఎప్పుడు చూతుమాయని ఉవ్విళులూరుచున్న -ఆరసజ్ఞ శేఖరుల రసభావ తరంగముల గమనించినారు. ప్రజలు రాముని కేవల మూఢముగ భావించిరా? అని కూడ మహర్షి ప్రజల మనస్సులను పరిశీలించినారు. రామునియందున్న ప్రత్యేకత నెరిగియే వారానందించుచుండిరని మునివర్యులు నిశ్చయించుకొనినారు. తరువాత ప్రజలందించిన సమాధానము నిట్లు చెప్పినారు.

ఇచ్ఛామోహి మహాబాహుం రఘువీరం మహాబలం
గజేన మహతాయాంతం రామం ఛత్రావృతాననం॥

మహారాజా! రామునే యువరాజుగ చేయుటను మేము కోరుచుంటిమనినారు. మీరు చెప్పగా మేము ఒప్పుకొనుట కాదు. ఎప్పటి నుండియో మా కోరిక

ఇట్లున్నదని వారి ఉత్సాహమును సూచించినారు. రాముడు మీ వంశమునకే సంద్రగ గణ్యుడనినారు. రాముని బలపరాక్రమములు కొలతలేని వనినారు. అట్టి రాముని భద్రగజముపై నెక్కించి రాజవీధుల రాముని త్రిప్పుచు అంతర్గృహముల వసించు స్త్రీలకు సైతమును రామునెప్పుడు దర్శింప చేతురా? యని ఉవిళ్ళూరు చుంటిమనినారు. రాముని ప్రత్యేకతను ప్రజలు నిర్ణయించి రాముని పరిపాలకుని గావింపుమని కోరుటకు ముందు రామునకీ విషయము తెలియదు. రాముడు తనను పరిపాలకునిగ ఎన్నుకొనమని ప్రజలలో ప్రచారమును చేసుకొనలేదు. నాటిది పెట్టుబడితో కూడిన ప్రజాస్వామ్యము కాదు.

తన పుత్రుని పట్టాభిషిక్తుని గావించుటకు ప్రజలందించిన సంతోష వార్తకారాజు తృప్తి నొందెనా? అతడు వారి ఒప్పుదలకు సంతృప్తి నొందలేదు. ప్రజలు మనసారా చెప్పిరా? నామమాత్రముగ ప్రకటించిరా? అనునది తేలవలెను. స్థూణానిఖన న్యాయమని ఒక న్యాయమున్నది. నేలపై గుంజను పాతి దానిని బాగుగ అటునిటు కదిలించి, అది కదలగా వచ్చిన ఖాళీ ప్రదేశమున రాళ్ళను కూరి ఆ స్తంభమును గట్టిపరచవలెను. ఆ క్రియకు స్థూణానిఖన న్యాయమని పేరు. ఆ న్యాయము ననుసరించి దశరథుడు ప్రజలను మరలనిట్లు ప్రశ్నించినాడు వారి ఒప్పుదలను ధృవపరచుటకై. సభాసదులారా! నేను ధర్మాత్ముడనై మిమ్ములను పాలింపుచుండ రామునేల కోరిరి? అని సూటిగ ప్రశ్నించినాడు ప్రజలను. వారిప్పుడు వృద్ధ రాజున కిచ్చిన సమాధానమే రామునకును ప్రజలకును గల సంబంధము.

ప్రజలిచ్చిన సమాధానమిది —

దశరథేశ్వరా! మేము రాముని కోరుకొనుట మీ పరిపాలన యందలి లోపమునుబట్టికాదు. రాముని గుణ సంపదయే మా అంతరాత్మల ప్రేరేపించి పలికించినది. అని నాటికి వారు రాముని గుణ సంపద నెట్లనుభవించుచుండిరో చెప్పినారు. సత్పురుషుడన రాముడొక్కడేనని నాటి ప్రజలకు నిర్ణయమైనది. సత్య ధర్మములు వేరై గుణములను పేరుతో రాముని 'ఆధారముగాగొని యుండక సత్య ధర్మములే రామ రూపమున తమ్ము పాలించు చుండెనని వారు తలచినారు. ఆ విషయమును వారు స్పష్టపరచినారు.

రామ స్సత్పురుషో లోకే సత్య ధర్మ పరాయణః
సాక్షాద్రామా ద్వినిర్వృత్తః ధర్మశ్చాపి శ్రియాసహ॥

ఈ విషయమిట్లుండ రాముని పరిపాలనా దక్షత్వములోని ప్రత్యేక తనే ప్రజలెన్నియో విధముల వర్ణించినారు. అందు రెండు ముఖ్య విషయములను చెప్పెదను. ఒకటి గ్రామ సీమల యందుగాని, నగర రాజముల యందుగాని కల హములు చెలరేగుచో ఆయా ప్రదేశములకు పోదగు రథ గజ తురగాది వాహనముల నెక్కి సౌమిత్రితో కూడ ఆ ప్రదేశముల కేగి అక్కడ చెలరేగిన విరోధి వర్గముల నణచి, అందలి ప్రజలకు శాంతి భద్రతల చేకూర్చక వెనుకకు రాడట ఇది యొక ముఖ్యమగు విషయము. వెనుకకు మరలి వచ్చిన వెంటనే తన రాజధాని యందాతడు చూపుల నిగిడ్చి ప్రజల యోగక్షేమముల నరయునట. ప్రజల యోగక్షేమముల నరయుట ఏదియో ఒకరోజున కాదట. ప్రతి నిత్యమును ప్రజల యోగక్షేమముల నాతడు కనుగొనునట.

"పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి"

అని నారు వాల్మీకి. తన కుటుంబసంక్షేమములను కనుగొన్నట్లు ప్రజల నందరను నిత్యమును పరామర్శించుట ఎట్లు? పరిపాలకుడు ప్రజల యోగక్షేమముల నెట్లు కనుగొనవలెనో వాల్మీకి రామాయణము చక్కగ బోధించినది.

దేశక్షేమము అయిదు భాగముల రక్షణపై ఆధారపడి యుండునని భారతీయ రాజ్యాంగము నిర్ణయించినది. ఆ అయిదు భాగము లేవియందురా? ఆ అయిదు భాగములను రెండు భాగములుగ విభజించుచో సేవకుడు, సేవ్యుడు నను వారిద్దరుందురు. అనగా సేవింపబడువాడును సేవించువాడును. వారిద్దరి మధ్యనుండు సేవ్యసేవక భావము చెడకుండ రక్షించుటయే-- ప్రజా సంరక్షణము. సేవకుడు పుత్రుడు సేవ్యుడు తండ్రి. ఆ తండ్రి కొడుకుల మధ్యనుండునది సేవ్యసేవక భావము. అట్లే భార్యాభర్తలును, సేవకుడు యజమానియు, గురువు శిష్యుడును, అగ్నియు, తదారాధకుడును. ఈ ఐదు వ్యవస్థలను బాగుపడినచో (లేక) చెడక యుండినచో దేశము క్షేమముగ యుండును.

కర్మాగారముల సేవకుల సమ్మెలు కొనసాగగా భార్యాభర్తల మైత్రి భగ్నముగాగ, గురు శిష్యుల గ్రుద్దులాటలు పెచ్చు—పెరగగా, తండ్రి కొడుకుల మధ్య పూజ్య వాత్సల్యములు అడుగంటగా, అగ్నిహోత్రాది కర్మలకు స్థానము లేకపోగా దేశ సౌభాగ్యమెక్కడిది? కావున రాముడు దేశాంతరముల నుండి వచ్చిన వెంటనే మీ పుత్రులు మాతృ పితృ శుశ్రూషల నెరవేర్చుచుండిరా? యని తండ్రు

లను, శిష్యులు వశవర్తులై యుండిరా? అని గురువులను అగ్నిహోత్ర సపర్యలు గావించుచుండిరా? అని ఆహితాగ్నులను ప్రశ్నించి తెలుసుకొనుచుండుటే నిత్య కుశలముల తెలిసి కొనుట. ఇది ప్రజలు రామునిపై తమకుగల ప్రేమకు కారణముల చెప్పిన సంగ్రహ కథనము. తరువాతి కథ——

దశరథుని మనసుప్పొంగినది. తన పుత్రుని సద్గుణ-రాశిని ప్రజల ముఖముగ వినుటకంటె సంతోషమొండు లేదు గదా?

పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడె పుట్టదు
జనులా పుత్రుని కనుగొని పొగడగ పుత్రోత్సాహంబు నాడు పొందును
సుమతీ ॥

వెంటనే దశరథుడు రామ పట్టాభిషేకమును నిశ్చయించి వశిష్ఠాదులను అప్రయత్నములకై హెచ్చరించినాడు. రాముని ప్రజలకెరుక పరచుటకై తన సభాస్థలికి తోడ్కొని రమ్మని సుమంత్రుని ఆజ్ఞాపించినాడు.

రాముడధిరోహించిన రాజరథము దశరథుని ఆజ్ఞానుసారముగ బయలు దేరినది. దశరథుడు తాను సౌధాంతర్భాగము నుండియే తన దగ్గఱ కేతెంచు రాముని రథమధ్యము నందుండగనే చూచినాడు. ఆతడాత్మారాముడు. ఒకవిధముగ దశరథరాముడు. దశరథుడు ఆ ఆత్మారాముని తన పుత్రుడు గనే దర్శించినాడు. మనమును ఆ దశరథాత్మజుని దర్శింతము. ఇప్పుడు దశరథుడు కూర్చొన్న సభాస్థలిని ఇంద్రసభయనినారు వాల్మీకి. ఆ సభకమూల్యాలంకారమై సింహాసనాసీనుడగు దశరథుని దేవేంద్రునిగ పోల్చి, ఆదేవేంద్రుని దగ్గరకు వచ్చు రాముని వర్ణించినారు మహర్షి. ముందు మీకు వాల్మీకి వాణిని వినిపింతును.

గంధర్వరాజప్రతిమం లోకే విఖ్యాత పౌరుషం
దీర్ఘబాహుం మహా సత్త్వం మత్త మాతంగ గామినం
చంద్ర కాంతాననం రామం అతీవ ప్రియదర్శనం
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణం
ఘర్మాభి తప్తాః పర్జన్యం హ్లాదయంతమివ ప్రజాః
న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః

ఆ రాముడు గంధర్వరాజువలె నుండెనట. అతడు ప్రపంచఖ్యాతి నొందిన వీరుడట. అతడతి బలశాలియగు అజాను బాహువట. అతని నడక మత్త మాతంగమును బోలియుండెనట. అతని ముఖమండలము చంద్రకాంతికి బోలి యుండెనట. అతడు చూపరుల కత్యంత ప్రియదర్శనుడట. అతని రూప సంపద పురుష పుంగవులకు కూడ మోహమును కల్పించి వారి చూపుల నపహరింపగా అతని గుణ సంపద వారి మనసుల నపహరించునట. రథాధిరూఢుడై వచ్చు అట్టి రాముని మండుటెండలకు క్రుగ్గిన ప్రజానీకముచే చూడబడు తొలకరి మబ్బును వలె చూచి దశరథుడు తృప్తినొంద లేదట. ఇది ఆ శ్లోకముల లోని వర్ణనము. ఈవర్ణనము. వాల్మీకి మహర్షి వారి మధురానుభూతి యనక తప్పదు. ఆయన అనుభూతియే మధుర వాణియై రథము నందున్న ఆ రామవిగ్రహ దివ్య కళాఖండమును మనముందుంచినది. కాని మనమిప్పుడా వర్ణనలోని పదగుంఫనల గమనింపనిచో ఆయనకు కలిగిన మధురానుభూతిలోని భాగమును మనము ఎందుకు పంచుకొన జాలమో. గమనింతము.

మునివర్యులు రామునిలోని దివ్యసౌందర్యమును దర్శించి గంధర్వ రాజువలె నుండెనని భావించినారు. అంతలో రామునిలోని వీరత్వము అతనికి గోచరించగా లోక ఖ్యాతి నొందిన వీరత్వము గదా! ఇది యని ఆనందరస నిమగ్నులై ముని "లోకే విఖ్యాత పౌరుషం" అని వాక్రుచ్చినారు.

అంతలో రాముని బాహు సౌందర్యమాతనికెదురై నిలవగా ఆ దీర్ఘ బాహువులను గూడ మనకన్నులకు చూపి, ఆ బాహువులను మీరు సౌందర్య మాత్రములని భావింతురేమో? కాదు కాదు. అతడు మహాబలశాలియై ప్రజల రక్షించ దగిన బాహుదండముల కలిగియుండెనని మనకు తెలిపినారు. అంతలో ఆయనకు ఆ సుందరమూర్తి వయ్యారపు నడక స్మృతికిరాగా మదపుటేనుగను మనముందుంచి మత్తమాతంగగామినం అని వర్ణించినారు. అంతలో ఆ భావనా సౌందర్యగరిమ రాముని ముఖ మండలము వైపుకు తిరుగగా ఈముఖ మండలము చంద్ర మండలమునకు పోల్చదగినది కాదు. చంద్ర మండలము కంటె మనోహర మైనదని ఆ రాముని ముఖ కాంతిని దర్శించగా వచ్చిన ఆనందమును కొల్చుటకు కొలతపాత్ర లేదనునది సిద్ధాంత మగుటచే "అతీవ ప్రియదర్శనం" అని వర్ణించి చంద్రుని నుండి రామచంద్రుని విడదీసినారు. కారణమేమి?

చంద్రుడు పరిమితమగు ప్రీతిని మాత్రమే తన్ను చూచు వారల కందించగా రాముని ముఖకాంతి నిరతిశయప్రీతిని గొలుపును సుమా! అని

సత్యజ్ఞానానంద లక్షణ లక్షితుడగు ఆత్మారాముని చెప్పిన ఉపనిష ద్వాక్యమును వ్యాఖ్యానించి, ఉపనిషత్ర్పతి పాద్యమీ రామ బ్రహ్మమని ధ్వనించి నారు. తరువాతి వాల్మీకి మహర్షి అనుభూతి ఏమి? ఆ సచ్చిదానంద బ్రహ్మము సగుణ మూర్తియై కల్పించు ఒక దివ్యానుభవము ఆయనకు కలిగినది. ఆ రాముడొక్కమారుగ హరియను నామమును ధరించి వాల్మీకికి దర్శన మిచ్చి నారు. "హృఞ్ హరణే" అనుధాతువు నుండి హరి శబ్దము వచ్చినది ఈతడేమి హరించి హరియయ్యెను ? అని విచారించి, తన అప్రాకృత సౌందర్యముచే చూచువారి చూపుల హరించి తన ఔదార్యాది గుణములచే మనస్సును హరించు నుగాన ఈతడు హరిశబ్దవాచ్యుడయ్యెనని ఆ విషయమును తెలిపినారు. "రూపౌ దార్య గుణైః పుంసాం దృష్టిచిత్తాప హారిణం" అని. మరొక్కసంగతి—

పుంసాం అని పురుషుల నేల పేర్కొనెను? ఇక్కడ పురుష శబ్దముచే చెప్పబడిన వారు జీవులు. జీవులన మానవ మాత్రులేయని అర్థముగాదు. స్థావర జంగమములన్నియునని భావము. రాముడు జగదంతర్యామి. కావుననే రాముడ రణ్యమున కేగగా చెట్లుకూడ ఈ ముగ్ధమోహన మూర్తియా ? ఈ అరణ్య వాసము ననుభవించునది ? అని కన్నీరు కార్చినవి అనినారు ఈ మహర్షి మరొక చోట.

అంతేకాదు. పురుష శబ్దముచే మునులను ధ్వనించి రాబోవు కృష్ణావ తారమును కూడ ధ్వనింపచేసినారు. కృష్ణావతారము అరణ్యములోని మునిబృందము యొక్కకోర్కెను తీర్చినది గదా ? తరువాత మహర్షి మరొక ఉపమానమును వాడినారు. ఏమది ? రామునొక మేఘమునకు పోల్చినారు. ఆమేఘ మెట్టిది యన ? గ్రీష్మ ఋతువు నందు తపించు జీవుల నానందింపజేయు మేఘమనినారు. అట్టి మేఘమువలె ఆనందమును కూర్చుచువచ్చు రాముని చూచి దశరధుడు తృప్తి నొందలేదని వర్ణించినారు. ఆ శ్లోకము వొక్కమారు మరల జ్ఞాపకమును చేయు చున్నాము.

ఘర్మాభి తప్తాః పర్జన్యం హ్లాదయంతమివ ప్రజాః
న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః ॥

కనురెప్పల వాల్పక దశరధుడా పుత్రుని చూచుచుండెనట. దశరధుడే కాదు. దశరధుని వంటి ఏ పుణ్య జీవుడు రాముని దర్శించి తృప్తి నొందును ?

ఇక మనము జీవుల తాపత్రయ నివారకమగు రామమేఘమును వదలి కథను వర్తము.

అది దశరథుడును సభాసదులును వసించియున్న సౌధరాజము. రాము డెక్కివచ్చిన రథమాసౌధరాజ ద్వారము కడనే నిలచినది. సుమంత్రుడు రాముని రథము నుండి క్రిందకు దింపినాడు. రాముడాసౌధోపరి భాగమున కేగవలెను.

రాముడు మేడమెట్ల నెక్కనారంభించినాడు. సుమంత్రుడు దోసిలియొగ్గి రాముని వెంట నుండినాడు.

అది దశరథేశ్వరుని రాజాసనము. రాముడు పితృపాదుల పాదమూలమున కేగినాడు. తన గోత్ర నామములతో తండ్రికి అభివాదన గావించి, తండ్రి గారి పార్శ్వభాగమున నిలచినాడు.

దశరథునకు వాత్సల్యరసముప్పొంగినది. పుత్రిని కౌగలించినాడు. శిరమున మూర్కొనినాడు. రామునికై ఏర్పరచిన వేరొక మణిమయాసనముపై పుత్రుని కూర్చుండ నియోగించినాడు. అప్పుడారాముడెట్లుండెనట? అప్పుడా రాముడెట్లుండెనో మహర్షి వర్ణింపక రాముడాయాసనము నెట్లు ప్రకాశింపజేసెనో వర్ణించినారు. ఉదయభాస్కరుడు తానధిరోహించిన పర్వతమును వెలిగించు నట్లు అతడా మాసనమును వెలిగించెనట. రాముడొక వెలుగుచే వెలుగొందువాడు కాడు. వెలుగులకు వెలుగునిచ్చువాడు రాముడనినారు.

తరువాతి కథ —

రాముని పుష్యమీ నక్షత్రమున యువరాజ్యమును స్వీకరింపుమని ఆజ్ఞాపించి అందుకు తగిన అర్హతలు నీకున్నవని పుత్రునకు తెలిపి, రాజ ధర్మములను కొన్నిటిని పుత్రునకు బోధించినారు. అంతతో ఆ సభాస్థలి ముగిసినది. ప్రజలు అత్యంత ప్రీతియుక్తులై రాజాజ్ఞను గైకొని తమ తమ గృహముల కేగినారు. మనమొక్కమారు రాముని మాతృమూర్తి కౌసల్యా మహాసాధ్వి మందిరమున కేగుదము.

అది కౌసల్యా మహాసాధ్వి మందిరము. నేడది యొక కళ్యాణ మంటపము. తన పుత్రుడు యువరాజగునని కౌసల్య ఇంతకు మందు ఊహించలేదు. దశరథునకు కైకేయి యందెక్కుడు ప్రీతియని ఆమె ఎరుగనిది కాదు. కావున రాముడే పట్టభద్రుడు కాగలడన్న నిర్ణయమామెకు లేదు. కాని ఆమె కీనాడు తన పుత్రునే

రాజు యువరాజును చేయ నిశ్చయించెనను వార్త అందినది. ఆమె ఆనందము నెవ్వరు వర్ణించ గలరు? రాజు రామునే యువరాజునుగావింప యత్నింప వచ్చును. మానవుని యత్నము సంపూర్ణముగ సఫల మగునని నిర్ణయమెక్కడ గలదు? దైవికములగు ప్రతిబంధకములు దానిని అడ్డగించ వచ్చును. కావున భారతీయ శాస్త్రములు నీవు తలచిన లేక నీవుకోరుకొన్న అభ్యుదయ కర్మను అడ్డగించు విఘ్నబాహుళ్యమును దృష్టియందుంచుకొని నీవాచరింపబోవు పుణ్య కర్మ నిర్విఘ్నముగ కొనసాగుటకై కొన్ని శాంతి కర్మల నాచరింపుమని చెప్పినది. అదియే మనము ఏపనిని తలపెట్టినను ముందుగ ఆచరించు విఘ్నేశ్వర పూజ. ఆభాగము లోనివేదాన ధర్మములు కూడ.

కౌసల్య ఈనాడు తన పుత్రుని యువరాజ్య పట్టాభిషేకము నిర్విఘ్నముగ జరుగుట కొరకై అనేక దాన ధర్మముల కొనసాగించుచున్నది. ఇది రాముని యువరాజ్య పట్టాభిషేక మహోత్సవము నిర్విఘ్నముగ సాగుటకై దశరథాంతః పురమున జరుగు ప్రయత్నము. ఒకమారు మనము రాముడు యువరాజు కాగలడని సభామధ్యమున దశరథ ముఖముగ విని వెళ్ళిన ప్రజల దగ్గరకు పోదము. వారేమి చేయుచుండిరి? ప్రజలు కూడ—ప్రత్యేకముగ తమ తమ గృహముల యందును, దేవాలయముల యందును రాముడు రాజగుటకు అర్చనల గావించుచుండిరి. ఎవరా ప్రజలు? స్త్రీలా? పురుషులా? వృద్ధులా? యువకులా? రాముడెవ్వరిని ముందిడుకొని నడచుచుండెను? రాముడానా డెవ్వరికి ప్రత్యేక స్థానము నిచ్చెను? అనునది ప్రశ్నకాకపోదు. నాడు ఎవరికివారిచే సంఘములు లేవు. రాముని ఎన్నిక ఏకగ్రీవ మగు ఎన్నిక. వాల్మీకి వాణి ఇది—

"స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయం ప్రాతస్సమాహితాః"

స్త్రీలును, పురుషులును, వృద్ధులును, యువకులును గూడ రాముడు రాజు కావలెనని సాయంకాల, ప్రాతఃకాలముల యందు ఏకాగ్రచిత్తులై దైవ ప్రార్థనల గావించు చుండిరట. ఒకవంక కౌసల్య తన పుత్రుని అభ్యుదయమునకై కొనసాగుచున్నకాలమది. నాటి ప్రజాస్వామ్యము ఆధ్యాత్మిక కౌన్నత్యముతో ఐక్యత నొందిన ప్రజాస్వామ్యము.

మన మొకమారు దశరథుని వద్దకు వత్తము—

దశరథుడు తన అభీష్టమును ప్రజలకు తెలిపి, ప్రజల అనుమతిని తీసి కొనినాడు. ప్రజావాణి తనకు వ్యతిరేకమైలేదు. అది చాలదు. మంత్రి మండలిని

కూడ ప్రత్యేకముగ సమావేశము గావించి వారికి తెలుపనవసరము లేక పోలేదు. కావున దశరథుడు ప్రత్యేకముగ మంత్రి మండలిని సమావేశ పరచినాడు. వారికి తన నిశ్చయమును తెలిపినాడు. రేపే రాముని యువరాజ్య పట్టాభిషేకమని. వారి అనుమతి సోత్సాహమై కన్పట్టినది. అంతటితో మంత్రులతోటి సమాలోచనము ముగిసినది. కాని దశరథుని కర్తవ్యము ముగియలేదు. అతడు రామునకు కొన్ని రహస్యములను ప్రత్యేకముగ తెలుపదలచినాడు. కావున అతడు తన రహస్య గృహమునకేగి మరియొక సమావేశమును జరుపదలచినాడు రామునితో—రాముని పట్టాభిషేకము నందిది మూడవ సమావేశము

అది రాముని అంతర్గృహము. అతడప్పుడే పితృపాదుల సన్నిధి నుండి వచ్చి కూర్చొనినాడు. అతడప్పుడు ఏమి ఆలోచనలు సలుపుచుండెనో ఎవ్వ డెరుగును? అతని అంతఃపురద్వారము కడ సుమంత్రుని రథము నిలచినది. తండ్రిగారు తననెందుకో ఆహ్వానించెనని సుమంత్రుడు తనకాహ్వానము నందించినాడు.

ఒక్కొక్కప్పుడు రాబోవు ఘట్టములు కొన్ని విశుద్ధాంతః కరణులగు వారి మనసున శంకారూపములై గోచరింప వచ్చును.

సుమంత్రుని వార్త రామునకు శంకా కారణమైనది. రాముని హృదయము కొంచెము శంకించినది. నిర్ణయ కార్యమున కంతరాయమేమైన కలిగినదా? అని, కాని రాముడాలసింపలేదు. వెంటనే సుమంత్రునితో బయలు దేరినాడు.

అది దశరథుని రహస్య సమాలోచనా మందిరము. అందుండ దగిన వాడు రాముడొక్కడే. రాముడొక్క క్షణమాత్రముననే దశరథుని ఎదుట నిలిచి అతని పాదములకు ప్రణమిల్లుట జరిగినది. అప్పుడు దశరథునిది పెల్లుబికిన పుత్ర వాత్సల్యము. మితి మీరిన ఆ ప్రేమ తోడనే ఆ పుత్రుని కౌగలించుకొని ఆసనమిడి కూర్చుండ నియోగించినాడు.

అతడిప్పుడు రామునకేమి తెలుపవలెను. దశరథుడు పట్టాభిషేకమును నిశ్చయించి ప్రజలకు తెలిపినరోజు పునర్వసు నక్షత్రము. పట్టము కట్ట దలచిన రోజు పుష్యమి. భరత శత్రుఘ్నులింట లేరు. ఇంటలేరు కాదు దేశమున లేరు. ఇంత అసందర్భముగ పట్టాభిషేక మెందుకు నిర్ణయింప బడినది? ఇది రామునకు తెలుపదగు ముఖ్య విషయము. దైవికములగు కారణములతి చిత్రములు రాజధర్మములతి సూక్ష్మములు. దశరథుడు తన మృత్యుకాలమును దైవజ్ఞుల వలన తెలిసి కొనినాడు. తన నక్షత్రము పాపగ్రహములగు సూర్యాంగారక రాహువులచే

ఆ క్రాంతమైనది. తనకు వచ్చు స్వప్నములను తన మరణమును నిశ్చయించు చున్నవి. ఈ సమయమున రాజొక పెద్ద ఆపదకు గురియగుట కాని, మరణము నొందుటగాని జరుగుట నిశ్చయము. ఇది తప్పునది కాదు. దీనికిక శాంతులులేవు. తానింత వరకు నెరవేర్పదగిన కర్తవ్యములలో మిగిలిన కర్తవ్యమిదియే. దేవ పితృ ఋణములు తీరినవి. ఋషి ఋణమును తీరినది. కావున రాముని పట్టాభి షేకమునకు విఘాతము రాకుండ తాను యత్నించవదగు ప్రయత్నము నాలోచించి ఇంత శీఘ్రముగ పట్టాభిషేకమును నిర్ణయించినాడు. ఈ విషయమునే ముఖ్యముగ రామునకు తెలిపినాడు. కాని దశరధుడు భరతుడు దేశాంతరము నందున్న సమయము వంటి కార్యమును తలపెట్టినాడు. ఇట్లేల చేయవలసి వచ్చినది? ఆవిధముగా చేయవలసి వచ్చుట చేతనే అట్లు చేసినాడు. ఆ విషయమును రామునకు స్పష్టముగ చెప్పినాడు. దశరధుడు దాచలేదు.

విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః
తావదేవాభిషించస్వ చలా హి ప్రాణినాం మతిః

దశరధుడు కైకను పెండ్లి యాడు నప్పుడు ఆమెయందు కలిగిన సంతానమునకే రాజ్యమిత్తునని రాజ్యశుల్కమున పెండ్లియాడినాడు. అప్పటికిసంతానము లేదు కౌసల్యయందు. కావున అట్లు చేసినాడు. ఇప్పుడది తారుమారైనది. రాముడు జ్యేష్ఠుడు. ప్రజాహితుడు. ప్రజలు కోరుకొన్నరాజు. అతనిని వదలి భరతునకు రాజ్యమిచ్చుట ధర్మము కాదు. మరి అన్న మాటను తప్పుట ధర్మమా?

విశేషధర్మము సామాన్యధర్మమును త్రోసిపుచ్చును. రాముని రాజును గావించుట విశేషధర్మము. కావున ఈ ధర్మమును నెరవేర్ప దశరధుడు యత్నించినాడు. ఒకవేళ భరతుడు అడ్డుపెట్టుట గాని అతని తాత కేకయరాజు అడ్డుతగులుట గాని జరుగ వచ్చును. కావున భరతుడు రాక పూర్వమే రామునకు రాజ్యమిచ్చుటను నిర్ణయించినాడు. భరతుడు ఈ రాజ్యము నాదియన్నచో అబద్ధమాడుట దశరధుని హృదయము కాదు. భరతుడు వచ్చులోపల నెరవేర్చుట నీతి, నీతియన ఉపాయము. భరతుడు మానింపదగిన వ్యక్తియా? కాదు. కాని మానవుల చిత్తము అనిత్యమని దశరధుడెరుగును. "కింతు చిత్తం మనుష్యాణా మనిత్యమితి మేమతిః" అని దశరధుని వాక్యము కావున. అట్లు చేయుచుంటినని రామునకు తెలిపి, పట్టాభిషిక్తుడవు కమ్మని నాడు. ఈ విషయమంతయు మంత్రులతో ముందుగనే ఆలోచించి రాముని వంటరిగ పిలిచి చెప్పినాడు. రాముడొప్పుకొని

నాడు. మరొక్క విషయమేమనగా వివాహకాలము నందలి- ప్రతినను పాటించుటకు తప్పించుకొన్నచో అనృత దోషమురాదు. ఇంతతో దశరధుని వదలుదము. మురాని వైపు తిరుగుదము.

రాముడు తండ్రియాజ్ఞకు మారు మాట్లాడలేదు. దశరధుని ఆజ్ఞను శిరసావహించినాడు. అక్కడ నుండి మాతృ గృహమున కేగినాడు. సుమిత్రా లక్ష్మణులును, సీతాకాంతయు, ఆసమయమున కౌసల్యకడకేతెంచిరి కాబోలు వారును అక్కడనే యుండిరి.

నాటి సనాతన భారత నారీమణులు విదుషీమణులు కూడ. ఆ సమయమున కౌసల్యా మహాసాధ్వి తన ధ్యాన మందిరమున శుచిర్భూతయై తెల్లని పట్టు పుట్టమును గట్టి అర్ధనిమీలిత నేత్రయై ప్రాణాయామమున చిత్తమును బంధించి తన— పుండరీకమున పుండరీకాక్షుని ధ్యానించు చున్నది ఆమె ధ్యానము రాముని గురించియే కావచ్చును.

రాముడు మాతృమూర్తిని దర్శించినాడు. అట్లేకాగ్రచిత్తయై యున్న ఆ తల్లి అడుగు దమ్ములపై శిరమును మోపినాడు. తన పుత్రుడు పట్టభద్రుడగు చుండెనను వార్త కౌసల్యకు తెలియనిది కాదు. తన పుత్రుడు భద్ర పీఠము నధిరోహించుటకు—విఘ్నము రాకుండుటకే నాటి ఆమె ప్రత్యేక కృత్యమంతయు.. రాముడు తల్లికి తన తండ్రి ఆజ్ఞను తెలిపినాడు. ఏమని ?

"అంబ! పిత్రా నియుక్తోస్మి ప్రజా పాలన కర్మణి"

తల్లీ! ప్రజలను పాలించుటయను కర్మయందు తండ్రి గారిచే ఆజ్ఞాపితుడనైతినని. వింటిరా? రాముని మాటను! నేను రాజు నైతినని అతడు చెప్పలేదు. ప్రజలను పాలించుటయను విధి కర్మయందాతడు తండ్రిచే నియమితుడయ్యెనట. ఇక్కడ రాముని హృదయమేమి? క్షత్రియునకు వేదశాస్త్రములు విధించిన ప్రజా రక్షణ కర్మను తండ్రియాజ్ఞాపించగా పిత్రాజ్ఞా పరిపాలనమునకు బద్ధకంకణుడనై వ్రతదీక్షితుడను రేపు కాబోవు చుంటిననునదే రాముని హృదయము. కృష్ణావతారము నందర్జుననకు బోధించినదీ ధర్మమునే.

"బ్రాహ్మణస్య తపోజ్ఞానం తపః క్షత్రస్యరక్షణం"

అనినారు మనువు. స్వధర్మమును పాలించుటకే తపస్సనిపేరు బ్రాహ్మణునకు వేదవేదాంగముల జ్ఞానమును సంపాదించుట తపస్సుకాగా రాజు

నకు ప్రజారక్షణధర్మమును నిర్వర్తించుటే తపస్సని మనువు చెప్పినాడు. కథను రండు.

నాడు రాజ్యాభిషేకమునకు ముందు ఋత్విక్పురోహితులు గావించు హోమాదికములును యజమానియగు వారొనరింపదగు ఉపవాసాది వ్రత నియమములు. శాస్త్రప్రసిద్ధములును. కావున రాముడు తల్లితో అమ్మా! ఋత్విక్పురోహితాచార్యులతో తండ్రిగారు ఉపవాసాది వ్రతమును నాకు విధించిరని చెప్పి సీతకు నీవాజ్ఞాపింపు మనినాడు, అంతియే కాదు. రేపు జరుగనున్న పట్టాభిషేకమునకు కాదగిన మంగళ కార్యముల నన్నిటిని నా చేతను సీత చేతను గూడ నీవు చేయింపుమని విశదీకరించిచెప్పినాడు. అది కౌసల్యమహాపాధ్వికిమధురక్షణమైనది. రాముని మధుర కంఠధ్వని తరంగములు ఆమె చెవుల సోకగా ఆమె ఆనందమునకు కొలతబద్దలేదు. ఆనంద బాష్పములు కనుకొలకులనిండి రాల్వలై ప్రవహింప మధుర స్వనముతో వత్సా! రామ! చతురంభోధి పరీతమగు నీ ఇక్ష్వాకు సామ్రాజ్యలక్ష్మినిన్ను వరించినదా? ఏమి? నా భాగ్యము. ఎట్టి కళ్యాణ నక్షత్రము నందుద్భవించితివి? దీర్ఘాయుష్మంతుడవై శత్రువుల జయించి సామ్రాజ్యలక్ష్మి సమేతుడవై సుమిత్ర హృదయమునేగాక సమస్త జ్ఞాతి బాంధవులకును సౌఖ్యము నొనగూర్తువు గాక యని రాము నాశాసించినది ఆ మాతృదేవత.

వత్స! రామ! చిరంజీవ హతాస్తే పరిపంథినః
జ్ఞాతీః మే త్వం శ్రియా యుక్తః సుమిత్రాయాశ్చ నందయ ॥

కౌసల్య రాముని నీ శత్రువులకు అపజయమును, నీకు జయమును కలుగుగాక! జ్ఞాతులకు నీ పట్టాభిషేకము సౌఖ్యప్రదమగుగాక, సుమిత్రకును ఆనందాదయక మగుగాకయని ఆశీస్సు నొసంగుటకేమైన ప్రత్యేకత యున్నదా? కౌసల్య ఇట్లు మాట్లాడుటకొక ప్రత్యేకత లేకపోలేము.

రాముడు పట్టభద్రుడగునని కౌసల్య ఊహించలేము. కైకేయి పుత్రునకే ఈ రాజ్యమని ఆమె నిశ్చయము, ఆ విషయము తారుమారు కాగా ఆమె చకితురాలై రామునకు నిష్కంటక రాజ్యలక్ష్మి చేకూరుగాక యని పలికినది. కైకేయిని వదిలి సుమిత్రను మాత్రమే స్మరించినది. ముందుకు పోవము రామూ రేమనెను? ఇక్కడ రాముని మాట మనకు చాల అవసరము.

రాముడు తల్లి మాటకు సమాధానముగా లక్ష్మణునివైపు తిరిగి, ఇట్లని నాడు—

లక్ష్మణే! మాం మయా సార్థం ప్రశాధి త్వం వసుంధరాం
ద్వితీయం మేంతరాత్మానం త్వామియం శ్రీరుపస్థితా.
సౌమిత్రే! భుంక్ష్వ భోగాం స్త్వం ఇష్టాన్ రాజ్య ఫలానిచ
జీవితం చ హి రాజ్యం చ త్వదర్థ మభికామయే॥

లక్ష్మణా! నన్నిపుడు వరించిన సామ్రాజ్యలక్ష్మిని నీవే శాసింపుము. నిజమునకీ రాజ్యలక్ష్మి నిన్ను వరించునట్లే భావింపుము. కారణమేమందువా? నీవు నాకు రెండవ అంతరాత్మవు సౌమిత్రీ! ఈ రాజ్యభోగములను రాజ్యఫలమును నేను నీకొరకే కాంక్షించుచుంటిని. ఈ రాజ్యభోగములే కాదు. ఈ జీవితము కూడ నీ కొరకే యనినాడు. ఎంత చక్కని పలుకులవ్వి! ఈ పలుకులు కేవలముగ లక్ష్మ ణుని ఉద్దేశించియే పలికిన పలుకులు కావు. జీవులందరకును బోధించిన బోధలు. శ్రీకృష్ణుడు అర్జునుని నిమిత్తముగాగొని తన నిజస్వరూపమును బోధించగా రాముడు ప్రతి ఒక్కనిని నిమిత్తముగాగొని ధర్మతత్త్వ ఆత్మతత్త్వములను ప్రద ర్శించుచు బోధించును. తన జీవితమును రాజ్యముగూడ లక్ష్మణుని కొరకేయట తనకోరకు కాదట. అనగా నాయవతార సహస్రములును నా చరిత్రలును—నా భక్తు లగు వారు తరించుటకే నాచేత గ్రహింపబడుచున్నవి కాని అవి నాకోరికలు కావని లక్ష్మణునకు బోధించినారు. మనకు చెప్పినారు. కృష్ణుని వాక్యమిద్ది.

నానవాప్తమ వాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.

నేను పొందనిదిలేదు. పొందవలసినదియును లేదు. కర్మల నాచరించు చునే యుండును. ఈ మాటయే ఆమాట. రామకృష్ణావతారములకు సిద్ధాంతభేదము లేదు.

రాముడక్కడ నుండి, తన మందిరమున కేగినాడు. మాతృమూర్తుల ఆజ్ఞతో ఇక రేపు రాముని యువరాజ్య పట్టాభిషేకము జరగవలెను. సీతయు కౌసల్యా సుమిత్రల ఆశీస్సులతో తన అంతర్గృహమున కేగినది.

ఈ యువరాజ్య పట్టాభిషేక మహాయజ్ఞమునకు కావలసిన సామగ్రి చాల యున్నది. నాటి పట్టాభిషేకములు వైదికములు కేవల తాకికములుకావు. ఈ కార్యమున సువర్ణఖండములు కావలెను. రత్న విశేషములుండవలెను. చతురంగ

జలముల తూర్చవలెను. లక్షణ యుతమగు భద్రగజమును, సువర్ణ కుంభములును, శ్వేతఛత్రమును అట్లే చామరమును, లక్షణలక్షితమగు ఆబోతును, సంపూర్ణావయవములతో కూడిన వ్యాఘ్రచర్మమును వంది మాగధులును మొదలగు పరికరములెన్నియో కూర్చబడవలెను. నగర రక్షణ మవసరము. కావున ప్రత్యేకమగు సైనికులు కావలెను. దేవాలయముల దేవార్చనలు జరుగవలెను. హోమవిధానముందును సాలంకృతలగు వేశ్యా స్త్రీలు కావలెను. వేదవేదాంగ పారగులగు బ్రాహ్మణోత్తము లీకార్యమునం దత్యంతా పశ్యకమై యుందురు. భారతదేశమందలి వృత్తులన్నియు ధర్మరక్షణకు అంగములు.

ఇదంతయు వశిష్ఠమునీంద్రుల ఆజ్ఞచే మంత్రి మండలి చేకూర్చినది. రాజాజ్ఞ ననుసరించియే వశిష్ఠులీ ఏర్పాటును చేయించినారు. తరువాతి కార్యక్రమము సీతారాములకు మునీంద్రులు రక్షాబంధనమును బంధించి, ఉపవాస వ్రతమును నియమించవలెను. దశరథుడు తనకోర్కెను పురోహితశ్రేష్ఠుల కెరింగించినాడు. వశిష్ఠమునీంద్రులు రాజాజ్ఞచే బ్రాహ్మ్యరథము నధిరోహించి సీతారాములకు దీక్షా కంకణముల కట్టినారు.

నాడే సువిశాల సుందరభవనములతో తీర్చిదిద్దిన రాజవీధులన్నియు తోరణ పతాకా లంకృతములైనవి. రాజవీధులేకాదు. ప్రతి పౌరుని గృహాభ్యంతరమును తోరణాలంకృత మగుటగాక ప్రతిపౌరుని గృహోపరిభాగమును చిత్ర విచిత్ర వర్ణపతాక సమలంకృతముకాగా పౌరులు బృంద బృందములుగ గుమిగూడి రాముని పట్టాభిషేకమహోత్సవ సంతోష వార్తలనే చెప్పుకొనుచుండుట నాటి నగర విశేషమై విరాజిల్లినది. గృహ ప్రాంగణముల బాలుర ఆటలలో, గృహాంతర్భాగముల కన్నెల పాటలలో పూజామందిరముల దేవార్చనాసమయములలో రాముని పట్టాభిషేక మహోత్సవమును గూర్చిన ప్రసంగములే ధ్వనించుచుండ వశిష్ఠులీనగర విశేషముల తిలకించుచునే చెవుల పండువులై వినబడు రాముని స్తుతివాక్యముల పౌరజానపదుల వలన వినుచునే రాజమందిరమునకేగి, తన కర్తవ్యమును నెరవేర్చితినని దశరథునకు తెలిపి, తన ఆశ్రమమున కేగినారు.

నాడు అయోధ్యానగరమునందే మూలలను బాల్యాదీక్షితులు లేవు. నగర రాజమంతయు దీపవిశేషములతో అలంకరింపబడినది. ఆ దీప సహస్రములు వృక్షా

కారములుగ కూర్చబడి ప్రేక్షకులకు వింతను గూర్చుచున్నవని వాల్మీకి వర్ణించి నారు.

దీప వృక్షాం స్తథా చక్రుః అనురథ్యాసు సర్వశః

ఒక్కమారు మనము రాముని కడకేగుదము.

సీతారాములు నాడుపవాసము. నాడు వారు గావించిన హోమశేషమును మాత్రమే వారు భుజించినారు. ఆరాత్రికాలమున రాముడు బ్రహ్మచర్య నిష్ఠుడై యుండ నిశ్చయించియు సీతను వేరొక ప్రదేశమునందుంచలేదు. సీతతో కూడియే అతడా రాత్రి తన దర్భాస్తరణమున పరుండినాడు సీతతో మాటనైన మాటాడ కుండ. అప్పుడాతని కర్తవ్యమేమి? నిద్రపోవుట కాదు. అతడు ధ్యానగతుడై యుండెనని వాల్మీకి వర్ణించినారు.

ధ్యాయన్నారాయణం దేవం స్వాస్తీర్ణే కుశసంస్తరే

వాగ్యతస్సహ వైదేహ్యా భూత్వా నియత మానసః

రాముడు దేవుడను చుంటిరిగదా? అతడెవ్వరిని ధ్యానించెను? అనకుడు రాముడిక్ష్వాకు వంశమున జన్మించెనను భావమున అతడు నారాయణుని ధ్యానించెను. అతడే నారాయణుడను భావమున ఆత్మనిష్ఠుడై యుండెను. దశరథుడు రాముని పట్టాభిషేకమును నిర్ణయించిన పునర్వాసు నక్షత్రము నాటి కార్యక్రమమిది. రేపు పుష్యమీ నక్షత్రము. రాముని పట్టాభిషేకము జరుగవలెను. తెల్లవారవలెను. కానున్న కార్యమునకై నిరీక్షింతము. నాడును నేడును ఇంతియే గృహములకేగుదము. ఉపన్యాసము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

మంగళం మహత్

శ్లో॥ బ్రహ్మా యేన కులాల వన్నియమితో బ్రహ్మాండ భాండోదరే

విష్ణుర్యేన దశావతార గహనే క్షిప్తో మహా సంకటే

రుద్రో యేన కపాలపాణి పుటకే భిక్షాటనం కారితః

సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే.

ఆర్య మహాశయులారా!

మన రామాయణ మహాకావ్య ప్రవచనమునందిది ఎనిమిదవరోజు. అయోధ్యకాండలోని కథా భాగమందలి.

భరతశత్రుఘ్నుల పయనముతోడ ప్రారంభించిన నిన్నటి యుపన్యాసం రాముని పట్టాభిషేక ప్రయత్నకథా భాగము తోడ ముగిసినది. నేటి యుపన్యాస కథాభాగము నిన్నటి పట్టాభిషేక యత్నకథా పరిణామము.

తానొకటి తలచును. దైవ మింకొకటి తలచును. అనునది సిద్ధాంతము కాకపోదు. పరమ సిద్ధాంతము. ఆ దైవమెవ్వరు? తలచిన తానెవ్వడు? అనునది ప్రశ్న. అందెవ్వరు బలవంతులనునది కూడ ప్రశ్నయే. ఈ రెండు ప్రశ్నలకును సమాధానమును కోరని వారుండరు. అందరును కోరుదురు. ఆ సమాధాన మెక్కడ తేలవలెను? ఆ తేల్చు వారెవ్వరు? అనుజిజ్ఞాసయు మేధావంతుల మస్తిష్కముల తిరుగాడనిది కాదు. అడుగడుగునను ఈ ప్రశ్నలు మానవుని ఎదుర్కొనుచునే యుండును. ఈ ప్రశ్నలకు పరిష్కార గ్రంధములే భారతీయ శాస్త్ర గ్రంధములు. రామాయణ కధాభాగమున ప్రవేశింతము.

మంధర కైకేయికి దాసి. ఆ దాసి ఎక్కడ పుట్టెనో ఆమె తల్లిదండ్రు లెవ్వరో ఎవ్వరును ఎరుగరు. కైకేయి కాపురమునకు వచ్చునప్పుడే కైకేయి పుట్టినింటి నుండి ఆదాసియు వచ్చినది.

"జ్ఞాతిదాసీ యతో జాతా కైకేయ్యాస్తు సహోషితా"

అనినారు వాల్మీకి. ఎందరెందరో ఏవియో కధలను మంధరను గురించి చెప్పెదరు. అవినాకక్కరలేదు. పాత్రల పోషించు బాధ్యత కవులదేలగుచో ఆ కధలవసరములైన కావచ్చును. వాల్మీకి రామాయణము నందలి పాత్రలు కవి కల్పితములు కాదనునది నా సిద్ధాంతము. ఆ పాత్రలను మనము పోషించవలసిన పని లేదు. అవి మహర్షి మొలిపించిన పాత్రలు కావు. మొలిచి నిలిచిన పాత్రలనే కవి వర్ణించి చెప్పినారు. కవి పాత్రల సరిదిద్ది పోషించుట నాటకరంగములోని విషయము. నాది వ్యాఖ్యానము. నేను చేయదగినది పాత్రపోషణము కాదు. ఆయా పాత్రల వివరణము. ప్రస్తుతమున మంధర పాత్రవలన కలిగెడు (లేక) తెలియబడెడు విషయములు మనకు చాల ముఖ్యములు. మన రామాయణ కథయందా పాత్ర ఏ భాగమున ప్రవేశించినది? ఆ పాత్రలోని ప్రత్యేకత ఏమి? కథయందా పాత్ర ఎక్కడతో వెనుకకు మరలినది? అను విషయములు మనకు చాల ముఖ్యములు. మంధర పాత్ర రాముని పట్టాభిషేకయత్నములో ప్రవేశించి రాముని అరణ్యగమనము తరువాత మరలినది. ఆ పాత్ర ప్రత్యేకత రాజకుటుంబమున చిచ్చు ముట్టించుటే.

ఇక కథలోనికి వత్తము.

రాముని యువరాజును గావించుటకై జరిగిన బాహ్యాభ్యంతర ప్రయత్న ములు మీరెరుగనివికావు. నిన్నటి యుపన్యాసములోని కథాభాగమదియే.

నేడెందుకో మంథర నగర సంచారమునకు బయలు దేరినది. ఏ కార్య క్రమమునకై బయలుదేరినదన్న ప్రశ్నకు సమాధానము లేదు. దొరకదు కూడ. స్వేచ్ఛా సంచారుల సంచారములకు కారణము లుండవు. కారణము లేకుండగనే ఆ దాసి ఒక రాజసౌధము నధిరోహింప నారంభించినది. మహర్షి ఆ దాసి మేడ నెక్కుటనిట్లు వర్ణించినారు.

"ప్రాసాదం చంద్రసంకాశ మారురోహ యదృచ్ఛయా"

నాడును నేడును అంతియే. కొందరు వీధులవెంట ఎందుకో తిరుగు చుందురు. వారికి ప్రత్యేక కార్యక్రమములుండవు. ఇంటింటికి వెళ్ళి కలగా పులగపు మాటలతో కాలమును గడుపుట వారి నిత్య జీవిత విధానము. ఇందుకు మంథర నేటిపయనము ఆదర్శము.

ప్రస్తుత కథాంశమున మంథర మేడమెట్ల నెక్కుచుండగా నగరము నందేదియో యొక ప్రత్యేకత గోచరించినది. నాడు రాముడు యువరాజగునని మంథరకు తెలియదు. ఏదియో యొక మహోత్సాహమును ప్రకటించుచు గుంపులు గుంపులై తిరుగాడు జన సందోహమును ఆ దాసికి ఆశ్చర్యమును కలిగించినది. అంతేకాదు. రాముని ధాత్రేయిక (పెంపుడు తల్లి) చేతనేవియో కొన్ని ఉపాయ నముల నుంచుకొని అత్యుత్సాహసమన్వితయై వచ్చుటయు ఆ గూని దాసి చూపున పడినది. అంతతో మంథర గమనవేగ మాగినది.

ఆధాత్రేయిక రాక కౌసల్యా మహాసాధ్వి గృహాభ్యంతరమునుండియని మంథర నిశ్చయించుకొన్నది. ఇక ఆ దాసికి ఈ రాజవీధుల ప్రత్యేకాలంకారము లకును, ఈ తిరుగాడు జన సందోహముల యుత్సాహమునకును, నేడు కౌసల్య తన దాసీలకు గావించిన ప్రత్యేక సత్కారములకును కారణము కావలసి వచ్చినది. ధాత్రేయికనుపిలచినది, కారణమడిగినది.

ఆధాత్రేయికయే గాక మరెందరో కౌసల్యా మహారాణీ పరిచారికలుగూడ నూడనాలంకరణములతో మంథరకన్నులబడగా, దాసికన్నులు మండి యుండ వచ్చును. రాముని ధాత్రేయిక మంథరకు రాముని పట్టాభిషేక వార్తను తెలిపినది.

అంతియే. ఆక్షణముననే మంథరపయనము వెనుకకు తిరిగినది. ఆ దాసి చూపు కైకేయి మేడపై కురికినది.

అది కైకేయీ మహారాణి రాజసౌధము. కైకేయి మంథరను దాసిగ చూడదు. కైకకు మంథర ఆప్తురాలు కూడ. కైకేయి రాణివాసమా మంథరకు స్వంత ఇల్లు. మంథర రాకపోకలకు ఆ కైకరాణివాసమున కాల నియమములేదు. ప్రొద్దున రావచ్చును మధ్యాహ్నకాలమున రావచ్చును. సాయంకాలమునకూడ రావచ్చును. రాణి వాసమందలి దాసికి అట్టి స్వాతంత్ర్యముండుట ఆ దాసిలోని నేర్పరితనము కావచ్చును. లేక కైకేయిలోని బేలతనమును కావచ్చును. పట్ట మహిషి కుబ్జావామని కాదులకివ్వదగు స్వతంత్రమున కొంత కొలత బద్ధయున్నది. ఆ కొలత బద్ధయే మంథర కైకేయీల మధ్య మృగ్యముకాగా కైకేయి మంథరకు పట్టు మహిషియై కన్పట్టదు. కైకేయి రాజమాతయను గౌరవ మీ దాసికిలేదు. రాణిని భూషించవచ్చును. దూషించవచ్చును. తిట్టవచ్చును. దీవించవచ్చును.

అనంతమగు నీ విశ్వరంగమున మానవ ప్రకృతులు భిన్నభిన్నములై విరుద్ధభావముల కాస్పదములై యుండును. పరిపూర్ణ పూర్ణిమా చంద్ర చంద్రిక లొక్కరికి హృదయంగమములై హాయిని గూర్చ వేరొక్కనికా జ్యోత్స్నయే విషాదమును దుర్భరతాపమును కలిగించును. మనోహర శీతల సమీర మొక్కనికి సేదతీర్చి శాంతి నొసంగ వేరొక్కని కయ్యది శ్రమకారణమగు చుండును. కాకున్న చంద్రకిరణ సంస్పర్శనమునకు విరహులు బాధనొందుదురా? మలయ మారుతములు వారికి బాధల కల్పించునా?

రామచంద్రుని పట్టాభిషేక వార్త సకల ప్రపంచమున కానందమును గూర్చుచుండ మంథరయను గూనిదాసికి విషాదమును కల్పించుటలో మానవ ప్రకృతుల భిన్నత్వమే కారణమనుటకంటె ఏమనవలెను?

ఈ ఘట్టమున మంథర దుర్భర విషాద క్రోధవేదనలతోడనే తానెక్కు మేడను దిగినది. కైకేయి మేడపై కురికినది.

మంథర కైకేయి అంతఃపురమున కేగినది. అది కైకేయి తనశయన తలమున పవళించి విశ్రాంతి సుఖము నొందుచున్న సమయము. మంథర సరాసరి ఆమె శయన తలము కడకేగినది. మూఢురాలా! లెమ్ము! లెమ్ము! అని ఘాటుగ పలికినది. నిన్నొక మహాభయము ఆవరించనుండగా నిన్ను నీవెరుగక యుంటివా? అని భీకరముగనే పలికినది. కైకేయి చలించలేదు. అట్లే పవళించి మంథరను

ప్రశ్నించినది. మనకు వాటిల్లిన భయమేమియని. మంథర అప్పుడే ఏమి చెప్పును? కైకేయి ఇట్లుండునని మంథర తలచలేదు. తన మాటను వినగనే దశరధుని పట్టమహిషి ధూమ్రాక్షియగు ననుకొన్నది. అది జరుగలేదు. కైకేయి కన్నులైన మార్పునొందలేదు.

రామాయణమునందలి మంథర పాత్ర సామాన్యమని మనము తలచగూడదు. ఇదియొక గూనిదాసియని వాల్మీకి మంథరను త్రోసివేయలేదు. తః పొట్టిదానిగట్టి తనమును చాటి చెప్పినారు మహర్షి, రామాయణమున లేని పాత్రలీ సృష్టిఖండము నందెక్కడున్నవి? మంథరను వర్ణించుచు వాల్మీకి ఈమె వాక్యవిశారదయని వర్ణించినారు. మంథరకు బిరుదు నిచ్చినారు. నిజమునకు కైకేయితో మాటాడునప్పుడు వాక్యవిశారదయయ్యెడు రీతిని బోధించినది. ఆదాసి వాక్యవిశారదత్వము రాజాంతః పురము నందొక విప్లవమును సృష్టించుటకు పనికి వచ్చినది. కావుననే మంథరను "పాపదర్శిని" అని వాడి నారు మహర్షి. రామపట్టాభిషేకమని తెలియగనే "పాదహ్యమానా కోపేన మంథరా పాపదర్శినీ" అని, "ఉవాచ క్రోధ సంయుక్తా వాక్యం వాక్యవిశారదా" అనినారు.

నిజమున కొకవ్యక్తి మరియొక వ్యక్తిపైనున్న ప్రేమ వాహినిని ఇంకింపజేయవలెనన్న ఎంతమాట నేర్పరి తనము కావలెనో (లేక) అట్టి వ్యక్తిత్వమందెంత చతురత యుండునో రామాయణ కావ్యమున మంథర పాత్ర ఆదర్శ పాత్రయై నిలిచినది. కైకేయి యందును భరతుని యందును తనకు ప్రేమ ఉట్టిపడుచున్నట్లు చూపి, దశరధుని యందును రాముని యందును కైకేయికిగల ధర్మబంధ ప్రేమబంధములను త్రెంచి వేసిన మంథర ప్రతిభ సామాన్య మెట్లగును? ఈ ఘట్టమున కైకేయీ మంథరల సన్నివేశమొక చిత్రమై నడచినది వినుడు.

కైక : మంథరా! నీవెందుకట్లు మండి పడుచుంటివి?

మంథ : నేను మండిపడుటలేదు. రాబోవు నీ జీవితమును తలచి భయ పడుచుంటిని.

కైక : నా జీవితమునకు భయమా?

మంథ : రేపే రాముని యువరాజ పట్టాభిషేకము నీవెరుగుదువా?

కైక : రాజు నాకు తెలుపగలడు.

మంధర : ఎంత అమాయకురాలవు ?

కైక : ఇందు నా అమాయకత్వమేమున్నది ?

మంధర : రాజు నీవాడను కొనుటయే నీ అమాయకత్వము.

కైక : కాదా ?

మంధర : భర్త విషహృదయమును నీవు గుర్తింపలేదు.

కైక : నీమాట నాకర్థము కాలేదు

మంధర : రాముడు రాజగు చుండెనని అర్థమైనదా ?

కైక : ఆ అమృతసూక్తిని వింటిని. ఇదిగో ఆసూక్తిని చెప్పిన నీకు మణి హారము !

మంధర : ఇంకేమైన నాకివ్వదలచితివా ?

కైక : నీవేమి కోరిన అదిఇత్తును. కోరుకొనుము.

మంధర : చాలుచాలు. నీ మణి హార ప్రదానము.

కైక : అట్లను చుంటివేమి ?

మంధర : భరతుని దేశాంతరమునకు పంపి, రామునికి రాజ్యము నిచ్చుచుండ అది అమృతసూక్తియై నీవు నాకీ హారము నివ్వగా నాకు దుఃఖము వచ్చుచున్నది. నీ భర్త నల్లత్రాచని నీవు గ్రహించక పోవుట నీదురదృష్టము.

కైక : మంధరా ! పొరబడు చుంటివి. రామునకు భరతునకు భేదములేదు. (రామేవా భరతేవాహం విశేషం నోపలక్షయే.) రాముడు పట్టాభిషిక్తు డగుచో భరతుడు రాజైనట్లే మంధరా !

మంధర : రామునకు రాజ్యము వచ్చిన తరువాత భరతుడు బ్రతికియే యుండుననుకొను చుంటివా ? భరతునకు దేశాంతర ప్రాప్తి. లేదా లోకాంతర గమనము తప్పదు.

కైక : ఎంతమాట ? రాముడు ధర్మాత్ముడు. సత్యవంతుడు. అతడు సేవకులకును సోదరులకును తండ్రి వంటివాడు. (భ్రాతౄణ్ భృత్యాంశ్చ దీర్ఘాయుః పితృవత్పాలయిష్యతి)

మంధర : నీ సవతి యగు కౌసల్యను మరచితివి కాబోలు ?

కైక : మరవలేదు. కౌసల్యకంటె రామునకు నేనే ప్రీతురాలను. (కౌసల్యాతోఽతిరిక్తంచ సోనుశుశ్రూష తే హి మాం)

మంధర : కార్యార్థులగు వారట్లే యుందురు. నీయందు రామునకు గల గౌరవము రాజ్యము చేతికి వచ్చునంతవరకే. నీవు రాముడు రాజగునంతవరకు రాణివి. తరువాత కౌసల్యకు దాసివి నీవెంత కాలమునుండి కౌసల్య నవమానించు చుంటివో ఒక్కమారు జ్ఞాపకమునకు తెచ్చుకొని ఇప్పుడామె నీపగ తీర్చుకొనునని తెలుసుకొనుము.

కైక : అవునవును మంధరా !

శ్రోతలారా ! వింటిరిగదా ? మంధర ప్రబోధమును. కైక మారినది. మంధర విషబీజములు కైక హృదయక్షేత్రమున నాటినవి. రామునిపై ప్రేమ వాహిను లింకినవి. దశరథుడు కృష్ణసర్పమయ్యే ఆమె ఎదుర నిలిచినాడు. మంధర మంత్రోపదేశము ఫలించినది. రాముడెంత మంచివాడైనను కౌసల్యరాముని మార్చునని కైక నిర్ణయించుకొన్నది. తన నిర్ణయమును మంధర కెరిగించినది. నన్నిప్పుడేమి చేయమందువని మంధరనేశరణు జొచ్చినది. మంధర ఇప్పుడు కైకేయికి సలహాదారురాలైనది.

మంధర : కైకా ! నీవిప్పుడు చేయదగు కార్యమును నేను వేరుగ చెప్పవలెనా ? రాముని ఇంటినుండి ప్రవాసమునకు పంపుటయు, భరతునకు రాజ్యము ఇప్పించుటయు, నీ కర్తవ్యములు. అప్పుడు భరతుని బ్రతికించు కొన్న దానివగుదువు.

కైక శయనతలమునుండి లేచినది ఉగ్రమూర్తియై. వేడి నిట్టూర్పుల విడిచినది. తానిప్పుడు గట్టినిద్రనుండి మేల్కాంటినని తలచినది. మరి నేనీ కార్యము నెట్లు నెరవేర్చు కొనవలెను ? అని ఆలోచించుకొన్నది. ఆమెకు తోచలేదు. భరతునకు రాజ్యమువచ్చు నుపాయమును నీవే చెప్పవలెనని మంధరనే వేడుకొన్నది. మంధర క్రొత్తగ ఆలోచించ వలసినదేమున్నది ? కైకను గట్టి పరచినది. కైకకు చాల కాలము క్రిందట జరిగిన ఒక కథను గుర్తుకు తెచ్చినది. ఆ కథ నిజమునకు మంధర ఎరిగిన కథకాదు. కైకేయి వలన విన్నకథయే.

ఒకనాటి దేవాసుర యుద్ధమున దశరథుడు దేవేంద్రునకు సాహాయ్యము చేయుటకై వెళ్లగా అప్పుడు కైకకూడ దశరథునితో వెళ్ళుట జరిగినది.

అది దక్షిణ దిశయందున్న దండకారణ్య ప్రదేశము. ఆ ప్రదేశములోనిదే వైజయంతీపురము. దానిని తిమిధ్వజుడను రక్కసుడు పాలించుచుండెను. అతనికే శంబరాసురుడని కూడ పేరు. అతడు మహామాయావి. అతడు దేవతలతో పగటి కాలమున పోరాడి క్షతగాత్రులగు వారు నిద్రించుచుండగా రాత్రికాలమున వారందరిని చంపుచుండెడి వాడు.

దశరథుడు వాతనిని జయింప రథాధిరూఢుడై వెళ్ళగా కైకేయికూడ రాజుతోటి వెళ్ళినది. ఆయుద్ధమున దశరథుడు శత్రువుచే మూర్ఛిల్లగా తాను దశరథునకు సారథియై ఆతనిని రెండు సార్లు రక్షించుట జరిగినది అనాడు దశరథుడామేరకు రెండు వరముల నిచ్చినాడు. కాని ఆవరములను కైకవాడుకొనలేదు.

ఆనాటి రాచవనితలు, యుద్ధ కౌశల్యము కలవారగుట ప్రసిద్ధము. సత్యభామ నరకాసురునితో యుద్ధమును సాగించుటను పోతన వర్ణించినారు వీరశృంగార భయ రౌద్ర విస్మయము లొక్కచోట కూడిన సత్యభామను మనకన్నుల ఎదుట పెట్టినారు. ఆవిషయమును యుద్ధమునుండి తిరిగివచ్చి, కైక మంధరకు చెప్పినది. మంధరదానిని గుర్తుపెట్టుకొని కైకకు నేను నీకొరకై ఆవరముల గుర్తుంచుకొంటినని చెప్పుకొని తన ప్రత్యేకతనను నిర్ణయించుకొనుచు, ఆరెండు వరములనే ఇప్పుడు భరతునికి రాజ్యమిచ్చునట్లును, రాముడరణ్యమునకు పంపునట్లును వరముల కోరుకొమ్మన్నది. భరతునికి పట్టాభిషేకము చేసిన చాలదా ? అన్నచో ప్రజలలోని స్నేహ భావమును రాముడు కోల్పోవలెనని సమాధానమిచ్చినది.

చతుర్దశ హి వర్షాణి రామె ప్రవ్రాజితే వనం
ప్రజాభావగతస్నేహః స్థిరః పుత్రో భవిష్యతి.

ఆవిషయమును వాల్మీకి స్పష్టపరచినారు. ఆనాటికే అనాగరికురాలగు మంధర కెంత విజ్ఞానము కలదో చూడుడు. మంధరకు మర్మనీతి కళయందుగల ప్రావీణ్య మింకను మనకు తెలియవలసి యున్నది. కైకయు అంతతో వదలలేదు.

దశరథుని వలన ఈవరద్వయము నెట్లు సాధించుకొన వలయునో కూడ బోధించినది ఉపాధ్యాయినియై.

రాజాంతఃపురములయందు కోపగృహమొకటి ప్రత్యేకమై యుండును. అలిగిన రాణులయొక్క అలకను తీర్చ గృహమది. కైక ఆ గృహమునందెట్లు ప్రవేశించి ఎట్లు మెలగవలెనో గూడ మంథర కైకేయికి తీర్చిదిద్దినది. అంతతో మంథర ఉపదేశ ఘట్టము పూర్తియైనది. తరువాత కైక భరతుని పట్టాభిషేకానంతరము తనకింత సాహాయ్యమును గావించిన మంథరకు రాదగిన గౌరవ మర్యాదలను కూడ వినిపింపగా ఆ వరముల నందుకొన్న మంథర కైకేయి అభ్యంతర గృహమును వదలినది.

## మారిన కైక

రాముని పట్టాభిషేక వార్తను మంథర కైకకు వినిపింపగనే కైక మంథరకు చెప్పిన సమాధానములు మీకు మరపురాలేదనియే నా నమ్మకము. అయ్యును ఒక్కమారు స్మృతికి తెచ్చెదను.

మంథర రాకపూర్వము కైక హృదయ క్షేత్రమున రాముడు ధర్మమూర్తి. కైక ప్రేమించిన గారాబు బిడ్డ. దశరథుడును ఆంతియే. మంథర రేపే రాముని పట్టాభిషేకమని చెప్పగనే శ్వేతచ్ఛత్రముతో గజారూఢుడై అభ్రదగజము నధిష్ఠించిన రాముడు కైకేయి హృదయ క్షేత్రమున రామభద్రుడై దర్శనమిచ్చినాడు. ఇప్పుడా రాముడే నారచీరెల ధరించి కఠిన కాంతారములచరించు వేషమున నిలిచినాడు. కైకేయి జీవితము నందిది యొక పెద్ద పరిణామము. ఆమెకు రాబోవు వైధవ్యమును చేతబెట్టి వెళ్ళినది మంథర. మానవ జీవితమునందలి పవిత్రాంతఃకరణల ప్రవహించు ప్రేమవాహినులను ఇంకింపజేయు పరమటి గాడ్పులే మంథర వంటి దుర్బోధలని మన రామాయణ మహాకావ్యము ఈ కథా భాగమున మనకు బోధించినది. కావుననే "దుస్సంగ స్సర్వథైవత్యాజ్యపిః" అనినారు నారదులు తన భక్తి సూత్రములయందు. సజ్జన సాంగత్యమెంత అవసరమో దుర్జన సాంగత్యమును వదలుట కూడ అంత అవసరము.

"అనర్థమర్థరూపేణ గ్రాహితా సా తత స్తయా"

అనర్థకమునే పరమార్థముగ గ్రహించినది కైకేయి కథకు వృత్తము.

కైక తన కనుబొమలతో రౌద్రరసము నొలికించినది. మంథరకు తన నిశ్చయమును చెప్పినది. మంథర వెళ్ళిపోయినది.

అది కైక ప్రవేశించిన కోపగృహము. ఆ గృహము అంధకారబంధురము తమో గుణము ఆవరించిన కైకకు ఆ గృహము ప్రాప్తమైనది. కైక తన తలపై నున్న చిత్రవిచిత్ర పుష్పమాలికలను, ఒంటిపైనున్న సువర్ణరత్నఖచిత భూషణావళులను గూడ ఆ కోపగృహమున నేలపై వికటిమ్మినది. కాని ఆమె తనులతా సౌందర్యమునేమి చేయగలదు? అది ఆమెను వదలలేదు. కిన్నరాంగనవలె నేలపై పరున్నది. అది కోపగృహమైనను గుహవంటిదికాదు. అతి విశాలము. అచ్చటచ్చట పడిన ఆమె భూషణములు విశాలాకాశమునందలి నక్షత్రములవలె ప్రకాశింప చీకట్లతో అలముకొన్న ఆకాశమైనదట ఆ ఇల్లు. వాల్మీకి అనినారు. దీని భావమేమి? ఆకాశమన శూన్యము. కావున అది శూన్యగృహమైనదని అర్థము. మాంగళ్యము తొలగినది. ప్రణయ క్రోధమునకది నిలయమైనను నేడు ప్రళయక్రోధాగారమైనది. మనమొక్కమారు దశరథునివైపుకు మరలుదము.

విపత్తు విశ్రాంతి లేరూపమును ధరించి మనవద్దకు వచ్చునో తాము ధరంచ దలచుకొన్న రూపమును మనకు తెలపవు. ఇదియే సృష్టికి నిమిత్తకారణమై యుండు మాయాశక్తి యొక్క ప్రభావము.

అది సాయంకాల సమయము. దశరథునకు రాముని పట్టాభిషేక వార్తను కైకేయికి తెలుపవలెననిపించినది. ఇంతవరకీ వార్త కైకేయికి తెలియదనియే అతని నిశ్చయము. నిజమునకు కైకకు తెలియనగు అవకాశము మాత్రమెక్కడున్నది? ఈ వార్తను విన్న కైకేయి సంతోషపడుననియే అతడెఱుగును? తన మృత్యువు ఆ మందిరమందున్నదని అతడెరుగడు.

కైకేయి మందిర మత్యున్నతము. శరన్మేఘమువలె అతి స్వచ్ఛమై ఆకసము నంటియున్నట్లుండును. దశరథుడు తన ప్రియురాలికి ప్రియవార్తనందించవలెననియే బయలుదేరినాడు. మహర్షివాల్మీకి దశరథుడు ఆ మేడనెక్కుటను రాహువుతో కూడియున్న ఆకాశమునకు పోల్చి, వెళ్ళబోవు దశరథుని చంద్రునిగ చెప్పినారు. "రాహుయుక్తం నిశాకరః" అని. రాబోవు ఘట్టమును కవి ఎరుగును. కైక రాహువు కాగలదు. దశరథుడు చంద్రుడై వెళ్లుచుండెను. ఇకడు పూర్ణ చంద్రుడై వెళ్లుచుండెను. రాబోవునది దశరథునకు కృష్ణపక్షము. అని చెప్పినారు. మనమును కవి పుంగవులతో కైకేయి అంతఃపురమున కేగుదము.

అది కైకేయి అంతఃపురము. ఒకవంక శుకసారికా ప్రలాపములు చెవుల కింపుగ గూర్చుచుండ వేరొకవంక వాయిద్య విశేషముల మృదుమధుర ధ్వనుల

నీనుచుండును. దాసదాసీ జనములొకవంక తిరుగాడుచుండ, వేరొకవంక నానావిధ భక్ష్యభోజ్య పదార్థము లమర్చబడి యుండెను. కాముకులకీ దృశ్యము కామో ద్దీపకము కాక తప్పదు.

దశరథుడు ఆ అంతఃపురమున ప్రవేశించినాడు. అతడు వృద్ధుడే కావచ్చును. అయ్యును అతడు మహారాజు. విరక్తుడైన వానప్రస్థుడు కాడు. వానప్రస్థుడను కావలెనన్న కోర్కెయు ఆయనకు కలిగిలేదు. స్వర్గసీమవలెనున్న ఆ అంతఃపుర మున ప్రవేశించగనే పూ విలుకాడు తన బాణమును వెక్కుబెట్టినాడు. దశరథునకు కైకేయితో కూడి కామకేళి ననుభవించవలెనని కుతూహలము కలిగినది. కైకేయి కనబడలేదు.

విషయ వాసనలతి బలిష్ఠములు. ఆ వృద్ధునకీ కోర్కెయా? అనకుడు. కోర్కెలు వాసనాధీనములు. వార్ధక్యము స్థూల శరీర సంబంధము. సూక్ష్మశరీరము నకు వార్ధక్యము వచ్చుచో మోక్షలక్ష్మి వరించుటకు తగిన వయఃపరిపాకము.

కైకేయి లేని శూన్యగృహమున కాతడు వచ్చుట కిదియే మొదటి రోజు. అక్కడనుండు ప్రతీహారిణిని (ద్వారపాలకురాలు) అడిగినాడు. ఆ ప్రతీహారిణి దోసిలి యొగ్గి మహారాణి కోపగృహమున కేగినదని సమాధానమిచ్చినది.

అది కైకేయి వసించియున్న కోపగృహము. దశరథుడా రాణీవాసములోని కోపగృహమున ప్రవేశించినాడు. ముసలి మొగునకు పడుచుపెండ్లాము పైనుండు తీపి వర్ణింపరానిది. ఇది ప్రకృతి సహజము. వాల్మీకియే చెప్పినాడు. "సవృద్ధస్తరు ణీం భార్యాం ప్రాణేభ్యోపిగరీయసీం" అని. ప్రాణములపై తీపికంటె పడుచు పెండ్లాముపై తీపి పెద్దదట. కాముకుడైన ఆ వృద్ధభూపతి కైకను చూడముచ్చటపడి నాడు. ఆ చంద్రముఖి ముఖచంద్రమండల దర్శన మా భూపతి కబ్బలేదు. పలుక రించినాడు. కామినీ సంభాషణా శ్రవణసుఖమైన కాతడప్పుడు నోచుకొనలేదు. ఆమె తల ఎత్తలేదు. మాటాడలేదు. కైకేయి స్థితి అర్థముకాలేదా రాజునకు. అతని బుద్ధివైభవము మందగించినది. ప్రియురాలిని సమీపించినాడు. ఆమెపై చేయి వేసి నాడు. పలుకరించినాడు. అతనికి ఒడలు జలదరించినవి. త్వగింద్రియ మాతని లోబరుచుకొన్నది. కైకేయిపై అనురాగ మా దశరథునకు చాల పెరిగినది. ఆమె అందచందములా మహారాజున కెదుట నిలువగా, ఇంతవరకామెతోటి అనుభవించిన అనుభవములు స్మృతిపథమున బారులుతీరగా ఆ రాజు అఘటనఘటనా పటీయసి

యగు మాయాదేవి పన్నిన వలయందు చిక్కుకొనినాడు. "ధరనెవ్వాడు సృజించె పూరుషగళోద్బంధ క్రియాపాశముల్" అనినాడొక కవి. ఈ స్త్రీ వ్యామోహము నెవ్వరు సృజించెనో ఇంతవరకెవ్వరికిని అర్థము కాలేదు. కాని వేదాంతశాస్త్రము నీవు సృజించుకొన్న దేనని సమాధానమిచ్చినది.

కధకు వత్తము.

దశరధుడు ఆమె ఎట్టి కోర్కెను కోరినను ఇత్తునని బద్ధుడై పలికినాడు. ప్రస్తుతమును అర్థము చేసుకొన్నది కైకేయి. స్త్రీలకు ఇంగిత జ్ఞానమెక్కువ. నా కొక కోరిక యున్నది. ఆ కోర్కెను తీర్తునని నీవు గట్టిగ పలుకుచో నా కోర్కెను చెప్పెదనన్నది.

దశరధుని ముఖమున చిరునవ్వు మొలకెత్తినది. ప్రియాతి ప్రియమైకన్పట్టు కామభోగ సుఖమును అనుభవింత మనుకొన్న దశరధుడు కైక తలను చేతులతో తాకి స్పర్శ సుఖానుభవభ్రాంతుడై తన తొడపై నిడుకొని తల దువ్వుచు కైకా! నీకంటె నాకు ప్రియమగు కాంత లేదు. రామునకంటె ప్రియమగు వస్తువు లేదు. రాముని సాక్షిగ నీ కోర్కెను తీర్తుననినాడు. ముమ్మాటికిని తీర్తును చెప్పుమని ఒట్టుపెట్టినాడు.

తేనాజయ్యేన ముఖ్యేన రాఘవేణ మహాత్మనా
శపే తే జీవనార్హేణ బ్రూహియన్మనసేచ్ఛసి.

కైక ముఖము కలకలలాడినది "నాధా! నీవనిన మాటను సూర్యచంద్రుల సాక్షిగ పలుకుమన్నది. ఒక్క సూర్యచంద్రులనే కాదు. దేవతలనందర సాక్షులుగ నిలిపినది దశరధుని పాశబద్ధుని గావించినది. అతడిప్పుడు ఆడినమాటను తప్పు కొనుట కవకాశములేని ధర్మపాశమున బద్ధుడయ్యెను. ఆ బంధమున కట్టుబడి యున్న దశరధునకు శంబరాసుర సంగ్రామ రంగమును జ్ఞాపకము చేసినది. తన కిచ్చిన వరద్వయమును జ్ఞాపకము చేసినది. రాజు తలయూపినాడు. అది తల యూపుట మాత్రమే కాదు. ఒప్పుదలయే. నాడిచ్చిన వరద్వయమును నేనివ్వలేదని అతడెట్లనును? ఆ రెండు వరముల నేనిప్పుడు కోరుకొందునన్నది. దశరధుడింతకు ముందు ఆమె కోరిన కోర్కెల తీర్చనివాడు కాదు ఆమె కోర్కెల తీర్చియే ఆ ముద్దులగుమ్మననుభవించిన రసికుడనుట తప్పదు. ఇప్పుడును అతడట్లే తలచినాడు. చేప అడుగును నీటియందు చూడవచ్చును. ఆడవారి మనసునెవ్వడెరుగగలడు? ఇది త్రికాల సత్యము.

మత్స్యపాదం జలే పశ్యేన్న నారీ హృదయ స్థితం.

కైక వరములను కోరుకొనునప్పుడే ఆ వరముల నివ్వకున్నచో ప్రాణముల వదలుదునని గట్టిగ చెప్పినది. రాజు విని భరింపరాని మాట అది.

సత్యధురంధరుడగు దశరధుకు వీలుకాని వలలో చిక్కిన మృగమువలె కైక వాక్కునకు బద్ధుడయ్యెను. ఆ రెండు వరముల కోరుకొమ్మనెను. కైకేయి రెండు వరముల కోరినది. ఒకటి రామునికై చేకూర్చిన అభిషేక సామగ్రితోడనే భరతుని పట్టాభిషిక్తుని చేయుట. రెండు రాముడు జడధారియై నారచీరెల ధరించి పదునాలుగు సంవత్సరములు దండకారణ్యముల కేగుట. ఆ వరములిప్పుడే జరుగ వలెనన్నది.

కైకేయి పలుకులు దశరధుని చెవిని బడినవి. అవి ములుకులైనవి. ఆ కటుకు ములుకులు చెవిని గ్రుచ్చుకొని మనసున నాటినవి. తానిప్పుడేయవస్థయందు తిరుగు చుండెనో ఆతనికర్థము కాలేదు. నేను జాగ్రదవస్థయందే యుంటిననుకొనుట కాతని ఆత్మ సందేహించుచున్నది. స్వప్న ప్రపంచమునందీ మాటలు వినబడినవని కొంత సేపాత డూహించినాడు. స్వప్నమన్న అసంభవములగునవి అనుభవమునకు వచ్చుట. కావున ఇది స్వప్నము కావచ్చునని అతడు కొంతసేపు భావించుట యుక్తము కాకపోదు. అంతలో ఆతడు బాహ్యేంద్రియ వ్యాపారముండగ ఇది స్వప్నమెట్లగును? అని జాగ్రద్దశయే ననుకొనినాడు. కాని ఇది చిత్త విభ్రమము కావచ్చునని పించినదాయనకు కొంతసేపు. భ్రమకు కారణము లేదు. కావున పూర్వ జన్మలలోని సంస్కారమేమో?....కాదు. ఇట్టి సంస్కారమసంభవమనిపించినది. ఉన్మాదమా? కాదు మరి ఏమి? ఈ యాలోచనలతో కొంతకాలమా మహారాజునకు మానసిక ప్రపంచము గడచినది. ఆ ప్రపంచము నుండి బయటపడినాడు. కైక ముఖమునుండియే ఈ మాట వెలువడినదని నమ్మినాడు. ఆయనకు తన ఎదుట సుందరాంగియై యున్న కాంత పెద్దపులియై కన్పట్టినది. ఆతడు లేడిపిల్లయై కైకను చూచినాడు. శరీరము వణకినది. మాట కూడ తడబడగా ఛీ! అని పలికినాడు. అంతలో మూర్ఛిల్లినాడు, ఆతడు మూర్ఛనుండి లేచుటకు కొంతకాలము పట్టినది. లేచినాడు. కైకపై ఆతని చూపు మారినది. కైక మారలేదు. ఇదియే దృష్టి సృష్టి వాదము. వస్తువు మారదు. చూచువాని చూపు మారుటయే వస్తువు మారుటయగును. దశరధుని మధుర భావమున కైక సుందరాంగియైనది పూర్వక్షణమున. ఇప్పుడు

వ్యాప్తియైనది. ఆ కైకనే కామభావముచే ముట్టుకొనగా శరీరము జలదరించినది. ఇప్పుడు భయభావమున వణకినది. ఇది చూచు వాని యొక్క చిత్త వికారము. అనగా కర్తయైన వాని చిత్తవికారము. ఇది వేదాంతసారము. గౌడపాదులు, "చిత్తదృశ్య మవస్తుకం" అనినారు. 4-36. అ.లా.శాం.ప్ర.

యథాస్వప్నదృశ్యః కాయః అసత్ తథాసర్వం చిత్తదృశ్యం అవస్తుకం.

శం. భా.

తరువాతి కథ.

దశరథుని క్రోధదృష్టులు కైకపై ప్రసరించినవి. కైక తన వంశమునుద్ధరింప వచ్చిన పత్ని కాదని నిశ్చయించుకొనినాడు. కాటువేయవచ్చిన మహోరగమని తలచినాడు. ఎర్రబడిన కన్నులతో కైకవంకకు తిరిగి, కైకను మధుర ధ్వనితో సంబోధించి, రామునకు కైకపైగల మాతృప్రేమ నుద్ఘాటించినాడు. కైక అప్పుడప్పుడు రాముని గురించి చెప్పిన ముచ్చట్లలోని మాటలను జ్ఞాపకము చేసినాడు. హా! యని ఏడ్చి, కౌసల్యను ఎట్లు వదలుదును? సుమిత్రను ఎట్లు వదలుదును? రామునెట్లు వదలుదునని ఏడ్చినాడు. కైక హృదయమును మార్చ చాల యత్నించినాడు. తన క్రోధమును మాని ప్రసన్నుడై ప్రసన్నురాలిని గావింప యత్నించినాడు. నీ పాదములు పట్టుకొందుమనని ప్రణయ కలహములోని శరణాగతిని ఇక్కడను వాడినాడు. ఇది ప్రళయ కలహమని అతనికి నిర్ణయము కాలేదు. కైక మాటలకు సరసత్వమును కల్పించి, నన్ను పరిహసించుచుంటివా? ప్రియా? అనినాడు. ఆమె విరసమగు కోర్కె సరసమెట్లగును? ఈ ఘట్టమున వాల్మీకి దశరథుడు రాముని గురించి వర్ణించుకొన్న మాటలను మనకు వినిపించినాడు. రాముని విజయ యాత్రను దశరథుడు వర్ణించుకొనినాడు.

సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః
గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్.

రాముడు, సత్యవ్రతముచే లోకాంతరముల జయించెనట. దానముచే దీనుల జయించెనట. శుశ్రూషచే గురువుల జయించెనట. తీక్షణ కోదండమును చేతబూని శత్రువుల జయించెనట. ఇట్లు విజయ సార్వభౌముడగు రామునెట్లు వదలుట? అని ఏడ్చినాడు. రాముని యందున్న గుణముల నన్నిటిని వినిపించి ప్రార్థించినాడు. ఆమె హృదయము ద్రవించలేదు. అరుణ కషాయిత నేత్రయై రాజును చూచి సత్య

ధర్మములకు పుట్టినిల్లగు ఇక్ష్వాకు వంశమునకు కళంకము తెత్తువా? ఇప్పుడే విషము మింగి చత్తునన్నది. అప్పటికి మూడు జాముల ప్రొద్దు గడచినది.

దశరథుడు కౌసల్యను తలచుకొని ఆమె సత్స్వభావమును కొనియాడుకొని ప్రజల దలచుకొని, ప్రజలాడబోవు మాటలకు బాధనొందుచు, రాముడు వనవాసము నందనుభవింపబోవు దుఃఖానుభవముల స్మరించి, కైకేయి మూర్ఖత్వము నెదుర్కొన శక్తుడు కాక చివరకు కైకేయిని పెండ్లినాడు మంత్రపూర్వకముగ పరిగ్రహించిన పరిగ్రహమును వదల నిశ్చయించుకొనినాడు.

యస్తే మంత్రకృతః పాణిః అగ్నౌ పాపే మయా ధృతః
తం త్యజామి స్వయం చైవ తవ పుత్రం త్వయా సహ.

కైకా! అగ్నిసాక్షిగా నేనెందుకు పెండ్లియాడితినో ఆ ధర్మ సంబంధము నీతో నాకు తెగినది. పాపాత్మురాలా! నీతో టియ్యే కాదు నీ కడుపున పుట్టిన కొడు కును కూడ వదలుచుంటిననినాడు. "ధర్మపాశేనబద్ధోస్మి" ధర్మ పాశమున బద్ధుడ నైతినను మాటతో వరముల నొప్పుకొనినాడు.

నేనబద్ధమాడదలచ లేదనినాడు. ధార్మికుడగు రాముని చూచుట కిచ్ఛయిం చుచుంటిననినాడు. ఓ! రాత్రీ! భగవతీ! నీవు గడవక ఇట్లేయుండుమని కాలమును ప్రార్థించినాడు. ఎందుకు? తెల్లవారగనే వచ్చు ప్రజలకు తానేమి చెప్పును? అందుకు. రామదర్శనమున కెదురుచూచుచు దశరథుడు దుఃఖ సముద్రమున మునిగినాడు. దశ రథుడు భగవతియగు రాత్రికాలంను ప్రార్థించినాడు నీవు తెల్లవారుటకు తావునివ్వవద్దని ప్రభాతమువచ్చుచో రామునిపట్టాభిషేక కాలంవచ్చును. తానేమి జవాబుఇవ్వవలెనో యని అతడుభయపడినాడు. ఎంత చిత్రమో చూచితిరా? జీవులకోర్కెల తీరు త్రములు. కాని జీవుల కోర్కెలననుసరించి కాలము నడువదు. ఒక తుమ్మెద కమల షండములోని మాధుర్యము నాస్వాదించుటకై ఆ కమలమున వ్రాలినది. అంతలో సూర్యుడస్తమించినాడు.కమలము ముకుళించినది. అప్పుడా భ్రమరము కోరిక ఏమి? రాత్రి వేగముగ వెళ్ళగా ప్రాతఃకాలము తొందరగ రావలెనని, కారణమేమి? రాత్రి వెళ్ళగా భగవాను డుదయించగా కమలము వికసించును. తన ప్రతిబంధకము తొలగును కాని ఆ భ్రమరమునకు రాత్రికాలము సాయపడలేదు. ఆకాలము స్వతంత్రముగ ప్రవర్తించుచున్నదా? లేదు. కాలమునుకూడ జీవుల కర్మాను గుణ్యముగ నడువుమని శాసించు శాసకు డొకడుండెను. ఆతుమ్మెద రాత్రిపోవును, సూర్యుడు ఉదయించును, నేను విముక్తనగుదును అనుకొను చుండగనే ఒక ఏనుగ

ఆ సరస్సునబడి ఆడుకొనగా ఈ భ్రమరమున్న తామరపూవే ఆ ఏనుగ కాలి క్రింద పడినలిగినది. ఇదియే సృష్టిఖండములోని చిత్రము జీవుని కర్మలను పరిపాకము గావించునది కాలమని మనము మరువకూడదు. కాలము స్వతంత్రమై పక్షపాతము కలిగి మనలనుద్ధరింపదు. క్రుంగదీయదు. దశరథుడు రాత్రిని దుఃఖరూపముగనే గడపవలసి వచ్చినది. "చేసుకొన్నవారికి చేసుకొన్నంత మహాదేవయను" నానుడి దశరథునియందు సార్థకమైనది. దశరథుని ఈస్థితికి తెచ్చినది కామ పిశాచము. కావుననే "కామార్తాహి ప్రకృతి కృపణాః" అనినాడు కాళిదాసు.

ఒక్కమాట. దశరథుడు రాముని పట్టాభిషిక్తుని గావింప యత్నించినాడు. దైవము దానిని తారుమారు గావించినది. ఇక్కడ దైవమన అర్థమేమి? ఈ దైవ శబ్దమునకు భగవంతుడని అర్థము కాదు. వెనుకటి జన్మయొక్క కర్మఫలమొక విధముగ పక్వమై ఫలరూపము నొందియుండగా జీవుడు దాని నెరుగక వర్తమాన మున కొన్నిటిని సంకల్పించును. ప్రాక్తన కర్మఫలము అత్యంత బలముకలది కాగా దాని నెదుర్కొనుశక్తిలేని జీవునకు ప్రాక్తన కర్మఫలమిప్పుడనుభవింపక తప్పదు. భగవంతుడు కర్మ ఫల ప్రదాత. ఎప్పుడైన ఒకానొక ధీరుడు భగవంతుడు తనకు తాత్కాలికముగ పంచిపెట్టు కర్మఫలమును కాదని (లేక) నాకక్కరలేదని తాను ప్రయత్నించు ఫలమునకే స్థానమిచ్చి ప్రబల ప్రయత్నము కలవాడగుచో అతడు కృతకృత్యుడు కాలేడనునది సిద్ధాంతము కాదు. ప్రస్తుత ప్రయత్నమునకును, వెనుకటి కర్మకును ద్వంద్వయుద్ధము వచ్చుచో ప్రస్తుత ప్రయత్నము వెనుకటి కర్మను గెలువనేరదను మాట సామాన్యముగాని, తిరుగులేని సిద్ధాంతముకాదు. యోగ వాశిష్ఠమున వశిష్ఠుని నిర్ణయమిది.

పరం పౌరుషమాశ్రిత్య దంతైర్దంతాన్ విచూర్ణయన్
శుభేనాశుభముద్యుక్తం ప్రాక్తనం పౌరుషం జయేత్.

పండ్లను పటపట కొరికి నా వెనుకటి అశుభఫలమును నేటి నా ప్రయత్నము వలన నివారించు కొందునని ఎప్పుడైన ప్రాక్తన కర్మఫలము నెదుర్కొనుచో అతడు తప్పక జయించుననినారు. ఇక్కడ దశరథుడు కామమునకు వశుడయ్యే కైకేయిచేత బంధింపబడినాడనునదే గ్రాహ్యము.

ఈ నాటికీ యుపన్యాసమును ముగింతము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# - వ రోజు

శ్లో॥ సీతా మనోమానస రాజహంస
సంసార సంతాప హర క్షమా వన్
శ్రీరామ దైత్యాంతక శాంతరూప
శ్రీ తారకబ్రహ్మ నమో నమస్తే.

ఆర్య మహాశయులారా!

మన రామాయణ మహాకావ్య ప్రవచనములందిది తొమ్మిదవ రోజు. అయోధ్యాకాండ కథాభాగమున ఇది మూడవరోజు

నిన్నటి కథాభాగము "తానొకటితలచిన దైవమొకటి తలచు"నన్న సూక్తికి సరితూగునట్లు దశరథేశ్వరుడు దుఃఖమున మునిగిన ఘట్టము.

నేటి కథాఘట్టము మానవ జీవితమున ఆకస్మికములై వచ్చు వియోగాది దుఃఖముల నెదుర్కొని జీవితమునకు వన్నె దిద్దుకొనుటయే మానవుని ప్రత్యేకత యని రాముడు ప్రదర్శించిన భారతీయాధ్యాత్మిక రహస్య ప్రదర్శనా ఘట్టము.

కథా మాత్రముగ రామాయణాది గ్రంథముల పఠించి ఆనందించుటతో హృదయ గ్రంథులు విడివడవు. హృదయగ్రంథి విచ్ఛేదనము గాని జీవునకు ముక్తిలభించదు మోక్ష ప్రాసాదము నెక్కినగాని శాశ్వత సుఖానుభూతికి స్థానము లేదు రామాయణాది గ్రంథములయందు కథాభాగమునకు స్థానము లేదని నాభావము కాదు. సామాన్య అసామాన్య ధర్మములు సశాస్త్రీయములై చర్చింపబడి మనకు ఆచరణయోగ్యము లెట్లగునో వివరించుట మన గ్రంథములందలి కథాభాగములకు ప్రధానలక్ష్యము. ధర్మపురుషార్థఫలమే మోక్షప్రాసాద నిర్మాణము.

నేటి యుపన్యాసమున రాముని ముఖముగ ధర్మసూక్ష్మములు చర్చించబడుట మీరు గమనింపదగు ముఖ్యవిషయము. కథాభాగమునకు వత్తము.

భగవతియగు రాత్రి నీవిట్లే యుండి నామర్యాదను కాపాడుమని విన్నవించు కొన్న దశరథుని విన్నపమును వినలేదు. తనత్రోవనతాను వెళ్ళినది. ఉదయాద్రికి రానున్న సూర్యభగవానుడును అనూరుడు ఆయత్తము గావించి తెచ్చిన రథము

పధిరోహించినాడు. ముందుగ అనూరుని అరుణకిరణ సహస్రములు అయోధ్యా నగరమున వ్యాపించినవి.

నగరరాజము పతాకాలంకృతమైనది. రాజవీధులు కస్తూరికా జలసిక్తము లైనవి కర్మసాక్షియగు సూర్యభగవానులు సమస్త భూతములకును దర్శనమిచ్చినారు రామ పట్టాభిషేక మహోత్సవమును చూడ నువ్విళ్ళూరుచు వచ్చు ప్రజానీకమునకు రాజవీధులలోని కస్తూరికా గంధముల నందుకొన్న పిల్లగాడ్పులు స్వాగత మిచ్చు చున్నవి.

అప్పుడే తన శిష్యగణముతో వశిష్ఠమునీంద్రులు నగరములోనికి కేతెంచినారు.

అది వృద్ధభూపతియగు దశరధేశ్వరుని నివాసమందిరము. మునీంద్రులా రాజమందిర ద్వారము వైపుకు తిరిగినారు. మహారాజగు దశరధుని మందిరము ఆనగర రాజమునందలి బ్రాహ్మణ ప్రవరులతో నిండి కలకలలాడుచున్నది. తన ఆజ్ఞచే మంత్రులు చేకూర్చిన పట్టాభిషేక మహోత్సవ సామాగ్రినంతను వశిష్ఠ మునీంద్రులు తిలకించినారు. ఇక మునీంద్రులకు మహారాజ సందర్శనము కావలెను. కాలేదు.

వశిష్ఠులు సుమంత్రుని మాత్రమే చూచినారు. పట్టాభిషేక మహోత్సవ కాలము అతిక్రమించరాదు. అందుకు యజమానిని తొందరబెట్టి కార్యోన్ముఖుని గావించుట ఋత్విక్పురోహితుల కర్తవ్యము. వశిష్ఠ మునీంద్రులు పురోహిత శ్రేష్ఠులు. మహారాజును తొందరజేసి కార్యోన్ముఖుని గావించుటకై సుమంత్రుని నియమించినారు.

అది రాజాంతఃపురములందొకటగు కైకేయీ మహారాణి భవనము. సుమంత్రుడు కైకేయీ భవనద్వారమునకే సరాసరి వెళ్ళినాడు. రాజు మేల్కొనలేదని అతడూహించినాడు. ప్రాతఃకాలమున రాజుల మేల్కొలుపునవి మంగళ గీతాలాపములు అవి సూతుల కర్తవ్యము. సుమంత్రుడా కర్తవ్యమును నెరవేర్చుచు సుప్రభాత మంగళగీతముల నారంభించినాడు రాజుశయ్యాగార ద్వారదేశమున

రాజా! శ్రీమంతమైన రాత్రి వెళ్ళినది. ప్రభాతమేతెంచినది. భవిష్యత్కాల కార్యనిర్వాహక సమయమాసన్నమైనది వీవిక నిద్రలెమ్ము. మహారాజా! రామ పట్టాభిషేక కార్యమును నెరవేర్చుము. అనునవి సుమంత్రుని మంగళగీతములు,

అది నిజమున కంతకాలము గా దశరధుడు నిద్రమేల్కాంచక కాలవిళంబన చేయ దగు రోజుకాదు. ఆసమయము వశిష్ఠ మునీంద్రుల రాకకు పూర్వముననే సభనలం కరింపదగు సుదినము. అదినేడు విపరీతమైనది.

నిజమునకు మంగళగీత ప్రబోధములు రాజులకు నిత్యనూతనములు. అయ్యెను దశరధునకీనాటి సుమంత్రుని మేలుకొలుపులు దుఃఖకారణములైనవి. అరువదివేల సంవత్సరములుగ వందిమాగధుల సుప్రభాత వాద్యఘోషములు ఆత్మా నందదాయకములుకాగా నేడేల ఆ రాజునకవి దుఃఖప్రదములైనవి? ఇదియే కాల ప్రభావము. భర్తృహరి "కాలాయతస్మైనమః" అని కాలపురుషునకు దోసిలొగ్గి నాడు. సుమంత్రునకు రాజదర్శనమైనది. రాజు సుమంత్రుని చూచి నన్నికబాధ పెట్టవద్దనినాడు. సుమంత్రుని మేలుకొలుపు అంతతో ఆగినది. జరుగనున్న కార్య క్రమమునకు ఇక దశరధరాజు యజమానికాడు. కాలప్రభావము కైకయై అక్కడనే నిలచియున్నది.

సుమంత్రా ! నీవు వెళ్ళి రాముని తోడి తెమ్మని సుమంత్రునికి చెప్పినది. రాజేమియు మాట్లాడలేదు. సుమంత్రుడు కైక పలుకును రాజాజ్ఞగనే భావించినాడు. రాజు అట్లేల నిద్రకువశమైయుండెనని సుమంత్రునకు సందేహమును కలుగనివ్వ లేదు కైకేయి రాత్రి అంతయు రామపట్టాభిషేక మహోత్సవమును తలచి తలచి రాజునకు నిద్ర సుఖము తడగైనదని సుమంత్రునకు తెలిపినది.

సుమంత్రుడు రాముని తీసుకొని వచ్చుటకు బయలుదేరినాడు. రాజద్వార మును సమీపించినాడు. సుమంత్రుని ప్రయాణము ముందుకు సాగలేదు. వారు వీరనక సామంతరాజులతో కూడ ఆ రాజద్వారము క్రిక్కిరియున్నది ప్రజల కోలాహల ధ్వని తరంగములు సుమంత్రుని వెనుకకు త్రిప్పినవి.

మహారాజెక్కడనుండెను ? రాజప్రతినిధులైనను ఇక్కడెవ్వరును కనబడ కుండిరేమి ? మన ఉపాయనముల తీసుకొను వారెవ్వరు ? అను ప్రజల సందేహ సంభాషణము సుమంత్రుని ముందుకు పోనివ్వలేదు. రాజాజ్ఞలేక తానా ఉపాయనముల తీసుకొను కార్యక్రమమును కొనసాగించుటెట్లు ?

సుమంత్రుడు బాధ్యతగల మంత్రిసత్తముడు. ప్రజల నొకవిధముగ సమా ధాన పరచినాడు. కైక చెప్పినది రాజాజ్ఞయా ? కైక వంచనా ? అన్న సందేహా ఘాతనిని వెంటాడినది. వెనుకకు మరలినాడు. రాజును మరల మేల్కొలుప నారంభిం

చినాడు. కన్నులు తెరచి సుమంత్రునికి విశదముగ సమాధానమిచ్చుటకు రాజు సమర్థుడైలేడు. అయ్యును ఎట్లో కన్నులతెరచి, రాముని నేల తీసుకొని రాలేదని తన ఆతురతను ప్రకటించినాడు.

సుమంత్రుడిక ఆలసింపలేదు. అతడు రామాంతఃపురమున కేగినాడు. రాచబాటలన్నియు జనసమూహముచే క్రిక్కిరిసియుండి సముద్రమా ఇది? అన్నట్లున్నను సముద్ర మధ్యమున చొచ్చుకొనిపోవు మకరమువలె ఆ ప్రజావాహిని నుండి ఈదుకొని రాముని తోడితెచ్చుటకు వెళ్ళినాడు.

అది రామాంతఃపురము కాషాయాంబరధారులు వేత్రహస్తులై కొందరు వృద్ధులును, మరికొందరు యువకులును, నానారూపధరులెందరో ఆ ద్వారదేశముల వద్ద కాపలా కాయుచుండిరికాని సుమంత్రుని వారెవ్వరును అడ్డలేదు. రాజాంతఃపురమునందు దాతడు సర్వస్వతంత్రుడు. రాముని ఎత్తుకొని ముద్దాడిన మంత్రిసత్తముడు. అయ్యును తాను ద్వారము వద్దనే నిలచి రాముని అనుమతికై వేచినాడు.

ఒక్కక్షణకాలముననే రాముని ఆహ్వానమందెనది సుమంత్రునకు. అది సుమంత్రుని జీవితమునందొక మధురక్షణము. అప్పుడు సుమంత్రున కబ్బిన రామదర్శనము మధురాతిమధురము.

రాముడప్పుడు సీత తనప్రక్కనవిలచి వింజామర వీచుచుండగా సీతతో కూడ సుమంత్రునికి దర్శనమిచ్చినాడు అదియే సుమంత్రుని మహాభాగ్యము. నిజమునకు రాముడుదాత్మారాముడు. సీత ఆ అఖండ చైతన్యమునందంతర్లీనమై యుండు సృష్టిశక్తి. అఖండాత్మయందా మహాశక్తి అంతర్లీనమైనప్పుడు రాముడొక్కడే. ఆ రాముడిప్పుడు దశరథరాముడై జానకితో కూడ ఇద్దరుగ సుమంత్రునకు దర్శనమిచ్చినాడు. కథకు వస్తువు.

రాముడిప్పుడు కాబోవు యువరాజు. వ్రతదీక్షితుడు. అలంకృతుడు. మణిమయసువర్ణాసనమున కూర్చొనినాడు. అతని విశాల వక్షము సువర్ణోత్తరీయముచే కప్పబడియున్నది. అతని నీలదేహమున వరాహరక్తమువలె కన్నుచెదరిపోవు రక్తచందనమలంకరింపబడి యున్నది. అది కుంకుమ పూవుతో మిశ్రమమై ఘుమఘుమలాడు సువాసనల గుబాళించుచున్నది.

ఆ రామభద్రుని మైపూత సీతాకాంతయే నాడు అలంకరించియుండవచ్చును.

ఆ చందనగంధమువందలి రక్తిమయు అందుండి ఘుమ ఘుమ లాడుచు గుబాళించు సువాసనలును రాముని లోకోత్తరత్వమును ప్రదర్శించుచున్నవి. అట్టి సీతారాముల అప్రాకృతశరీరములు సుమంత్రునకు నేత్రగోచరములై అతని ధన్యునిగావించినవి.

రాముని పట్టాభిషేక యత్నము చైత్రమాసము. కావుననే సీతతోకూడిన ఆ రాముని చిత్తానక్షత్రముతోకూడిన చంద్రునిగ వర్ణించినారు ఆదికవి. "చిత్రయా శశినం యథా" అని అప్పుడు రాముడు పూర్ణచంద్రునివలె నుండెననుటతో రామ చంద్రుని వర్ణనను ముగించలేదు. రాముని సూర్యునకును కుబేరునకును పోల్చినారు.

ఆ రఘువీరుడప్పుడు సూర్యునివలె కూడ వెలుగుచుండెననినారు. అంతేకాదు అతడు కుబేరునివలె కూడ నుండెనట. ఇట్లు రాముని వర్ణించుటలోని ప్రత్యేకత ఏమి ?

వైశ్రవణ సంకాశుడని రాముని పోల్చి కాబోవు ఈ మహారాజు కోరిన వారి కోర్కెలనెల్ల తీర్చదగు దాతయని సూచించినారు. అంతేకాదు. వేదమున కుబేరుని వర్ణన 'కామేశ్వరో వైశ్రవణోదదాతు'. అని ఉన్నది. ఆ కామేశ్వరుడగు కుబేరు డీతడేనని వేదార్థమును వ్యాఖ్యానించినారు చైత్రశుద్ధపూర్ణిమ నాటి చంద్రమండలము నకు పోల్చి రాముని నిరావరణ విశుద్ధ తేజమును ధ్వనించినారు. ఎట్లందురా?

హేమంతము కాదు గావున చంద్రమండలము మంచుచే ఆవరింపబడదు. వర్షఋతువుకాదు కావున మేఘములచే కప్పబడియుండదు. ఆవరణ రహితమును ఆచ్ఛాదనారహితమునగునదే పరబ్రహ్మతేజము. మరొక్క విశేషము. రాముని సూర్యునికి పోల్చునప్పుడు "తంతపంతమివాదిత్యం" అని మధ్యాహ్నభాస్కరునికి పోల్చి "ఉపపన్నం స్వతేజసా" తన స్వీయ తేజమున వెలుగుచుండెననినారు. ఈ ఉపమానముచే సూర్యచంద్రులకు తేజమును కూర్చువాడీ రాముడేనని స్వప్రకాశ బ్రహ్మచైతన్యమును స్ఫురింపచేసినారు. ఈ ఘట్టమున మరొక్క విశేష మున్నది.

సూర్యచంద్రతేజములను రాముని యందు వర్ణించి సూర్యకాంతితో శత్రు వులకు చూడరాని ప్రతాపవంతునిగను చంద్రకాంతితో ప్రజలకు ఆహ్లాదకరుడూ గూడనై యుండెనని సూచించినారు. ఈ ఘట్టమున మరొక్క విశేషమేమన ? ఇట్టి రాముని సుమంత్రుడు చూచెననక "దదర్శ సూతః" సూతుడు చూచెనని వాడినారు మహర్షి. ఇది యొక ప్రత్యేకమగు ప్రబోధము.

బ్రాహ్మణాది వర్ణములవలె సూతజాతి అత్యంత పవిత్రముకాదు. అయ్యును మహర్షులకు గూడ అందరానిఇట్టి దర్శన మబ్బినదని భక్తికి ప్రత్యేకస్థానమునిచ్చి నారు. సుమంత్రుడు భక్తాగ్రగణ్యుడు. "భక్త్యాతుష్యతి కేవలం నచగుణైః భక్తి ప్రియోమాధవః" అని వ్యాఖ్యానించినారు. కథకు వత్తము.

సుమంత్రుడు రాముని దర్శించినారు. రామునకు ప్రదక్షిణ నమస్కారముల గావించినాడు. రామా! అని సంబోధించి మంగళాశీస్సుల నొసంగి దశరథుని ఆజ్ఞను తెలిపినాడు.

## రాముని కైకేయీ మందిరప్రవేశము

రాముడాలసించలేదు.

పితృవాక్య పరిపాలనా రూపధర్మ నిర్వహణము రామావతారము నందొక ప్రత్యేకమగు ఆదర్శము.

దశరథ కైకేయీల సమాలోచన యందేదియో తనకొక మహాఫలము చేకూర నున్నదనియే రాముని ఆశయము. సవతి తల్లియే యైనను కైకయందాతనికి భేద భావములేదు. ఇదికైక ఒప్పుకొన్నమాట.

రాముడాసనము నుండి లేచినాడు. అతడు రసజ్ఞశేఖరుడు. తనమెడలోని మంచిముత్తెముల సరమును తీసి సీతమెడకలంకరించినాడు. ముఖమండలమున చిరునవ్వు మొలకెత్తగా సీతకు తన పయనమును తెలిపినాడు. ఆ వైదేహి తన క్రీగంటి ప్రసారముల రామునిపై ప్రసరింపచేయగా ఆమె కటాక్షపంక్తి నీలోత్పల మాలికయై రాముని అలంకరించినది. ఆ సీతారాముల మధుర రసానుభూతి ఆక్షణము నందంతతో ముగిసినది.

ఆగృహాభ్యంతరము నుండి రాముని అడుగులు ముందుకు సాగినవి. ద్వార దేశము దాక సీతయు రామునసుసరించినది. ఊరక అనుసరించుటకాదు. భర్తకు కొన్ని మంగళాశాసనముల నందించినది.

రాజసూయమను యజ్ఞము రాజులు కావింపదగు ఒక మహాధ్వరము. అది వారికి సామ్రాజ్యాభిషేకము. భావికాలమున రాముడా మహాధ్వరమున బ్రాహ్మణ ప్రవరులచే అభిషిక్తుడు కావలెనని ఆమెస్మరించి ఆశాసించినది. ఇంద్రుడు ఇంద్ర

పదవి నధిష్ఠించినట్లు తనభర్తను ఈ భూభాగమునకు దశరథుడు రాజును చేయగల డని ఆమె భావించియే తనభర్త రాజసూయ మహాయజ్ఞ దీక్షితుడు కాగలడని ఆశీస్సు నిచ్చినది.

చిన్నవారు పెద్దవారి నాశీర్వదించుటయా? అనకుడు. ఇవి మంగళాశాసనములు. ఇవి మంత్ర పూర్వకములు కావు. వీటినెవ్వరైన పలుకవచ్చును. దిగధిష్ఠాన దేవతల రక్షణము రామునకు గలుగవలెనని పలికినది.

సీతా కాంతను నిలుమని ఆజ్ఞాపించి రాముడు అంతర్గృహమును దాటినాడు సుమంత్రునితో కూడ.

అది ప్రథమద్వారము. లక్ష్మణుడు వెంటలేని పయనమెప్పుడును రామునకు జరుగదు.

లక్ష్మణుడు తన ప్రభువగు రామునకు ఛత్రచామరములు పట్టగా రాముడు రథాధిరూఢుడయ్యెను. రామలక్ష్మణుల రథము బయలుదేరినది. మందముగ సాగి వేగము నందుకొన్నది.

విడమున కది క్రిక్కిరిసి యున్న జనమధ్యము. అయ్యును ఆజనసమూహము రాముని రథమును చుట్టుముట్టి విరగ ద్రొక్కుకొనుచు రథమును అడ్డలేదు. నాటి సమాజము క్రమ శిక్షణ లేని సమాజము కాదు. రక్షణ శాఖ వారి లాఠీ దెబ్బలతో నాటి ఉత్సవములుండెడివికాదు.

నేటి మంత్రుల ఉపన్యాస వేదికలు కొట్లాటలతో బాష్పవాయు ప్రయోగము లతో నడవగా నేడు నాగరికత వృద్ధి నొందినదని మనమనుకోవచ్చును. నవసమాజ క్రమ వికాస వాదము భారతీయతకు కళంకము ప్రకృతమనుసర్తామః.

అంతఃపుర కాంతలు చల్లు కుసుమ సహస్రములును లాజాక్షతలును రాముని రథముపై జల్లుజల్లులై పడుచున్నవి. అప్పుడే కన్యకామణులతో కలసిన పురంధ్రీ మణులును రాచబాటలు క్రిక్కిరిసి తీర్చి దిద్దిన జనకంఠములును రాముడు రాజగుట మామహాభాగ్యమను చెప్పుకొను కోలాహల ధ్వనులు మిన్నుముట్టు చుండగా రాముని రథము జనమధ్యమును దాటినది రాముడును వారి చూపులకు మరుగు పడినాడు. కానీ ఇక్కడొక్క చిత్రము జరిగినది.

రాముని చూచువారల చూపులు మాత్రము రామునుండి మరలలేదు. వారి చూపులు రామునితో అల్లెపయనించినవి. మరి చూచు వారి మనస్సులో? అన్వియు

రామునితోడనే వెళ్ళిపోయినవి. ఆచూపరులు తమచూపులను, మనస్సులను తమ దగ్గరకు మరలించుకొన ప్రయత్నించిరిగాని వారు సమర్థులు కాలేదు రాముని దివ్య సౌందర్య సౌభాగ్యములను మరగిన నేత్రేంద్రియము తిరిగివచ్చునా? మనస్సు కూడ అంతియే.

"న హి తస్మాన్మనః కశ్చిచ్చక్షుషీ వా నరోత్తమాత్
నరశ్శక్నో త్యపాక్రష్టు మతిక్రాంతేపి రాఘవే"

నరోత్తముడగు రామునివెంట నరుల చూపులును మనస్సులును వెళ్ళి తిరిగి రాలేదట. మహర్షివర్ణనమిది భావ గర్భితమగు ఈ వర్ణన మనకు ఆస్వాద యోగ్యముకావలెను.

ఇక్కడి "నర, నరోత్తమ" పదములు సహృదయముల స్పందింపజేయు పదములు.

నరోత్తమ పదము భగవద్వాచకము. పురోషోత్తముడు భగవంతుడు ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః- గీత.

అని గీతా శాస్త్రము. రాముడిక్కడ పురుషోత్తముడు. అతడే నరోత్తముడు. నర పదముచే జీవులను తెలిపి, నరోత్తమ పదముచే రాముడు భగవంతుడగుటను తెలిపి, ఆభగవంతుని అనుసరించిన భక్తశేఖరుల చక్షురింద్రియమును, మనస్సును కూడా మరల వెనుకకు మరలి రాలేదనినారు చూచువారిచూపులనుండి దాటినవాడెవరు రాఘవుడు. రఘువంశమునందవతరించి దశరథపుత్రుడని వ్యవహరింపబడు వ్యక్తి. ఇతడు కథలోనిపాత్ర. ఇక్కడ భారతీయాధ్యాత్మిక శాస్త్రములు భగవంతుని రెండు విధములుగ వర్ణించినవి. ఒకటి సగుణము. అనగా విగ్రహరూపము. ఇది మనస్సుచే గ్రహించి, చక్షురాంద్రియములచే అనుభవించదగు స్వరూపము. రెండవది నిర్గుణము ఇది కేవల అనుభవరూపము. సచ్చిదానందైక స్వభావము. ఇది అవ్యక్తము. సగుణము వ్యక్తము. నేను అనుపదమునకు వాచ్యమైన జీవభావము నందుపాసించ దగినది సగుణము. జీవుడు కించిజ్ఞుడుకాగా భగవంతుడు సర్వజ్ఞుడు. సర్వజ్ఞుడగు భగవంతుని కించిజ్ఞుడగు జీవుడు ఆరాధించి, దర్శించి కృతకృత్యుడు కాగలడు. సగుణము భక్తికి ఆధారము. సేవ్యసేవక భావము కలది భక్తి. సగుణమూర్తి యందలి రూపమాధుర్యమును గుణ మాధుర్యమును చొక్కిన భక్తశేఖరుని మనస్సు తుచ్ఛములగు విషయ సౌఖ్యముల వైపు తిరగదు. ఈఘట్టమున మీకు పోతనామాత్యుల భాగవత సూక్తిని వినిపింతును.

సీ. మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలదూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవ ఖాదియైచొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములకు

తే. నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల.

ఈ పద్యము నాంధ్రులందరు చదివి యుందురు. ఆంధ్రుల జిహ్వాలన్నియు ఈ పద్యమధువును గ్రోలియే యుండును. దీనికి ప్రతిపదార్థమును నేను చెప్ప నక్కరలేదు. అయ్యును దీని భావమును కొంచెము చెప్పెదను.

ఏభక్త శేఖరుల హృదయము తేటి, హంస, కోయిల, చకోరపక్షి అను తిర్యగ్జంతువులలోని రసాస్వాదన చాతుర్యము కలది అగునో వాని హృదయము భగవానుని దివ్య పాదారవింద చింతనలోని మాధుర్యమును చొక్కి ప్రపంచాభి ముఖము కానేరదట. ఇది ప్రహ్లాదుని అనుభూతి నాలుక యున్న మాత్రమున ప్రతి వ్యక్తియు పదార్థము నందలి రుచిని గ్రహింపజాలదు. అన్ని జంతువులకును నాలుక యున్నది. ప్రతి కీటకమును తామరపువ్వుపైన వాలకపోదు. కాని తామర పువ్వునందలి మధువును గ్రోలదగు అర్హత తుమ్మెదకే కలదు. సృష్టిలోని ఈ ప్రత్యేకతను ఏ బుద్ధిమంతులును తారు మారు చేయజాలరు. మిగిలినవన్నియు అంతియే. అందరును మానవులే కావచ్చును. అందరికిని బుద్ధి యుండవచ్చును. హృదయమున్నంతమాత్రమున ఆ హృదయము భగవద్భక్తి రసాయనము నందు కొనవలెనని ఎక్కడున్నది? ఈగకూడ తీపి పదార్థమున వాలును. కాని అదివెంటనే అమేధ్యమునందును చీము, రక్తముకారు పుండుమీగ కూడ వాలును. తుమ్మెద వేప పూవుపైన వాలదు. ఇంతవరకు మీకు చెప్పినది సగుణభక్తి. రామదాసు, మీరా

బాయి ...వలగువారి అనుభూతులెన్నియో ఈ భక్తికి ఉదాహరణము కావచ్చును. ఇప్పుడు చెప్పిన శ్లోకమువలన వాల్మీకి నిర్గుణ బ్రహ్మమును వర్ణించెనా? కేవలం సగుణ బ్రహ్మమునే వర్ణించెనా? అనునది ప్రశ్న కావచ్చును. ఈ రఘువీరుడను పేర వ్యవహరింప బడువాడు సచ్చిదానంద బ్రహ్మమే సుమా? అని కూడ ఈ శ్లోకము నందా మహర్షి ధ్వనించక పోలేదు. ఆపరోత్తమ పదముచే అఖండబ్రహ్మ చైతన్యమునుచెప్పి, ఆ బ్రహ్మానందరసానుభూతినొందిన జ్ఞాని యొక్క చక్షు రాదీంద్రియ వర్గమును ఆ వర్గముతోటి తాదాత్మ్యమునొందిన జీవ చైతన్యమును మరల ఈ ద్వైత ప్రపంచానుభవమును పొందరు అని స్పష్ట పరచినారు. ఇచ్చటి నరోత్తమ పదము నిర్గుణ బ్రహ్మపరము ఎట్లుందురా?

ఏ వ్యాస భగవానులు మహాభారత మధ్యమున గీతా శాస్త్రముచే అద్వైతామృత వర్షమును కురిపించెనో ఆవ్యాసభట్టారకులే మహాభారత ప్రారంభమున తద్గ్రంధ నిర్విఘ్న పరిసమాప్తికై చెప్పిన మంగళ శ్లోకమున నరోత్తమ పదమును వాడినారు. ఆశ్లోకమిది

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీంచైవ తతో జయముదీరయేత్.

ఇచ్చట నారాయణునికి నమస్కరించి నరునకు, నరోత్తమునికి నమస్కరించి దేవియగు సరస్వతికిని మ్రొక్కి జయమును ప్రారంభించినారు.

ఇక్కడ భారత వ్యాఖ్యాతయగు నీలకంఠులు నరోత్తమ పదమునిట్లు వ్యాఖ్యానించినారు.

"స్వావిద్యాసృష్టపిండేన తాదాత్మ్యం యో గతో నరః
స జీవః స పరంబ్రహ్మ నరోత్తమ పదాభిదం.

ఏజీవుడు తన అవిద్యచేతనే ఈశరీరాదికమును సృష్టించుకొని, ఈశరీరాది తాదాత్మ్యముచే నేను జీవుడను, సంసారిని, కర్తను, భోక్తను అని జనన మరణ ప్రవాహము నీదుచుండెనో ఆజీవుడు పరబ్రహ్మయేగాని యదార్థముగ జీవుడుకాడు. అతనినే అనగా ఆ పరబ్రహ్మనే నరోత్తమ పదముచే నమస్కరించి, సంసార జయమగు జయనామక గ్రంధమును ప్రారంభించినారట వ్యాసులు.

ఈ వ్యాఖ్యానము నాస్వీయముకాదు. వాల్మీకి ప్రజలనిట్లు వర్ణించి, ఆ విధమగు అనుభూతిని పొందిన ప్రజలేమని తలపోసిరో కూడ వర్ణించినారు. ఆశ్లోకమిది.

"యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి
నిందితస్సవసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే॥

ఈ శ్లోక తాత్పర్యమిది.

ఎవ్వడు రాముని దర్శించడో ఎవనిని రాముడు చూడడో వాడు లోకమున నిందార్హుడుగనే బ్రతుకునట. అంతేకాదట. తన ఆత్మయే వీనిని నిందించునట. ఈ మాట నాటి ప్రజలమాట. ఆనాటి ప్రజలు ఆనాడు రాముని చూడవచ్చును. మనమిప్పుడెట్లు చూతుము? అనునది ముఖ్యమగు ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానమును కుదుర్చుకొన్నప్పుడే రామాయణ కావ్య పఠన ప్రయోజనము మనకు కలుగును. దీనికి సమాధానమిది.

వాల్మీకి నాటి ప్రజలనుకొన్నమాటనే చెప్పినను యచ్ఛబ్దముని వాడి ఎవ్వడు అట్లు రాముని దర్శించడో అనినారు. అక్కడ కాలనిర్దేశము లేదు. ఎవ్వడైనను ఎప్పుడైనను అనగా ఏకాలమందైనను రాముని దర్శించడో రాముని చూపునందు పడడో అని అర్థము. అప్పుడా రాముడు దశరథ రాముడు కాడు. అతడు ఆత్మారాముడు. దానికర్థము ఎవ్వడు ఆత్మదర్శనమునకై యత్నించడో ఎవ్వనిని భగవంతుడు జ్ఞానిగ దగ్గరకు తీసుకొనడో అతనిని లోకము నిందించుట కాక ఆత్మయే నిందించునట. ఇక్కడ ఆత్మయననేమి? మనస్సని అర్థము. మనస్సు నిందించుటేమిటి? ఆహా! ఈ జీవుడెంతటి పశువు? మానవశరీరమును ధరించి, ఇంద్రియ పాటవముకలిగి పశువులకంటె గొప్ప విజ్ఞానవంతుడనునేనని విర్రవీగుచు తానెవ్వడై ఇట్లు చరించుచుండెనో నన్ను ఆధారముగా గొని ఏల గారించడు? అని మనస్సు ఆత్మను చివాట్లుపెట్టునట. ఆత్మను చివాట్లుపెట్టుట సబుద్ధిని నిందించునని అర్థము. భగవంతున కత్యంత సన్నిహితుడు ఆత్మజ్ఞాని. జ్ఞానీత్వాత్మైవ మేమతం" అనినారు గీతాచార్యులు. ఇక కథకు వత్తము.

రాముని రథము కైకేయీ మందిరద్వారముకడ నిలచినది.

# రాముని స్థితప్రజ్ఞత్వము

అది రాముని పితృపాదుల శయ్యాగృహము. ఆతనికి మధ్యమాంబయగు కైకేయియు అక్కడనేయున్నది.

మాతృపితృమూర్తు లిద్దరును రామునకు ఆరాధ్య దైవములే. కైక సవతి తల్లియను తారతమ్యము రామునకు లేదు. రాముడు ముందుగ పితృపాదుల పాద పద్మములపైబడి వందన మాచరించి, తల్లియగు కైకకు సాష్టాంగ ప్రణామము గావించినాడు. కాని రామునకొక విషమసమస్య ఎదురై నిలచిన దాసమయముననే. రాముడు భరింపరాని సమస్య అది.

రాముడింతవరకు తనతండ్రి తనపైచూపు వాత్సల్యరసమునే ఆస్వాదించెను గాని అరుణ కషాయిత నేత్రములతో తన్నుచూచుట అతడెరుగడు. దశరథుడెప్పుడును రాముడు తన దగ్గరకురాగా తన రెండుచేతులతో రాముని కౌగిలించి, శిరమును మూర్కొని ఆనందించునేగాని ఉపేక్షాభావమున రాముని చూచుట దశరథుడును ఎరుగడు. ఈనాడాభాగము లోపించినది. దశరథుడు రాముని మాటాడించ నుత్సాహించలేదు. దశరథుని ముఖమండలమున రాముని దర్శించిన ఉత్సాహము రవంతయైనను కనబడలేదు. దీన స్వరమున రాముని సంబోధించినాడు తప్పని సరిగ పలంరించునట్లున్నది ఆ పలకరింపు.

తన తండ్రి ఈనాడట్లు తననుగురించి ఎందుకుండెను? తనలోపమేమి? తానేమైన అపరాధము గావించకున్న తన తండ్రి తన నట్లెందుకు చూచును? అను సమస్య రాముని నెదుర్కొన్నది. రాముని అంతరంగము వెనుకకు మరలినది. ఆత్మ పరీక్షను చేసుకొన్నది. రాముని అంతరాత్మకెక్కడను సమాధానమందలేదు. బహిర్ముఖమైనది.

రాముడు కైకవైపుకు తిరిగినాడు. తల్లికి మరల మ్రొక్కి అజ్ఞాతముగ తండ్రికి నేనేమైనా అపరాధమును గావించితినా? తల్లీ! తండ్రిగారిట్లుండుటకు కారణ మేమియో నీవు కనుగొని చెప్పుమని వినయ విధేయతలకు గురువై యుండదగు రాముడు కైకను అడిగినాడు.

ఈ శరీరము వచ్చుటకెవ్వడు ఆధారమో ఆతండ్రికంటె దైవములేడను తన ఆత్మనిశ్చయమును తెలిపి, ప్రత్యక్షదైవము తండ్రియేయని అట్టి దైవతమును

పూజించుట కంటె నాకు వేరొకవ్రతములేదని పితృాజ్ఞాపాలనమును చేతునని చేయు టకుద్యుక్తుడయ్యే కైకను అడిగినాడు.

స్వార్ధమొక విచిత్రమగు రక్కసి. స్వార్ధమునకు బాహ్యమగు ఆకారము లేదు. లోకాపవాదమునకు వెరువని తనము దాని శరీరము. దయాదాక్షిణ్యములకు అణుమాత్రమైన స్థానమును కల్పింపక పోవుటయేదాని నిజాత్మ.

ఇప్పుడు కైక కర్తవ్యమేమి? తన వరద్వయమును తెలుపవలెను. సిగ్గు అనుగుణము కైకను అడ్డగించినచో కైక తన కార్యమును సాధించుకొనజాలదు. కైకలజ్జాత్యాగమునకు జంకుగొనలేదు. సంపూర్ణముగ సిగ్గును వదిలినది. ఆ రాత్రి అంతయు తనకును దశరధునకును జరిగిన సంభాషణను రామునకు చెప్పినది. శంబరాసురుని యుద్ధమున దశరధుడు తనకిచ్చిన వరములను రెంటిని నేనిప్పుడు కోరితినన్నది. కాని ఆవరముల నిచ్చిన నీ తండ్రి ఆజ్ఞను నీవు తప్పక పాలింతు నన్నచో ఆవరములెవ్వియో రామా! నీకుతెలిపెదనన్నది. ఈ సంభాషణ అంతయు దశరధుని ఎదురుగనే జరిగినవి. దశరధుడు వినుచునేయుండెను. దశరధుని నోట అడ్డుమాట రాలేదు. దశరధుడు సత్యపాశబద్ధుడై మాటాడలేదు.

రామునకింతవరకు దశరధుడు కైకకు రెండు వరముల నిచ్చెనని మాత్రము తెలసినది ఆవరములనిప్పుడు తనతండ్రి సత్యవ్రతుడై కైకకు అప్పుతీర్చ కొన వలసిన వాడయ్యెనని అర్ధమైనది. ఆబాధ్యత తన యందుండెనని స్పష్టమైనది. ఆ రెండు వరముల నేరూపముగ కైక కోరినదో మాత్రము అతనికి నిర్ణయముకాలేదు. అయ్యును తండ్రి ఆజ్ఞపాలించుటలో తనను అనుమానించి తనను గట్టి పరచుటకు కైకచేసిన ప్రయత్నమునకు మనసు కలతనొందగా అతడిట్లు ప్రతిజ్ఞనుగావించినాడు.

"అహం హి వచనాద్రాజ్ఞః పతేయమపి పావకే
భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయ మపి చార్ణవే.

తల్లీ! తండ్రిగారి ఆజ్ఞయైనచో జ్వలించుచున్న అగ్నియందు ప్రవేశింతును. హాలాహలము సైతమును భక్షింతును. సముద్రమున దుముకుటకైనను సంశయింపను. ఇది నావ్రతిన అని దృఢముగ పలికి రాముడు రెండుమాటల మాట్లాడువాడు కాదని ముక్తకంఠమున పలికినాడు. "రామోద్విర్నాభిభాషతే" అని.

కైకకు ధైర్యము వచ్చినది. దశరధునితాను కోరిన రెండువరము లెవ్వియో రామునకు తెలిపినది.

"సప్త సప్తచ వర్షాణి దండకారణ్యమాశ్రితః
అభిషేక మిమం త్యక్త్వా జటాజిన ధరో వస
భరతః కోసలపురే ప్రశాస్తు వసుధామిమాం.

మొదటివరము రాముడిప్పుడు కట్టుకొను పట్టాభిషేకమును వదిలి నారచీరెల ధరించి, జడదారియై దండకారణ్యభూములలో పదునాలుగు సంవత్సరములు గడుపుట. రెండవవరము ఈ కోసల సామ్రాజ్యలక్ష్మికి భరతుడే రాజగుట. ఈమాటలను నీకు చెప్పుటకు రాజునకు మొగము చెల్లకయున్నది, నీవు నీతండ్రిని సత్యవ్రతుని గావింపుమన్నది. రాముని మనసిప్పుడెట్లుండును? ఈ ఘట్టమున సామాన్య మానవ మాత్రుడు రాముని మనఃపరివర్తన మెట్లుండునో ఊహింపజాలడనునది త్రికాల సత్యము. అంతేకాదు కైకేయి తన మాటనుగా రామునకు తెలియ చేయుచుండ రాముని పట్టాభిషేక మహోత్సవమును చూడదలచుకొన్న దశరధుని స్థితిని ఊహించుట మాత్రము సాధ్యమా? ఈ రెండు పాత్రలను ఒకే త్రాసున రెండువైపుల నుంచి తూచుట మానవబుద్ధికి సాధ్యమగునదికాదు. ఉపనిషద్విజ్ఞాన వేత్తలగు వారి బుద్ధి తులాదండమునకు రెండువైపులా కూర్చబడిన పాత్రలలో ఈ రెండు పాత్రలనుంచి, తూచినగాని ఈ రెండు పాత్రలలోని ప్రత్యేకత బోధపడదు.

ఇందొక పాత్ర సంసారియై సుఖదుఃఖముల ననుభవించుభోక్త. అతడు దశరధుడు. రెండవపాత్ర సుఖదుఃఖములకు నిలయమై యుండు గృహస్థాశ్రమము నందుండి లోకవ్యవహారమున వ్యవహరించుచు, చూచువారల కట్లే కన్పట్టుచు తాను కర్తకాక, భోక్తకాక సాక్షియై యుండుపాత్ర. అతడే రాముడు. రెండవది అనగా రాముని స్థితి మానవమాత్రునకు సాధ్యమా? అను సంశయము మనకు కలుగుట అసహజముకాదు. పారమార్థిక ప్రపంచము నందడుగిడని మన మనస్సు సుఖదుఃఖములకు సాక్షియై యుండుటను నమ్మజాలదు. నమ్మజాలని విషయమును శాస్త్రములు చెప్పునా? అను విషయమున శాస్త్రవిశ్వాసమైన యున్నచో అభ్యాసము ఇట్టి సిద్ధత్వమును కల్పించునని నమ్మగలము. గౌడపాదులు చెప్పినమాట ఇది.

"త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః
వేదైతదుభయం యస్తు స భుంజానో న లిప్యతే.

జాగ్రత్స్వప్న సుషుప్తులలోని భోక్తృభోజ్య భావముల నెవ్వడు తెలిసికొనునో అతడు సుఖదుఃఖముల ననుభవించియు అనుభవించని వాడయ్యేయుండునట. ఇదియే జీవన్ముక్తి కావున ఇక్కడ వాల్మీకి మహర్షి రాముని అంతఃకరణమున ప్రవేశించి తన విశుద్ధాంతఃకరణమున రాముని దర్శించి, సత్యజ్ఞానానంద లక్షణ లక్షితుడై యున్న రామ బ్రహ్మము ఆసమయమునందెట్లుండెనో తెలిపినారు. దశరధుడెట్లుండెనో కూడ చెప్పినారు.

"ఇతీవ తస్యాం పరుషం వదంత్యాం
న చైవ రామః ప్రవివేశ శోకం
ప్రవివ్యధే చాపి మహానుభావో
రాజా తు పుత్రవ్యసనాభి తప్తః" అనినారు.

కైక ఈ విధముగు కఠిన వాక్యముల పలికినను రాముని ముఖమండలము సందేమాత్రమును వైవర్ణ్యము కలుగలేదట. మనస్సుకూడ వ్యధను చెందలేదట. కావున రాముని "మహానుభావః రామః" అనినారు. పుత్రవ్యసన సంతప్తుడగు దశరధుని, "తు" అను పదముచే విడదీసి, "రాజా దశరధః ప్రవివ్యధే" అని తెలిపినారు. దేహాత్మ బుద్ధికలిగి, రాజునన్న అభిమానము తో కూడినవాడు దశరధుడు బాధపడినాడు. (జీవుడు, సంసారి) రాముడు సంసారియై కన్పట్టు అసంసారి. తరువాతేమి జరిగినది?

రాముడతి సంతోషము తోడనే రాజ్యమును వదిలినాడు. కైకేయితో భరతుని రప్పించి రాజ్యమును నప్పగింతుమని సంతోషముగనే చెప్పినాడు. కైకయు సంతసించినది. కాని భరతుడు వచ్చిన తరువాతగదా? రాముని అరణ్యగమనము? అనునది కైకకు సమస్యయైనది. రాముడరణ్యమున కేగుటకు కాలవిళంబనమును సహించలేకపోయినది. అందుకై ఆమె రామునివంక తిరిగి ఇట్లన్నది.

రామా! నీవు అరణ్యమున కేగునంతవరకును నీ తండ్రి దశరధుడు స్నాన పానముల గావింపడన్నది ఇక నీవు ఆలసింపక దండకారణ్యములకు పయనము కమ్మన్నది. ఈ పలుకు దశరధుడు భరింపరానిది. కైకేయి పలుకాతనికొక పిడుగుపాటైనది. ఆముదునలికి కైకేయి రూపమున మృత్యువు సాక్షాత్కరించినట్లయినది ఆ క్షణముననే మూర్ఛనొందినాడా వృద్ధభూపతి. ఆయంతఃపురమునందప్పుడే మిగిలిన అంతఃపురకాంతల ఆర్తనినాదముల చెలరేగినవి.

దశరథుని రాముడాక్షణముననే లేవనెత్తి, సేదతీర్చి కైకకు కలిగిన అను మానమును తీర్చినాడు. కైక అనుమానమును రాముడుతీర్చుటతో మనకొక ప్రత్యేక సంబంధమున్నది. రాముని జీవిత లక్ష్యమేమియో మనకు స్పష్టముకాగలదు గాన జాగరూకులై వినుడు రాముని సిద్ధాంతమిది.

"నా హమర్థ పరోదేవి లోకమావస్తు ముత్సహె
విద్ధి మాం ఋషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితం."

రాముడు కేవలముగ ధనసంచయమునే ప్రధానము గావించు కొనలేదట. ధర్మమునాచరించుటే అతని జీవితముయొక్క ప్రధానలక్ష్యమట. ఇట్టి జీవితమును గడపుటకు ఉదాహరణ ఎవ్వరట? ఋషుల జీవితమట. ఋషులకు జీవిత లక్ష్య మెద్దియో రాముని జీవిత లక్ష్యమదియట. ఇక కైకకుగల అనుమానమేమి? ఆమె అనుమానము నెట్లు తీర్చెను? అనునది ప్రశ్న. రామునకు కాలవ్యవధి నిచ్చుచో ప్రజలు రామునివైపుకు తిరుగుచో తనప్రయత్నము విఫలమగునను భయము కైక కున్నది అంతేకాదు భరతుడు వచ్చుచో భ్రాతృభక్తి పరాయణుడగు భరతుడును రాముని వనవాసమును మాన్పునన్న భయము కైకేయికి లేకపోలేదు. కావున రాముడు"తల్లీ! నేను "లోకం ఆవస్తుం నోత్సహే" అనినాడు. అనగా ప్రజలనను సరించువాడనుకాను. పితృవాక్య పరిపాలనా రూపధర్మము నాకు ఏకైక లక్ష్యమని నొక్కిచెప్పినాడు ఇక్కడ మనకు తేలిన సారాంశమేమనగా రామునిది ధర్మప్రధా నమగు అర్థ కామముల సేవనముగాని అర్థప్రధానమగు ధర్మసేవనముకాదు. తరు వాత జరిగినదేమన?

రాముడు కైకేయిని నేనిట్టివరముల నేల యడిగితివని చింతింపను కూడ చింతింపవద్దని తనకు కౌసల్యకును, సీతకును ఈ విషయమును తెలిపి వెళ్ళుటకు అనుజ్ఞనిమ్మని కోరినాడు. కైక అంగీకరించినది.

రాముటట్లు కైకేయికి చెప్పెనుగాని అతని మనస్సునందైన రాజ్యవియోగ మును గూర్చిన చింతలేకుండునా? అని మన మనస్సు రామునిగూర్చి శంకింపక పోదు. తప్పక శంకించును. ఆశంకనుకూడ వాల్మీకి మహర్షి తీర్చినారు. ఎట్లు తీర్చినారు?

రాముడు కైక మందిరమును వదలి కౌసల్యాగృహమునకు వెళ్ళునప్పుడు అతడు పట్టాభిషేక సంభారములను తిలకించి, ప్రదక్షిణమాచరించి, ఈయభిషేక

ద్రవ్యములు భరతునికే వినియోగపడుగాక అనిపినిర్మల హృదయముతోడనే అను కొనుచు వెళ్ళెనట. రామునికా ద్రవ్యముల తిలకించినపుడు చిత్తముచలించలేదట. అప్పుడాతని చిత్తమెట్లుండెనట?

"సర్వలోకాతిగస్యేవ లక్ష్యతే చిత్తవిక్రియా"

రాముని చిత్తము సమస్తలోకముల నతిక్రమించిన వాని చిత్తమువలె నున్న దట. సర్వలోకాతిగుడన ఎట్లుండునట?

ఆనందమనునది రెండు విధములు. ఒకటి అనుభవింపబడు ఆనందము. అనుభవరూపమగు ఆనందము ఈ అనుభవింపబడు ఆనందము తనకంటె వేరొక వస్తువుచే ప్రాప్తమై ఒకదానికంటె నొకటి ఎక్కువైయుండును. ఒక లక్షాధికారి యగు ధనవంతుడు నేను లక్షాధికారినని అనుకొని ఆనందించు ఆనందమున కంటె కోటీశ్వరుని ఆనందముగొప్పది. ఆ కోటీశ్వరుని ఆనందమునకంటె చక్రవర్తి ఆనందము గొప్పది. ఇట్లే భూలోకవాసుల ఆనందమున కంటె స్వర్గలోక సౌఖ్య ముల వలన కలుగు ఆనందము మరింతగొప్పది. ఇట్లు లెక్కవేయుగా బ్రహ్మలోక మున కధిపతియగు వాని ఆనందము గొప్పది. కాని ఈ ఆనందములకు పరిమితి యున్నది. అపరిమితమగు ఆనందమునకు అఖండానందమని పేరు. ఆ అఖండా నందమునకే ఆత్మానందమని పేరు. ఇదియే అనుభవరూపమగు ఆనందము. ఇట్టి ఆనందమున నుభవించువారు భాగవతోత్తములును పరమ జ్ఞానులును. భాగవతులు భగవత్పారతంత్ర్యమును గోలి ఇంద్రియములచే అనుభవింపబడు ఆనందమును ధిక్కరించగా, జ్ఞానులు తమకును భగవత్తత్వమునకును వేరులేమిని సాధించుకొని ఆత్మానుభవమునొందుచు ఇతరవస్తువుచే కలుగు చిత్తవికారము నొందకయుందురు. జ్ఞానులకు సహజముగ ఏ వ్యవహారమునందును వాసనల ప్రకోపము కలుగదు. లోక సంగ్రహదృష్టితో శాస్త్రము ననుసరించి ప్రవర్తింతురు. వారికి రాజ్యభోగ ములు తృణప్రాయములు. అట్టిమహనీయుల చిత్తవృత్తి ఎట్లు బాహ్యపదార్థముల తృణప్రాయముగ చూచునో అట్లుండెనట రాముని చిత్తవృత్తి. ఇప్పటిరాముని చిత్తవృత్తియే స్థితిప్రజ్ఞుని చిత్తము. త్రిగుణాతీతుని చిత్తము గీతలోని త్రిగుణా తీత, స్థితి ప్రజ్ఞతలక్షణములను అర్జునునకు బోధించినవాడెవరను కొనుచుంటిరో ఈ రాముడే. రామావతారమున ఆదర్శప్రాయుడై కృష్ణావతారమున జగద్గురు వయ్యెను. ఇది రాముని స్థిత ప్రజ్ఞత్వ ప్రదర్శన రంగస్థలము. ఇక రాముడు చూప బోవునది మానవుడాచరింపదగు ధర్మప్రదర్శన రంగస్థలము.

తరువాతి కథ.

అది కౌసల్యా మహారాణిమందిరము. అందెందరో బ్రాహ్మణులీ నాడు వైదికములగు మంత్రములతో శ్రద్ధాభక్తులతో హోమములగావించుచుండిరి. ఆమెయు తెల్లని పట్టు పుట్టమును ధరించి రాముని పట్టాభిషేకవార్త వినినది మొదలుగా వ్రత దీక్షితయై వ్రతదీక్షచే కృశించిన శరీరముతోడనే అగ్నిని ఆరాధించుచుండెను.

కైకేయి మందిరమునందలి అంతఃపురకాంతల అంతఃకరణములు దుఃఖా క్రాంతములైయున్న ఆసమయమున కౌసల్యాంతఃపురము మంగళకార్యములతో అలరారుచున్నది. క్షణకాలమున రాబోవు దుఃఖఫలముల నెవ్వరెరుగుదురు? సృష్టి ఖండమునందేనాడును ఎవ్వరును గ్రహించరాని విషయమిది. ఒక్కక్షణకాలముననే దురదృష్ట ఫలము తన్ను ఎదుర్కొనబోవుచున్నదని కౌసల్యకు తెలియదు? పుష్యమి నక్షత్రముతో కూడిన ఈనాటి రాముని పట్టాభిషేక మహోత్సవమే కౌసల్యామనః ఫలకమున చిత్రింపబడియున్నది.

రాముడు మాతృగృహమున ప్రవేశించినాడు. మూడవకక్ష్యయందలి వేద పారగుల వేదపాఠధ్వనుల వినినాడు. ఆభద్రమూర్తులకు వందన సమర్పణలు గావించినాడు. తన మాతృమూర్తిని సమీపించినాడు. తల్లిపాదములకు ప్రణమిల్లి నిలచినాడు.

పుత్రునిదర్శించి అనుభవించు ఆకౌసల్య సంతోషమునకు చివరఎక్కడ? అప్పుడామె ఆనందము అపారవారము. ఆక్షణముననే రామునకొక సువర్ణ పీఠము నుంచినది. దానికి ముందుగ భోజన పాత్రనుంచినది. పుత్రుని కౌగిలించుకొన్నది. బిడ్డా! ఈ పీఠపై కూర్చొనమన్నది.

రాముడు తల్లియిచ్చిన ఆసువర్ణాసనమును చేతముట్టినాడు. అంతియే అతడు కూర్చొనలేదు.

ఒక్కమాఱుగ నేనరణ్యములకు పోవలసిన యిడదానిని నేసి ఆసనమున కూర్చుండనని తల్లికి చెప్పుచో కౌసల్యగుండె బ్రద్దలగునని రాముడెటుగక పోలేదు. కావున తల్లీ! నేపీ పీఠపై కూర్చుండదగు కాలముకాదు నాకు. అని సమాధానమిచ్చి ఇరువది అయిదు దర్భలతో అల్లిన విష్టరాసనముపైన కూర్చొనదగు కాలమని కాలమునకొక ప్రత్యేకతనిచ్చినాడు. "విష్టరాసన యోగ్యోహి కాలోయం మామ వస్థితః" అనినారు. విష్టరాసనమన దర్భాసనము.

నాపై ప్రసరించిన కాల ప్రభావమే నీపైనను సీతాలక్ష్మణులపైనను కూడా ప్రసరించినదనినాడు. ఆ తరువాత మీమువ్వురది దురదృష్టకాలమనినాడు అందుకు కారణమును చెప్పక తప్పుతెట్లు? తన పదునాలుగు సంవత్సరముల అరణ్యవాస దీక్షను తల్లికి తెలిపి, భరతుని రాజ్యాభిషేక నిర్ణయమును చెప్పినాడు. రాముని సంభాషణలోని ప్రత్యేకతను గమనించితిరా? సీతా లక్ష్మణులకును కౌసల్యకును ఇది దురదృష్టకాలమట. తనదికాదా? కాదట. తానొక వినిర్మల జీవితమును గడుపుటకై వనముల కేగుచుండెనట. ఆ పవిత్రవన జీవితమున కాదర్శమెవ్వరిదట? మునీశ్వరుల జీవితమట. విషయసుఖములను దూరముగానించుట ముని జీవితమునకు లక్ష్యము. ఆ విషయమును తేటతెల్లముగ చెప్పినాడు."

"మధుమూలఫలైర్జీవన్ హిత్వా మునివదామిషం.

మునుల వలె ఆమిషమును వదలునట. ఆమిషమన నేమి? ఆమిషమన సామాన్యమగు అర్థము మాంసము. ఇక్కడ మాంసాహారమును వదలుదునని అర్థముకాదు. ఆమిషశబ్దమునకు విషయసుఖములని అర్థము. శబ్దార్థవివరణమునకు ప్రకరణాంశము చాలముఖ్యము. లక్ష్యార్థ ధ్వన్యర్థములును అవసరములే. కేవల వాచ్యార్థములతో భావము వ్యక్తముకాదు. మనుస్మృతి మునిజీవితము నిట్లువర్ణించినది

"అధ్యాత్మ రతి రాసీనో నిరపేక్షో నిరామిషః
ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ" మను 8-49

ఇక్కడ ఆమిషశబ్దమునకు ఆమిషం=విషయాః అని కుల్లూకభట్టుగారి వ్యాఖ్యానము. కావున రాముడు ఇక్కడవాడిన ఆమిషశబ్దమున కర్థము విషయ సుఖముల విడనాడుదునని అర్థము. కాక ఆమిషమన రాజభోగ్యమగువస్తువు. అట్టి ఆహారపదార్థమునే తల్లి తనకుపెట్టగా తల్లిఇచ్చిన ఆసనమును ఆహారపదార్థమును కూడ నాకువద్దని అరణ్యమునందెట్టి ఆహారము ప్రాప్తమగునో దానినే తిందునని నాడు.

మనమిక కథాభాగమునకు వచ్చి కౌసల్యను సమీపింతము.

రాముని పలుకు వినుట తడవుగా కౌసల్య క్రిందకూలినది. మూర్ఛనొందినది. కొద్ది కాల మామెకు రాముడు సేదతీర్చగా కన్నుల విప్పినది. అంత మాత్రమే ఆమె దుఃఖతరంగములు శాంతించలేదు. ఇంతకుముందు పుత్రవతికాక

తానను భవించిన సాంసారిక దుఃఖములు కూడ ఆమె తలపునకు వచ్చినవి. ఈనాడు పుత్రవతియై అనుభవించు సుఖమునకంటె నాటి గొడ్రాలితనము మేలనిపించినది.

ఒకనాడు దుఃఖమై కనబడినదే మరొక కాలమున నాటి దుఃఖమే సుఖమని పించుట ప్రకృతి స్వభావము. ప్రకృతిలోని సుఖదుఃఖములకు నియతిలేదు. ఆత్మ సుఖమొక్కటే నిత్యము.

విషయసుఖమునకై జీవుడెంతయో ప్రయత్నించును. ఆ ఫలమునను భవింప జీవుడెదురు చూచును.

ఆ ఫలమాతని చేతికి పూర్ణరూపమై అందుననన్న నిర్ణయములేదు. ఒకవేళ అందినను అది శాశ్వతముకాదు. కర్మఫలము పుట్టుక కలది. పుట్టిన దానికి నిత్యత్వము లేదనునది త్రికాలసత్యము.

కధకు వత్తము.

రామ మాత మూర్ఛనుండి లేచినది. తన దురదృష్టజీవితమును మాటి మాటికి తలచుకొనుచు విలపించినది. అప్పుడామె దుఃఖశోకము లెట్లుతీరును ? ఆమెనెవ్వరా దరించవలెను ? రాముడు తల్లీ ! నేనరణ్యమునకుపోవను నీవేడువకుమనునా ? అట్లైన ఆమె దుఃఖము మానును. అది అసంభవము.

లక్ష్మణుడామె దీనత్వమును చూచి సహించలేక పోయెను. అప్పుడామెను ఓదార్చదగిన వాడు లక్ష్మణుడొక్కడే.

ఒకప్పుడు బాధపడువాని బాధను పరిపూర్ణముగ తుడిచివైచుటకు సాధ్యము కాకున్నను తాత్కాలికముగనైన ఆ దుఃఖభాగుని శాంతింపజేయ యత్నించుట మానవ సహజము. కావున లక్ష్మణుడు "తత్కాలసదృశంవచః" ఆ సమయమున కనుగుణ్యముగ కౌసల్యను ఓదార్పరయత్నించినాడు.

ప్రస్తుతమగు కౌసల్యబాధయేమి? రాముడరణ్యమున కేగుటను గురించియే. అందుకు కారణభూతురాలు కైకేయి. ఆమెకిచ్చిన వరద్వయమునను సరించి రాముడ రణ్యమునకేగుచుండెనుగాన ఆమె వరద్వయమును పాటించి రాముడరణ్యమునకు పోవలసిన పనిలేదని కౌసల్యవైపుకు తిరిగిపలికినాడు. అంతతో రాముడు దశరథుని ఆజ్ఞను పాలింపవలసిన పనిలేదని తేలినది. ఆక్షణమున ఏరులైపారు ఆమె కన్నీటి

ధారలు కొంచెము వెనుకకు మరలినవి. ఆ సమయముననే దశరథుని మాటను పాటించుట కవసరమెందుకు లేదో కొన్ని కారణములను ప్రతిపాదించి దశరథుని అవివేకమును చూపినాడు.

"విపరీతశ్చ వృద్ధశ్చ విషయైశ్చ ప్రధర్షితః
నృపః కిమివ న బ్రూయాచ్చోద్యమానస్సమన్మథః"

వయోధర్మము ఆయన బుద్ధికి వైపరీత్యము కల్పించినదనినాడు. అదిగాక విషయ సుఖాభిలాష ఆతనిని వంచించినదని కూడ ననినాడు. ఏమైనను ఇది రాజశాసనముగదా? అనుటకుకూడ వీలులేదనినాడు కాముకుడగు రాజుకు వివక్షణాజ్ఞానమెక్కడిదని రాజాజ్ఞగ తీసుకొనవలసిన పనిలేదనినాడు. అంతతో కౌసల్యకు మరింత వెనుకకు నడచినదిశోకము. ఆతడంతతో ఆగలేదు. రాముని వంకదిరిగి అవసరమగుచో నా బలపరాక్రమములను కూడ దశరథుని అడ్డగించుటకు ధారవోయుదునని మాట్లాడి ఇది ధర్మమా? అను ప్రశ్నకు సమాధానమిచ్చినాడు ధర్మశాస్త్రాచార్యుడై. గురువులైనను సత్పథమును తప్పి నడచుచో వారిని ధిక్కరించవచ్చునన్న వాక్యమును ప్రమాణీకరించినాడు. క్షాత్రధర్మమునందిది యొకముఖ్య ధర్మము. లక్ష్మణు డిక్కడ ఉగ్రవాదియై పలికిన పలుకుకాదు. అందుచేత రాముడు లక్ష్మణునికి ప్రత్యేకముగ సమాధానమిక్కడేమియు చెప్పలేదు.

కౌసల్యకు కొంచెము బాగుగనే బలముచిక్కినది. సరాసరిగ భర్తమాటను ఆమెకాదను టెట్లు? లక్ష్మణుని అనుసరించి రాముని వనవాసము నుండి మరలించుటకు ప్రయత్నించినది. కైకకే ఇట్టి సమయము దొరకుచో గట్టిగనే చెప్పెడిదిగాని కౌసల్య "రామా లక్ష్మణుని వాక్యముల వింటివిగదా?" అని రాముని నివారింప యత్నించినది.

రాముని పాత్రచాల చిత్రమైనది. ధర్మమున కెదురై నిలుచు దయాదాక్షిణ్యములు ఆ ధర్మమూర్తి చూపున విలువవు. కౌసల్యకు తన హృదయమును స్పష్ట పరచినాడు.

నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మమ.

తల్లీ! తండ్రివాక్యమును నేనెన్నడును అతిక్రమింపజాలను. నన్నను గ్రహింపుమనినాడు. మాతృవాక్యమట్టిదికాదా? కాదనియే ఆయన సమాధానము.

తల్లినూరురెట్లు తండ్రికంటె అధికమని ధర్మశాస్త్రములు చెప్పినను శుశ్రూషయందా ధర్మము వర్తింపవలెనుగాని ఆజ్ఞాపాలనము నందా ధర్మము వర్తించదనియే రాముని నిర్ణయము. దీనికే సూక్ష్మధర్మమని పేరు ఒక విధముగ కౌసల్యయు లక్ష్మణుడును రాముని వనవాసమును మాన్పయత్నించినారు. ధర్మాచరణమున రాముని హృదయము శిలాసదృశము. లోహమయము. కఠినాతికఠినము. లక్ష్మణుని మనసును నొప్పింపలేదు. తల్లిమనస్సునుకూడ అంతియే. కౌసల్యకు సాధ్వీమతల్లుల ధర్మమును బోధించి, పుత్రవాత్సల్యము కంటె పతిదైవతము నారాధించుటే ముఖ్యమని సిద్ధాంతీకరించినాడు. ఆమె తనను వెంటనంటుటకూడ అనుమతించలేదు. భర్త జీవించియుండ స్త్రీ పుత్రుననుసరించుటకు ధర్మశాస్త్రాచార్యులు ఒప్పలేదనినాడు. దశరథుని ఆజ్ఞను అతిక్రమించుట కెవ్వరికిని హక్కులేదనినాడు. రాముడు సనాతన ధర్మవాది.

"గురుశ్చ రాజా చ పితా చ వృద్ధః
క్రోధాత్ప్రహర్షాద్యదివాపి కామాత్
యద్వ్యాదిశేత్కార్యమవేక్ష్య ధర్మం
కస్తం న కుర్యాదనృశంస వృత్తిః

దశరథునకున్న హక్కులను ముందు చెప్పినాడు. అతడు గురువు, రాజు, తండ్రి, వృద్ధుడు. అట్టి దశరథుడు క్రోధముచేత పలికినను, కామముచేత పలికినను సంతోషమున ఆజ్ఞాపించినను ఆయన వాక్యమును కాదను హక్కు ఎవ్వరికిని లేదనినాడు. అట్లు ధిక్కరించుట అధర్మమని లక్ష్మణుని వాక్యమునకు కూడ సమాధానము నందించి, ఈ ఘట్టము దైవికమని తేల్చినాడు. లక్ష్మణునివాదము తన యందుగల భక్తికి మాత్రమే స్థానముగలదైనదని తేల్చినాడు. తరువాతేమి జరిగినది ?

కౌసల్యయే తన హృదయమును మార్చుకొన్నది. ఆమె రామమాత. ధర్మాధర్మముల నెఱిగినసాధ్వి. రాముని ధర్మదీక్షకే స్థానము నిచ్చినది. ఆతడు పయనింపబోవు వనవాసమునకు రక్షణ కల్పించుచు మంత్రౌషధములచేత ఆ జగద్రక్షకుని బాహుదండమున రక్షాబంధనమును బంధించినది. జీవులకు మంగళముల నందించు దేవతలందరును తన పుత్రునకు మంగళముల నొసంగుగాక యని మంగళాశాసనముల గావించి పుత్రునకు వనవాసమున కేగుమని అనుజ్ఞనిచ్చినది పుత్రవియోగ దుఃఖమును దిగమ్రింగి.

# భారతీయతలో అర్ధాంగి పాత్ర

సీతారాముల జీవిత లక్ష్యమే భారతీయత. భారతీయతే సీతారాముల జీవిత చరిత్రము.

భారతీయుల గృహస్థాశ్రమము గృహరాజ్యమును పాలించుటకై అధిష్ఠించ దగు ఒక రాజపీఠము. అందు సగ భాగము హక్కు కలిగి యుండు భాగస్వామిని భార్యామణి. కావుననే ఆమెకు సంస్కృత వాఙ్మయమున అర్ధాంగియని పేరు. భారతీయ గృహస్థు అర్ధనారీశ్వరుడు. ఒకే ఒక తేజము రెండగుట అర్ధనారీశ్వర త్వము. శివుడొక్కడే అర్ధనారీశ్వరుడుకాడు. ప్రతి భారతీయుడును బ్రహ్మచర్య వ్రతదీక్షను వదలి గృహస్థాశ్రమ వ్రతదీక్షకు బద్ధకంకణుడగుట అర్ధనారీశ్వరుడ గుట. గృహస్థాశ్రమమును వదలి సన్యాసాశ్రమ ప్రవేశము గావించుట ఈశ్వరుడ గుట. ఆయాశ్రమమును కూడ వదలి ఏవ్రత దీక్షానామముగూడ లేక దిగంబరుడై చరించుట మృత్యుంజయుడగుట.

ప్రతి ఆశ్రమమును కొన్ని నియమ నిబంధనలలో కూడియే యుండుటను నిర్ణయించినవి భారతీయ శాస్త్రములు. ప్రతి వ్యక్తికి హక్కు భుక్తములు శాసనా ధీనములు. భారతీయ శాసనములు వేదశాస్త్రములు. వేదశాసన మిట్లున్నది. "అర్ధోవా ఏష ఆత్మన యత్పత్నీ" పత్నియన ఆత్మలోని సగభాగమట. కథకు వత్తము. నేచెప్పిన సిద్ధాంతమును సీత వ్యాఖ్యానించును.

ఇంతకు ముందు రాఘవేశ్వరుడు యువరాజగుటకు రాజచిహ్నము ధరించి ఆ చిహ్నములతోడనే పితృపాదుల ఆహ్వానముపైన సుమంత్రునితో కైకేయీ అంతఃపురమున కేగినాడు. అక్కడ రాజపీఠము తారుమారైనది, దండకారణ్యములే కొంత కాలము తన నివాస గృహము కావలసివచ్చినది. ఆ వార్తను తల్లికి తెలిపి, భార్యకు తెలిపి వెళ్లుమనన్న అనుమతిని కైకేయి వద్ద తీసుకొని సరాసరిగ మాతృ గృహమున కేగినాడు. తల్లిని ఓదార్చి, ఆమె ఆశీస్సుల గ్రహించి, ఆమెబంధించిన రక్షాబంధనమును బాహుదండమున ధరించినాడు. అక్కడ నుండి తన ఇల్లాలికి తెలుప తన అంతఃపురమునకు బయలుదేరినాడు. అప్పుడు రాముని ధీరత్వము నందెందుకో మార్పుకలిగినది. అప్పుడాతని నెందుకో లజ్జయావరించినది. అతని ముఖమండలమును కొంచెము క్రిందకువచ్చినది. కారణమెవ్వరెరుగుదురు? కవివరులు మాత్రము "హ్రియాకించిదవాఙ్ముఖః" సిగ్గుచే కొంచెము అవాఙ్ముఖుడయ్యెననినారు.

తల్లి కట్టిన రక్షాబంధన మొక ప్రత్యేక చిహ్నము కాగా పాదచారి యయ్యె రాముడు ఇల్లాలి దగ్గర కేగినాడు. శ్వేతచ్ఛత్ర మాతని శరీరమునకు అలంకారమై లేదు. అతని కిరు ప్రక్కలనుండదగు వింజామరలులేవు. వందిమాగదుల స్తోత్రములతో అతడు రాలేదు. బారులు తీర్చి యుండదగు పరిషజ్జనులుగాని మంత్రి మండలిగాని, అతనివెంట లేరు. పట్టాభిషిక్తుని వెంటనలటి స్వస్తి వాచనములతోడ రాదగు బ్రాహ్మణ ప్రవరులును రాముని వెంటలేరు. అట్లురాజచిహ్నములు తొలగిన తన నాథుని సీత చూచినది.

సీత దృష్టులతి విశాలములు. రాముని దృశ్యమామెకర్థమైనది. ప్రస్తుత రాజ్యలక్ష్మి రామునకు దూరమయ్యెనని ఆమె గ్రహించినది. ఆక్షణముననే ఆమె అంతరాత్మయు నీవిప్పుడు రాణివి కావని సీతకు తెలిపినది. సీతమనసు కలత బారినది. కలత బారిన ముఖమండలము తోడనే రాముని ముందు నిలచినది. ఎందు కట్లయ్యెనో సీత కేమితెలుసును? తెలియదు పాపము!

తన జీవితము సీత కర్థమైనదని రాముడు గ్రహించకపోలేదు. గ్రహించి నాడు. రాముడు గంభీర హృదయుడు. అతని హృదయమొక సముద్రము. కావచ్చును. అతడు ప్రస్తుతమున తన ముఖవర్ణమును కోల్పోవక తప్పలేదు. సీతకు తన వృత్తాంతమును చెప్పక తప్పదు. రామునకిదియొక ప్రత్యేకమగు సంఘటనము. సీతను అయోధ్యయందే వదిలి తాను అరణ్యమున కేగుటయా? సీతనుకూడ తోడ్కొని పోవుటయా? అను ప్రశ్నయొకటున్నది.

కైకేయి కోరిన వరములందు సీత విషయము లేదు. దశరధుని శాసనము రామునకు మాత్రమే సంబంధించియున్నది. ఇదియొక విషమ సమస్య. రామునకిది యొక పెద్దసమస్యకాదు. అయ్యును సీతను ఒప్పించుట సమస్య కాకపోదు. ఆమె విదేహ రాజ తనయ. ధర్మకర్మల నెరిగిన ప్రౌఢ.

రాముడు తన వృత్తాంతమును సీతకు తెలిపినాడు. తన వనవాసపయనము ఒంటరిగనే నెరవేర్చుకొనుట సీత కెరిగించినాడు. సీతకు నీతి ధర్మముల బోధించి వనవాస పయనమునకు ముందడుగు వేయుటకు ప్రయత్నించినాడు. అతడు సీతకు చేసిన నీతి ధర్మముల ప్రబోధమిది.

సీతా! నీవు అయోధ్యయందే యుండి అత్తమామలకు సేవచేయుము, దేవతా

రాధనము గావించుచు, భరతుని ద్వేషింపక, నాయతక్కువతను ప్రశంసింపక పదునాలుగు సంవత్సరములు జీవితమును ఒంటరిగ గడుపుమనినాడు.

అప్పుడు సీత స్థితి ఏమి? ఆమె ముందుగనే నాపయనమని రామునకు సమాధానమిచ్చినది. రాముడు ఒప్పుకొనలేదు. వనములందుండు దోషముల తెలిపి ఆ దండకారణ్యముల చరింపదగవని సీత సౌకుమార్యమును కారణముగ తాను ఒంటరిగ వెళ్ళు అభిప్రాయమును సిద్ధాంతీకరించినాడు.

సీత రామునకు తీసిపోలేదు. నా సౌకుమార్యము మీసేవకేనని సమాధాన మిచ్చినది. భర్తతోటి అరణ్యవాసము భార్యకు భరింపరాని కష్టము కాదని భారత నారీ మండలమున కధ్యక్షురాలై పలికినది.

కఠిన శిలలని తలవక ముండ్లను లెక్కపెట్టక పాదయాత్రను సాగించునది నాపయనమని తెలిపిననాధునకు శ్రమతో అకఠిన కాంతారముల చేయదగు పాదయాత్ర నాకు పట్టుపరుపులపై నడకవలె కాగలదని రాముని హేతువును మృదుమధుర తర్కముతో ధర్మబద్ధముగ ఖండించి తన రాకను సిద్ధాంతీకరించుకొన్నది.

రాముడు ఒప్పలేదు. సీత అంతటతో ఆగలేదు.

మీరా కఠిన కాంతారముల నడచునప్పుడు మార్గమధ్యమున ప్రతిబంధకములై యుండు శిలల తొలగించి, ముండ్లను ఏరి మీరు నడువదగిన బాటను తీర్చిదిద్దుటే నారాకకు ప్రయోజనమని గౌరవప్రపత్తులను దాటించి రాముని వ్యతిరేక సిద్ధాంతము నడ్డగించినది. వారి సంభాషణ అట్లు కొంతసేపు నడచినది.

సీత కన్నులెఱ్ఱబడినవి మనస్సును తొందరపడినది. ఆమెవాక్కునందలి మాధుర్యము వెనుకకు మరలినది. కోపలక్షణము లన్నియు ఆమెను వరించినవి. కాని ఆ సాధ్వి కోపము భర్తపైగల అనురాగముతో కలసి నాధునకొక మధుర రసానుభూతిని కల్పింపదగు వాగ్రూపమును ధరించినది. అది ప్రణయస్నేహముల రంగరించుకొన్న కోపము. భర్తపై గౌరవము తరిగిన కోపముకాదు. తన ప్రాథమిక హక్కును కోల్పోవుటకు ఇష్టపడని కోపము. అందొక వీరత్వము కూడ యున్నది. రసమయమగు ఆమహానాయిక క్రోధరసమును వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"ఏవముక్తా తు వైదేహీ ప్రియార్హా ప్రియవాదినీ
ప్రణయాదేవ సంక్రుద్ధా భర్తారమిదమబ్రవీత్.

వాల్మీకి మహర్షి ఈశ్లోక రెండవపాదమున, "భర్తారమిద్మమ బ్రవీత్" అని, భారత నారీమణులకు భర్తపై వచ్చు కోప వేగము ధర్మసీమను దాటదని తెలిపినారు. సీతా రాముల సంభాషణమ్లేనడచినది. వారి సంభాషణలోని ఒక భాగమిది.

రాము: నీవేల బాధపడెదవు ? సీతా! రాజాన్నముల తిని అత్తమామలకు సేవచేయు భాగ్యమును సంపాదింపుము.

సీత : స్త్రీలకు పతి శుశ్రూషయే ముఖ్యఫలము.

రాము : వృద్ధసేవయు అట్టిదే.

సీత : స్త్రీకి భర్తకంటె అన్యమగు దైవములేదు.

రాము : దశరథుని ఆజ్ఞనాకు మితమైయున్నది.

సీత ; అదియే నాకును ఆదేశము.

రాము : అదెట్లు ?

సీత : భార్య ఒక్కతే పరలోకములను కల్పించు భర్తృ భాగ్యమునసుభవింప అర్హురాలు. మిగిలిన వారికి ఆయర్హతలేదు. భార్య అర్ధాంగి. కావున నా పయనము తప్పదు. నాకు నా తండ్రి గృహమునందే ఎందరో బ్రాహ్మణులును ఒక ధర్మ భిక్షుకియు, నీ కరణ్యవానమున్నదని చెప్పినారు. అందుకై ఉత్సాహమున నేనెదురు చూడగా ఆ బ్రాహ్మణోత్తముల వాక్యములను సత్యములు గావించు సమయమిదియే గావున మీతోటి నా పయనము తప్పదు. పురాకృత కర్మఫల మెవ్వరికి తప్పించ శక్యము.

రాముడు మారలేదు. సీత సమాధానములు ఫలింప లేదు. రాముడు తన్ను వదిలి వెళ్ళునని యే సీత నిర్ణయించుకొన్నది. ఈ ఘట్టమున రాముని తీపి మాటలామెకు తీయదనము నివ్వలేదు. సీతాకాంతకు కన్నులనిండ నీరుగ్రమ్మ తిరిగినది. అది ఆపరాని దుఃఖము. కన్నుల నిండిన నీరు ధారలై కురిసినవి. ఆమె ఉత్తుంగ నిశాల వక్షమును తడిసినవి రాముని మనస్సు కరుగలేదు. కాని రాముని చూపులు సీత ముఖమండలము పైననే నిలచిన నిరసనమయములై.

సీతాకాంతకు కోపమాగలేదు. రామునిపైగల ప్రణయ స్నేహములు సీతకు ముందు నిలచి రామునిపైకి దుముకగా సీత బాహువల్లులు రాముని విశాలవక్షమును చుట్టినవి. ప్రియురాలి ఆ బిగుకౌగిలిలో రాముడు బంధింప బడినాడు. సీతకిప్పుడు పట్టరాని కోపము, రామునియందలి ప్రణయ స్నేహములును అట్టివే.

కాని, పట్టరాని కోపముతోడనే ఒడలు వణకగా రాముని కౌగిలించినది. పరిపూర్ణ ప్రేమభావమున లీనమైయున్న ప్రణయక్రోధము పలికించు పలుకుల రసహృదయు లకు మనోహరములును హృద్యములు కాకపోవు. అవి మహాకవులకు వర్ణనీయ ములు కూడ. సీత రాముని ఇల్లు మందలించినదట.

"కిం త్వామన్యత వైదేహః పితా మే మిధిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం."

నాథా! విదేహ వంశమున జన్మించి మిధిలాధిపతియైయున్న నా తండ్రి మిమ్ములనేమని భావించెను? పురుష వేషధారియైయున్న స్త్రీయని భావించెనా? అని ఘాటుగనే పలికినది. ప్రణయ స్వాతంత్ర్యమున భయమునకు చోటుండునా? భయమును తీప్పునదే ప్రణయము.

సీత పలుకు నందింతటి ఘాటుతనమును రాముడెప్పుడును ఇంతవరకందుకొని యుండడు. ఇప్పుడందినది. లోలోన అతడేమనుకొను చుండెనో మనకు తెలి యదు. ఆతడందించు సమాధానమున బయటపడును. సీత పలికిన పలుకులలోని ఘాటుతనమును పరికింతము. వాల్మీకి మహర్షి ఈ ఘట్టమున "పరిచిక్షేపరాఘవం" అనినారు. పరిక్షేపయన నిందించెనని అర్థము.

నా తండ్రి పురుష వేషమునందున్న స్త్రీవని భావించెనా? అన్న ప్రశ్నార్థ కముతో ముగించినది సీతాకాంత. ఆ ప్రశ్నార్థకము తలచెను అను సమాధానముతో కలవనిది కాదు.

నిజమునకు నా తండ్రి మీ మగతనమును విల్లునెక్కుపెట్టుట వరకే చూచి, ఒడలుమరచి, నన్నిచ్చెనుగాని భార్యనిట్లు వదలి వెళ్ళుదురని పెండ్లినాడు భావించి యుండకపోవచ్చును. కాకున్న నాథా! మీరు మగవారగుచో యౌవనవతియగు ఇల్లాలిని పరుల రాజ్యమున వదలి వెళ్లుదురా? అను భావమును స్పష్టపరచినది. అతడు మిధిలాధిపతియే అయ్యును విదేహ వంశీయుడగుటచే వర్ణించరచెను సమా ధానమును తన తండ్రికి వాడిన విదేహుడను విశేషణము నందిమిడ్చినది చక్రవర్తి యగు జనకుడు అంత భ్రాంతుడయ్యెనా? అనుచో రాక్షసాది వీరులకుకూడ అలవి కాని శివధనస్సును మానవ మాత్రుడవై చూపట్టుచు వెక్కుపెట్టుట నా తండ్రికి ఆశ్చర్యమును కల్పించగా భ్రాంతుడయ్యెనని వాఖ్యానించినది. అంతతో ఆమెకు

రామునిపై ఆగ్రహము చల్లారలేదు. మరొక్క రీతిలో రాముని వ్యంగ్యముగ తనను విడిచి వెళ్లుట తప్పని తెల్పినది.

ఆ చెప్పునపుడొక చక్కని ఉపమానమును వాడి మందలించినది.

"అనృతం బత లోకోయమజ్ఞానాద్యద్ధి వక్ష్యతి
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే"

నాథా! లోకము సత్యమును గుర్తెరుగనిది. సత్యమును గుర్తెరుగని లోకము ఏమైన మాట్లాడగలదు. లోకమునంతను తపింపచేయు సూర్యుని తేజో విశేషమును తెలుసుకొనక ఎట్లు నిందింతురో అట్లే నిన్నును రాముడు తేజోవంతుడుకాదని నన్నిక్కడ దిగవిడుచుటను ఆధారముగాగొని నిందింతురన్నది.

మొదటి మాటకంటె ఈ రెండవదాని యందొక విధముగ స్పష్టతను చూపినది. దీని తరువాత మరింత స్పష్టముగ చెప్పినది. తననిక్కడ దిగవిడచి వెళ్లుట సర్వధా దోషమని.

"స్వయం తు భార్యాం కౌమారీం చిరమధ్యుషితాం సతీం
శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతు మిచ్ఛసి."

రామా! అగ్నిసాక్షిగ భర్తృత్వము నంగీకరించి, కౌమార వయస్సు నందుండి, ఎంత కాలమునుండియో నిన్ను సేవించుచు సతీత్వము కలిగియున్న నన్ను శైలూషునివలె (భార్యవలన జీవించు వానివలె.) పరులకు వప్పచెప్పి వెళ్లుదురా? అన్నది. తన ప్రత్యేకతను గురించి మాట్లాడిన రాముని ఒక విధముగ మేలుకొలిపి ఆతడాచరించు విధానమును పరిపూర్ణముగ నిషేధించినది ఆ ఎర్ర బారిన ముఖమండలము తోడనే.

కేవలముగ ఆతడాచరింపదగు కార్యమును నొక్కివక్కాణించుట మాత్రమే కాదు. దాని పర్యవసానమగు ఫల పరిణామముకూడ ఎట్లుండునో వివరించినది.

అథ మామేవమవ్యగ్రాం వనం నైవ న యిష్యసి
విషమద్యైవ పాస్యామి మావశం ద్విషతాం వశం.

రామా! నీయందింత గాఢానురాగముగలిగి ధర్మపత్నినైయున్న నన్ను నీతోటి గొంపోవని యెడల ఈ నా జీవితము నీ భూమిపైన నిలవను విషపానమున పరిణమింతును. ఆ మరణమెప్పుడో కాదు అద్యైవ ఇప్పుడే అన్నది.

ఇక మనము రాముని వంకకు తిరుగుదము. ఆ రాముని దర్శింతము ఒక్క క్షణకాలము. దర్శించుటకాదు. దీర్ఘకాలముగ ఈ సీతారాముల సన్నివేశమును మననము గావించుట చాల అవసరము. రామాయణ కావ్యములోని సన్నివేశములు ఆధ్యాత్మికజీవులు బాటసారులై పయనించుట కేర్పరుపబడిన విశ్రాంతి భవనములు. ఈ సన్నివేశము నందు రాముని చూతము

ప్రేమమూర్తియై ధర్మదేవతయై, భర్తృవియోగ దుఃఖమును భరింపలేక పరితపించుచు, స్వచ్ఛాంతి స్వచ్ఛములై స్ఫటికమణులవలె వెడలివచ్చు కన్నీటి ధారలు కలువరేకుల నుండి జాలువారునట్లు జాలువారుచుండగా శరణార్థినియై ప్రాణాధారణ మిక భూమికపై లేదనునది నిశ్చయించుకొన్న సీతాకాంత బాహు లతలతో బంధింపబడియున్న రాముడతడు. కేవల దశరథరాముడే కాడు. ఆత్మారాముడై దాంపత్య జీవితమున పరమపవిత్ర శృంగారము ననుభవించుటకు ఆదర్శమూర్తియగు రాముడుగూడ. కావుననే సీత తనను అధిక్షేపించిన అధిక్షేపణకు కన్నుల నెత్రజేసికొనలేదు. అంతేకాదు, ఎట్టి భక్తశేఖరుల నాత డెట్లాదరించునో మనకు తెలుపుటకు మన కావ్యమున కధానాయకుడైన రాముడతడు. కాకున్న సీత కోపముతో పలికిన కఠోరవాణి ఆతనికెట్లు మధురవాణి కాగలదు ? రాముడు రసికశిఖామణి. ధర్మపీఠుడు. ధీరుడు. సీతాకాంత నట్లు మాట్లాడింప కుతూహలుడయ్యె ఆతడట్లు పలికించినాడు. అందును సమయమును గుర్తెరిగి మాట్లాడించినాడు. శీలవతులగు ఇల్లాండ్రకు సీతచే ధర్మప్రబోధమును చేయించదగు సమయ మిదియే యని భావించి మాట్లాడించినాడు.

లోకతంత్రము నెరుగదగు పురుషులకు సమయము వచ్చినప్పుడు ఇల్లాండ్ర చిత్తవృత్తుల నెట్లు బహిర్గతములు గావింపవలయునో తెలుపుటకు గూడ సీతచే ఇట్లు మాట్లాడించి యుండవచ్చును.

తనకుతానై సీతను అరణ్యమునకు ప్రయాణముగు మన్నచో ఆమె హృదయమెట్లుండెనో తెలియుటెట్లు ? అంతియే కాదు.

ప్రణయప్రేమ స్నేహ సంబంధములు ముప్పిరిగొనగా ఎఱ్ఱబారిన ఇల్లాలి ముఖశోభను చూచి ఆనందించుటే గార్హస్థ్య జీవితమున కొక పరమావధి యని కూడ భావించి యుండవచ్చును. రసికశిఖామణియగు శ్రీకృష్ణుడొకప్పుడీ పమాధానము నిచ్చినాడు కూడ. ఇది పోతన వాణి.

ఉ॥ కింకలు ముద్దుమబ్బులును కెంపు కనుంగవ తియ్యమోవియున్
జంకెలు తేరిచూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలుం
గొంకక పీదనాడుటలు గూరిమియుంగల కాంత గూడుటల్
లంకె వివేక జన్మఫలమబ్బుటగాదె కురంగలోచనా.

రుక్మిణీదేవిని ఏకాంతవాసమున శిశుపాలాదులవదలి మమ్మేల పెండ్లియాడితి వని పలికి ఇప్పుడైనను "దగిన మనుజేంద్రు నొక్కని దగులుము" అని, రోష కషాయితనేత్రను గావించి సొమ్మసిల్లిన రుక్మిణీదేవికి చెప్పిన సమాధానము.

ఒకే విధముగ ధర్మశృంగారముల సమ్మేళన ఘట్టమీ సీతారాముల శృంగార ఘట్టము. నేడు ఈ రసిక ప్రపంచము రసికపదమునకు కర్థము వ్యభిచారమని వ్యవహరించిన వ్యవహరించ వచ్చును. విజ్ఞుల వ్యవహారమున రసికపదమున కర్థమదికాదు. రసమన పరబ్రహ్మ యని అర్థము. "సోవైరసః" అని చెప్పినది శ్రుతి. భారతీయశాస్త్రములు చెప్పిన రసికత్వము పార్వతీ పరమేశ్వరులవంటి నాయికానాయకులలోని రసికత్వము. "సీతారాముల దాంపత్యములోని రసికత్వము, భారతీయ స్త్రీపురుష సంబంధము లక్ష్మీనారాయణుల సంబంధము. కావున రాముడు రసికుడు శివుడు రసికుడు. నారాయణుడు రసికుడు. ఇట్టి రసికత్వము నాధారముగా గొనినదే అలంకారశాస్త్రము. ఒక్కొక్కశాస్త్రము ఒక్కొక్క కవికాలమున పుట్టినదను వాదము భారతీయతలోనిది కాదు. సమస్త శాస్త్రములును సనాతనములే యనునదే వైదిక సిద్ధాంతము. అలంకారములన్నియు వేద సాహిత్యము లోనివే. ప్రకృతమునకు వత్తము.

అప్పుడు రాఘవేశ్వరులు తన ఇల్లాలి ముఖమండలమును, జల మధ్యము నుండి వెలువడివచ్చి వాడు చూపిన పద్మినివలె నుండుటను చూచి సహించలేక తన కౌగలింతచే సీత నాదరించి, "సీతా! నీవులేని స్వర్గము కూడ నాకక్కరలేదు. నేను భయస్థుడనై నిన్ను అరణ్యములకు వద్దన లేదు. నీ భావమును గుర్తెరుగక అట్లంటిని. అని తన ఆదరవచనముల సీతకు సంతోషమును కల్పించి, తనకును సీతకునుగల సంబంధమును మనకు తెలిపినారు.

"యత్సృష్టాసి మయా సార్ధం వనవాసాయ మైథిలి
న విహాతుం మయా శక్త్యా కీర్తిరాత్మవతా యథా"

సీతా తనతోపాటుగనే వనవాసము చేయుటకు సృష్టింపబడినదట. ఆత్మవంతుడగు వానిని కీర్తి యనునది ఎట్లు వదలియుండదో అట్లు సీత తనతో విడివడి యుండదట. ఎంత చక్కని ఉపమానము ? గుణము గుణిని వదలియుండునా ? అట్టిదట సీతారాముల సంబంధము. తరువాతేమి జరిగినది ?

తానిప్పుడుచేయు ధర్మపరిపాలనకు ఫలము గోలోకప్రాప్తి యని చెప్పి, సీతా ! నీవిక సేవకులకును బ్రాహ్మణులకును స్వీయమగు ధనమును పంచిపెట్టుమని ఆజ్ఞాపించి, సీతను తనతో పయనమగుటను నిర్ణయించినాడు. సీత అట్లే దానధర్మముల కొనసాగించినది. అంతతో వారి సంభాషణ ముగిసినది.

సీత రాముని నీవు మగవాడవేనా ? నన్ను శైలూషునివలె పరులకు పప్పగింతురా ? అన్నమాట ప్రశ్నార్థకముగదా ? నీవట్టివాడవే అనునదియే సమాధానమా ? కాదు. చెప్పెదను.

సీతారాముని నాతండ్రి నిన్ను పురుషవేషమును ధరించిన స్త్రీయని తలచెనా? అన్న ప్రశ్నకు అంతరార్థమున్నది.

భక్తిశాస్త్రమున జీవుడు స్త్రీ స్వరూపముకాగా భగవంతుడొక్కడే పురుషుడనునది సిద్ధాంతము అప్పుడు జీవుడు నాయిక. భగవంతుడు నాయకుడు. నాయికానాయక సంబంధము జీవేశ్వర సంబంధము. జీవుడు నాయికాభావమున భగవంతునకు దగ్గర కాగలడు. ప్రేమభావమిందు ప్రాముఖ్యము. దీనికి మధురభక్తియని పేరు. ఈ భక్తి శృంగారరస ప్రధానము. భక్తు డనుభవింపదగు భక్తి శృంగారమునకు ఆధారము భగవంతుని అప్రాకృత మంగళ విగ్రహమును ఆయన గుణగణమును కూడ. సీతారాములు జీవేశ్వరులు. సీత జీవుడు. రాముడీశ్వరుడు. సీత మాట్లాడినది నిందాగర్భమగు భగవన్నుతి రామా! నీవొక్కడవే పురుషుడవని నా తండ్రి నన్ను నీచేతబెట్టినాడన్నది. నిన్నువరించితినన్నది. ఏకస్వరూపముగనిన్నారాధించుచుంటినన్నది. నీవువదలిన నేను బ్రతుకలేదన్నది. నీవొక్కడవే నాకుపోషకుడవై యుంటవలెనుగాని వేరొకడు పోషకుడై యుండుట ఎట్లు భరింతునన్నది. భక్తిశాస్త్రమున భగవంతుడొక్కడే నాకు భర్తగాని వేరొకరు పురుషులే కారు. అందరును స్త్రీలే. అను భావముండవలెను గావున హే భగవన్ ! నన్ను వేరొకరి పోషణమునందుంచుట కులకాంతను వస్తులకు పప్పజెప్పుటవంటిదని భక్తిశాస్త్ర

ధర్మమును ప్రతిపాదించినది. భగవంతున కత్యంత సాన్నిధ్యమును చేరుకొన్న భక్తశిఖామణుల భాష ఇట్లే యుండును.

భాగవతములోని గోపికా గీతములును భ్రమరగీతములు కూడ ఇట్టివే. శ్రీకృష్ణుని ఒక ఘాతుకునిగ వర్ణించినారు గోప్యాంగనలు. ఇదియే సీత రాముని వెంటనంటు ఘట్టములోని అంతరార్థము. తరువాతి విషయము.

మన రామాయణ కథలోని రాముని అరణ్యవాసపు పయనమున ఆ రాముని అనుసరించిన వారిద్దరుగదా? అందొక వ్యక్తి సీతాకాంత. రెండవ వ్యక్తి లక్ష్మణా ర్యుడు. సీత కార్యక్రమము ముగిసినది. తరువాతి వాడు లక్ష్మణుడు. ఆతడును సీతకు సరితూగు భక్తశిఖామణియే. ఆతనికిగూడ రామునివెంట వెళ్లుటకు రాముని అనుజ్ఞ కావలెను ఆతడు రాముని తన పయనమునకు ఆజ్ఞ యిమ్మని అడుగుట యందొక ప్రత్యేకత యున్నది. లక్ష్మణునిపాత్ర, మనకు బోధించు ప్రబోధమొక ప్రత్యేకతను కలిగియున్నదనుట యందేమాత్రమును సందేహము లేదు. సీతా రాముల ప్రయాణమును విన్న లక్ష్మణునకు శోకమాగలేదు. లక్ష్మణుడు తాను రామునివెంట బయలుదేరుటకు అతని అనుజ్ఞ నెట్లు కోరుకొనవలెను? సనును వత్తునను ప్రార్థన గావించు విధానమేమి? అను ప్రశ్నలు లక్ష్మణుని ముందు నిలిచినవి.

ఆతడొక నిశ్చయమునకు వచ్చినాడు. నోటితో వరమడుగుట చాలదని నిర్ణ యించుకొనినాడు. సీత అర్ధాంగియయ్యే కష్టాతికష్టమున అతని ఒప్పించగా నాకు సాధ్యమగునా? అని నిర్ణయించుకొని, సీతారాముల నిద్దర ప్రార్థించి మన కార్య మును గట్టెక్కించుకొనుట అవసరమనుకొనినాడు. వారిద్దర వేర్వేరుగ ప్రార్థించుట కాదని అతని అంతరాత్మ చక్కని ప్రబోధము నందించినది. ఎవరినెట్లు ప్రార్థించ వలెననునది ప్రశ్నయైనది. మాతాపితరులిద్దరును ఆరాధ్యదైవతములే. కావచ్చును. అందెవరి చిత్తము తొందరగ కరుగును? తల్లిమనసు వెన్నవంటిది. బిడ్డ విన్నప మును తండ్రికి నచ్చచెప్పి ఒప్పించగల శక్తిగలది కావున తనకును పితృమూర్తి కిని మధ్య ఆమె కావలెను. కావున సీతను ఆధారముగాగొని లక్ష్మణుడొక్క మాటుగా వచ్చి రాముని పాదములపై వ్రాలి గట్టిగ పట్టుకొనినాడు ఇక వదలదలచ లేదు. "గాఢం నిపేద్య" అనినాడు మహర్షి. అప్పుడే సీతనుకూడ ప్రార్థించినాడు నన్నును అనుగ్రహింపుమని.

"స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః
సీతామువాచాతియశాః రాఘవం చ మహావ్రతం
అహం త్వానుగమిష్యామి వనమగ్రే ధనుర్ధరః
న దేవలోకాక్రమణం నామరత్వమహం వృణే
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయావినా.

ఇప్పుడు లక్ష్మణుడు అనుసరించిన విధానమునకు శరణాగతియని పేరు. భగవంతుని పరిపూర్ణానుగ్రహమును కోరుకొను జీవుడు విషయానందముల నెంత వరకు వదలుకొన్న భగవత్పారతంత్ర్యమును భగవత్పాదారవింద మకరంద రసాస్వాదనమును చేయగలడో లక్ష్మణుని పాత్ర మనకు బోధించినది. లక్ష్మణుడేమని రామునితో విన్నవించుకొనెను? ఎట్లు విన్నవించుకొనెను? అను దానిని పరిశీలింతము.

ఇహలోకసుఖముల వదలుటగాక దేవలోకములలో కలుగు సుఖమును, దేవాదిలోకములను గూడ అక్రమించి దేవత్వము నొందదగు అధికారములనుగూడ ఆతడు వదలుకొనినాడు రామా! నిన్ను తప్ప నేను దేనినికూడ కోరుట లేదని విన్నవించుకొనినాడు. అనగానేమి? అయోధ్యను వదలినాను. తల్లిదండ్రుల వదలుకొనినాను. నీ పాదాశ్రయుడనే అయి నీవెంట వత్తుననినాడు. భగవద్భక్తులకును ఆత్మ జిజ్ఞాసువులకు కూడ ఇదియే ఉపదేశము. ఇక్కడ భాగవతసూక్తి ఒక్కటి స్మృతికి వచ్చినది.

ఒల్లనిర్జరేంద్ర పదమొల్లరు బ్రహ్మపదంబు నొందగా
నొల్లరు చక్రవర్తి పదమొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మరియొండు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల నొందిన ధన్యులెవ్వరున్.

రాముడొకవిధముగ అంగీకరించలేదు. అయ్యును లక్ష్మణుని ప్రార్థనలోని భక్తిప్రపత్తులు రాముని అంగీకరింపజేసినవి. సర్వకాల సర్వావస్థలయందును మీకు కింకరుడనై మిమ్ముల సేవించుకొని కృతార్థుడనౌదునని కోరుకొనినాడు. మీకును నావలన కలుగు లాభము లేకపోదని విన్నవించుకొనినాడు. కందమూలముల త్రవ్వుకొను గుద్దలి మీచేత నిడుకొని అరణ్యమునకేగుట నేను సహించలేననిచెప్పి ఖనిత్రపిటకముల ధరించి ధనుర్ధారినై మీకు ముందుగయుండి దారిచూపుచు

రాదగిన నేనుండగ మీరు ఒంటరిగ పయనించుట తగదనిచెప్పు లక్ష్మణుని. రాముడు కాదనుటెట్లు? భగవంతుని ప్రసన్నుని గావింపదగు బాధ్యత భక్తునిదే ననుటను లక్ష్మణుడు నిరూపించినాడు.

ఇక సీతారామలక్ష్మణులు ముగ్గురును దండకారణ్యములకు పయనము కావలెను. మన రామాయణ కథాభాగమున దేవతలకుకూడ సంబంధమున్నదనుమాటను మనము మరువకూడదు. వరుణదేవుడు రాక్షస సంహారమునకు పనికివచ్చు ధనుర్బాణములను, బాణముల నిల్వచేసుకొను తూణీరమును కూడ జనకుని యజ్ఞకాలమున ఆయనచేతి కందించినాడు. అవి రామలక్ష్మణులకు జనకచక్రవర్తిగారి మూలముగనే అందినవి. వారును వాటిని తమదగ్గర యుంచుకొనలేదు. అవి వశిష్ఠ మునీంద్రుల పూజాగృహమున పూజింపబడుచున్నవి. ఇప్పుడు వాటిని చేపట్ట వలెను. ఆధనుర్బాణము లమానుషములు. ఆ తూణీరము అక్షయ తూణీరము. ఎప్పటికప్పుడే బాణముల నింపుకొనవలసిన అవసరము ఆ తూణీరమునకుండదు. వేకువేలుగ ఆతూణీరము నుండి బాణము లుత్పన్నము లగుచునే యుండును. ధనుస్సులో! అతిరౌద్రములు. నేటికి అవసరములగు ఆధనుర్బాణ తూణీరములు నాడెప్పుడో రామలక్ష్మణుల కందినవి. అవి వశిష్ఠుని పూజామందిరమునందున్నవి. గ్రహింపుడు. దుష్టరాక్షస సంహారమున కెంత రహస్యరూపము నడచినదో! వశిష్ఠ మునీంద్రుల మందిరమునకేగి ఆ ధనుస్సులను తెచ్చుటకు లక్ష్మణుని పంపినాడు రాముడు. వచ్చునప్పుడు ఆయన కుటుంబమును ఆహ్వానము చేయుమని చెప్పినాడు. కేవలముగ వశిష్ఠుని బంధువులనేకాదు. ఎందరెందరినో బ్రాహ్మణులను, సేవక గణమును రప్పించినారు శ్రీరామచంద్రులు. ఎందుకు? వారందర పూజించుటకు. సీతాలక్ష్మణులచేత కూడ వారందరకును మణిసువర్ణ రత్నహారములను అర్పింప చేసినాడు. పేరుపేరు వరుసగ సత్కారముల చేయించినారు. కౌసల్య దగ్గరనుండు దాసదాసీజనములకు ప్రత్యేక సత్కారము లందినవి సీతారామలక్ష్మణులచే.

ఈ ఘట్టమున త్రిజటుడను బ్రాహ్మణోత్తముడొక వనవాసి, ఆకస్మికముగ వచ్చినాడు. నిజమునకా బ్రాహ్మణుడు యాచకుడు కాదు. యాచ్నాదైన్యమాతని వరించలేదు. యాచనావిధానము నాతడెరుగడు. ఆతడు కుటుంబి. దైన్యజీవితము నాతడు వెనుకకుత్రోసి, హింసారహితమగు వనజీవితమునే ఆతడు గ్రహించిన వ్యక్తి. ఇంత ఎంతకాలము మనమిట్లు జీవించుట? కందమూలముల త్రవ్వుకొను

శ్రవ్వక పాధనములను అవ్వల పారవైచి రాముని దర్శింతమని ఆ బ్రాహ్మణుని ఇల్లాలు ఆయనను ప్రేరేపించగా ఆతడు భార్యను బిడ్డను వెంటనిడుకొని అయోధ్య కేతెంచినాడు. రాముని దర్శనమబ్బినది. రాజద్వారములందా బ్రాహ్మణ కుటుంబము నడగించిన వారెవ్వరును లేరు, ఆతడు రాముని దర్శించి, రామా! "నిర్ధనో బహుపుత్రోస్మి ప్రత్యవేక్షస్వమాం" అనినాడు. నేను ధనహీనుడను. కాని సంతానము బహుళము అని నీ కటాక్షమును బరపుమనినాడు. యాచించుట తెలియని ఆ బ్రాహ్మణుని మాటలకు నవ్వువచ్చినది రామునకు. ఇంత ధనమిమ్మని అడుగలేదనియే రాముని ఆశ్చర్యము. రాముని హాస్యము అతి గంభీరము. ఈ వృద్ధబ్రాహ్మణుని ప్రాణశక్తి ఎంతకలదో చూతమని ఈమాట అనినాడు. బ్రాహ్మణోత్తమా! నీవు చేత కర్ర నిడుకొని ఆవులు మేసకుపేలుగనుంచు ఈ ప్రదేశము నుండెంత దూరము విసరుదువో అన్నివేల గోవులను తీసుకొందువనినాడు. ఆ బ్రాహ్మణుడు నడుమునకు పైనున్న శాటీని బిగించినాడు కర్రను చేతపట్టినాడు. గాలిని గట్టిగపీల్చి, చేతనున్న కర్రను గిరగిర త్రిప్పి విసిరినాడు. ఆ దండము సరయూనది ఒడ్డునందున్న ఒక వృషభరాజము వద్ద పడగా అంతదూరముగ విస్తరించియుండు ఆవులనన్నిటిని ఆ బ్రాహ్మణునకిచ్చి ఆశ్రమమునకు తోలించి వేరేమియు ద్రవ్యమడుగని ఆ బ్రాహ్మణుని నిర్లిప్తత కాతడు సంతసించి, చమత్కారమునకు మీచేత కర్రను విసిరించితిని గాని వేరుకాదని ఆ బ్రాహ్మణుని గౌరవించి వేరుగ ధనమునుగూడ ఇచ్చి పంపినాడు.

ఇక సీతారామలక్ష్మణులు దండకారణ్య భూములనేలుటకు పయనించవలెను. అప్పుడే సీతాకాంత వీరపత్నియై రాముని ఖడ్గతూణీరములకును అతని తీక్షణ కోదండమునకును పుష్పమాలలనలంకరించినది. రాముని దివ్యాయుధములు సీతాకాంతచే అలంకృతములై రాముని వరించగా రాముడును ధనుర్ధారియై ఖడ్గతూణీరముల ధరించినాడు. ఆకటిప్పుడు కోదండరాముడు మహారాక్షస విమర్దనుడు. లోకోద్ధరణ పారిజాతము. నిజమునకు రాక్షస సంహారమునకే సీతాకాంతరాముని అర్ధాంగియైనది ఇదితెరలోని విషయము.

రాముడిప్పుడు సీతాలక్ష్మణ సమేతుడై పితృపాదుల అంతఃపురమునకు పోవలెను. తన భార్యయు తమ్ముడును తనతో వనవాసమునకు బయులుదేరినని రాజాజ్ఞను తీసికొనవలెను.

రామావతార మాదర్శావతారము. కావున అతని జీవితము చట్టబద్ధము. రాముడిప్పుడు రాజపుత్రుడు. సీతాకాంత దశరథుని కోడలు. లక్ష్మణుడు రాముని సోదరుడు, భక్తపరుడు కూడ. రాముని బహిఃప్రాణము.

సీతారామలక్ష్మణులు తమ అంతర్గృహము నుండి బహిర్ద్వారమును దాటినారు అది రాజమార్గము. కిక్కిరిసియున్న జనమధ్యము. ఆ జన మధ్యము నుండియే రాముని పయనము. ఆతడు భార్యాసోదరసహితో పాదచారియై బయలుదేరినాడు. రామ లక్ష్మణులను చూడని ప్రజానీకము ఉండుట దుర్లభము. సీతనెవ్వరెరుగుదురు? ఆమె మహారాణి. అంతఃపురకాంత. ఆకాసమున విహరించు దేవతలకును ఇంతవరకామె కంటబడలేదు. లోకోద్ధరణకై అవతరించిన వారి జీవితములట్లె అంతఃపురముల దాగి సమాప్తములగుట సృష్టిఖండములోని విషయముకాదు. కావుననే ఆ మహా రాణి నేడు మార్గమధ్యమందలి సామాన్యజనుల కంటబడి వారిచూపులయందామె దుఃఖభాగినియైనది! ప్రజలు కన్నీటి బిందువులు కార్చక తప్పలేదు. కొంతసేపు మాత్రము చూపరుల కన్నులనుండి నీటిబిందువులు రాలక అట్లే నిలిచినవి. ఆ సమయము సీతాకాంత సామాన్య జనుల కంట బడకుండుటకై చతుర్ముఖుడు వారి నేత్రములకు అడ్డము వైచిన తెరగా వచ్చెను.

రాముడు కైకేయి అంతఃపురమునకేగునప్పుడు రాజమార్గమున తీర్చిదిద్ది యున్న హర్మ్యప్రాసాదము లాతని కంటబడక పోలేదు. పౌరులు కైకేయిని నిందించి, భరతుని సామ్రాజ్యమును వదలిపోవుదమనుకొనుటయు ఆతని చెవిని పడుచునేయున్నది. అయ్యును ఆతడుదాసీనుడయ్యే పయనించినాడు. సుమంత్రుడు మార్గమధ్యముననే కలియుట జరిగినది. ఇక రాముడు సీతాలక్ష్మణ సమేతుడై తండ్రిని దర్శించవలెను. ఆయన అనుజ్ఞకయ్యే సుమంత్రుడు లోనికేగినాడు. రాముని రాకను చెప్పినాడు. దశరథుడు పుత్రవియోగదుఃఖమున మునిగితేలుచున్న సమయమది. అయ్యును దశరథుడు సుమంత్రున కాజ్ఞాపించుట జరుగకపోలేదు. దశరథుడు తన భార్యలనందర నొక్కచో చేర్చి రాముని ప్రవేశ పెట్టునట్లాజ్ఞా పించినాడు.

దశరథునకు పట్టపు రాణులు ముప్వురేయైనను భార్యలై అంతఃపురమున వసించు వనితామణులు మూడు వందల ఏబదిమంది కలరు. వారందరును రామునకు తల్లులై రాముని ప్రేమింతురు. ప్రస్తుతమున వారందర నొక్కచో చేర్చి, వారందరి

మధ్యమున్న రాముని దర్శింపదలచినాడు వృద్ధభూపతి. అట్లే జరిగినది. కౌసల్యా సుమిత్రలతో కలసియే మూడువందల ఏబదిమంది భార్యలును కైకేయి అంతఃపురమును జూచినారు. సీతారామలక్ష్మణుల ప్రవేశమైనది ఇదియొక పవిత్రమగు సన్నివేశము దశరథాంతఃపురమంతయు ఒక్క క్షణకాలముననే అల్లకల్లోలమైనది. జీవుడు కోరుకొను కోరికలు తాను కోరినట్లుగనే ఫలవంతములై అతనిని సంతోషపెట్టునను నిర్ణయమీ సృష్టిఖండమున లేదు. ఒక్క క్షణకాలమున రాజాంతఃపురము సంతోషసాగరమధ్యమున నోలలాడనవచ్చును. అదియే శోకసాగరమై దుఃఖతరంగములలో ఉయ్యాలలూగవచ్చును.

శ్రోతలారా! మీరిప్పుడు దశరథాంతఃపురమును దర్శింపుడు. కైకేయి నొక్కదానిని అవ్వలనుంచగా సీతారామలక్ష్మణుల యునికికి అంతఃపురమంతయు గగ్గోలు పెట్టగా వారి రోదనధ్వనులు మిన్నుముట్టినవి. రామమాతలందరును రాముని వనవాసమును తలచి తలచి ఎలుగెత్తి ఏడ్వగా దశరథుడును హా! యని పెద్ద కంఠముననే ఏడ్చినాడు. ఈక్షణమునేమనవలెను? జీవుని సంతోషము నిత్యసత్య మనవలెనా? స్వర్గసీమయు ఇట్టిదే. బ్రహ్మలోకమును అంతియే. "ఆబ్రహ్మభువనాన్ లోకాన్ పునరావర్తినోర్జున" అన్నది గీత. కథకురండు.

ఇప్పుడు కలిగిన పుత్రదర్శనము దశరథునకు చివ్వరిదర్శనము. మాతృమండల మధ్యమునందాతడు దశరథునకు కంటబడినాడు. దోసిళ్ళు నొగ్గి వినమ్రులై నిలచిన పుత్రులజూచి తానిక లోకాంతరమునకు పయనము కాబోవుచుంటినని తలచిన ఏ తండ్రి బిడ్డల కౌగిలింప సత్యాతురుడై వేవేగ లేవనుంకింపడు? రాముని విడచి ఒక్క ముహూర్తకాలముకూడ జీవింపలేనని విశ్వామిత్రునకు మనవి చేసికొనిన దశరథుడీతడు. రాముడు తన దగ్గరకు వచ్చుటకు ముందుగనే రాముని తన చేతులజాపి కౌగలించుకొనవలెనని దశరథుడాతురుడై పక్కమీదనుండి తటాలున లేచినాడు. ఆమహాభాగ్యమాయనకు దక్కలేదు. మార్గమధ్యముననే మూర్ఛిల్లి క్రిందపడినాడు. రామలక్ష్మణులే పరుగుపరుగున వచ్చి తండ్రిని తను కౌగిలించి లేవనెత్తి ఆసనమున కూర్చుండబెట్టుట జరిగినది ఇకరాముడు తండ్రిగారి అనుజ్ఞను కోరవలెను. తనతో సీతాలక్ష్మణుల గొంపోవుటకు, తండ్రి దుఃఖమును చూడ చూడ రామునకును దుఃఖమాగుటలేదు. అయ్యును తండ్రీ! సీతాలక్ష్మణులు నా వెంట వచ్చుటకనుజ్ఞనిమ్మని దుఃఖాగాఢుడయ్యే గద్గదకంఠముననే కోరినాడు. ఇదియే రాముని పాత్రలోని ప్రత్యేకత.

తన వియోగమును భరింపలేక దుఃఖభాజనులైన తల్లిదండ్రులు కన్నీ
కాల్వల ప్రవహింపజేసినను అతని ధర్మహృదయమున మార్పురాలేదు. (
మూర్తుల హృదయములలో మార్దవమొక భాగమును ఆక్రమించియుండగా,
న్యమును ఆప్రక్కనే నిలచి, ధర్మాచరణమునకు మాత్రము కాఠిన్యము ...
దోహదము చేయుచుండును. కాకున్న అత్యంతమార్దవముగల బ్రాహ్మణుని హ
యమున యజ్ఞపశువును విశసనము గావించి దేవతలకు హవిర్భాగము నిచ్చు
తావెక్కడ కలదు? పశు విశసనము గావించి, మంత్రపూతమగు హవిస్సును
తల కందించుచు వేదవిధిని అనుసరించునప్పుడు అతని హృదయమునందుండ
మార్దవమొక ప్రక్కకు జరుగగా కాఠిన్యము వేదవిధిని ఆచరింపజేయును.
మనకు "మాహింస్యాత్సర్వ భూతాని, అగ్నీషోమీయం పశుమాలభేత" అను
రెండునూ వేదవిధులేయగుటచే ఆవిధుల నిర్వహణ నిర్వహింపచేయునది గ
వేదవిధియే కావలెనుగాని మన అంతరాత్మకాగూడదు. రాముడిక్కడ పితృమూ
సత్యవ్రతుని గావించుటకే తావునిచ్చి, వారి సామాన్య దుఃఖమును తీర్చు
తావునివ్వలేదు, ఇవియే మనము రామునిలో గ్రహింపదగు విషయము. కథకురం
కథ వరుసగ జరుగుట లేదనుకొనకుడు. నా ఉపన్యాసములకు లక్ష్యము కేవలం
కథాకథనము కాదు. వేదవేద్యుడగు రామునకును వేదవిధులకునుగల సంబంధమ
తెలుపుట నా లక్ష్యము.

అందుకు దశరధుడేమనెను? వెళ్ళుమనెనా? కన్నకుమారుని సద్గుణాభిరా
రాజ్యార్హుని వనసీమలకు పొమ్మని ఏతండ్రి తన నోట చెప్పగలడు? ఒక్కమా
చెప్పినాడు.

అహం రాఘవ కైకేయ్యా వరదానేన మోహితః
అయోధ్యాయాస్త్వమేవాద్య భవ రాజా నిగృహ్యామాం

రామా! కైకేయీ వరదాన మోహితుడనగు నన్ను నిగ్రహించి అయోధ్య
మనినాడు. రాముడు మారునా? తండ్రీ! నీ సత్యవ్రతదీక్షను సఫలము చేయ
నాకు సామ్రాజ్య లక్ష్మీ పాణిగ్రహణమనినాడు. నీయాజ్ఞాపాలనమే స్వర్గపీఠమ
తన మధుర వాక్కులచే దశరధుని లాలించినాడు. దశరధునకామాటలు చెవినిబడ
అతడు మరల మూర్ఛిల్లినాడు. కైకేయివంటి కాంతకు భర్తయగుటకంటే పురుష
వేరుదుఃఖములేదు.

"లోకే తు నిర్ధనో దుఃఖీ ఋణగ్రస్త స్తతోధికః
తాభ్యాం రోగయుతో దుఃఖీ తేభ్యో దుఃఖీ కుభార్యకః "భార"

లోకమున దుఃఖమిచ్చునది దరిద్రము అంతకంటే ఋణము. దానికంటే వ్యాధి. ఈమూడింటి కంటెను గూడ మిక్కిలి దుఃఖమిచ్చునది దుష్టురాలగు భార్యకు భర్తయగుట. ఇప్పుడు మూర్ఛనొందినది దశరథుడే కాదు. కైకేయి తప్ప మిగిలిన వారందరును ఉచ్చైస్స్వరమున ఏడ్వగా సుమంత్రుడు కూడా మూర్ఛిల్లినాడు. కానీ అతడెట్టకేలకు లేచినాడు ఆతనికి కోపమాగలేదు కన్నులనెర్ర జేసుకొని పండ్లు పటపట గొరుకుచు కైకేయి వైపుకు తిరిగినాడు. సుమంత్రుడు అంతఃపుర కాంతలను గూడా తీర్చిదిద్దగల వాక్స్వాతంత్ర్యము గల మంత్రి కావున కైకేయిని వేధించదగు వాగ్బాణములతో కొట్టినాడు. భర్తృఘాతుకీ! కులపాంసనీ! నీచేత సంపాదింపబడిన ఈ పాపిష్ఠి రాజ్యమున మేమెవ్వరమును నివసింపమనినాడు. బ్రాహ్మణు లెవ్వరిం దుండరని గట్టిగ చెప్పినాడు ఎలుకలచే త్రవ్వబడిన మట్టిరాసులే నీదృకృథము నందుండదగిన వనినాడు. కాక నీజన్మ అట్టిదనుటకు నింబవృక్షమునుండి తేనె (సోనలు గురియునా? నింబమన వేప) అని ప్రశ్నించి నీవుపుట్టిన కడుపు అట్టిదని కైక తల్లి చరిత్రను జ్ఞాపకము చేసినాడు ఆమెదొక చరిత్ర, కేకయరాజునకు చీమలభాష తెలియును. అది ఒక మహాత్ముని ప్రసాదము. ఆతడొకనాడు భార్యతో కలసి యుండగా రెండు చీమలు మాట్లాడుకొనుట జరిగినది. ఆయనకు వాటి సంభాషణ నవ్వును తెప్పించగా నవ్వినాడు. భార్య ఆతని హాసమును తన అవమానముగ భావించి కారణమడిగినది. ఆతడు చీమల భాషను బయట పెట్టుచో తనకుమరణము కలుగుటను ఆమెకుచెప్పగా నీవుచచ్చినను సరియేచెప్పుమన్నది. కేకయమహారాజు తనకు ప్రసాదించిన మహాత్మునితో సంప్రదించగా ఆతడు చెప్పుటకు అనుజ్ఞనీయ లేదు. అంతతో భార్యకా విషయమును చెప్పక సుఖపడెను ఆ చరిత్రను కైకకు చెప్పి, నీ తల్లిబుద్ధియేనీకు వచ్చినదనినాడు. కైకేయి మారలేదు. అంతలో దశరథుడు మూర్ఛనుండిలేచి సుమంత్రునిచూచి, సుమంత్రా! రామునకు వలయు ధనము నిమ్మని ఆజ్ఞాపించినాడు కైకేయి సహించునా? దెబ్బతిన్న త్రాచువలె లేచినది. ధనహీనములగు శూన్యాగారముల నా పుత్రునకిత్తువా? అని గద్దరించి పలికినది.

సిద్ధార్థుడను మంత్రిముదుసలి. అతడును కైకకు బోధించినాడు. కైక తన పట్టును విడువలేదు. దశరథుడు మేమందరమును రాముని వెంట వెళ్ళుదు మనినాడు.

ఇట్లెన్నియో విధముల రాముని వనవాసమును మాన్పుటకు ప్రయత్నములు జరిగినని. ఆసమయమున రాముని సమాధానమిది.

తండ్రీ! నాకేల ద్రవ్యము? నేనరణ్యముల వసింప మీరు నాతోడ వచ్చుట నాకు సుఖమును గూర్చుటరాదు. నాకిప్పుడు కావలసినవి అరణ్యజీవనము చేయు వారికి కావలసిన సాధనములు. నారచీరెలు, గంప, గడ్డ పారలున్న చాలును. ఏనుగను వదలినవానికి, దానిని కట్టివైచు త్రాడునందు మోహముండునా? కావున నాకు వలసిన నారచీరెలనిచ్చి, నన్నరణ్యములకు వేవేగ పంపుమనినాడు.

కైకేయి సంతసించినది సీతారాములకు కావలసిన నారచీరెలనామె అదివరకే చేకూర్చినది. చివాలునలేచినది. రామునికి నారచీరెలను ఇచ్చుట కాలస్యము చేసిన ఏదియోకార్యభంగ మగునని తలచినదేమో! తానే తనహస్తములతో రామునకు నారచీరెలనిచ్చి, కట్టుకొమ్మనినది. ఆమాటను చెప్పుటకామెసిగ్గుపడలేదు. అట్టి వారిట్టి కార్యములకు సిగ్గుపడరు. రాముడా తల్లియిచ్చిన నారచీరెల చేత తీసికొనినాడు. పట్టుపుట్టములవిడిచి, ఆ నారచీరెల ధరించినాడు. లక్ష్మణుడును ధరించినాడు. సీతకుకూడ ఇచ్చినది. ఇక సీతాకాంత ధరించవలెను. ఆ నారచీరెల ధరించుట ఆమెకు చేతకాలేదు. ఒకచేత కంఠసీమకు చుట్టుకొన్నది. అంతియే నాధునివంకతిరిగినది. "కథంను చీరం బధ్నంతి?" ఈ నారచీరెలనెట్లు కట్టుకొనవలెనో? వనవాసులెట్లు ధరింతురో? అన్నది. రాఘవేశ్వరుడే తన పవిత్ర పాణితలముతో అర్ధాంగికి ఆమెధరించియున్న పట్టు పుట్టములమీదనే నారచీరెను కట్టినాడు. మీరొక్కమారీ దృశ్యమును తిలకింపుడు.

నిత్యనూతనములగు పట్టుచీరెల ధరించు నాకాంతా లలామకు రాముడే స్వహస్తములతో నారచీరెల ధరింపజేసిన దృశ్యమా అంతఃపురము నందున్న వారికెంత కలవరమును కల్పించునో యూహింపుడు.

వశిష్ఠమునీంద్రుడు బ్రహ్మమానస పుత్రుడు జ్ఞానసంపన్నుడు. అట్టిమహనీయుడే ఆదృశ్యమును చూడలేకపోయెను. మిగిలినవారి సంగతి చెప్పేదేమున్నది? ఆయన హృదయమొక విధముగ కదలబారినది. రామునివెంట సీత వెళ్ళవలసిన పనిలేదనినాడు. సీతరాముని అర్ధాంగి కావున రాముడధిష్ఠించు సింహాసనము నందామెను కూర్చుండ బెట్టెదననినాడు.

"ఆత్మా హి దారాస్సర్వేషాం దారసంగ్రహవర్తినాం
ఆత్మేయమితి రామస్య పాలయిష్యతి మేదినీం"

గృహస్థులకు భార్యవారి ఆత్మస్థానములంకరింపదగువ్యక్తి. సీతరాముని ఆత్మ. కావున ఆమెరాజ్యమేలగలదు అనినారు

శ్రోతలారా! భారతీయుల పవిత్రభావముల గమనించితిరా? స్త్రీల కొసంగిన ఉన్నతస్థానమును తిలకించితిరా? మాంసమయదేహ సౌందర్యమును మాత్రమే లక్షించుచు స్థూలదేహమునే యారాధించుచు, అంతఃకరణ పారిశుధ్యమావంతయైనను స్త్రీలపట్ల చూపని పాశ్చాత్యసోదరులు నేడుమనకు స్త్రీలకివ్వదగు స్వాతంత్ర్యమందును వారిని చూడదగు ఉన్నత దృక్పథములకును ఆదర్శచరిత్రకారులగుట దౌర్భాగ్యమనుటకంటె మరేమనవలెను? కథాభాగమునకు రండు.

దశరథభూమీశుడు సీతకు ఆభరణములను చీనిచీనాంబరములకూడ నొసగుట కాజ్ఞయివ్వగా అట్లేజరిగినది రాముడు తనతల్లియగు కౌసల్యను దశరథునకు వప్పచెప్పగా సిగ్గునొందిన దశరథుడు మూర్ఛనొందినాడు.

కొంతసేపటికి మూర్ఛతెలసినది. రాముడరణ్యములకు బోవతప్పదుగావున సుమంత్రునిపిలచి రథమునాయత్తముగావింపుమని దశరథుడాజ్ఞాపించినాడు. రథము సిద్ధమైనది.

సీతారామలక్ష్మణులు రథము నధిష్ఠింపవలెను.సీతాకాంతముఖమున విచారము మిసుమంతయునులేదు. ఆమెభర్తతోటి అరణ్యవాసము స్వర్గమను కొన్న ఇల్లాలుగదా? కౌసల్యకోడలును చూచినది. ఆమెకొక ప్రత్యేకమగు సంతసము కలిగినది. కోడలును దగ్గరకు తీసుకొన్నది. సీతాకాంతకు భర్తకుగల సంపద తొలగగా ఉండదగు ధర్మమెట్టిదో తననోటచెప్పి, రాముని యందాదరమును చూపుమని పలికినది. సీతాకాంతకాయుపదేశము వింతకాదు. నా పితృగృహమున నేను పొందిన శిక్షణను స్మృతికి తెచ్చితిరని గంభీరముగా అత్తగారికి సమాధానమిచ్చినది. తాను చరించదగు విధిని గూడ వర్ణించి కౌసల్యకు తృప్తిని గూర్చినది. కౌసల్యామహాసాధ్వి కన్నుల నుండి ఆనందబాష్పములున్ను దుఃఖాశ్రువులు కూడ జంటయయ్యేరాలినవి. రాముడు కౌసల్యమొదలగు మాతృమూర్తులందర నొక్కొమారుగ పలకరించి అనుజ్ఞను కోరినాడు. మీరందరు దుఃఖార్తులు కాకుండుడని ఓదార్చినాడు సీతాలక్ష్మణులచే ప్రత్యేక వందనముల సమర్పింపజేసినాడు మాతాపితరులకు, తాను ప్రత్యేకముగ కౌసల్య

దగ్గరకేగి,తల్లికౌగిటిలో బిడ్డమై ప్రత్యేకమగు వాత్సల్యరసమునను ఛవింపజేసినాడు. మనమిక వనములకు పోవు సీతారామలక్ష్మణుల దర్శించుటయే మిగిలినది. కాని ఈ ఘట్టమున సుమిత్ర లక్ష్మణునకు బోధించిన బోధామృత సూక్తిని మీకు వినిపింపవలసి యున్నది.

లక్ష్మణుడు తన నిజమాతయగు సుమిత్ర కడకేగినాడు. వందన మాచరించి అరణ్యమునకు పోవుచుంటిననినాడు.

రామాయణమున సుమిత్ర పాత్రకొక ప్రత్యేకత యున్నది. ఆమె విజ్ఞానఖని లక్ష్మణుని దగ్గరకులాగికొని శిరమును వాసనచూచి, లక్ష్మణానీవు వనవాసమునకే సృష్టించబడితివని అతని కర్తవ్యమును గురించి ప్రత్యేకముగ బోధించి, పురిగొల్పినదే గాని నీవును అరణ్యమునకు పోవుచుంటివా? అని కంటనీరు పెట్టుకొనలేదు. ఇదియే ఆమెలోని ప్రత్యేకత. ఆమెబోధ ఇది.

రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం
అయోధ్యామటావీం విద్ధి గచ్ఛ తాత యథా సుఖం

లక్ష్మణుడప్పుడు వదలివెళ్ళునవి మూడు స్థానములు. ఒకటి పితృస్థానము. రెండు మాతృస్థానము. మూడు స్వదేశము. పుట్టిన చోటులు రెండును పెరిగిన చోటు ఒకటియు. అందొకటి తాను. రెండవవాడు దశరథుడు. మూడవది అయోధ్య. ఈమూడును నిన్ను విడిచిలేవు అని బోధించినది లక్ష్మణునకు. నీ పితృ మూర్తికి బదులుగ నీ అన్న ఉండెనన్నది తల్లినైననాకు బదులుగ వదినె యున్నదన్నది. మరి అయోధ్యయో? అడవియే అయోధ్యఅన్నది. ఒకటి మరియొకటి ఎట్లు కాగలదు? దశరథుడు రాముడెట్లగును? సుమిత్రసీతయగునా? అరణ్యము నగరమగునా? తప్పక కాగలదన్నది భావనయే మానవునకు దుఃఖమును కల్పించును భావనయే సుఖము నిచ్చును. మాంసపు కన్నులకు కనబడునది భావించుట కాధారమన్నది. అనగానేమి? స్థూలమగు జగత్తుభావనకు ఆలంబనమని అర్థము. మాంసమయ శరీరము ప్రధానము కాదన్నది. సూక్ష్మమగు గుణమయ శరీరమునందలి కన్నును తెరువ వలెనన్నది. ఆకన్నును తెరువని వాని జీవితము వ్యర్థమన్నది బిడ్డా! నీవు సీమనో నేత్రమును తెరచియే ఇప్పుడు రామునితో పయనమగుచుంటివి. ఇక ఈ నేత్రమును మూయ్యవద్దన్నది. పెద్దన్న తండ్రియని భావించుటను ధర్మశాస్త్రము చెప్పినది. జ్యేష్ఠ సోదరుని భార్య తల్లియనియు ధర్మ

శాస్త్రమే నిర్వహింపబడినది. ఆ ధర్మశాస్త్రమును పుత్రుని మనస్సున దృఢపరచినది తరువాతది భక్తిశాస్త్రము. ధర్మనిర్వహణకు ఫలము భక్తి. తరువాత ఆభక్తికి స్థానము నిచ్చినది.

ఈ స్థూల శరీరమును తల్లిదండ్రులివ్వగా జ్ఞానమయ దేహము నిచ్చువాడు భగవంతుడు. ఆ భగవంతుని పుత్రునకు తెలిపినది.

సీతారాములు లక్ష్మీనారాయణులన్నది. కేవల ముగ నీ స్థూలదేహమునకు సంబంధించిన బంధువులు కారన్నది. ఆలక్ష్మీనారాయణు లింతవరకీ అయోధ్య యందుండిరి. వారున్నంతవరకీ అయోధ్య వైకుంఠమన్నది. ఇప్పుడువారు అరణ్య మునకు పోవుచుండిరి గాన అరణ్యమే అయోధ్య లేక వైకుంఠమన్నది. ప్రస్తుతమగు అయోధ్యానగరము అరణ్యమేనన్నది. అంతేకాదు. లక్ష్మణా! అయోధ్యయన నీవు చూచు ఈ నగరమేకాదు. నీదేహమే అయోధ్య అన్నది. నీ శరీరమధ్యమున వెలుగొందు హృదయపుండరీకమున నివసించు సీతారాములు నీకు బాటగుచో అదియొక అరణ్యమన్నది. నీ మనోమయ శరీరమున కామక్రోధాది క్రూరమృగములు చరించునన్నది. నీ మనఃఫలకమున సీతారాముల ముద్రించు కొన్నచో నీ దేహము వైకుంఠమగునన్నది. ఆశ్లోకాన్వయమిది.

రామం దశరథమితివిద్ధి. జానకీం మాం ఇతివిద్ధి. అరణ్యం అయోధ్యామితి విద్ధి. దశయన పక్షి. గరుడుడు. దానిని ఎక్కినవాడు విష్ణువు. మాయన లక్ష్మి. అయోధ్యయన వైకుంఠము. ఎట్లందురా?

అయోధ్యయన శత్రువుల కప్రవేశ్యమగు నగరరాజముగదా? ఇక్కడ శత్రువులన కామాది శత్రువులని అర్థము. అవి వంచింపని, (లేక) భేదింపని నగరరాజము సాక్షాన్నారాయణుడు వసించు నగరము. అదియే వైకుంఠము ప్రస్తుతమున రాముడు వసింప బోవు వనసీమలే వైకుంఠనగరము. లక్ష్మణా! రాముడు వెళ్లునట్టి మహారణ్యసీమయే నీకు వైకుంఠము కాగలదని సుమిత్ర తనబిడ్డకు బోధించినది. ఇదియొక బోధామృత భాండము. ధ్రువునకు నీతి ఇట్టి అమృతభాండమునే చేతికిచ్చి తపస్సునకై అయిదేండ్ల బాలుని అరణ్య మున కంపినది. భారత నారీమణులు బిడ్డలను కనుటయందు లక్ష్యమిదియే ఇట్టి బోధను అందించలేని తల్లియైనది కైక. భౌతిక రాజ్యమునే తన బిడ్డ కివ్వదలచినది. ప్రకృతము ననుసరింతము

లక్ష్మణుడు మాతృదేవత అందించిన ఆధ్యాత్మిక ప్రసాదమును శిరమువంచి, దోసిలియొగ్గి గురు ప్రసాదముగ అందుకొని రామునితో పయనమయ్యెను. అంతలో సుమంత్రుడు అత్యంత వేగ సంపన్నములగు గుర్రముల పూన్చి యాత్రారథమును ద్వారదేశమున నిలిపినాడు. ఇక సీతారామలక్ష్మణులు వనవాస ప్రారబ్ధయాత్రను సాగింపవలెను. ఆ యాత్రను సాగింప సీతయే ముందుగ రథము నధిరోహించినది. తరువాత రామ లక్ష్మణులెక్కినారు. వారి రథము వనసీమల కభిముఖమైనది. మరి అయోధ్యా నగరసామ్రాజ్యము దేనికభిముఖమైనది? తెలియరాని కట్టలేని దుఃఖసముద్రమున మునిగినది. అయోధ్యాపుర వాసులు మధురానుభూతులననుభవించు కాలము వెనుకకు మరలినది. ప్రస్తుతమున రాముని దర్శనభాగ్యమబ్బుకొనువారు అరణ్యవాసులేయని కాలము పాఠమును చెప్పగా నగరవాసులకు రాముని వియోగము భరింపరానిదైనది.

రాముడు దశరథుని పుత్రుడు మాత్రమేకాదు. కౌసల్యకు కొమరుడై మాత్రమేలేడు. రాజాంతఃపురమునగల దశరథుని భార్యలే అతని మాతృమూర్తులు కారు. రాముడందరివాడు. అందరిలోనివాడు. అతడు పరమప్రేమమూర్తి. అతడు అందరిఆత్మ.

నగరము నందలి ప్రజానీకము దుఃఖకాతరులై ఆబాలగోపాలము కూడ ఆయన వెళ్లు రథమును కదలనిచ్చుటలేదు కొందరు వెంటనంటినారు. మరికొందరాతని పయనమును తలచి ఒడలెరుగక పడియుండినారు. ఏ ఒక్కరి మనస్సును వారివారి స్వాధీనమున లేక రాముని స్వాధీనమైనవి. శోకరసనిమగ్నులైన ఆపౌరులందరిలో రాముడు నిలచినాడు. సీతారామలక్ష్మణులు ప్రతిబింబించని అంతరాత్మలు లేవు. కౌసల్య పుత్రునివెంట పరుగెత్త మొదలిడినది. దశరథుడు సుమంత్రుని పిలచి సుమంత్రా! రథమును తోలకుము తోలకుము అని కేకలు పెట్టుచు రథ పరాగము కనబడునంతవరకు అట్లే చూచుచుండెను. తల్లులకు పుత్రులపై ప్రేమలుడిగినవి. సోదరులను ప్రేమించుటలేదు. బిడ్డలను తల్లుల ప్రేమించుటలేదు. భార్యలకు భర్తలపై ప్రేమభావము అంతరించినవి. మొట్టమొదట కాన్పున పుత్రుడు పుట్టగా ఏ తల్లియు సంతసించుటలేదు ఆనాడు గృహస్థులెవ్వరును వంటలు చేయలేదు. అగ్నిహోత్రముల ప్రేల్చువారును ఆ అగ్నులనారాధించుటలేదు. అగ్నులను అంతర్ధానము నొందినవి. ఆవులు దూడలకు పాలనిచ్చుట మానినవి. సూర్యుడాకసమున మసగుబడినాడు. గ్రహమండలములలో గురుబుధులు క్రూరగ్రహములు

కాకున్నను నేడు అంగారకునితో కూడి క్రూర గ్రహములైనవి. అశ్విన్యాది నక్షత్రములు కాంతిమాసి తేజోహీనములై కన్పట్టినవి. విశాఖానక్షత్రము ధూమ కేతువుతో కలసినవి. (విశాఖ ఇక్ష్వాకువుల నక్షత్రము) ఇవన్నియు నిట్లుండ పసిబాలురు కూడ తల్లుల చూచి పాలకేడ్చుటలేదు. వేయేల? పంచభూతములును ఆ సుకుమార గాత్రుని అరణ్యమునకడు పాట్లను తలచి వాడుహూపెనని వాల్మీకి వర్ణించినాడు. శ్రోతలొక్కసారిపుడు రాముని పరిశీలింపుడు ఈదశరథ రాము డెవ్వడైయుండెను? ఆత్మారాముడయ్యేయుండెననుటకు మీరు సందేహింతురా? ఆత్మకంటె ప్రియమగు వస్తువులేదని ఉపనిషద్వాణి తెలిపినది. ఆత్మానందము కొరకే తనకంటె అన్యమగు వస్తువును ప్రతివాడును ప్రేమింతురు. కాకున్న భార్య భర్తనే లవదలి బ్రతుకును? దారాపుత్రాదులనే లపురుషుడు వదలును? తనను తానేల వదలుకొనడు? రాముడు సర్వభూతాత్మయని మన కథాభాగము వ్యాఖ్యా నించినది. కాకున్న భూతములన్నియు అట్లు కంటినీరును విడుచునా? ఇక కథలోనికి పోదము. కథాంతర్భాగమునందు మీకొకముఖ్యమగు విషయము చెప్పవలసియున్నది. రాముని రథము కదలి వెళ్లుచున్నప్పుడు దశరథుడు సుమంతుని రథమును ఆపుము ఆపుము అని కేకలు పెట్టుచుండగా రాముడు తొందరగ తోలుము సుమంత్రా! అని సూతుని తొందరపెట్టెను. ఆసమయమున సుమంత్రుడు రాజాజ్ఞను రామునాజ్ఞను మధ్యనుండగా రాముడు దశరథునిమాటను లెక్కపెట్టవద్దనియు, అంతగ నీవు తిరిగిరాగా రాజు అట్లేల చేసితివని అడుగుచో మీమాట నాకు వినడదలేదని చెప్పుమనియు, సుమంత్రునకు సలహానిచ్చి రథమును ముందుకు నడిపించినాడు.

రాముని పాత్ర చాల చిత్రమైనది. రాముడు సత్యవ్రత దురంధరుడు. తానెప్పుడును అబద్ధమాడడు "అనృతం నోక్త పూర్వం మే నచ వక్ష్యేకదాచన" అని ఆయన ప్రతిజ్ఞ. కాని సుమంత్రుని ఇప్పుడు అబద్ధమాడుమని చెప్పుటేమిటి?

ఇట్టి ఘట్టములే మన పురాణములందు భ్రమపెట్టు స్థలములు. ఈ ఘట్టమును మనసు నందుంచుకొనిన ఒక మిత్రుడు నన్నిట్లు ప్రశ్నించినాడు.

మిత్రు: నేనెన్నడును అబద్ధమాడనన్న రాముడు నీవిట్లబద్ధమాడుమని మరొకరిని ప్రోత్సహించిన చోటు రామాయణము నందున్నది మీరు చూచితిరా?

నేను : అట్టి ఘట్టము రామాయణము నందెచ్చటను నాకంట బడలేదు.

మిత్రు: మీరు రామభక్తులు.

**నేను :** కాదు. కాదు నేను విమర్శకుడను కూడ. నాది మూర్ఖభక్తికాదు. మా గురువర్యులు విమలానంద భారతీయతీంద్రులు చక్కని తర్కమునకు స్థానము నొసంగెడివారు. కాని అది శ్రుతిమత తర్కము. శాస్త్రాధారమగు విమర్శయే మోక్షమొసంగునని శంకర సిద్ధాంతము. మీరెక్కడైన రామాయణమును మరొకరిచే రాముడబద్ధ మాడించుటను చూచితిరా?

**మిత్రు:** అయోధ్యాకాండమునందు రాముడరణ్యమునకు పోవునప్పుడు దశరథుడు సుమంత్రుని రథము నాపుమని ఆజ్ఞాపింప నా రాముడు సుమంత్రునితో నేమనెను.

**నేను :** మీరే చెప్పుడు.

**మిత్రు :** "నా శ్రౌషమితి రాజా నం ఉపాలబ్ధోపి వక్ష్యసి" సుమంత్రా రథమును పోనిమ్ము ఆపవద్దు. ఒకవేళ రాజునిన్ను నా ఆజ్ఞనేల ఉల్లంఘించితివని తిరిగి వచ్చినతరువాత అడుగుచో వినబడలేదని చెప్పుము. అని చెప్పెను గదా? దీని నేమందురు.

**నేను :** దీనిని అబద్ధమాడించుటయని విజ్ఞులనరు.

**మిత్రు:** మరేమనెదరు?

**నేను :** దశరథుడెందుకు ఆపమనెను? రాముడెందుకు పోనిమ్మనెను? అని విచారింరింతురు. దశరథుడు రాముని పయనమును ఆపుటకు రథము నునిలుపమనలేదు రాముడు తండ్రిమాటను ధిక్కరించుటకు ఆపవద్దనలేదు. "చిరందుఃఖస్యపాపిష్ఠం" మన రథమును ఆపిన కొలది దశరథుడు దుఃఖపడుటయే గావున మన పయనము తప్పదుగావున పోనిమ్మనెను. అంతగ రాజడుగుచో ఆజన ఘోషమున వినబడలేదని సర్దమనెను. ఇక్కడ "నాశ్రౌషమ్" అనుమాటకు నేను వినలేదని చెప్పుట అర్థముకాదు. నాచెవిని పడలేదని అర్థము. అనగా మీ మాట ఆ సమయమున నా చెవికెక్కలేదు అను అర్థమున వాడబడినది ఆపదము. పర్యవసానమున చెవికెక్కక పోవుటయేనని దాని భావము. ఇక్కడ నీవు చెప్పినట్లు చేయలేదను అర్థమునందు నీమాట వినలేదను ప్రయోగమువంటిదీ ప్రయోగము. యుద్ధకాండమున రావణుడు నైతచ్ఛ్రోత్ర గతం మమ" అని మాల్యవంతునకు సమాధానమిచ్చినాడు. సామాన్యముగ

కూడ నీమాటను ఆనాడు నేను వినలేదు అనుట కలదు గదా? కావున ఇది అబద్ధమాడించుట కాదని విజ్ఞులు తలతురు.

మిత్రు: బాగున్నది. నా సందేహం తీరినది. అనినాడు.

నేను : ఇక కథకు వత్తము.

సీతారాముల రథము దశరథుని చూపును దాటినది. రథధూళియు కొంత సేపు దశరథునకు ప్రియమును గూర్చి అదియు దశరథుని చూపునకందలేదు. అంతలో అతడు మూర్ఛిల్లినాడు. ఆ జనమధ్యముననే కైకేయియు, కౌసల్యయును, ఆతని ప్రక్కననే నిలిచియుండి లేవదీసినారు. రాజునకు మూర్ఛతెలిసినది. కైకేయిని చూచినాడు. దశరథుని దృష్టి యందామె అస్పృశ్య. తన్ను తాకుటకు సంపూర్ణముగ అనర్హురాలనియే ఆతడు భావించి కన్నుల నెర్రజేసి, ఆమెతోటి సంబంధమును ఇహపరముల రెంటి యందును త్రెంచుకొనినాడు. భరతుడు కూడ ఈ రాజ్యమును సంతోషముగ స్వీకరించుచో ఆతడును కైక తోటివాడే కాగలడని కోపోద్రేకమును శోకోద్రేకమును కూడ రెట్టించగా పలికినాడు.

అక్కడనే కొంత సమయము గడిచినది. ఆతడట్లే దుఃఖించి దుఃఖించి నగరమధ్యకు వచ్చి, అయోధ్యనంతను పరికించి కాంతిహీనమగు ఆ నగరరాజమును చూడలేక చూచినాడు. అచ్చట నుండి తిరిగి కైకేయి మందిరమునకు వెళ్ళలేదు. కౌసల్యాగృహమునకు చేర్చుడని పరివారమునకు తెలపగా కౌసల్యాగృహముననే ప్రవేశపెట్టినారు. దశరథుడిప్పుడు కౌసల్యాంతఃపురముననే యుండెను. అప్పటికి రాత్రికాలము వచ్చినది. ఆతడు హంసతూలికా తల్పముననే పరుండియు సుఖనిద్రను చెందలేదు. రాముడే ఆ మహారాజు దృష్టియందుండెను. ఆరాజు నేత్రేంద్రియమప్పుడు రామునకే సమర్పింపబడినది. దృశ్య ప్రపంచము నందే పదార్థమును ఆతడు చూడలేకపోయెను. కౌసల్యను పిలిచి ఇట్లు చెప్పినాడు.

"రామం మేనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే
న త్వాం పశ్యామి కౌసల్యే సాధు మా పాణినాస్పృశ"

కౌసల్యా! నాదృష్టి రామునితోడనే పయనించినది. ఇంతవరకును నాదగ్గరకు రాలేదు. దీని నిర్ణయమెట్లుందువేమో నీవు నాకన్నుల కగపడుటలేదు. నా త్వగింద్రియము నిన్ను తాకుట కుత్సహించుచున్నది కౌసల్యా పన్నొకమారు తాకుమని నాడు. రాముని తల్లితన్ను తాకగా ఆతని శరీరము చల్లబడుననుకొనినాడు. పాపము

తొలగుననుకొనినాడు. ఏమి దశరథుడు! భారతీయ చరిత్రలోని పాత్రలు లోకోత్తరములు.

లోకోత్తరములన లోకమునలేని ధర్మములు కలవని అర్థముకాదు. కేవల భౌతిక దృక్కులకు అర్థమగునవి కావని అర్థము. నిజమునకు దశరథుని పాత్ర లోకసామాన్యముకాదు. అతని పుత్రప్రేమ అసాధారణము. పుత్రుని ఆలంబనముగ గొన్న ఆయనలోని వాత్సల్యరసము పూర్ణరూపమునొంది ప్రపంచమును మరపించి రామునొక్కనే అతని అంతఃకరణమున స్థాపించినది. లేకున్న నాదృష్టి రామునితో వెళ్ళి మరలరాలేదని ఎట్లు చెప్పగలడు చక్షురింద్రియమే కాదు. త్వగాదీంద్రియములను రాముని వైపునకే తిరిగినవి. రాముని జననముతోటి ప్రారంభమైన వాత్సల్య రసము రాముని వనవాస వయనకాలమున స్థాయీ భావమునొందినది. దశరథుని యందు కావున దశరథుని పాత్ర వాత్సల్య భక్తికి ఆదర్శము. పుత్రవిరహక్లేశమున దుఃఖసముద్రమున మునిగియున్న దశరథుని భక్తుడనియు, ఆయన శోకమును భక్తి రసమనియు అనుట యుక్తమా? అందురేమో? దశరథుని శోకము భక్తిరసమెట్లయ్యెనో చెప్పెదను.

మన చిత్తము లక్కవంటి గట్టి పదార్థము. అయ్యును అది గట్టిదనమును వీడుట కరగుట అను రెండవస్థలు కలిగియుండును. సామాన్యమగు వేడి తగులగా లక్క కొంచెము శిథిలమగును. వేడి బాగతగులుచో అదికరగును. అట్లె మనచిత్త ద్రవ్యముకూడ సామాన్యమగు తాపమునకు మెత్తపడును. అధిక తాపమున కరుగును. కామము, క్రోధము, భయము, స్నేహము అను గుణములు మనస్సునకు సామాన్య తాపమును కల్పించుచో మనసు మెత్తపడి అందా గుణములకు ఆలంబనమగు వస్తువు వాసనా రూపమున నిలుచును. అనగా ఒకనిపై క్రోధము కలుగుచో అతని ఆకృతి వాసనా మాత్రమై మనస్సున నిలుచును. ఆ క్రోధము ఒక వ్యక్తి యందు తీవ్రముకాగా ఆ తీవ్రకోధమున తాపము నొందిన చిత్తము తన్మయమై ఆ వ్యక్తినే చూచును. అనగా ఆ ద్రవీభూత చిత్తమున ఆ వ్యక్తికి సంబంధించిన భావము స్థిరమై నిలచును. ఇట్లె కామము, భయము. స్నేహము మొదలగు గుణములు కూడ. ఇది ప్రాకృతవ్యక్తుల నాలంబనముగా గ్రహించుచో దుఃఖప్రదములై జీవుని బంధించగా భగవంతుని ఆలంబనముగ గ్రహించుచో ముక్తి నొసంగును. అప్రాకృతమగు భగవత్తత్వము నాలంబనగాగా దానికి భక్తియని పేరు. చిత్తమున తాపము తీవ్రమగుటకు గలుగు వాతావరణమునే విభావ సంచార, వ్యభిచారీ భావ

ములను పేర అలంకార శాస్త్రము పిలిచినవి. భక్తి శాస్త్రముగూడ భగవంతుని ఆలంబన గావించి ఆ పేర్లను వాడినవి. కావున ప్రస్తుతమున దశరధుని పుత్ర స్నేహమునకు రాముడే ఆలంబనముకాగా దశరధుని చిత్తము అతని విరహాగ్ని జ్వాలలకు కరుగగా ఆ నారాయణుడే పుత్రుడను పేర దశరధుని అంతఃకరణమున నిలచి, ఆతని బాహ్యేంద్రియములను కూడ తనవైపు త్రిప్పుకొనినాడు. కావున దశరధుని శోకరసమును భక్తిరసమని చెప్పినాను. భగవంతునే పుత్రునిగకన్న దశరధుని భక్తుడనుటకు సందేహమేమున్నది ?

తరువాతి కథాఘట్టము రామలక్ష్మణులను కన్న తల్లుల సంభాషణము. ఇందు రాముని కన్నతల్లి రాముని పుత్రుడనిమాత్రమే గ్రహించి దుఃఖభాగిని కాగా లక్ష్మణుని కన్నతల్లి రాముని యధార్ధస్వరూపమును చెప్పి ఆమెకు దుఃఖోపశమన మును చేయును. ఈ అయోధ్యాకాండము నందిది యొక ముఖ్యమగు ఘట్టము. అన్నియు అట్టివే అయినను ఇది మణిహారమున కొలికిపూసవంటి దనక తప్పదు. వారి సంభాషణ మిది.

సుమిత్ర : అక్కా ! బహుజన్మార్జితమగు నీ పుణ్యపుంజము పక్వముకాగా రాము డను పేర పుత్రరూపము నొందినది. అట్టి పుత్రుని గురించి నీకు దుఃఖ మెందులకు ?

కౌస : నా పుణ్యపుంజము దుఃఖరూపముగ మారినదిగదా ?

సుమిత్ర : లేదు లేదు. నీ పుణ్యపుంజము నేడు సద్వాసనల గుబాళించుచు దశదిశల వ్యాపించినది.

కౌస : సుమిత్రా ! పట్టభద్రుడై రథ గజ తురగ పదాతులు తన్ను వెంటనంటగా రాజాంతఃపురమున వసింపదగు నా రాముడు అరణ్యముల పాలై, కందమూలముల భక్షించుచు శీతవాతాతపముల స్రుక్కి దుఃఖభాగు డగుట నా పుణ్యఫలము పక్వమై సద్వాసనల వెదజల్లుచున్నదని నేనెట్లు తలతును ?

సుమిత్ర : అక్కా ! నీవిక్కడనే పొరపడితివి. రాముడిప్పుడు పయనించినది అరణ్యములకు కాదు. ధర్మాత్ముడగు రాజు పెడలదగు విజయయాత్ర కాతడు పయనమయ్యెను. పితృవాక్య పరిపాలనారూప ధర్మ నిర్వహణ యను రథము నెక్కి ధర్మ సత్యవ్రత ధనముల కోలోప్పవక శాశ్వత

కీర్తి పతాకమును గగనతలమున స్థాపించినాడు. అట్టి పుత్రుని కనుట నీ మహాభాగ్యము. కన్నబిడ్డలు తల్లికి తాము సంపాదించి అంపెంచదగు ధనమే రాముని వనవాస పయనము.

కౌస : సుకుమారగాత్రుడగు రాము డరణ్యవాస దుఃఖము నెట్లనుభవింపగలడో.

సుమిత్ర : ఆతడొక్కడై అరణ్యము కేగలేదు. ఎండ యను దానిని కన్నుల చూడని సుకుమారగాత్రి సీతాకాంతయు ఆతని ననుసరించినది. ధనుష్పాణియై లక్ష్మణుడును ఆతనివెంట నంటినాడు. పగలు సూర్యుడు తన కిరణసహస్రములచే రామునికి వెచ్చ తగులనీయడు. రాత్రికాలమున చంద్రజ్యోత్స్నలు రాముని కౌగలించి ఆతనికాహ్లాదమును కల్పించును. వాయువును ధర్మమూర్తియగు రాముని సుకుమార శరీరమును శుష్కింపజేయు గాలిని వీచడు. నిత్య సుఖస్పర్శ నొసంగుచునే ఆతనికి సుఖమును కలుగజేయుచు వీచును. భూకాంత నీ పుత్రునకు పట్టుపరుపై మెత్తని శయ్యాతలము నమర్చును. రామునకు భూమి కఠినతలము కాదు. నీవు ధర్మమూర్తియగు నీ పుత్రుని తలచి దుఃఖింపకుము. పంచ భూతములును ఆతని సేవకులై సేవను చేయుదురు. నీవనుకొనునట్లు రాముడు నీ పుత్రుడు మాత్రమేకాడు. అతడు జగన్నాధుడు. సూర్యునకాతడు సూర్యుడు. అగ్నికి అగ్ని. లక్ష్మికి ఆతడు లక్ష్మి. కీర్తికి కీర్తి. ఓరిమికాతడు ఓరిమి. దేవతలకెల్లర కాతడే దైవము. అక్కా! వేయేల? ఈ ప్రపంచములోని వెలుగులన్నియు రాముని వెలుగును ఆధారముగా గొనియే వెలుగుచున్నవని తెలియుము. రాముని వనవాసమునకు ఖేదము నొందకుము.

"సూర్యస్యాపి భవేత్సూర్యో హ్యగ్నేరగ్నిః ప్రభోః ప్రభుః
శ్రియశ్శ్రీశ్చ భవేదగ్ర్యా కీర్తిః కీర్త్యాః క్షమాః క్షమా
దైవతం దైవతానాం చ భూతానాం భూతసత్తమః.

కౌస : సుమిత్రా! దుఃఖభాగినినైన నాకు మరల ఆ రాముని దర్శన మబ్బునందువా?

సుమిత్ర : అక్కా! ఒట్టుపెట్టి చెప్పుచుంటిని అడవినుండి అయోధ్యకు మరలి

వచ్చి, పట్టాభిషిక్తుడై నీ ప్రియపుత్రుడు నీకు కన్నులపండువు చేయగలడు పట్టాభిరాముడై.

కౌస : ఎక్కడి పదునాలుగేండ్లు? ఎక్కడి నేను? అంతవరకు నేను జీవింతునని ఏమి నమ్మకము?

సుమి : కాదు కాదు. శుద్ధపాడ్యమి (నెలపొడుపు) నాటి చంద్రునివలె నీవు నీ పుత్రుని చూడగలవు. నీవు సుశీలవు. నీకీ శోకము మబ్బువలె విడిపోవును. రాముని సుకుమార సుందర హస్తతలములు నీ పాదముల తాకగలవు ఈ జన్మమునే. నీవు నీ కన్నులవెంట ఆనందబాష్పముల జలజల రాల్చెదవు. నా మాటను నమ్ముము.

శ్రోతలారా! సుమిత్ర వాక్యామృత బిందువులు కౌసల్య దుఃఖమును పోగొట్టినవి ఆ క్షణకాలముననే. "సద్యశ్శరీరే వినినాశశోకః" అనినారు మహర్షి.

నిజమునకు జ్ఞానుల తాత్కాలిక దుఃఖము లిట్లేయుండును. కావుననే వాల్మీకి మహర్షి ఇక్కడ కౌసల్య దుఃఖ మెట్లు పోయినదనగా, "శరద్గతో మేఘ ఇవాల్ప తోయదః" కొంచెము నీరుగల శరత్కాల మేఘము ఆ నీటిని విడిచినట్లు కౌసల్య శోకము అంతము నొందెనట. అనగా నేమి? అజ్ఞానావరణము దట్టమగుట వర్షాకాల మేఘము. అజ్ఞానము నామమాత్రమై యుండి, తాత్కాలిక శోకము కలిగి యుండుట శరన్మేఘము. మేఘమునందలి మాలిన్య మంతయు శరదృతువు పోగొట్టునట్లే భగవత్తత్వ ప్రబోధము చెవినిబడ్డ మాత్రముననే జ్ఞానుల తాత్కాలిక శోకము తొలగునని వాల్మీకి తెలిపినారు.

మనమింక ముందుకు నడచి రాముని పయనమును చూతము

రాముని రథము నగరమును దాటినది. ప్రజలు మాత్రము రాముని వదల లేదు రాముడు ప్రజల నెట్లైన మరల్ప చూచెను. అతని కోర్కె నెరవేర లేదు. వారు వెనుకకు మరలుట లేదు. రామునియందలి సద్గుణపుంజము వారిని బంధింపగా వారు వెనుకకు మరలలేదు.

అందుకొంత బ్రాహ్మణ బృందమున్నది. అదికర్మయోగుల బృందము. వారు గావించిన వేదోక్త కర్మానుష్ఠానములకు ఫలమే రాముని రూపమున అయోధ్య యందవతరించినదని నిర్ణయించుకున్న భక్తబృందము. వారు గృహస్థులకు విధిం

చిన విధికర్మలను ఆచరించుచునే భక్తి, ధ్యాన, జ్ఞాన యోగముల యందుత్తీర్ణులైన బ్రాహ్మణోత్తములు. వారు బ్రాహ్మణునకు మాత్రమే అర్హతగల వాజపేయమను మహాక్రతువును కూడ ఆచరించిన బ్రాహ్మణ సామ్రాట్టులు. బ్రాహ్మణునకు వాజపేయయాగము రాజునకుగల సార్వభౌమాధిపత్యము వంటిది. అట్టి ఆధిపత్యము గలిగి ఎనుబది సంవత్సరములకు పైబడిన వృద్ధభూసురులెందరో రాముని వెంట వెంటనంటినారు. వారి భుజములపైన అరణులు కూడా ఉన్నవి. (అరణులంటే యజ్ఞాలలో అగ్నిని మధించే కర్ర) ఆ అరణులలో తమతమ నిత్యాగ్నిహోత్ర విధులను నెరవేర్చుకొనుటకు మంత్రపూర్వకముగ అగ్నిహోత్రమును అందు ఉంచుట శాస్త్రవిధి. ఆవిధులననుసరించి వెళ్ళు బ్రాహ్మణులు కొందరు రాముని రామా! నీవు వెళ్ళవద్దు నిలుమని బిగ్గరగ వణకెడు స్వరములతో వేడుకొనుచుండిరట. వాల్మీకి వర్ణించినారు ఈ సందర్భముననే మహర్షి బ్రాహ్మణుల భుజములనెక్కి అగ్నులుకూడా రాముని వెంటనంటినవని వర్ణించినారు. వారి నెరసిన వెంట్రుకల తెలుపును వారి శిరములందున్న వాజపేయ యాగమునందు ధరించిన వారి శ్వేత చ్ఛత్రములును రాముని వెంటనంటి, రామా! మా శ్వేతచ్ఛత్రములతో వనమున నీకు నీడను కల్పింతుమనుచుంటిరట అంతేకాదు మేము ఇంతకాలముగా అగ్నిహోత్ర విధులనెరవేర్చిన దానికి ఫలితము నిన్నువెంటనంటుచేనని వేదములుద్ఘోషించుచున్నవిగాన మేము నీవెంట నంటితిమని వివరించి రధముతోపాటు వారును పరుగెత్త నారంభించినారు. రధము ఆగక వెళ్ళుచుండ అరధమునకు కట్టబడియున్న గుఱ్ఱములనుకూడ ప్రార్థించినారు. మీరైనా మా మొరను ఆలకింపుడని. రాముని రధము ఆగలేదు. కాని రాముడు రధమును దిగినాడు. అప్పుడు వారు రామా! మేమొక్కరమే నిన్ను అడవికి వెళ్ళవద్దని యాచించుటలేదు. చెట్లపైనున్న పక్షులును చెట్లునుకూడ సమాధినిష్ఠను పొందినవి చూడుమనినారు. "పక్షిణోపి ప్రయాచంతే" అనినారు. రామునిప్రయాణమాగలేదు.

రాముడెంత ధర్మమూర్తియై అరణ్యములకేగుచుండెనో ప్రజల హృదయము లంత రాముని అనుసరించినవి. ఈఘట్టమున వాల్మీకి ఒక విశేషమును చెప్పినారు.

భారతదేశమున నాటి బ్రాహ్మణులకు తరగని ధనము వేద వాఙ్మయము, ఆ ధనము నాడు గ్రంధాలయములందు నిక్షిప్తమైలేదు. భారతదేశము నెందరు కొల్ల

గొట్టినను ఆధనము వేరొకరికి స్వాధీనమగునదికాదు. ఆ విషయమును బ్రాహ్మణులు రామునితో చెప్పుకొన్న మాటనుగా వర్ణించినారు.

"హృదయేష్వేవ తిష్ఠంతి వేదా యేనః పరంధనం"

వేదవాఙ్మయమను ధనము వారి హృదయములయందే నిక్షిప్తమైయున్నదట. వారి మస్తిష్కములే నాటి గ్రంథాలయములు.

పర్యవసానమున రాముని వన పయనమును ఆపుట కెవ్వరును సమర్థులు కాలేదు రాముడధిరోహించిన రథమును, ఆరథమును వెంటనంటిన ప్రజలును అట్లే కొంతదూరము పయనించినారు. వారందరును తమసా నదీతీరమునకు చేరినారు. నదీమతల్లి మాత్రము రాముని పయనమునకిష్టపడునా? ఆ తమసానది తన ఉత్తుంగ తరంగ హస్తములతో రాముని నాటి ప్రయాణమును నివారించినది. రామునకు రథమునాపుకొనక తప్పినదికాదు. అప్పటికి సాయంకాలమైనది. సీతా రామలక్ష్మణులును, ప్రజలును గూడ ఆ తమసా నదీతీరముననే నిలిచినారు. ఆ రాత్రికి వారి నివాసమక్కడనే. మనమును ఈనాటి కిక్కడనే ఆగుదుము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

తరువాతి కథా భాగము రేపు.	3వ రోజు పూర్తి.

# 4వ రోజు

శ్లో॥ రామేతి వర్ణద్వయమాదరేణ సదా స్మరన్ ముక్తిము
పైతి జంతుః
కలౌయుగే కల్మషమానసానామన్యత్ర ధర్మే ఖలు
Acc.no.1421 - 294.592
SOB-V.2
నాధికారః
భక్తప్రియం భక్తసమాధిగమ్యం చింతాహరం చింతిత
సుబ్రహ్మణ్యశర్మ, నందూరు
కామధేనుం
రవీందుకోటిద్యుతి భాస్వరంతం రామం భజే రాఘవ
రామచంద్రమ్

శ్రీమద్వాల్మీకి రామాయణోపన్యాసములు

## - ప య న ము -

ఆర్యమహాశయులారా !

నేటి మన ఉపన్యాసమేమి? రాముని దండకారణ్యప్రయాణము. నిన్నటి మన ప్రవచన మెంతవరకు నడచినది? రాముని రథము తమసానది యొద్దన నిలిచినది. మన ధనుర్మాస కార్యక్రమము నందిది పదకొండవరోజు. రామునితో పయనమైన పురవాసులును ఆ తమసానది ఒడ్డుననే నిద్రించినారు. వారందరును రామునితో దండకారణ్యములకు వెళ్లుటకయ్యే అతనిని వెంటనంటి వచ్చినారు. గుంపులుగుంపులై వారందరును అచ్చటచ్చట నిద్రించినారు.

ఆ ప్రజల నందర తనతోపాటు ఆ మహారణ్యముల దుఃఖభాగుల గావించు టకు రామునకు మనసొప్పలేదు. కావున ప్రజలు గాఢనిద్రలో నుండుటను గుర్తెరిగి రాముడు తన పయనమును సాగించినాడు.

రాముని రథము తమసానదిని దాటినది. ప్రజలకు తాను వెళ్ళిన త్రోవ గుర్తు పట్టుటకు వీలుకాకుండునట్లే సుమంత్రుని రథము తోలమనగా సుమంత్రుడట్లే చేసినాడు.

సూర్యోదయమైనది. ప్రజలు మేల్కొనినారు. రాముని రథమేది? రథ మార్గమును గుర్తింప యత్నించిరి గాని ఆమార్గము వారికర్థము కాలేదు. ప్రజలకు అయోధ్యయే శరణ్యమైనది. కన్నీటిధారల కార్చుకొనుచు, రామవియోగమునకు వారి దురదృష్టమును స్మరించుకొనుచు అయోధ్యకేగినారు. అది రాముడు లేని అయోధ్యకావున అదినగర రాజమైలేదు శుష్కించిన మహా సముద్రమువలె నున్నది. రాచబాటలు చూడ ముచ్చటలైలేవు. విపణివీధులు లక్ష్మీనిలయములుగకన్ప ట్టుటలేదు. కళావిహీనమగు ఆనగరములోనే చూచుచు ప్రజలును, బ్రాహ్మణులును తమతమ గృహముల కేగినారు. ఆగృహములును శాంతినిలయములైలేవు. గృహి ణులు దుఃఖభాగినులై వారి కెదురుగ వచ్చినారు. రాముని త్రిప్పితీసుకొని రాలేని భర్తలను నిందించుచు వారు గౌరవించలేకపోవుట ఈఘట్టమునందలి ప్రత్యేకత. నిజముగ వారందరును భర్తలయెడ పూజ్యభావము లేని గృహిణులని మీరు తలచ కుడు.

రాముడరణ్యమున కేగగా రామునకండదండలై నిలువదగిన పురుషపుంగవులు మరలగృహముల కేతెంచగా, రాముని వదలిన ఈగృహస్థాశ్రమము జన్మము సార్థ కము గావించలేదను వారి పరితాపము వారి నిందాపూర్వకములగు ప్రేమసూక్తులలో స్ఫుటమైనది.

> కిం ను తేషాం గృహైః కార్యం కిం దారైః కిం ధనేన వా
> పుత్రైర్వా కిం సుఖైర్వాపి యే న పశ్యంతి రాఘవం.

ఎవరి చూపునుండి రాముడంతర్ధానమయ్యెనో వారికీ గృహస్థాశ్రమ మెందుకు? ధన ధాన్యములును దారాపుత్రాదులును వారికి కృతార్థతను కల్పించునా? మీరేమని తలచి మరల ఇండ్లకేతెంచిరి? అని ఆగృహిణులు తమభర్తల నిందించినారు. ఇదినిందయా? ఆవదేశమా? రాముని కటాక్షమునకు పాత్రులుకానివారి గార్హస్థ్యము వ్యర్థమని వారి గము

అంతేకాదు. వారు తమ భర్తలతో స్త్రీపురుషుల మందరమును రాముని కద్దకు పోదమనినారు. "యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవః" అని సిద్ధాంతీకరించినారు. రాముడెక్కడకలడో అక్కడ భయముండదు. అక్కడ పరా భవముండదు. మాస్త్రీల కందరకును సీత రక్షకురాలుకాగా పురుషులకు రాముడు యోగక్షేమముల కల్పించునని తమ భర్తల ప్రోత్సహించినారు.

ఎంతటి దురదృష్టవంతులము కాకున్న రాముడులేని అయోధ్యయందు వసింతుమా? అని బాధనొందుచు, దండకారణ్యములందలి వృక్షలతానికుంజములను అక్కడి పర్వత శ్రేణులను తమకంటె ఎంతయో పుణ్యముగావించుకొన్న జీవులని ఆస్థావరములను పొగిడినారు. వాటి పుణ్యమేమియనగా? ఆ వృక్షలతా నికుంజములు రామునకు ఫలపుష్పోపహారములనందించి ధన్యత నొంద నోచుకొన్న వనినారు. అందలి సరస్సులను సీతారాముల స్నానపానములతో కృతకృత్యత నొందుగదా? అని వాపోవుచు రాముని తమ హృదయముల నిలుపుకొనినారు. ఇక మనము రాముని యొద్దకు పోవుదము.

రాముడు తమసానదిని దాటి, నిత్యవిధులను గావించుకొని, వేదశ్రుతి, గోమతి స్యందికానదులను దాటి కోసలదేశమునకు దక్షిణదిశయందున్న గంగానది యొడ్డున తమరథమును నిలుపుకొనినారు. మధ్యమధ్యనెన్నియో పల్లెలను, గ్రామములను గడచినవి. వారందరి ఆదరముల నందుకొనినారు.

ఆ నది ఒడ్డుననే ఇంగుదీవృక్షము. అక్కడనే శృంగిబేరపురము. దానికి పరిపాలకుడు గుహుడను నిషాదుడు(బోయ). అతడు పరమభాగవతుడు. ఆ గుహునకు స్థపతి అనునది ప్రసిద్ధనామము. అచ్చటి అటవీప్రదేశమంతయు ఆగుహుని పరిపాలనలోనిదే. అతడు రామునకు ఆప్తమిత్రుడు. రాముడక్కడి కేతెంచుట తెలియుటతోడనే రామదర్శన కాంక్షియై మంత్రి జ్ఞాతి బాంధవులతో కూడ బయలుదేరినాడు.

రాఘవేశ్వరునకు నేను రాజవంశమున జన్మించితినను జాత్యహంకారము లేదు. రాముడు గుహుని రాకనుచూచి అతడు కొంతదూరమునందుండగనే లక్ష్మణునితో కూడి రాముడెదురేగినాడు.

అది భగవద్భాగవత సమాగమము. ఒకభక్తుడు భగవద్దర్శన కాంక్షియైవచ్చుచుండ ఆ భక్తశేఖరునకు భగవంతుడెదురేగెను. ఇదిపరమార్థము. కథా భాగమునకు వత్తము.

రాజశేఖరుడు కాదగినరాముని తాపస వేషధారణము గుహుని హృదయమును భేదించినది. రాముని కౌగలించుకొనినాడు రాముడిప్పుడు గుహునకు అతిథి కూడనైకన్పట్టినాడు. గుహునిహృదయము పొంగినది. "కః ప్రాప్స్యత్యతిథిం

ప్రియం" ఇట్టి అతిధినెవ్వరు సంపాదించుకొనగలరని అతని అంతరాత్మ తాండవించి నది. ఆత్మానందముగా వించినాడు.

రామా! ఈసామ్రాజ్యము నీది. నేను నీవాడను. ఈనారాజ్యము అయోధ్యకు వేరైలేదు. ఇవిగో సుసంపన్నములగు భోజ్యపదార్థములని రామునకు నివేదించు కొని స్వాగతము పలికినాడు.

ఆభక్తశేఖరుని పలుకులు భక్తిరసాయన ఘుటికలైనవి. ఆగుహుని రాముడు గాఢాలింగనము కావించుకొనినాడు.

గుహుడు రామునకాప్తుడు, మిత్రుడు, భక్తుడు. రాముని ఆలింగనమునందీ భాగములన్నియు ఇమిడియేయున్నవి. కాని అతడుతెచ్చిన భోజ్య పదార్థములను మాత్రము స్వీకరించలేదు. గుహుని యోగక్షేమములనారసి గుహా! నేనిప్పుడు ముని ధర్మము నాశ్రయించితిని గావున ప్రతిగ్రహము చేయనని చెప్పి తన రధవాహకము లగు అశ్వములకు గ్రాసమును కూర్చుమని ఆజ్ఞాపించినాడు, గుహుడు రామాజ్ఞను శిరసావహించినాడు. అదిరాముని ఆదరపూర్వకమగు ఆజ్ఞయే.

నాటిరాత్రి ఇంగుదీ వృక్షమూలమే రామునికి నివాస స్థానము. లక్ష్మణుడు అందించిన గంగాజలమే ఆహారము. కటికినేలయే హంసతూలికాతల్పము. సీతతో కూడ ఆ తల్పమున రాముడు నిద్రించినాడు.

లక్ష్మణునకు నిద్రలేదు. సీతారాముల నిద్రాకాలమున కూడ అతడు వారికి రక్షకుడు. గుహుడు లక్ష్మణునకు శయ్య నేర్పరచి పరుండమనెను కాని అతడు పరుండలేదు. రాముని రక్షణకు నేనుంటినని గుహుడు చెప్పెనుగాని లక్ష్మణుడా మాటకు మౌనమును దాల్చి తన కర్తవ్యమును నెరవేర్చుకొనినాడు.

గుహుడును మేల్కొనియే యుండెను. నాటి ఆ భక్తశేఖరుల జాగరణము మనకేమైన జన్మసార్థకతను ఉపదేశించెనా? సాధుసమాగమము కాలమును వ్యర్థము గావింపదు. నాటిరాత్రి గుహుడు లక్ష్మణునితో చెప్పుకొన్న అతని జీవితలక్ష్యము మనకు తత్వోపదేశము.

లక్ష్మణా! నాకు రామునకంటె ప్రియమైన వస్తువు ఈ భూమిపైన లేదు. ఇది నామమాత్రము కాదు. ఆత్మసాక్షిగ చెప్పుమాట. నాకీసంపదంతయు రామునే

గ్రహము. నాకు ధర్మజీవితము గడచుట రామ కటాక్షము అని చెప్పుకొనినాడు. ఇంతకంటె తత్త్వోపదేశ మేమి కావలెను? గార్హస్థ్యమున ముక్తిమార్గ మిదియే. గుహుని అహంత రామున కర్పితమైనది. అతని సంపదకు రాముడు యజమాని నాడి యనునది గుహునకు దూరమైనది. తిన్నని భక్తి ఇట్టిదే.

జాతి భేదమును చెప్పి వేదాధ్యయనాధికారము కొందరకే కలదన్న భారతీయ ధర్మము జాతిసమైక్యతకు భంగము కల్పించిన దనువారి నేటి వాదము నేమనవలెనో నాకు తెలియదు. వేదవేదాంగముల పఠింపకున్నను తపస్యులు కాకున్నను తిన్నడు, గుహుడు మొదలగువారు ఆదర్శపాత్రులై తరువాతి వారికి ఉపదేశముల నిచ్చినారు. వేదవిధులు నాడును నేడును కలవు. కథకు వత్తము.

తెల్లవారినది. ఇక రాముని పయనము సాగవలెను. ఆ గంగా ప్రవాహ ములు దాటినగాని సీతారామ లక్ష్మణుల పయనము సాగదు

లక్ష్మణుడు గుహునకు అన్నగారి ఆజ్ఞను తెలుపగా గుహుడు పడవను సిద్ధము చేయించినాడు. కాని గుహునకు రాముని పయనము ఇష్టములేదు. రాముడు మిత్రుని ఒడంబరచినాడు. ఇక సుమంత్రుని ఇంటికి పంపి, తాము నావను అధిరో హించవలెను. అయోధ్యకు తిరిగి వెళ్ళవలసిన సుమంత్రునకు తన తల్లిదండ్రులకు తెలుపదగు క్షేమవార్తల తెలిపినాడు. మాతాపితరులకు వందన సమర్పణల గావించి నాడు. తనతోపాటుగనే సీతాలక్ష్మణులును వందనముల గావించెనని దశరథ కౌసల్యలకు తెలుపుమని భక్తి వినమ్రతలతో సుమంత్రునకు చెప్పినాడు. రాముడు మర్యాదా పురుషోత్తముడుగదా? ఆయన కర్తవ్య నిర్వహణలయందు లోపమే ముండును? సుమంత్రునకు చేయదగిన అప్పగింతలన్నియు సక్రమముగనే జరిగినవి. మనమొక్కమారు సుమంత్రుని వైపుకు మరలుదము.

సుమంత్రుని ముఖమండలము చిన్నబోయినది. కన్నుల నీరు నిండినది. సుమంత్రుని ఊహ తారుమారైనది. తానును రామునితో పదునాలుగు సంవత్సర ములను అరణ్యముల గడుపవలెనన్న ఉత్సాహముతో రథమును తోలుకొనిరాగా అతని మనోరథము భగ్నమైనది. రాముడు లేని రథమును తోలుకొని అయోధ్యకు వెళ్ళవలసి వచ్చినది. దుఃఖము పొర్లి వచ్చినది.

రాముడు సుమంత్రుని ఓదార్చి వెళ్ళదగు కారణముల ప్రతిపాదించి పంప వలెను. సుమంత్రునకు ముఖ్యావసరముల కొన్నిటిని తెలిపి అతని భక్తిప్రపత్తులకు తన కృతజ్ఞతను తెలిపి సుమంత్రుని ఒప్పించినాడు.

సుమంత్రుడు అయోధ్యకేగి తమ గమనమును కైకకు తెలుపుట చాల అవసరముట. తన మాతాపితరుల ఆదరించుటకు తనప్రతినిధిగ సుమంత్రు డయోధ్య యందుండుట అత్యంతావసరముట. సుమంత్రుడు కాదనలేని కారణము లివ్వి. రాముడీకారణముల తెలుపగా సుమంత్రుని మనసు కరిగి నీరైనది. అతడు రామాజ్ఞనే శిరసావహించినాడు. అత డయోధ్యకు వెళ్ళక తప్పలేదు.

సీతారామ లక్ష్మణులు శుచిర్భూతులై ఆ గంగా నదీమతల్లికి ప్రణామముల నర్పించి నావ నధిరోహించినారు.

రాముడిప్పుడు వానప్రస్థుడు. అతడు జడల ధరించవలెను. గుహునిచే మర్రిపాలను తెప్పించి, ఆ దివ్యశోభనుడు జడదారి యయ్యెను. నావికులు రామాజ్ఞచే పడవను వదలినారు. నావ నదీ మధ్యమునకు చేరినది. సీత తన రెండుచేతుల జోడించి నా భర్తను సోదరసమేతముగ చల్లగ చూడుము తల్లీ! మా వనవాసము పూర్తియై అయోధ్యకు చేరగనే నీ పేరుతో భూతములకు సమారాధన గావింతునని మ్రొక్కినది.

భారతక్షేత్రమున గంగాదితీర్థరాజములు పరాశక్తి యొక్క అంశభూతములు. అవి జలమాత్రములుకావు. వైదికధర్మ ప్రతిపాదకము రామాయణము పాశ్చాత్యుల దేశచరిత్రలవంటి చరిత్ర మాత్రమే కాదు ఈ మహాకావ్యము.

నావ నదీమధ్యము నుండి అవ్వలఒడ్డుకు చేరినది. ఆ పడవను దిగిన సీతారామలక్ష్మణులు ఆ ఒడ్డున కొంత దూరము నడచి అందొక వృక్షమూలమున నిలచినారు. అప్పటికి అస్తమయమైనది. రామలక్ష్మణుల సాంధ్యకృత్యములు తీరినవి. ఆ రాత్రికి వారి నివాసమక్కడనే. ఆకులలములతో వారు శయ్యాతలముల నేర్పరచుకొనినారు. రామునకు నిద్ర పట్టలేదు.

తండ్రిని తలచుకొనినాడు. కైకేయియు స్మృతికి వచ్చినది. భరతుడు తాత గారి యింటినుండి వచ్చినతరువాత జరుగబోవు కార్యక్రమమును అతడు తలచినాడు

నా తండ్రి ముదుసలి. అనాథ. నేనును ఇంటలేను. కైక దుర్మార్గురాలు. తండ్రి వృద్ధుడగుటే కాదు కామాత్ముడు గూడ. కైక చేతిలోని కీలుబొమ్మ. తన కొడుకు యింటికిరాగానే కైకేయి తప్పక భర్తను చంపును. నా తల్లిని కూడ చంపును. అప్పుడు వృద్ధభూపతి నాతల్లి నెట్లు రక్షించును! నా తండ్రి అంత సమర్థుడగుచో ఆడుదానిమాటకు అనుకూలుడై వర్తించి జ్యేష్ఠపుత్రుని అరణ్యములకు పంపునా? ఎంత మూర్ఖుడును చేయని అకార్యమును కామము నా తండ్రిచే చేయించినది. కామ మెంత గొప్పది. ధర్మార్థ కామములందు కామమునకున్న బలము ధర్మార్థములకు లేదుగదా! అన్న ఊహాతరంగములు రాముని గంభీరాంతఃకరణమున ఉవ్వెత్తున లేచినవి. వెంటనే తన ఊహాప్రపంచమును లక్ష్మణున కెరింగించి లక్ష్మణా! నీవిప్పుడు అయోధ్యకేగుట చాల అవసరమని తమ్ముని ప్రేరేపించినాడు.

రామాయణ కథాభాగమునందిదియొక విచిత్రమగు ఘట్టము. సామాన్యముగ నమ్మరాని విషయము. రాముడు తన తండ్రిని ఎంతటి మూర్ఖుడును చేయరాని కార్యమును కామాత్ముడై చేసెనని నిందించెనా? రాము డయోధ్యనుంచి బయలుదేరు నప్పుడు దశరథుడు రాముని దృష్టియందు కామాత్ముడు కాకుండ దైవతమై ఇప్పుడు దోషి అయ్యెనా? మూర్ఖుడయ్యెనా? అయ్యెను. ఇదిగో మూలము.

“కోహ్యవిద్వానపి పుమాన్ ప్రమదాయాః కృతేత్యజేత్
ఛందానువర్తినం పుత్రం తాతో మామివ లక్ష్మణ॥”

ఇదియే రామునిలోని ప్రత్యేకత. కథలోని గాంభీర్యము. విమర్శనీయమగు విషయము.

అసలు రాముడరణ్యమునకు పయనమగుట యందున్నది పితృ భక్తి కాదు. పితృవాక్య పరిపాలనము. విధి నిర్వహణము. భక్తి, విధి నిర్వహణము కాదు. భక్తియందు విమర్శకు స్థానములేదు. ఆజ్ఞా పాలనమున యజమాని ఆజ్ఞలోని దోషము తెలిసియు అతని ఆజ్ఞను పాలించిన సేవకుడు విజ్ఞుడు. “జ్ఞాత్వాకర్మాణి కుర్వీత” అన్నది గీతా శాస్త్రము. కావున రాముడు పితృవాక్య పరిపాలనా విధి నిర్వహించి దశరథుడు కామమునకు బద్ధుడగుట యను దోషమును విస్పష్టపాఠముగ తెలిపినాడు. విజ్ఞుడగువాని కర్మకు జ్ఞాని కర్మయని కూడ చెప్పవలెను. కావున

రాముడిప్పుడు చేసినది పితృనిందకాదు. విషయ విమర్శనయే. ఇదికాక ప్రస్తుతమున లక్ష్మణు నేల ప్రేరేపించెను ? అనునది కూడ మనము గ్రహించ వలసిన విషయము.

లక్ష్మణుని హృదయమును పరీక్షించి అతడు తనతో వచ్చుటను రాముడు నిర్ణయించదలచినాడు. కైకను నిందింపగా తనతో కలియును. దశరధుని రక్షణ తన్ను మెత్తపడవచ్చును ఇదియొక హృదయము. అంతియేకాని తనకు రాజ్యము పోయినదనుటకును, తండ్రిని నిందించుటకును కాదు. ఇదియే ఈ ఘట్టములోని ప్రత్యేకత.

లక్ష్మణుడు కదలినా ? అతడు కదలలేదు. ఆ ఆలోచనకిది సమయము కాదని సమాధాన మిచ్చినాడు. ఆరాత్రి గడిచినది అక్కడనే. ఆనాటికి వనవాస దీక్షకు మూడురాత్రులు గడచినవి. మరునాడు పయనము సాగినది. వారక్కడనుండి భరద్వాజ ఆశ్రమమున కేగినారు. అక్కడ ఒక్కరాత్రి గడిపినారు. ఆమునివర్యుని ఆతిథ్యమును స్వీకరించి, అచ్చట నుండి వారి యనుమతితో చిత్రకూటమున కేగినారు. ఆ పర్వత రాజము భారతీయుల పుణ్యపుంజము. అది ప్రకృతి సుందరి కొక ప్రత్యేకమగు అలంకారము కూడ. శ్రీరామచంద్రుడక్కడ కేగునప్పటికి వాల్మీకి మహర్షి వారి ఆశ్రమమక్కడనే యున్నది. ప్రప్రథమముగ సీతా లక్ష్మణులతో ఆమహర్షి పాదపద్మములకు వందన మాచరించినారు శ్రీరామచంద్రులు. ఇక సీతారామలక్ష్మణులకొక నివాస స్థానము కావలెను.

లక్ష్మణుడొక పర్ణకుటీరమును నిర్మించినాడు. అది వాస్తుశాస్త్ర ప్రసిద్ధమగు నిర్మాణము. అప్పుడు వారికిదియే సుందరభవనము. వసతులన్నియు అందు చక్కగ చేకూర్చబడినవి. అగ్న్యాగారమునకొక ప్రత్యేక గృహము నిర్మితమైనది. అందే ఆయుధాగారము కూడ. ఆకుటీరము గాలివానలకు గురికాదు. నాటి రాజపుత్రులకు చేతగాని కార్యములు లేవు.

వాస్తు పురుషు నర్చించి గృహదేవతల పూజించి శాంతి బలుల నర్పించి రాముని కుటుంబమంత ప్రవేశించినది. అవతార మూర్తియగు శ్రీరామచంద్రుల పవిత్ర పాద స్పర్శకై ఎదురుచూచు ఆ పర్వత రాజునకు పుణ్యపుంజము పరిపాకము కాగా సీతా లక్ష్మణులతో రాముడక్కడ వసించినాడు. చిత్రకూటము భరద్వాజ

మున్యాశ్రమమునకు పది క్రోసుల దూరము. ఆ చిత్రకూటము చాలమంది మునులకు కూడ స్థానము. ఎందరో మునులక్కడ వసించినారు. ముందు కథకు పోదము.

అది సాయంకాల సమయము. రాముని వదలిన సుమంత్రుని రిక్తస్యందనము అయోధ్య కేతెంచినది సుమంత్రుడు దుఃఖ భాగుడయ్యే అయోధ్యకే తెంచినాడు. రాముని వియోగ మెవ్వరికి దుఃఖ కారణము కాదు ? ప్రజలు గుంపులు గుంపులై సుమంత్రుని, రామ వృత్తాంతమును అడగిరి గాని అతడు వారికేమియు చెప్పకయే నగరమధ్యము నుండి రథమును దాటించు కొనినాడు. రాముడు భరద్వాజాశ్రమము నకు వెళ్ళువరకు గుహుని వలన వినెను గావున సుమంత్రునకు రాముని వృత్తాంతము కొంత తెలిసినను దానిని ప్రజలకు వివరించలేదు.

సుమంత్రుని రథము అంతఃపురమునం దెనిమిదవ కక్ష్య యందున్న వృద్ధ భూపతి యగు దశరథేశ్వరుని మందిరము కడ నిలచినది. సుమంత్రుడు రథముదిగి లోపలి కేగినాడు. శోకసముద్రమున ఈదులాడు దశరథుని చూచినాడు. రాజు పాదములకు ప్రణమిల్లి రాముని వార్త నందించినాడు. పుత్రుని వార్త నందుకొన్న ఒక్క క్షణకాలముననే దశరథునకు మతి తప్పినది. నేలకూలినాడు. దశరథున కెంత కష్టకాలము వచ్చినదో చూచితిరా ? ఇదియే సంసారాటవిలోని పాంథుని పయనము.

రాజాంతఃపురములు సంసారాటవులు కాకపోవు. చక్రవర్తియు ఒక బాట సారియే. దశరథుని పరికింపుడు.

వృద్ధాప్యము. పుత్రవియోగము. మరణకాలమాసన్నమగుట. అంతఃపురము అగ్నిశాల యగుట కంటె ఏమికావలెను ? సంసారము కర్మఫల రూపమని గుర్తెరుగుట ఈసన్నివేశములోని సారాంశము.

కథకు వత్తము.

కౌసల్యా సుమిత్రలు దశరథుని సమీపముననే యుండుటచే వేవేగవచ్చి, ఆతని సేదతీర్చి ఒక ఆసనముపైన కూర్చొనబెట్టినారు. దశరథుడిప్పుడు కర్తవ్యతా మూఢుడై కూర్చొనినాడు. రాముని అరణ్య ప్రయాణమును గురించి సుమంత్రుని అడుగలేదు. వారి ప్రసక్తి ఎత్తుకొనలేదు.

కౌసల్య దుఃఖము ఏరై పారినది. కైకకు భయపడెడి భర్తనే ఆమె ఎరుగును. నిర్భయముగ తన్నాదరించిన రోజులు ఉండెనో లేదో. ఇప్పుడుకూడ అటులే యుండెనని ఆమె నిర్ణయించుకొన్నది. దశరథుని చూచి, నాధా! కైక ఇక్కడలేదు. రాముని క్షేమ వార్తలడుగవచ్చును సుమంత్రుని అని హెచ్చరించినది కన్నీరు కార్చుచునే. ఆమాట తనకు బాధాకరమైనను కోపము తెచ్చుకొనకయే దోషదర్శియై దశరథుడు పెదవి విప్పినాడు. రామాదుల క్షేమమును అడిగినాడు.

సుమంత్రుడు వెనుకకు మరలివచ్చి, రాముడు గంగా నదిని దాటునప్పటి విశేషములు చెప్పి, తానుమరల అయోధ్యకు తిరిగి వచ్చువరకు గల సందర్భముల నన్నిటిని చక్కగ వివరించినాడు. అందు మనకు ముఖ్యములగు రెండు ఘట్టము లున్నవి. వాటిని వివరించెదను. ఒకటి లక్ష్మణుడు తన తండ్రికి చెప్పుమన్నమాట. రెండు సుమంత్రుడు తాను అయోధ్యకు వచ్చునప్పటి దృశ్యవర్ణనము.

సుమంత్రుడు ప్రప్రథమముగ రాముడు తండ్రికి అందించిన ప్రణామము లను ఆవృద్ధ దంపతులకు తాను స్వయముగ అందించి ఆతని వార్తల నందించినాడు. తరువాతది లక్ష్మణుని సందేశము. లక్ష్మణుడు కన్నుల నెఱ్ఱుచేసికొని నాకు నాతండ్రి యందు తండ్రియను భావము లేదని చెప్పినాడు. నాకు తల్లియు, తండ్రియు సోదరుడును, ప్రభువును ఆత్మబంధువు కూడ రాముడేనని గర్జించి పలికినాడని దశరథునకు తెలిపినాడు.

శ్లో॥ అహం తావన్మహారాజే పితృత్వం నోప లక్షయే.
భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః

ఇది లక్ష్మణుని సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ధర్మలోపమా? అనునది ప్రశ్న. కాదనునది సమాధానము. ఇక్కడ లక్ష్మణుని పాత్ర సామాన్య ధర్మము నతిక్రమించినది. విశేష ధర్మము నాశ్రయించినది శరీర సంబంధ బంధుత్వము నాతడు వదలినాడు. ఆత్మబంధుత్వము నాశ్రయించినాడు.

తనకు కలుగు దుఃఖములను భక్తులు భరింతురు. తన ప్రభువునకు కలుగు బాధలనుగాని, కల్పించు వ్యక్తులనుగాని వారు క్షమించలేరు. వారు ప్రేమించిన భగవంతుని కొరకే వారి జీవితము. ఇక్కడ దశరథుడు స్త్రీ వ్యామోహముచే

భగవంతునకు దూరమై లోక బాంధవునకు కల్పించిన దుఃఖమునాతడు ఓర్వలేక పోవుటయే ఈనిందయొక్క తాత్పర్యముగాని ఇది పితృనిందకాదు. తరువాతి విషయము సుమంత్రుడు తాను వచ్చునపుడు త్రోవలోని విశేషముల తెల్పుట వినుడు.

దశరథేశ్వరా ! ఇక నా రథము అయోధ్యాభిముఖమైనది. కాని రథవాహకము లగు గుర్రములు ముందుకు అడుగిడలేదు. దుఃఖాశ్రువులరాల్చినవి. అంతతో నేనాశృంగిబేరపురమును వదలక గుహుని సేవకులతో రాముని వర్తమానము నందు కొనిబయలుదేరినాను. అరణ్యములు నాకంట బడినవి. ఉద్యాన వనములు చూచినాను. సరోవరములును నాకెదురైనవి. అరణ్యముల స్వేచ్ఛగ చరించు క్రూర మృగములను నేను చూడకపోలేదు. విషసర్పములెన్నియో నాకంట బడినవి. మహారాజా ! అవన్నియు రాముని అరణ్యవాసమును తలచి శోకోపహతములై కన్పట్టినవి గాని సహజములై అవి నాకంట బడలేదు.

ఆ మహారణ్యముల వృక్షరాజములు చిరుమొగ్గలతో కూడి రామ విరహ క్లేశమును ప్రదర్శించినవి లతానికుంజములును అంతియే. ఉద్యానవనములు ప్రతి నిత్య పోషకములై అత్యంత సుకుమారములై కనుపట్టదగియు తమ కోమలత్వ మును కోల్పోయి యున్నవి. రాజా ! అరణ్యముల స్వేచ్ఛా సంచారమున ఆహారముల నందుకొను మనపులేసుగలుపు, వ్యాఘ్రభల్లూకాదులును గూడ తమ ఆహారములగూని స్తబ్ధములై తమలోని శోకమును ప్రదర్శించినవి. క్రూర సర్ప ములును తిరుగాడలేదు. నేనేమని వర్ణింతును ? సరస్సులలోని కలకల ధ్వనులు నాచెవిని బడలేదు. నీటి కాకులు సైతమును కదులాడకయుండ ఆపద్మినులును వ్యాకులములైనవి. వేయేల ? రాముని అరణ్యవాసము స్థావర జంగమాత్మక ప్రకృతినంతను కన్నీటి బిందువుల కార్పించినది. నారథము అయోధ్యయందు ప్రవేశించినది. నగరలక్ష్మియును కన్నీరు కార్చుచునే నాకు దర్శనమిచ్చినదనినాడు.

శ్రోతలారా ! స్థావర జంగమాత్మక ప్రకృతి అంతయు రామునట్లు ప్రేమించి నదని వర్ణించిన వాల్మీకి రామునెవ్వనిగ నిరూపించెను ? రాముడంత ప్రపంచము నకును ఆత్మకాకున్న ప్రపంచమంతయు ఏకాకారమై రామునెట్లు ప్రేమించును ? వాల్మీకి అట్లు చిత్రించె ననుకొనకుడు. అట్టి రాముని తెలిపెననుకొనుడు ముందుకురండు.

దశరథుడేమైన ఈఘట్టమున మాటాడెనా ? తన అంతరాత్మ తన తప్పు త్రోవను పట్టించుట నాతడు గుర్తెరిగి బయటకుచెప్పి ఏడ్చినాడీ ఘట్టమున. నేను నా వృద్ధమంత్రులతో ఆలోచింపక మోహపూరితుడనై చేసిన తప్పిదమిదియని వాపోయినాడు.

కైకేయ్యా వినియుక్తేన పాపాభిజనభావయా
మయా న మంత్రకుశలైర్వృద్ధైస్సహ సమర్థితం॥

న సుహృద్భిర్నచామాత్యైః మంత్రయిత్వా చ నైగమైః
మయాయమర్ధస్సంమోహాత్ స్త్రీహేతోస్సహసాకృతః

రామాయణ మహాకావ్యము దశరథుని వంటి మహారాజుల నెంత సుకుమారముగ విమర్శించినదో చూచితిరా ? రాజు వృద్ధ మంత్రుల నాలోచింపక చేసిన కార్యఫలమును ప్రదర్శించినది. రామాయణ మహాకావ్యము లోకవ్యవహార ప్రబోధకము. (వ్యవహారవిదే) అనినారు అలంకారికులు.

అంతలో సుమంత్రుని సంభాషణ ముగిసినది. కౌసల్య దుఃఖమాగలేదు. సుమంత్రుడోదార్చినాడు. పుత్రవిరహదుఃఖము స్త్రీలకు భరింపరానిది. కావున సుమంత్రుని ఓదార్పుమాటలు ఆమె కన్నీటి ధారలు తుడవలేక పోయినవి.

## జీవుని మరణకాలము

మనమొక ఇంటి నుండి వేరొక ఇంటిలోనికి ప్రవేశింప బోవుట వంటిదే మరణ కాలము. నేటి జనన మరణములు పూర్వజన్మ కర్మాధీనములు. ఇది కాదన రాని సిద్ధాంతము.

మరణ కాలమున జీవుడు తానొనరించిన పుణ్యపాపకర్మల గురించి విమర్శించుకొనును. తాను గావించిన పాపముల తలచి బాధపడును. పుణ్యమును చేసుకొనక పోతినని పశ్చాత్తాపము నొందును. ఈ విషయమును తైత్తిరీయోపనిషత్తు చెప్పినది. "కిమహగ్ంసాధునాకరవం" "కిమహంపాపమకరవమితి"

దశరథునకు మరణసమయము ఆసన్నమైనది తనకౌక కాలమున ప్రాప్తించిన మునిశాపము స్మృతికి వచ్చినది. తానిప్పడు చేసిన తప్పుఆతనిని వెంటాడినది. మామిడి తోటను నరికి మోదుగచెట్టును పెంచితిననుకొనినాడు. ఒకడు మామిడి

పూతను చూచి, మోదుగపూవును చూచి, మామిడి పూతకంటె మోదుగ పువ్వు పెద్దదనుకొని ఆపువ్వు అందించు ఫలము నాశించి మామిడి తోటను నరికి మోదుగ చెట్టును పెంచినాడట. నేనట్లు చేసితినని బాధపడినాడు మామిడి తోటను నరకుట యనగ రాముని పట్టాభిషేక విఘ్నమును కావించుట, మోదుగచెట్టును పెంచుటయన కైకకు స్థానమిచ్చుట. ఈ రెంటినితలచి బాధపడినాడు. వెంటనే కౌసల్యను పిలిచి తనకు ముని ఇచ్చిన శాపమును చెప్పినాడు. ఆశాపమిది. నీపుత్రులెవ్వరును దగ్గర లేని సమయమున హా! పుత్రా! యని తపించుచు ప్రాణమును వదులుదువు అని. దశరథుడు కౌసల్యను వివాహమాడుటకు పూర్వము వచ్చిన శాపమిది.

దశరథుడు వేటకై వెళ్ళి అరణ్యమున అర్ధరాత్రియందు ఒకజంతువు అనుకొని ఒకముని బాలుకుని చంపినాడు ఆముని ఈశాపము నిచ్చినాడు. అత్యుత్కృష్టములగు పుణ్య పాపఫలములు ఈజన్మయందే ఫలించునని సిద్ధాంతము. అదియే దశరథునకు జరిగినది.

అది అర్ధరాత్రి సమయము ఇకతన ప్రాణము నిలువదని దశరథునకు నిశ్చయమైనది. దేహిదేహమునుండి వయనమగునప్పుడు అతడే స్థితిననుభవించునో ఆయనుభవమాతనికి గోచరమైనది. తనచిత్తము నశించుటచే ఇంద్రియములు కూడ తమ తమ కార్యముల నెరవేర్చుట లేదని ఆరాజు గుర్తెరిగినాడు. ప్రక్కనున్న కౌసల్యతనకు కనబడుటలేదు. రామ వియోగాగ్ని జ్వాలలు చెలరేగినవి తనవంటి పాపాత్ము లీలోకమున లేరని నొచ్చుకొనినాడు. రామునివంటి పుత్రుడెక్కడుండునని కుమిలినాడు. చివరకు కౌసల్యను పిలచి తనను ఒక్కమారు తాకుమనినాడు. కౌసల్యా! నీకిట్టి దుఃఖమును కల్పించితినని వాపోయినాడు. సుమిత్రకు కూడ తన పశ్చాతాపమును తెలుపుకొనినాడు. కైకను నిందించినాడు. అంతలో ఆదశరథునకు భగవంతుని పుత్రునిగా కనదగిన మహాభాగ్యము మూర్తియై ఆయనను వరించినది.

దశరథుని మనోనేత్రమునకు రాముడు గోచరించినాడు. ఆయన చిత్తము రామాయత్తమైనది. ఆ అంతః కరణమున ఆత్మారాముడు స్వసంకల్పముచే అవతరించిన కళ్యాణ విగ్రహమును దర్శించినాడు దశరథుడు.

పరిపూర్ణ పూర్ణిమా చంద్రమండలమువలె తాపహారియై, హాయిని చేకూర్చు రాముని ముఖ మండలము ఆయనకు ధ్యేయమైనది. శాంతరసమును చిమ్ముచు జీవుల కనుగ్రహప్రదాయకములగు ఆరాముని ఆకర్ణాంతనేత్ర ద్వంద్వము శాంత

రసము నందించినది. అప్పుడే ఆరాముని ముఖమండలమున తీర్చిదిద్దిన కను బొమల యందచందము గూడ తననాకర్షించగా, ఈసుందరాంగుని ఇక నేనీ లోకమున చూడజాలను. దర్శించుకొను ధన్యులెవరో అనుకొనుచు, హా! రామా! హే! మహాబాహో! మమ ఆయాసనాశన! పితృ ప్రియ. ఎక్కడుంటివి? ఎక్కడికేగితివి? అనుచుండగనే ప్రాణము లామహారాజు దేహము నుండి పయ నించినవి. స్థూలదేహము ఇక్కడ నిలిచినది. సూక్ష్మశరీరము శరీరితో పువ్వులోని వాసనలను వాయువు గొంపోవునట్లు పయనించినది. చూచువారలకా సూక్ష్మదేహము కనబడదు. అందుండు జీవుని కూడ ఎవ్వరును చూడజాలరు. పువ్వు నుండి వెడలి వచ్చు సుగంధమును మోసుకొనిపోవు గాలి నెవ్వరు గమనించగలరు?

ఇప్పుడు దశరథుడు అయోధ్యయందు లేడు. దశరథుడను పేరునొందిన శరీర మక్కడనే యున్నది. ఆ శరీరము లోపల నేను దశరథుడను రాజును, నా భార్యలు వీరు, నా బిడ్డలు వీరని గుర్తించుకొనుచుండు దేహి పయనించినాడు. తరువాతి కథకు పోదము. కాలమెవ్వరికిని సంబంధించి నడువదు. తనంతట తానై పయనించు చుండును. రాత్రి కాలము వెళ్ళిపోయినది. తెల్లవారు జాము వచ్చినది. అది జీవు లందరును నిద్రనుండి మేల్కాంచు సమయము. నేను మహారాజననుకొన్న జీవుడు మేల్కాంచుటకు అతని రాజ్యమున కొన్ని మర్యాదలు జరుగుచుండును. అయోధ్యా నగరమున రాజమర్యాదలు ప్రారంభమైనవి. వందిమాగధులు మేలుకొలుపుల పాడి నారు. వీణావేణు మృదంగ వాద్యముల ధ్వని తరంగములును ఆ రాజగృహమున ప్రతిధ్వనించినవి. రాజు నిద్రనుండి లేవలేదు. దశరథుని ప్రత్యేకముగదర్శించి నిద్ర పుటకై కొందరు స్త్రీలు ఆయన పడకటింటిలోని కేగినారు. అతడు కన్నుల తెరువ లేదు. అది నిద్రయేనా? అను అనుమానమునకు వారు గురికాక తప్పలేదు. మెల్లగ వారు దశరథుని శయ్యాతలము దగ్గర కేగినారు. వారి అనుమానమునకు బలము చేకూరినది. వారాతని తాకినారు. కదలికలేదు. శ్వాసగాలిని పరీక్షించినారు. అదియు మృగ్యమైనది. వారు ఆ గృహాంతర్భాగముననే పరుండియున్న కౌసల్యా సుమిత్రల వద్దకేగినారు. ఆ రాత్రి చింతయు నిద్రలేమియే అప్పుడే కునుకుపట్టిన ఆ ఇద్దరురాణులును దశరథునివలెనే శుష్కించిన తనువులతో కన్నులలో నిలిచిన ప్రాణములతో నుండి నారు.

అంతఃపురములోని కేగిన వారి గుండెలు బ్రద్దలైనవి. అందరొక్కమారుగ ఎలుగెత్తి ఏడ్చినారు. అంతలో కౌసల్యా సుమిత్రల కన్నులు తెరువబడినవి. వారును మహారాజును పరికింపగా రాజు మృతినొందెనని అందరకు నిర్ణయమైనది. దశరధునకు మూడువందల ఏబదిమంది భార్యలు ముగ్గురు రాణులు. ఇప్పుడందరొక్కచోట కూడినారు. వారి ఏడ్పులు మిన్నుముట్టినవి. అందు కైక లేకపోలేదు. కైక పాపిష్టురాలన్న నినాదముతోడనే వారందరి ఏడ్పులను ఆకసమునంటినవి. ఆ సమయమున రాజాంతఃపురమొక్కటే శోకమయమగుటకాదు. నగరమంతయు అట్లే అయినది. నగరవాసులందరును కైకను తిట్టుచునే శోకించినారు. రాజద్రోహమునకు గురియైన కైక, భర్తృద్రోహమాచరించిన కైక, పుత్రద్రోహము చేసిన కైక ప్రజాద్రోహములకు కారకురాలైన కైక అను నినాదము లేనిచోటు ఆ రాజధానియందు లేదు. రాజు శవమా రోజున తైలద్రోణి యందుంచబడినది. శవము కుళ్ళకుండుటకే ఆ విధానము పుత్రులున్నవారికి వారి పుత్రులు వచ్చి దహనసంస్కారములు గావించుట సనాతన భారతీయ సంస్కృతి. ఆ రోజు గడచినది. అప్పటికి రాముని వనవాసము ఏడురోజులు ముగిసినవి. దశరధుని పుత్రులెవ్వరును ఇక్కడ లేరు గదా! ఆ తరువాతి విషయము రేపు.

ఈ నాటికి ఉపన్యాసము సమాప్తము —

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

4 వ రోజు సమాప్తము.

# 5 వ రోజు

శ్లో॥ శ్రీరామచంద్రం ధృతచాపసాయకం
నీలోత్పలాభం నలినాయతేక్షణం
సౌమిత్రిణా సేవిత పాదపంకజం
సీతా సమేతం శరణం భజేఽనిశమ్.

ఆర్యమహాశయులారా !

మన రామాయణ కథా ప్రవచనమున నిన్నటి యుపన్యాసమెక్కడ నిలిచినది? దశరథుని అస్తమయముతో నిలిచినది. రాముడరణ్యమున కేగిన ఆరవనాటి రాత్రి దశరథుని మరణము ఏడవ రోజంతయు దశరథుని మృతకళేబరము తైలద్రోణి యందే నిక్షిప్తమై యున్నది. (తైలద్రోణియన నూనెపాత్రి) ఆనాటి రాత్రి గడచినది. నేడెనిమిదవ రోజు. ఈ నాటినుండి జరుగబోవు చరిత్రాంశము నేటి మన యుపన్యాసము

దశరథుడస్తమించగా, రాముడరణ్యమునకేగగా, భరతుడు తాతగారింట నుండగా నాటినుండి పరిపాలకుడెవ్వడనునది ప్రశ్న. ఈ సమస్య నెవ్వరు పరిష్కరించవలెను? ఆనాడీ సమస్యను మంత్రులు పరిష్కరించలేదు. ప్రజలును పరిష్కర్తలుగ లేరు.

ఉదయభానునితోపాటు నాడు గౌతమ, మౌద్గల్య, కాత్యాయన, మార్కండేయ, జాబాలి, కాశ్యప, వామ దేవులను బ్రాహ్మణ శ్రేష్ఠులందరొక్కచోట కూడినారు. మంత్రిసత్తములతో వారొక సభను ఏర్పాటు చేసినారు. రాజపురోహితులందగ్రగణ్యులు వశిష్ఠ మునీంద్రులు. ఆ వశిష్ఠ మునీంద్రులవంక తిరిగి, గౌతమ కాత్యాయనాది బ్రాహ్మణులందరును రాజు మరణించుటచే నిన్నటి దినమొక్కటే నూరేండ్లవలె గడచినది. కావున రాజపీఠమున శ్రేష్ఠుడగు రాజకుమారునొక్కని ప్రతిష్ఠించుట అవసరము. రాజ్యము అరాజకము కాగూడదు. రాష్ట్ర విప్లవములు చెలరేగును. కావున రాజునొకనిని నిర్ణయింతమనినారు. ఆ సమయమున రాజులేని రాజ్యమున జరుగు ఘోరములు మన రామాయణమున వర్ణింపబడినవి.

# రాజు లేని రాజ్యము

రాజులేని రాష్ట్రమిట్లుండునట.

మొదటి మాట సకాలమున వర్షములుండవట. రైతులు పంటలు పండించరట. కారణమేమి? తాము పండించిన పంటలు తమకు దక్కునన్న నమ్మకము వారి కుండదు. దొంగలవలన భయము మెండై యుండును. ఇట్లే కొన్ని ప్రతిబంధకముల వర్ణించినారు మహర్షి. మంచి మంచి వనములను నాశము చేయుదురు. మనోహరము లైన ఉద్యానవనములు పరిశుభ్రములై యుండవు. సభలు సక్రమములై సాగవు. ఉత్సవములు జరగవు. తగవులు న్యాయముగ పరిష్కారములు కావు. అధికారులు లంచము తీసుకొనుటకు వెనుకాడరు. కళలు పరిపూర్ణములై యుండవు. ఇట్లెన్నియో దోషములు రాష్ట్రమును పాలించు సమర్థుడగు రాజు లేనప్పుడు కలుగునని మహర్షులు కొందరు వర్ణించి దేశమును పాలించుటకు రాజెంత అవసరమో చెప్పినారు చివరకు వారు సిద్ధాంతీకరించిన సిద్ధాంతమిది.

"రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులం
రాజా మాతా పితాచైవ రాజా హితకరో నృణాం"

సత్యధర్మములన రాజే. ప్రజలకు తల్లిదండ్రులును రాజే. వేయేల? దేశ భద్రత రాజుపైననే ఆధారపడినదనినారు. తరువాతి కథ.

కాశ్యపాది మహర్షులును మంత్రులును కూడ ఈ విషయముల చెప్పగా వశిష్ఠులు భరత శత్రుఘ్నుల కొరకై దూతలను కేకయ రాజ్యమునకు పంపినారు. నేనాదేశించితినని వారికి చెప్పి తీసుకొని రండని దూతలకు చెప్పినారు. దశరథుని మృతిని వారికి తెలుపవద్దనినారు.

అది అర్ధరాత్రి సమయము. కేకయ రాజ్యమునకు గిరివ్రజమని కూడ పేరు. అయోధ్యనుండి బయలుదేరిన దూతలు కేకయ రాజ్యమునకు వేవేగ పయనించి చేరుకొనినారు. అది రాత్రికాలమగుటచే వారు రాజభవనముకు వెళ్ళలేను. తెల్లవారినది. దూతలు భరతుని దర్శించినారు. భరతుని చేతికి తాము తెచ్చిన కొంత ధనము నందించి, కేకయ రాజునకును, అతని పుత్రునకును ఆ ధనమును పంచమనగా భరతుడట్లే చేసెను.

కాని భరతుని మనస్సుత్సాహమై లేదు. దూతలు కేకయరాజ్యమున కాలు పెట్టిన ఆ రాత్రియే భరతునకు భయంకరముగ స్వప్నము వచ్చినది. అది దశరథుడు గార్ధభములు కట్టిన రథముపై నెక్కి కొందరు స్త్రీలు వెళ్లనెయుండగా వచ్చని వర్ణముగల మరికొందరు స్త్రీలాతని పరిహసించుచుండ ఎర్రని పూలమాలలధరించి దక్షిణదిక్కునకు పయనించెను. తానునుమాసిన బట్టలతో కొండపైనుండి క్రింద నున్న పేడగుంటలోపడినట్లు కలను గనెను. ఇట్లు కొన్ని దుష్టఘట్టముల నాతడు కలలో చూచి భయస్థుడై యుండెను. తన స్నేహితులతో తనభయమును చెప్పుకొనెను. అంతలో దూతలువచ్చి, భరతా! నీవేవచ్చి తీర్చవలసి ఒక కార్యముండుటచే నిన్ను శీఘ్రముగ తీసుకునిరమ్మనెనని, దూతలు చెప్పగా భరతుని గుండెలదిరినవి. అతడు త్సుకుడై లేడు. ఒక్కమాట. అతని దుష్టస్వప్నముల కేవియో ప్రతిక్రియలు జరుగక పోలేదు

మొదటి జామున వచ్చినకల సంవత్సరమునకు ఫలించును. రెండవ జామున వచ్చినకలకు ఎనిమిదినెలలు గడువు. మూడవ జామమునకు మూడునెలలు. నాలుగవ జామునందు వచ్చిన స్వప్నము మాసములోపల ఫలించును. మంచికలలు వచ్చిన తరువాత నిద్రించరాదు. చెడ్డకలలురాగా శుద్ధుడై శాంతిని చేసుకొనవలెను. మంచి కలలను తెల్లవారగనే బ్రాహ్మణులతో చెప్పి ఆశీస్సులనొందవలెను. ఇట్లేన్నియో ధర్మములను చెప్పినవి భారతీయశాస్త్రములు.

భరతుని చిత్తవృత్తిని కలత నొందించినదీ స్వప్నమొక్కటేకాదు. దూతలు నీవేతీర్చవలసిన కార్యమునకు నిన్ను వేవేగ తీసుకొనిరమ్మని చెప్పినారు గదా? కైకవలన ఏదియో అనర్ధకము జరిగి యుండవచ్చునని కూడ అతడూహించినాడు. దూతలను అందరిక్షేమమడుగునప్పుడు కైకనిట్లు వర్ణించి అడిగినాడు.

"ఆత్మకామా సదా చండీ క్రోధనా ప్రాజ్ఞమానినీ
అరోగాచాపి మే మాతా" అనినాడు.

ఆమె స్వార్ధపరురాలట, చండియట, నేనే పండితురాలనన్న అహంకారము కలదట. భరతుడు తొందరగనే తాతగారి వద్దను మేనమామ దగ్గరను అనుజ్ఞను గొని వారిచ్చిన సత్కారములను తప్పనిసరియగుటచే గ్రహించి, అందర అనుమతితో ప్రయాణమయ్యెను. మధ్యమార్గమున ఆతని పయనము కొన్ని నదులను

వనములను వనమధ్యములందలి దేశములను దాటుచునేసాగినది. అతడు ఏడు రోజులు పయనించి ఎనిమిదవరోజు సూర్యోదయమునకు అయోధ్యకుచేరెను.

అయోధ్య నిరానందమై అతని కగపడినది. వేదపాఠములు వినవచ్చుట లేదు. వచ్చిపోవు ప్రజల సంచారము లేదు. మంగళ వాద్యధ్వనులు నగరసమీపము నకు వచ్చినను వినవచ్చుటలేదు. అవన్నియు అట్లుండ నందనోద్యానవనమువలె నుండు బాహ్యోద్యానవనములు రాలుచున్న ఆకులతో విరిగిపడెను కొమ్మలతో గోలపెట్టి ఏడ్చుచున్నట్లున్నవి. ఆ దృశ్యమాతని మనస్సును తొందరపెట్టగా సారధితో చెప్పి, అరనిమంటలు మనస్సును పరుగులెత్తింపగా అతడయోధ్యానగర మేదియో యొకవిపత్తునకు గురియయ్యెనని నిశ్చయించుకొనినాడు. యధార్థమాతని కెట్లు తెలియును?

భరతుని రథము దశరధేశ్వరుని ప్రాసాద ద్వారమున నిలచినది. భరతుడు తండ్రిని చూచుటకై వేవేగలోనికి వెళ్ళినాడు. అతడక్కడలేడు. సరాసరి భరతుడు కైకేయి మందిరమునకేగినాడు.

కైకకిది యొక మహోత్సవసమయము. భరతుడు తల్లిమందిరమున కేగు నప్పటికి కైక ఎత్తైన సువర్ణపీఠము నధిష్ఠించియున్నది. భరతుడామె కంటబడగనే తటాలున దూకినదా పీఠమునుండి. భరతుడును తల్లిపాదములపై వ్రాలినాడు. పుత్రుని కౌగిలించుకొన్నది శిరమును వాసన చూచినది. పుత్రస్నేహమును వలకబోసి నది. తన పుట్టింటివారి యోగక్షేమముల నన్నిటిని పేరుపేరు వరుసన అడిగినది భరతుడు తల్లి అడుగుప్రశ్నలకు చాల తొందర తొందరగ సమాధానమిచ్చినాడు. ఆతని దృష్టియందవి ప్రధానములై లేవు. ఇప్పుడాతనికి శీఘ్రముగ తెలియదగినది తండ్రి వృత్తాంతము.

భరతుడు తల్లిశయనమందిరము వంకచూడగా ఆమెశయ్యాతలము కళావి హీనమై యున్నది. రాజబంధువుల ఏడ్పులేవియో వినబడుచున్నవి రాజకార్యముల వదలుచో దశరధుని నివాసమీ కైక మందిరముననే యుండెడిది. అదిలేదు. తండ్రి ఎక్కడికేగెను?

ఆతని మనస్సు అనేకవిధములుగ సందేహించినది. తల్లినడిగినాడు. కైకకిది యొక పెద్దఘట్టముకాదు దశరధుని మరణవార్తను ఆమెచాల తేలికగనే భరతున

కందించినది ఏమని? భరతా! నీ తండ్రి, పుట్టిన భూతములన్నియు సహజముగ ఏ త్రోవకుపయనించునో ఆత్రోవకే వెళ్ళెనని, తండ్రికౌగలింతలోని స్పర్శసుఖము నందు కొందమని ఉవ్విళులూరు భరతునకీవార్త నందించినది.

భరతునకది పిడుగుపాటైనది. హ! తండ్రీయని గండ్రగొడ్డలిచే నరకబడిన వృక్షశాఖవలె నేలకూలినాడు లేచినాడు. ఆతనికదియొక ఉన్మాదావస్థయైనది. లేచును. మరల కూలును. తండ్రీ! అని పిలుచును. నేను భరతుడనని చెప్పు కొనును........

కైక దృక్పథమున భర్తలేడు. కొడుకుండెను. భరతుని బుజ్జగించినది. కాలము భూతముల మింగకుండునా? అని వేదాంతమును బోధించినది. కాని భరతుడు నేలపైబడి పొర్లుటను ఆమె ఆపలేకపోయినది. అతడనుకొనివచ్చిన ఊహా ప్రపంచము వేరు. జరిగినఘట్టమువేరు. వానిని తలచుకొని బాధపడినాడు. భరతుని దుఃఖము రాముని స్మృతికి దెచ్చినది. తండ్రి తనకందించు ఆలింగన భాగ్యమును రాముడందించుననుకొనినాడు. కైకవైపుకు తిరిగినాడు

తల్లీ! ఎవడు నాకు అన్నయో, ఎవడునాకు తండ్రికూడనో, బంధువెవ్వరో! నే నెవ్వరికింకరుడనో గుణఖనియగు ఆరామునకు కబురు పంపుమనిచెప్పి, ఆతని పాదములపై వ్రాలుటకు ఉత్సుకపడినాడు అంతలో అతనికింకొకసమస్య స్ఫురించి నది. అంత్యకాలమున నా తండ్రి నాకేమైన సందేశమునందించి వెళ్ళెనా? అని తల్లిని అడిగినాడు.

కైక ఈవిషయమున అబద్ధమాడుటకు పూనుకొనలేదు.

భరతా! నీ తండ్రి ప్రాణములవదలుచు హా! రామా! హా! లక్ష్మణా! సీతా! మీరు తిరిగివచ్చుట ధన్యులు చూతురనుచు ప్రాణముల వదలెనని చెప్పినది.

భరతుని మనసు క్షుభితపడినది తండ్రి మరణసమయమున రామలక్ష్మణు లేలలేరు? సీత ఎక్కడికేగినది? అని ప్రశ్నించినాడు.

కైక రాముని అరణ్యప్రయాణమును తెలిపినది. కారణము భరతుని ఊహ కందలేదు. దండకారణ్యములకు రాముని పంపదగిన తప్పులను రాముడేమిచేసెను?

బ్రాహ్మణధనముల నాశించెనా? నిరపరాధుల శిక్షించెనా? పరదారల పరిగ్రహించెనా? ఇట్టి శిక్ష అతనికేల విధింపబడెను? అని తల్లినడిగినాడు. కైక రాముడట్టి తప్పులను చేయలేదు. రాముడట్టి దోషముంజేయువాడు కాడు. అతడు పరదారల కన్నెత్తిచూడడు అని చెప్పినది. మరి?

కైకకొక్క మారుగలోలోన సంతోషముపొంగినది తన ఘనకార్యమును నివేదించగా తనవలెనే భరతుడును సంతోషించి, తన మహాప్రయత్నముచే సంపాదించిన ఈ ఇక్ష్వాకు సామ్రాజ్య లక్ష్మిని చేపట్టుననుకొన్నది భర్తను పొట్టబెట్టుకొంటినన్న బాధ ఆమెను బాధించలేదు. ప్రజల ఆర్తనినాదములున్ను ఆమెచెవిని బడలేదు ఈ క్షణము వరకును. కైకఇట్టి ఘట్టమున కాదర్శపాత్ర.

పుత్రునకు రాముని దండకారణ్య పయన కారణమును సమగ్రముగ తెలిపి, రాజ్యలక్ష్మిని చేకొనమన్నది.

శ్రోతలు భరతునివైపున కొక్కమారు మరలుడు. అతడు తల్లికి బిడ్డకాలేదు. అతడు రఘువంశ ప్రతిష్ఠాపకుడు ధర్మమూర్తి. అతని జీవితము రామునకంకితము. అతడు రాముని సోదరుడేకాదు. అతడు రాముని దాసుడు. భక్తశిఖామణి, అతని వినిర్మల జీవితమునకిదియొక పరీక్షా ఘట్టమైనది వచ్చెను. మహామహుల జీవితములోని సద్వాసనలు బహిర్గతములై లోకమును గుబాళించవలెనన్న వారి జీవితమునందు కొన్ని ఘట్టములు వారినెదుర్కొని వారి జీవితములు మధించవలెను భరతునకిప్పుడు వచ్చిన ఘట్టమట్టిదే. భరతుడు తల్లిమాటను వినుట తడవుగా కాలిన పుండుపై బడిన కారమువలెయైనది అతని హృదయ వేదనము. అది భరింపరాని దుఃఖమైనది. క్రిందపడి మూర్ఛిల్లినాడు. లేచినాడు. కైకపై అతని చూపులు ప్రసరించినవి. అవి మహోగ్రరూపములైన చూపులు. భరతునకామె తల్లియైకనబడలేదు. దశరథున కామెరాణియని అతడు తలచలేమ. తండ్రి తన అజ్ఞానముచే నిప్పును తెచ్చుకొనెనని అతడు భావించినాడు. ఈ రాజవంశమును భక్షించుటకై వచ్చిన కాళియని ఆమెను చూచినాడు.

ఆమె నిప్పుడేమిచేసిన తన క్రోధము తీరును! నిశితకరవాలమున ఈ ఘాతుకి కుత్తుకను కోయవలె ననుకొనినాడు. రాముడాతని అంతఃకరణయందు సాక్షాత్కరించగా ఆగినాడు. రాముడు కైకను తల్లీ! యని పిలుచును. అది భరతుని అడ్డగించినది. ఈ మహాపాపిష్ఠురాలు నాతల్లియా? ఆహా! నేనెంత దురదృష్టవంతు

డను ? ఈమె అందించు రాజ్యమునకు నేను రాజునా ? ఛీ ! అని తానలంకరించు కొన్న మణి సువర్ణ భూషణముల నూడబెరికి నేలవేసినాడు ఈ ఘాతుకికి వాగ్దండము నైన విధించుట రాజధర్మమని తలచెనేమో తాను తలచిన భావములను వాగ్రూపము నొందించి తల్లిని నిందించినాడు. మంత్రులతో ఈ రాజ్యము రాముని దేనని కంఠో క్తిగ చెప్పినాడు. అరణ్యమున తానుండుటకు నిర్ణయించుకొనినాడు. కౌసల్యా మహాసాధ్వి తలచుకొనగా అతని దుఃఖము పెల్లుబికినది. కౌసల్యా సుమిత్రలను దర్శించుట కాతడు బయలుదేరినాడు. ఏకైక పుత్రుడు కలిగిన కౌసల్య రాముని కొరకై పడు బాధ నాతడనుభవించినాడు.

అది కౌసల్య గృహము. భరత శత్రుఘ్నులిద్దరును కౌసల్యామందిరమున కేగినారు. శుష్కించిన శరీరముతో నేల నంటియున్న ఆ దీనురాలిని చూచినారు. భరత శత్రుఘ్నులకు దుఃఖ మాగలేదు. దుఃఖితులయ్యే ఆమె పాదముల పైబడి ఆ తల్లిని కౌగలించుకొని దుఃఖింపగా, కౌసల్యయు పుత్రవియోగ దుఃఖము ఏరులై పార పెద్దపెట్టున ఏడ్చుచునే భరతుని—

భరతా ! రాజ్యము కావలెనను నీ కోరిక సఫలమైనది. క్రూరురాలై కైకేయి సంపాదించినది ఇక నీవనుభవింపుమన్నది. ఆ మాట భరతున కెట్లుండును ? పుండుపై సూది గ్రుచ్చుకొన్నట్లయినది. "వివ్యధే భరత స్తీవ్రం వ్రణే తుద్యేవ సూచినా." భరతుని కౌసల్య వాక్యము చాల బాధించగా, మరల ఆమె పాదములపై బడి తల్లీ ! నేను రాజ్యకాముడను కాను. నేనీరాజ్యమును కోరియున్నచో పాపులు వెళ్లు లోకములకు నేనును పోయెదనని ఏడ్చుచునే చెప్పినాడు. ఆ పాపము లెవ్వి ? వినుడు.

> ప్రేష్యం పాపీయసాం యాతు సూర్యం చ ప్రతిమేహతు
> హంతు పాదేన గాం సుప్తాం యస్యార్యోనుమతే గతః॥

తల్లీ ! రాము డడవికిబోవుట నాకు సమ్మతమయ్యేనేని నీచులకు సేవ చేసిన వారును, సూర్యున కెదురుగా మూర్చుండి మూత్రపురీషముల విడుచువారును, పరుండి యున్న గోమాతను కాలదన్ను దుష్టులను పోవు మహానరక కూపములకు నేను పోయెద ననినాడు.

బలిషడ్భాగ ముద్ధృత్య నృపస్యారక్షతః ప్రజాః
అధర్మోయోఽస్య సోస్యాస్తు యస్యార్యోనుమతేగతః॥

ప్రజలవలన పంటలోని యాఱవపాలు గప్పము గొనుచు ప్రజలను సంరక్షింపక ఆ ప్రజలను అకలిదప్పులపా లొనుచేయు రాజుపోవు పాపలోకము నకు నేను పోయెద.

విశ్వాసా త్కథితం కించిత్పరివాదం మిథః క్వచిత్
విప్రణోతు స దుష్టాత్మా యస్యార్యోనుమతే గతః॥

స్నేహితుడు తనయందుగల మిత్రభావముతో గొప్ప రహస్యమును తనకు చెప్పగా నద్దానిని వెల్లిబుచ్చువాడు వెడలు నరకలోకమునకు నేనును పోయెదను.

ఉభే సంధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే
తచ్చ పాపం భవేత్తస్య యస్యార్యోనుమతే గతః॥

సూర్యోదయ సూర్యాస్తమయ కాలములందు విధిపూర్వకముగు సంధ్యాను ష్ఠానముల నిర్వర్తించక, దైవప్రార్థనల నలుపక నిద్రించు దుర్మార్గుడు పొందెడు యమయాతనను నేనును పొందెదను.

ఇట్లెన్నియో శపథముల గావించినాడు భరతుడు. కౌసల్య భరతుని తత్వ మెరుగనిది కాదు. ఆమెచే పుత్రవిరహ క్లేశమట్లు పలికించినది. అంతియే. ఆ మాటనే ఆమె భరతునికి చెప్పి, అతనిని తనతొడపై నిడుకొని ఆదరించినది. నీకు పాప మెక్కడిది నాయనా ? అని దీవించినది. ఆ రాత్రి భరతునకును, అతని సోదరునకును, కౌసల్యాదులకును అట్లే గడచినది.

తెల్లవారినది. వశిష్ఠమునీంద్రు లేతెంచినారు. తైలద్రోణియందుంచిన శవము నెంత కాలముంచుదురు ? మునీంద్రులు భరతు నోదార్చి, అతనిచే దహనసంస్కా రాది క్రియల చేయించినారు. ప్రేతకార్యములు సమంత్రకములై నెరవేరినవి పంద్రెండు రోజులు.

అది పదమూడవ రోజు. అత్యంత దుఃఖ సంతప్తుడైయున్న భరతుని శత్రుఘ్నుడు ఓదార్చు సమయము. అప్పుడే తూర్పు వాకిట కేతెంచినది మంధర. భరతుడు తన్ను గౌరవింపగా శత్రుఘ్నుడా భరతుని యనుసరింప, అందరును

తన మెడను పూలదండలతో నింపుననుకొన్నది ఆ దాసి. భరతుడు వచ్చిన తరువాత కైకకు జరిగిన రాజమర్యాద మంథరకు తెలియలేదు కాబోలు. మంథర ఇట్లాలోచించినదట.

తన ఒడలంతయు మంచిగంధము పూసుకొన్నదట. పూలను ముడుచుకొన్నదట శిఖయందు. కైక ఇచ్చిన దశరథేశ్వరుని చొక్కాను చక్కగ తొడిగికొన్నదట. ఇంక ఏమైన అంగవస్త్రము లున్న వల్లెవాటుల వేసుకొని, ఆ అంగాలపై, కైక యిచ్చిన బంగారునగలను, రత్నాభరణములను అలంకరించుకొన్నదట, నడుమున వడ్డాణము పెట్టుకొన్నదట. నడుమునకు తాడు కట్టిన కోతివలె వచ్చినదట. వాల్మీకి వర్ణించినారు. "రజ్జుబద్ధేవ వానరీ" అని వింటిరా? వాల్మీకి చమత్కారరచనను? తరువాతేమి జరిగినది?

మంథర వచ్చిన ద్వారముకడ నిలిచిన ద్వారపాలకులు దానిని చేతబట్టి తీసుకువచ్చి, శత్రుఘ్నునకు వప్పగించినారు. మంథర ఒక్కతయే రాలేదు. ఆ కుబ్జకున్న సఖురాండ్రందరును వచ్చినారు ఆ దాసిని చుట్టి.

రాజపుత్రా! శత్రుఘ్నా! ఇదిగో కొంపకు నిప్పు ముట్టించిన మంథర అని వదలినారు.

నిజమునకు శత్రుఘ్నుడు నిత్యశత్రుఘ్నుడే. అయ్యును ఆ పాపదాసిని చూచి ఉగ్రుడయ్యెను. అది మహోగ్ర క్రోధము. ఆ శత్రుఘ్నుని కోపమును చూచి దాదులందరును తలొక దారికి పారిపోయిరి గాని మంథర మాత్రము ఆ యత్నమున సఫలత నొందలేదు. పట్టుబడినది. అచ్చటి సేవకులు దానిని కదలనివ్వలేదు. పెద్దగ ఏడ్చినదిగాని మంథర గయ్యాళితనమక్కడ సాగలేదు.

శత్రుఘ్నుడొక్కతన్ను తన్నగా అది నేలకూలినది. మరల తన్నగా దొర్లినది. మరల తన్నియు శత్రుఘ్నుడు శాంతించలేదు. భరతుడు నివారించినాడు స్త్రీహత్యకు భయపడి. కైక ఆ దాసిని రక్షింప వచ్చినది. చివాట్లతో ఆమె మరలినది. శత్రుఘ్నుని చేతిలో కైకకు దెబ్బలు తప్పినవి. తప్పించుకొన్నది. అంతతో మంథర ఘట్టము ముగిసినది. కైకయు మౌనము వహించినది. భరతుని పితృకర్మ సమాప్తమైనది. ఇది పదునాల్గవ రోజు. తరువాతి కర్తవ్యమేమి?

భరతుడిక రాజు కావలెను. మంత్రులు సభామంటపము నేర్పరచినారు. సభ నిండినది. వశిష్ఠాది మునులును అందుండిరి. పురవాసులు భరతుడు రాజగుటకు ఎదురుచూచుచున్న సమయమది. భరతుడు సభాస్థలి కేతెంచినాడు. మంత్రులందరును భరతా! దేశము అరాజకమగుట దేశోపద్రవమునకు కారణము గావున ఈ రాజ సింహాసనము నధిష్ఠింపుమని ప్రార్థించినారు.

స్వార్థత్యాగమునకు భరతుని పాత్రయే ఆదర్శము. భరతుడు అభిషేక సామగ్రికంతకును ప్రదక్షిణ నమస్కారము గావించి నేను రాజును కాను ఈ సామగ్రినంతను రామునివద్దకు గొంపోయి అతనినే నేను రాజును చేతునని సమాధానమిచ్చినాడు. భరతుడు రాజు కాలేదు సరిగదా రామునకు తీర్చవలసిన వనవాస దీక్ష నాదియని నిర్ణయించినాడు. ప్రజల హర్షధ్వానములు మిన్నుముట్టినవి. రామునివద్ద కేగుటకు అందరును సిద్ధముకండని మంత్రిమండలినేగాక ప్రజానీకమునంతను ఆజ్ఞాపించినాడు. రామునివద్ద కేగుటకు మార్గములు చక్కదిద్దవలెనని కూడ భరతుని ఆజ్ఞయైనది. ఆ రాత్రి గడచినది. రెండవరోజు ఘట్టము.

మరల ప్రాతఃకాలమున రాజసభ ఏర్పాటైనది. రాజసింహాసనమును ఆ సభాస్థలియందుంచబడినది. భరతుడా పరిషన్మధ్యమున వేరొక ఆసనముపై కూర్చొనినాడు. వశిష్ఠులును సుఖాసీనులైరి. మరల భరతుని రాజు గావించుట కీనాటి ప్రయత్నమును వశిష్ఠులు పరిగ్రహించి మునివర్యులే కోరినారు. భరతా! ఇదిగో నిష్కంటకమగు ఇక్ష్వాకు సామ్రాజ్యము. నీ తండ్రి దశరథుడును, తండ్రి ఆజ్ఞను పాలింపబద్ధ కంకణుడైన రాముడును నీ చేతికందించినారు. కావున శీఘ్రముగ పట్టాభిషిక్తుడవు కమ్మనినారు. అంతేకాక నాల్గుదిక్కులనున్న సామంత రాజులందించు రత్నములను కూడ గైకొనుమని ప్రోత్సాహపరచినారు.

మన మొక్కమారు భరతునివంక తిరుగుదము.

భరతుని ముఖమండలము దుఃఖముచే ఆవరింపబడినది. కన్నులవెంట నీరు కారినది. ఆతనికది భరింపరాని దుఃఖమైనది. గద్గదకంఠుడై సిగ్గువదలి సభామధ్యముననే ఏడ్చుచు హంసస్వరమువంటి కంఠస్వరమున వశిష్ఠునిపై గౌరవము తొలగగా ఆ మహర్షిని తిరస్కరించుచు కంఠస్వరమును పెంచి సమాధాన మిచ్చినాడు.

మునీంద్రా! వేదములు పఠించి వేదాంగములు నభ్యసించి, తదర్థముల గ్రహించి వాని ననుష్ఠించుట శాస్త్రమర్యాదకు బద్ధుడైన నావంటి వాడెవ్వడును ఈ రాజ్యము నపహరింపడు దశరధునకు పుట్టినవాడింతటి అధర్మము నాచరించునని తాము తలచితిరా? నేనును, నా రాజ్యమును గూడ రాముని యధీనము. కావున ఈ ధర్మమును రామునకు బోధించి రామునయోధ్యకు మరల్చుమనినాడు.

శ్రోతలు భరతుని మాటలలోని ప్రత్యేకతనేమి గ్రహించితిరి? అర్థము గావించుకొనదగిన విషయములివ్వి. భరతుడు బ్రహ్మచర్యముచేసి వేదమును చదివెనట. గురువులు నీ విద్యపరిపూర్తియైనదనునంతవరకును విద్యాభ్యాసము గావించి స్నాతకుడయ్యెనట. అంతియేగాక, విద్యారహస్యముల గ్రహింపగలిగిన బుద్ధిశాలి యట అవన్నియు అట్లుండ ధర్మము నాచరించుటయందే నియతమానసుడైయుండెనట. ఇన్ని అర్హతలుగల వాడెవ్వడును ఇట్టి చోరత్వమునకు పూనుకొనడట. మానవున కుత్తమ సంస్కారము కావలెనన్న కేవల విద్యనభ్యసించుటకాదు. ధర్మమును తన ముందుంచుకొనుట భారతీయ జీవన విధానము. జ్యేష్ఠవిభాగమును కనిష్ఠుడువశ గ్రహించుట చోరత్వమని భరతుడు సిద్ధాంతీకరించినాడు. అదట్లుండ పురోహితుని సభయందు నిందించకూడదు. అయ్యును భరతుడు నిందించినాడు. కారణమేమి? పురోహితులైన తాము నాకిట్టి అధర్మమును బోధించుటయా? అది యట్లుండ ప్రజలందరును నిన్ను కోరుచుండిరి. రాజులందరును నీవు రాజగుటకు అంగీకరించినారు. వారు నీకు కప్పములు కట్టుదురు. లోకులు నిందింతురను భయమక్కరలేదు. నిర్భయముగ నీవు రాజ్యమును తీసుకొనవచ్చుననిగదా? సభామధ్యమున వశిష్ఠులు చెప్పిరి? నేను నా ప్రభుత్వమును నలుగురును అంగీకరింపరను భయముచే ఈ రాజ్యమును నాకక్కర లేదంటినా? నేను ఇంతకు పూర్వము రాజకర్తలకు చెప్పగా మరల ఈ సభయందేల చెప్పిరి? అనుభావము భరతుని వివశుని గావించినది. కావున రహస్యముగ నిందింప వలసిన పురోహితుని గూడ బహిరంగముగ సభయందే నిందించి తన నిశ్చితాభిప్రాయమును వెల్లడించినాడు. ఇంతకన్న స్వార్థత్యాగమేమున్నది?

ఒక్కమాట దేశమును ముందుకు నడిపింపదలచిన నేటి విద్యావిధానమును మీరే యూహించుకొనుడు. తరువాతి కథ.

భరతుని మాటలకు వశిష్ఠులేమనిరి? ఏమందురు? అతని ధర్మతత్వమున కానంద పడినారు. అంతతో ఆ సభ ముగిసినది. వశిష్ఠాది మునీంద్రులును ప్రజానీకమును భరతుని ఆజ్ఞను పాలించినారు. రాముని దర్శింతుమన్న పరమోత్సాహము స్త్రీ పురుషులయందు వెల్లిమీరగా అయోధ్యా పుర వాసులందరును రామదర్శనమునకై బయలుదేరినారు. వశిష్ఠ జాబాలి కాశ్యపాది మహర్షులును ప్రయాణమైరి. కౌసల్యా సుమిత్రలతో కైకేయి పయనము కాకపోలేదు. భరతుడిక రాజ్యమును గైకొనడను నిశ్చయము కలుగుటచే కైకయు సంతోషముతోడనే బయలుదేరినది. వేయేల? అయోధ్యంతయు రాముని దగ్గరకు బయలుదేరినది. ఒక్కమాట.

వాల్మీకి మహర్షి వారానాడు మానవ సమాజమునందేయే వృత్తులు కళాత్మకములై యుండెడివో ఈ ఘట్టమున వర్ణించినారు.

రత్నముల సానబట్టువారు, కుమ్మరులు, కమ్మరులు, కమసాలులు, కంబళ్ళు నేయువారు, సుగంధ చూర్ణముల తయారు చేయువారు, నెమలి ఈకలతో విసనకర్రల కట్టువారు, తలయంటువారు, బెస్తలు, గొల్లలు, వైద్యులు, కల్లుగీయువారు, చాకలివారు మొదలగు ఎన్నియో జాతులవారిని వర్ణించినారు. రథగజతురగాది వాహనములతోనేకాక ఎడ్లబండ్లుకూడ నాడు వాహనములైనవి. ఇంతకు పూర్వమేననే మార్గమంతయు చక్కజేయబడినదగుటచే వారి పయనము సునాయాసముగ సాగినది.

అది గంగాతీరము. ఆనాటికి భరతుని పయనమక్కడ ఆగినది. గంగానదీ పవిత్ర తోయముల గ్రుంకులిడి దశరథేశ్వరునకు తర్పణ మాచరించుటకే అక్కడ నిలచినది. శృంగిబేరపురమునకు అధిపతి గుహుండు. అతని అధీనమునందున్నవి ఎన్నియో నావలు. నావికాయానమే శతాబ్దమున కనుగొనిరి? మనవారు? అను అమాయక చరిత్రకారులను తలచకుడు. సృష్టి అనాది. భారతీయుల ప్రతి విజ్ఞాన సూత్రమును అనాదియే అను సిద్ధాంతమును మీ బుద్ధి వృత్తులనుండి తొలగనీయకుడు. వేదములయందు కూడ పడవల వర్ణనమున్నది. కథకు వత్తము.

భరతుని రాక గుహునకు తెలియగనే తన బంధు వర్గముతో గుహుడు స్వాగతమిచ్చుటకు బయలుదేరినాడు. గంగను దాటించు నావలనన్నిటిని సిద్ధముగావించుట కాజ్ఞనిచ్చినాడు. తాను బంధువులతో భరతుని కలియుట కేగినాడు. భరతునకు గుహుండు రాముని ఆప్తుడను విషయమును సుమంత్రుడు తెలుపగా భరతు

డాపందించినాడు. వారిద్దరు కలసికొనుట జరిగినది. వారుభయులు సుస్వాగతముల నందుకొనగా గుహుండు భరతునకును మిత్రుడయ్యెను. సుమంత్రుడు గుహునకీ యరణ్య భాగమంతయు పరిచయమైనదియని తెలిపినాడు. భరతుని కోరికపై గుహుండు మిమ్ముల నేనును నా వారును బాణముల ధరించి వెంటనంటుదుమని భరతునకు ధైర్యము నొసంగినాడు.

ఆనాటి భరతుని సైన్యమునకంతకును ఆతిథ్యము గుహునిదే. అంతలో ప్రొద్దు గ్రుంకినది. ఈ రాత్రి ఇక్కడనే వసింపుడని గుహుండు భరతుని కోరగా రాముని ఆత్మస్నేహితుడు రాముడేనను భావమున గుహుని సన్మానించినాడు భరతుడు. వారిద్దరును ఆప్తమిత్రులనుకొనుట సందేహములేదు. అయ్యెను గుహునకు భరతుని గూర్చిన సందేహము అంతర్గతమై యున్నదనుట నిస్సంశయము. రాముని యందు గుహునకు గల భక్తియే అందుకు కారణమనక తప్పదు. గుహుండు బయట పడినాడు.

భరతా ! నీవయనము నాకు సందేహమును కల్పించుచున్నదనినాడు. కారణ మేమందువా ? రామునితోడితెచ్చుట కింతసైన్యమెందుకు ? ఇదియే నా సంశయము నకు కారణమనినాడు.

ఈ భావము గుహునకు మొదటనే కలిగినది. నేను రామునకు స్నేహితుడ నగుటచే నన్ను బంధించుటకుగాని, రామునిపై దండెత్తుటకుగాని ఈతడు పయన మయ్యెననియే భావించినాడు. కావుననే అతడు తన బంధువులనందర జాగ్రత్త పరచి నాబంధువులతో కూడ వచ్చి మీకు దారి చూపుదుననినాడు. ఈ ఘట్టమున భరతుని సమాధానమేమి ? ఈఘట్టమున భరతుని సమాధానమును, ఆతని పాత్రయు వాల్మీకి మహర్షిచే చాల చక్కగ వర్ణింపబడినవి ముందా శ్లోకమును వినుడు. భరతుని వర్ణన ఇది.

తమేవమభిభాషంతమాకాశ ఇవ నిర్మలః
భరతశ్లక్ష్ణయా వాచా గుహం వచనమబ్రవీత్.

గుహుండడిగిన ప్రశ్నకు ఆకాశమువలె నిర్మలుడై మధురముగ సమాధాన మిచ్చెనట భరతుడు. ఇచ్చట భరతుని ఆకాశమునకు పోల్చినారు కవి ఆకాశము అతిస్వచ్ఛము. దానికి సంగదోషములేదు. అది ఎన్నడును మలిన

సహితముకాదు. చూచువారలకు మాత్రమది మేఘముంచే కప్పంబడినట్లు కనబడును. అది చూచువారి అజ్ఞానము. ఇక్కడ గుహునికి భరతునిపై కలిగిన అనుమానమునకు కారణము గుహుని అజ్ఞానమని సూచించినారు. ఇక భరతుని సమాధానమును వినుడు.

"మాభూత్సకాలో యత్కష్టం న మాం శంకితుమర్హసి

గుహా! నీవు శంకించదగు శంకకు అవకాశమిచ్చునది ఈ యుగము కాదనినాడు. కలిదోషము నన్నావరింపలేదనినాడు. తన భ్రాతృభక్తిని వెల్లడించి తన నిజ హృదయమును గుహునకు తెలిపినాడు. గుహుడు తన సంతోషమును గూడ వెలిబుచ్చినాడు. కాని అంతతో వారి సంభాషణ ముగియలేదు. తనకు రాముని యందుగల భక్తి ప్రవృత్తులను లక్ష్మణునకు రాముని యందలి ప్రేమాతిశయములను వర్ణించుచు గుహుడు కొంత కాలమును గడపినాడు. అంతలో సూర్యుడస్తాద్రి కేగినాడు. రాత్రియరుదెంచినది. సామాన్యమగు భూతజాతమంతయు నిద్రజెందినది.

భరతునకు నిద్రపట్టలేదు. అతని హృదయక్షేత్రమున రాముని కఠిన కాంతార క్లేశములు పరివర్తనలగుచుండ అతడెట్లు నిద్రపోవును ?

భరతుని చిత్తమిప్పుడొక అగ్నికుండమైనది. సంకల్పము లాతని వదలుట లేదు. మానసిక తాపమును చల్లార్చునది ఆత్మప్రియుమును గూర్చువారి గుణకథనము. ఇప్పుడు భరతుడు దానినే కోరి గుహుని దగ్గర కేగినాడు.

గుహుడు రామభక్తాగ్రేసరుడు. రాముని గుణవర్ణనము నాతడు చేయగలడు. భక్తశేఖరుల ముఖము నుండి వెలువడి వచ్చునవి అమృతసూక్తులు. అవి భగవద్గుణాను వర్ణన లగుటయే ఆసూక్తులకా పేరు వచ్చినది

గుహుడు భరతునకు రామలక్ష్మణుల ప్రయాణ విశేషముల వర్ణించుట ప్రారంభించినాడు. అందు లక్ష్మణుని భక్తి తత్పరత వర్ణితమైనది. రాముని ప్రభావమును రాకపోలేదు.

భరతుని చిత్తమొక ఘన పదార్థముకాదు. ద్రవీభూతమగు చిత్తము. తన ప్రభువుయొక్క సౌకుమార్యమాతని కనులకు కట్టినట్లుండగా అసుకుమార గాత్రుని కఠిన కాంతార క్లేశములును ఆతని చిత్తమునందు నిలచినవి. అదృశ్యమాతడు భరింపగానిది అంతతో భరతుడు క్రిందకూలినాడు. అదియొక విధమగు మూర్ఛ.

దానినొక విధముగ సమాధిస్థితి యనుట కథా ప్రపంచమును అర్థగించు మాటకాదు. రామకథా శ్రవణయొక ధ్యాన యోగమనుట సార్థక నామము. కావున భరతుని పతనము మూర్ఛయు, భక్తి సమాధియు గూడనైనవి. మనము కథా భాగమును తలచుచో కౌసల్యకు భరతుని మూర్ఛ దుఃఖకారణమైనది. ఆమె విలపించినది. పుత్రవియోగమునకిది తీసిపోకయే భరతునిమూర్ఛ ఆమెను శోకసముద్రమున ముంచినది. అంతనొక్క ముహూర్తకాలము గడచినది. భరతుడు లేచినాడు. కౌసల్య నోదార్చినాడు.

భరతునకు అన్నగారెక్కడ పరుండిరో ఆహారములనెక్కడ స్వీకరించిరో తెలుసుకొనవలెనను యూహ పొడమినది. గుహుని అడిగినాడు. గుహుడు నాడు రాముడు తాను సమర్పించిన సరసపదార్థముల గ్రహింపక లక్ష్మణుడిచ్చిన జల పానమునే గావించుటను తెలిపి రాముడు సీతతో కూడ శయనించిన స్థలమును చూపించినాడు. అదికరుకునేల. ఆనేలపైన దర్భశయనము. ఆకరుకు దర్భలపై హంస తూలికా తల్పముల సౌధాగ్ర భాగముల పరుండదగు సుకుమారగాత్రుని శయ్యాతలము. భరతుని హృదయమేమగును? ఎట్లుండును? ఆయనుభవము భరతునిదే. కాని భరతునివంటి వారిది కూడ కావచ్చును. భరతునకు దుఃఖ మాగలేదు. రాముని శయ్యాతలమునకు ప్రక్కనే యున్న జానకీరమణి నిద్రించిన స్థలమును అతడు చూచినాడు. సీతాకాంత ధరించిన పట్టుపుట్టము నందలి దారము లాతని కంటబడగా, పొంగి పొరలి వచ్చు దుఃఖము నారాజపుత్రుడు మ్రింగలేక పోవుట అతని అసామర్థ్యము కాదు. ఆశోక వేగమాతని మెత్తని మనసును కోసి వైచినది. అంతలో సీతాసాధ్వి ధరించిన ఆభరణములందలి సూక్ష్మ ఖండములును ఆతనికంట బడినవి. అట్టి ఘట్టమంతయు తనకు భరింపరానిదై భరతునకు వనవాస దీక్షనొసంగినది. ఆక్షణమునకే భరతుడు నేనిప్పుడు రాజపుత్రుడనుకాను. ఆరణ్యక వ్రతదీక్షితుడననుకొనినాడు. నారచీరలుధరించి జడ దారి యగుట కాతని చిత్తము గట్టిదైనది. అది మామూలునట్టి తాత్కాలిక వైరాగ్యముకాదు. ఆక్షణముననే అతడు నారచీరెలు ధరించినాడు. చేతులెత్తి దేవతలకు మ్రొక్కినాడు. నేను రాముని పట్టాభిషిక్తుని గావించెద. అరణ్యజీవితమును నేను గడపెద. ఓ దేవతలారా! నా సంకల్పమును సఫలము గావింపుడు అన్నది అతని దీక్ష.

నేసీక్షణము మొదలు భూమిపైననే పరుండెద. లేక దర్భలపైన పరుండెద. కందమూలములే నాకాహారములు-వనవాసమున రామునకు గడిచిన రోజులుగాక మిగిలినరోజులు నావి కాగా శత్రుఘ్నుడు నన్ననుసరించును.లక్ష్మణుడు రామునితో రాగా అయోధ్యయందలి బ్రాహ్మణోత్తములా రామునితో రాజ్యాభిషేకము గావింపవలెను. దేవతలారా నాకోర్కెను సఫలముగావింపుడని, రాముడు పరున్న ప్రదేశమున పరుండినాడు. ఆరాత్రి గంగ ఒడ్డుననే గడచినది. మరుసటి దినము కథ రేపే. ఈనాటికి మన ఉపన్యాసము సమాప్తము—

ఓం శాంతి శాంతి శ్శాంతి శ్శాంతిః

# 6వ రోజు

శ్లో॥ యత్పాద పంకజ రజః శ్రుతిభిర్విమృగ్యం
యన్నాభి పంకజ భవః కమలాసనశ్చ.
యన్నామసార రసికో భగవాన్ పురారిః
తం రామచంద్ర మనిశం హృది భావయామి.

ఆర్యమహాశయులారా!

మన భారతీయ వాఙ్మయమొక మహాసముద్రము. ఈ మహాసముద్రమే ఈ విశాల విశ్వంభరావలయమును వ్యాపించి ఖండ ఖండాంతర వాసులకును విజ్ఞాన విశేషముల నందించినది. సృష్టి ఖండమునందలి సమస్త విజ్ఞాన స్రవంతులును ఈమహోదధిలోని అంశాంశము లేనసుట అత్యుక్తికాదు.

వాగ్దేవియొక్క తొలి యవతారమును గుర్తెరిగించినది మన వాఙ్మయమే అదియే శబ్దశాస్త్రము సృష్టికి పూర్వము నందున్నదేదో నిర్వచించినది మన వాఙ్మయమే అదియే ఉపనిషద్వాఙ్మయము. ఇది వేదములలోని భాగము. భారతీయ వాఙ్మయము ఆదిమానవునితో ప్రారంభమైనదని భావించుట విజ్ఞాన ప్రపంచమున తప్పటడుగులువేయు శైశవావస్థ.

జన్మ జరామృత్యువుల నెదుర్కొని స్థిరతనొందిన ఆత్మానందము ననుభవించుటకు మానవుడు సమర్థుడని చాటినది భారతీయ వాఙ్మయమే.

శ్రోతలారా! వేదశాస్త్రములు సమాజనిర్మితములని బాలకుల వాదములలో ప్రౌఢత్వమున్నదని భ్రాంతి నొందకుడు. అంధకార బంధురమగు మహా సంసారారణ్యమున పయనించు బాటసారికి త్రోవనుచూపునవి. వేదశాస్త్రములలోని విజ్ఞాన కరదీపికయే. ఈ కరదీపిక ఆరిపోవునదికాదు. కృత్రిమ సృష్టిలోనిది కాదు.

కథకు పత్తము

మనము భరతునితో పయనించుచుంటిమి. ఆతడు తనకెదురై వచ్చిన నిష్కంటక సామ్రాజ్యలక్ష్మిని త్యాగము గావించి రాముని పాదారవిందముల సమర్పించుటకై బయలుదేరి నిన్నటిరాత్రి గంగానదియొడ్డున ఇంగుదీవృక్షము క్రింద నిలచినాడు నిన్నమనమును అక్కడనే నిలచితిమి. ఈనాడు అక్కడనుండి ఆతడు రాముని వద్దకు బయలుదేరును. మనమును పయనింతము

రాత్రి గడచినది. ఇక భరతుని పయనము సాగవలెను. భానుడును ఉదయాద్రి నెక్కినాడు.

గంగాస్రవంతి అగాధమగు మహానది. కావున దానిని దాటుటకు గుహుని నావలు బారులుతీరినవి. అవి అయిదువందల నావలు. నావికులు గుహునిబంధువులే.

తన వారితోడను తన బలగముతోడను బ్రాహ్మణ ప్రవరులతోడను ఆ నావల నధిరోహించినాడు భరతుడు. ఎక్కువారి అర్హతల ననుసరించియే ఆ నావల కూర్చబడినవి. క్రిక్కిరిసిన జనమును క్రమబద్ధముచేసి పడవల నెక్కించుటకు రక్షకభటులక్కడ లేకపోలేదు ముందు వశిష్ఠాది మునులును తరువాత బ్రాహ్మణ ప్రవరులును ఆతరువాత మహారాజ కుటుంబములును ఎక్కినారు. సైన్యమును ఇతర వర్గములను, ధనధాన్య సంచయమును ఆ పడవల ఆధారముననే దాటవలెను. ఆ నావలన్నియు స్వస్తిక చిహ్నములతో పతాకాలంకృతములైనవి. పడవలకు తెరచాపలెత్తబడినవి. నావికులత్యుత్సాహముతో నడుప నారంభించినారు. నాటికి నావికాయానము లేదనకుడు.

నావలన్నియు సునాయాసముగనే గంగకు అవ్వలి ఒడ్డును చేరుకొన్నవి. అప్పటికి మైత్ర ముహూర్తము వచ్చినది. నదిని దాటుటకు ఆరుఘడియల కాలము

పట్టినది. మైత్ర ముహూర్తమన ప్రాతఃకాలమునుండి మూడవ ముహూర్తము. గంగకు అవ్వలి ఒడ్డుననే ప్రయాగవనము. భరతాదులు ఆవనముననే నివాసముగ చేసుకొనినారు. ఆవనమునకొక క్రోసెడు దూరమున్నది భరద్వాజ మునీంద్రుల ఆశ్రమము.

భరద్వాజమునీంద్రులు చాల తపఃప్రభావ సంపన్నులు. మూడు వందల సంవత్సరములు బ్రహ్మచర్యదీక్షితులై వేదాధ్యయనము గావించిన వేదవిదులు. ఆ మహర్షి వారిని దర్శించి వారి ఆశీస్సులతో భరతుడు రామదర్శనమును గావించుకొనవలెను. మహారాజులు ధనుర్ధరులై మహర్షుల ఆశ్రమములకు వెళ్ళకూడదు రథములనెక్కియు, అశ్వవాహకులయ్యును వెళ్ళరాదు. సైన్యముల నక్కడ దింపకూడదు. పాదచారులై పవిత్రమూర్తులై వారిని దర్శింపవలెను. భరతుడట్లే తన సైన్యమును ప్రయాగవనమునందే యుంచి తాను పాదచారియై వశిష్ఠుల ముందిడుకొని పురోహితునితో మునీంద్రుల దర్శింపవెళ్ళినాడు. భరతుని కిది యొక పరీక్షా కేంద్రము.

భరద్వాజులు వశిష్ఠుని కెదురేగి తోడితెచ్చి అర్ఘ్యపాద్యాది విధుల నర్పించి భరతుననుగూడ అతిథి సత్కారముల గావించినారు. కాని ఆ మహాముని అంతతో తృప్తి నొందలేదు. భరతుని ప్రయాణరహస్యమును తెలుసుకొనదలచినారు.

భరద్వాజుడు భరతునిట్లు సూటిగ ప్రశ్నించినారు. ఏమని?

భరతా! నీచేతి కందిన మహారాజ్యము నీకు తృప్తిని కలిగించక సైన్యముతో రామునిపైకి యుద్ధమున కేగుచుంటివా? అని. ఇప్పుడు భరతుని స్థితిఏమి? అతని హృదయము మొక్కమాఱుగ అగ్నిమండలమున పడినది. సువర్ణమువలె తాపతప్తమైనది. మెరసిపోవు అతని హృదయకాంతులు బహిర్గతములైనవి. హతోస్మి! హతోస్మి! మునివర్యా! తమవంటి మహనీయులే నన్నిట్లు సంశయింపగా నేనెట్లు బ్రతుకగలను? నేను రామునిపైకి యుద్ధమునకు పోవుటలేదు. ఈ ప్రజానీకముతో ఈ సైన్యముతో రామపాదారవిందముల దర్శించి నాంజలిఘటించి రాముని అయోధ్యకు తీసుకొనివచ్చుట కేగుచుంటిననినాడు.

భరద్వాజునకు భరతుని హృదయము తెలియనిది కాదు. ఆ భరతరాణ్మణిని సానబట్టినారు. రత్నము శాణనిఘృష్టముగాక మెరయునా? కావుననే భరతా! నిన్ను

వేనెరుగని వాడనుకాను. నీభక్తిని మెరుగుపెట్టుటకై ఇట్లంటినని సమాధానమిచ్చి నారు. భరతుని మనసును గట్టిపరచినారు.

భరతుడు రాముని వద్దకేగుటకు మార్గమును తెలుపుడని మునిని అడుగగా రాముని నివాసము చిత్రకూటమునందని తెలిపి, ఆమార్గమునుకూడ విశదీకరించి నేటికి నీవయన్నమాపి సైన్యముతోగూడ మా పరిపూర్ణ ఆతిథ్యమును స్వీకరించి వెళ్ళుమనినారు.

భరతుడు ఋషి అందించిన కందమూలములకు తృప్తిని ప్రకటించియు వారి ఆజ్ఞను శిరసావహించి భరద్వాజాశ్రమమునే ఆరాత్రి నిలచినాడు.

## భరద్వాజుని ఆతిథ్యము

ఇది ఒక అపూర్వమగు ఆతిథ్యము. భౌతికవిజ్ఞానమును మాత్రమే చూడ గలిగి యాంత్రిక జీవితమునకు మాత్రమే విస్మయము నొందుచు, ఇంద్రియములచే గ్రహింపరాని విషయముల నెరుగని కూపస్థమండూకములై యుండువారు నమ్మజాలని ఆతిథ్యము.

గ్రుడ్లగూబ పగటికాలము నెరుగదు. సూర్యుడుండెనని నమ్మదు. అంతియే భౌతిక విజ్ఞానమాత్ర పండిత ప్రకాండుల బుద్ధి వైభవమని గ్రహించి మహర్షివారి తపఃప్రభావ సంపన్నత్వమును గ్రహింపుడు.

శక్తులు రెండు విధములు. బాహ్యశక్తి, అంతరశక్తి అని. అంతరశక్తి ఒక మహాసముద్రము. బాహ్యశక్తి అందలి తరంగములు. సృష్టిఖండమంతయు దీనిని ననుసరించియే యున్నది. శబ్దము స్థూలము, ధ్వనితరంగములు సూక్ష్మములు. ఋతీయ తపఃప్రభావ సంపన్నత్వము సూక్ష్మాతిసూక్ష్మము. కథలోనికి పోదము.

భారద్వాజమునీంద్రులు భరతునకివ్వదలచిన ఆతిథ్య ద్రవ్యమును చేకూర్చు టకై వారి పర్ణశాల యందొకభాగమున నిర్మితమైయున్న అగ్నిహోత్ర గృహము లోని కేగినారు. ఆచమనము చేసినారు. కన్నులు నరమోడ్చినారు. అర్థనిమీలిత నేత్రులై అపౌరుషేయము ఆలౌకికమునగు వేదమంత్రములతో దేవలోకములలోని దేవతల నాహ్వానించినారు. ఆదేవతలను పిలుచుటకు వారు పలికినపలుకులు క్రమ బద్ధములు. దీనినే వాల్మీకిమునులు శిక్షాస్వర సమాయుక్తములని వర్ణించినారు.

ప్రకృతిలోని సృష్టి విశేషముల కన్నిటికిని యజమానులగు వారు కొందరుందురు. వారిని నియమించినవాడు భగవంతుడు. మన లోకమున జీవులకు భోగ్యములగు పదార్థములన్నియు లోకాంతరములలోని ఆయజమానుల స్వాధీనము నందుండును. వారికే అధిష్ఠాన దేవతలని పేరు. వారి శరీరములు తేజోమయములు. వారి సంకల్పములు సత్యసంకల్పములు. వారి సంకల్ప మాత్రముననే స్థూలమగు భౌతికసృష్టి ఆకృతినొందును. ఒక్కొక్క కళయందారి తేరిన పుణ్యాత్ములకే ఆయా అధికారము లివ్వబడును. వారందర పిలచి ఈ యీ కార్యముల మీరు చేయుడని కోరుటకే భరద్వాజులు అగ్నిహోత్ర గృహములోని కేగినారు.

విశ్వకర్మ దేవశిల్పి. అతనిని గృహనిర్మాణముల కాహ్వానించినారు. అతనితో అత్యంత వైభవోపేతములగు భవనములు నిర్మితములైనవి.

అవి కేవల రాజభవనములే కావు. గజాశ్వబృందములకు ప్రత్యేక ప్రత్యేక శాలలు నిర్మితములైనవి. స్నాన భోజన పానశాలలు నిర్మితములైనవి. భోజన పదార్థముల సృష్టికై ఓషధీ నాయకుడగు చంద్రుని ఆహ్వానించగా అతడు భక్ష్య భోజ్య చోష్య లేహ్యాది పదార్థములనేగాక మాంసవిశేషములతో అనేక వంటకముల సృష్టించినాడు. త్రాగుట కింపైన పుష్పాసవ మధ్వాసవములు కూడ సృష్టింపబడినవి. భూలోకవాసులు తెరుకలేని పుష్ప గుళుచ్ఛములతో ప్రతి ఒక్కరును తమ కంఠసీమల నలంకరించుకొనదగు పూలమాలలు వేనకువేలు కుప్పలు తయారైనవి.

భూమిపై కన్నట్టదగు సుందరదృశ్యముల సృష్టించుటకు భూదేవిని కోరగా భూకాంత సుందర సుకుమార వనసుందరుల నెందరనో పంపి, మెట్టపల్లములులేని సమతల ప్రదేశముల వారినందర నిలపినది. అది భూదేవి వినూత్నాలంకారములతో అలంకరించుకొని ప్రత్యక్షమైనట్లున్నది. విశ్వకర్మ నిర్మితములైన నాట్యకళా ప్రదర్శన మండపములలో ప్రదర్శనల నిచ్చుటకు గంధర్వాద్యప్సరోగణమును, నారద తుంబురులును ఆహ్వానితులై వచ్చినారు. మఱయ పర్వతాదులు శాశవృంతములై చల్లని పిల్లగాడ్పులతో అందరకును విశ్రాంతి సుఖము నొసంగినవి. ఇన్ని మాటలెందుకు ? నాడు భరద్వాజ మునీంద్రుని ఆశ్రమము స్వర్గధామమైనది.

అందొక రాజసభామంటపము నిర్మితమైనది. రాజాసన సచివాసనములు ఆ సభామంటపమున ముఖ్యస్థానములైనవి. భరతుని ఆ సభామంటప ప్రవేశమున కాహ్వానించి ఆ యాసనముల చూపగా భరతుడు రాజాసనమున కూర్చుండ లేదు. అది రాముని దని సచివాసనమున కూర్చొనినాడు.

బ్రహ్మాది దేవలోకముల నుండి వచ్చిన సుందరాంగనల చేతను నారదాది సంగీత విద్వాంసులచేతను ఆ సభయందు లయతాళ బద్ధములగు నృత్య గీతము లారంభమైనవి.

మారేడుచెట్లు మద్దెలల వాయించినవి. రావిచెట్లు నృత్యముల చేసినవి. లతా నికుంజములు స్త్రీ రూపముల ధరించి, ప్రజలను స్నానభోజనాదికముల కాహ్వానించి నారు. తలంట్లు పోయుటకు ఒక్కొక్క మగవానికి ఎనమండుగురు స్త్రీలు మెరుపు తీగెలవలె మెరయుచు నలుగు పెట్టి జలకముల నాడించినారు.

తెల్లవారినది. ముని ఏర్పరచిన విందు పూర్తియైనది. ప్రాతఃకాలమున భరతుడు భరద్వాజుని దర్శించుట జరిగినది. కౌసల్యా సుమిత్ర కైకేయీలతో. మునివర్యులు నీ తల్లుల ముగ్గుర తెలుపు మనగా భరతుడు తనతల్లిని కౌసల్యా సుమిత్రలతో కలపలేదు. రామలక్ష్మణులను కన్న భాగ్యవంతురాం డ్రనివారిద్దర పరిచయము గావించినాడు.

ఎవ్వతె గావించిన పాపముచే రామలక్ష్మణులు బ్రతికియు చచ్చినవారివలె అరణ్యముపాలై యుండిరో, ఏ పాపాత్మురాలి పాపముచే దశరథుడు మృతి నొందెనో ఆ కనబడు చండియే ఈ మదదృష్టవంతుని కన్నతల్లి యని కైకను ప్రత్యేకించి తన బాధను వెళ్ళగ్రక్కినాడు. మునీంద్రులు కైకను భరతుడు నిందించుటకు సమ్మతించలేదు. అరణ్యములలోని దేవదానవాది శాపగ్రస్తుల శాప విమోచనమగుటకు రాముని దండకారణ్యములకుపంపిన పుణ్యాత్మురాలీ కైకయేనని భరతునకు సమాధాన మిచ్చినారు. మునీంద్రులీ సమాధానమును భరతున కందించు టకే నీతల్లులను పరిచయము చేయుమని కోరినారు. "నదోషేణావగంతవ్యా కైకేయి భరతత్వయా". ఇంతతో భరతుని భరద్వాజాశ్రమ కార్యక్రమము ముగిసినది. భరద్వాజ మునీంద్రుల అనుజ్ఞతో వారు తెలిపిన బాటల ననుసరించి భరతుని చిత్ర కూటాద్రి పయనము సాగినది, ఆతని మహా సైన్యముతోకూడ.

అది ప్రాతఃకాలము. చిత్రకూటమున సీతారాముల విహార యాత్రానందము ముగియగా సీతారాము లొక్కచో కూర్చొని పక్వమాంసముల భుజించుచున్న సమయము. వారు మాంసముల పక్వము గావించుటకై ఏర్పరచుకొన్న అగ్ని మండలము నుండి ఆకసమున కెగయు ధూమము చిత్రకూటాద్రి యందున్న రాముని దర్శించుటకై వచ్చు భరతుని సైన్యమునకు మార్గదర్శకమైనది.

చిత్రకూట పర్వతప్రాంతము సైన్యాక్రాంత మైనది. పర్వత సానువుల యందు తిరుగాడు పశుపక్ష్యాది గణము చిందరవందర యైనవి. ఆకసమున ధూళి కమ్మినది. రాముడు ఈ సంచలనమునకు కారణ మరయగోరి లక్ష్మణుని ఆజ్ఞాపించినాడు.

లక్ష్మణుడు చెట్ల నెక్కుటయందు నేర్పరి. అతడొక సాలవృక్షము నెక్కినాడు. రథ గజ తురగ పదాతులు వెల్లువయైవచ్చుట అతని దృక్పథమున పడినది అది భరతుని సైన్యమని అతడు నిశ్చయించుకొనినాడు.

లక్ష్మణుని రక్తము పొంగిపొరలినది. క్రోధము మూర్తీభవించినది. అతని అంతరంగమున రణరంగము ప్రత్యక్షమైనది. రాముని కవచధారణము గావింపుమని, సీతను గుహాభ్యంతరమున దాచి, పై కెగయు పొగను రాకుండ చేయుటకు నిప్పును చల్లార్పుమని హెచ్చరించినాడు. అతడు చెట్టు నుండి దిగలేదు,

లక్ష్మణుని క్రోధదీప్తి రామునకు క్రొత్తకాదు. కారణ మడిగినాడు. లక్ష్మణుడు కన్నుల నెఱ్ఱజేసికొని భరతుని రాకను తెలిపి, ఆ వచ్చు భరతుని, భరతుని సైన్యమును కూడ నే నొక్కడనే వధించి చిత్రకూటమును రక్తసిక్తము గావింతునని సమాధాన మిచ్చినాడు. భరతుని వధించుట దేనికట? ఇక్ష్వాకు సామ్రాజ్య లక్ష్మిని రామపాదారవిందములకు కర్పించుటకేనట. ఇప్పుడు రాముని కర్తవ్యమేమి? భగ్గుమని మండిన లక్ష్మణుని భ్రాంతిని తొలిగించవలెను.

జీవుడు రజోగుణ ప్రధానుడైనప్పుడు భగవంతు నెట్లు పరిపూర్ణముగ కనుగొనజాలడో అట్లే భగవద్భక్తులను కూడ కనుగొనజాలడు. భ్రాంతిసహిత చైతన్యము జీవచైతన్యము. భ్రాంతిరహిత చైతన్యము బ్రహ్మచైతన్యము. రాముడు ఆత్మారాముడు. భగవంతుడు. అతడు తన భక్తకుటుంబములోని వారి పరస్పర భ్రాంతులను తొలగించి అందర కృతార్థుల గావించును. లక్ష్మణుని భ్రాంతిని చక్కగ తొలగించినాడు.

లక్ష్మణా! నేను తండ్రిని చంపి, సోదరుల చంపి, ఆ రక్తాన్నమును తిని ఆనందించువాడను కాను. నాకు రాజ్యకాంక్ష లేదు. భరతుడు సోదరఘాతకుడు కాడు. అతడు నీవనుకొనట్లు మనల చంప వచ్చుటలేదు. అతడు గృహమునకు వచ్చుటతోడనే నా అరణ్యవాసము చెవిని బడగా కైకమాటను కాదని నన్ను

పట్టాభిషిక్తుని చేయుటకే ఆత దేతెంచుచుండెను. లక్ష్మణా! నాకీ సంపదలే కావలసి వచ్చుచో ఈ అఖండ మహీమండలము నంతను నే నొక్కడనే సంపాదింప సమర్ధుడను. నీకు రాజ్యము కావలెనన్న భరతుడు వచ్చుట తడవుగా ఆతనికిచెప్పి నీకు ఇప్పించెదను. నీవును, భరత శత్రుఘ్నులును లేని రాజ్యము నాకెందుకు? అని చెట్టుపైనున్న లక్ష్మణునకు సమాధాన మిచ్చినాడు.

లక్ష్మణుడు సిగ్గు పడినాడు. మనల గొనిపోవ తండ్రి వచ్చుచుండెనేమోనని సమాధానమివ్వగా రాముడు కావచ్చునని లక్ష్మణునితో ఏకీభవించి చెట్టునుండి ఆతనిని తన మాటలతో దింపినాడు రాముని సత్యప్రబోధము లక్ష్మణుని భ్రాంతిని తొలగించినది. చెట్టు దిగినాడు.

భగవంతుని అనుగ్రహమిట్లేయుండును. నీతిని బోధించును. నిష్ఠురము లాడును. ధర్మము నెరిగించును. ఆదరించి అనుగ్రహించును. అవియే శాస్త్రములు వేదములును.

లక్ష్మణునకు భరతుని భక్తిని తెలిపినాడు. సోదరప్రేమను కలిగించినాడు. నిష్ఠురముగ మాట్లాడి సిగ్గునొందిన వానిని దగ్గరకుతీసి ఆదరించినాడు.

మనమొక్కసారి భరతుని పయనము పైపుకు తిరుగుదము.

భరతుని సైన్యము ఈ చిత్రకూటమునకు కొంతదూరమున నిలిచినది. భరద్వాజాశ్రమము నుండి అంతవరకు వారు వాహనములమీదనే పయనించుట జరిగినది. ఇక్కడనుండి పాదచారులయ్యే వారు రామాశ్రమమును కనుగొనదలచినారు. భరతుని హృదయమది. వశిష్ఠులందుకు సమ్మతించగా భరతుడందుకు నిశ్చయించుకొనినాడు. వెంటనే శత్రుఘ్నుని పిలిచినాడు. శత్రుఘ్నా! నీవును ఈ సమస్త జనులును బోయలును కలిసి ఒకప్రక్క వెతుకుడని ఆతని ఆజ్ఞాపించినాడు. తనతో ఆతని బంధువర్గముతో కూడిన గుహుడును మంత్రిముఖ్యులును వశిష్ఠ మునీంద్రులును పురజనులును వత్తురని తెలిపినాడు.

మన మిక్కడనుండి భరతుని ఒక రాజకుమారునిగ చూచుటకాదు, ఆతడు రామునితమ్ముడుకాడు. దశరధుని పుత్రుడు కాడు. ఆతనిని అవయవములతో అందమొందిన భక్తిరసమట్లు మూర్తీభవించినదని కొనవలెను. ఆ మూర్తి ట్లే చూడవలెను.

రామాశ్రమమును వెతకుటకై వారందరకట్లా జ్ఞాపించిన క్షణముననే ఆతని హృదయాకాశమున రామబ్రహ్మము సగుణమూర్తియై సాక్షాత్కరించినాడు. రాముడొక్కడే కాదు. సీతాకాంతయు ఎదురనిలచినది. వారిద్దరే కాదు. వారిద్దర సేవించు భాగ్యవంతుడగు లక్ష్మణుడును సాక్షాత్కరించినాడు. అప్పుడే భరింపరాని వేదనయు అతనికి పొడసూపినది. అప్పుడాతడు శత్రుఘ్నునివైపు తిరిగి చెప్పినమాటలివి.

శత్రుఘ్నా! రాముని వెతుకబోదము. నా మనస్సు చాలా అలజడి నొందుచున్నది ఆ సీతారామలక్ష్మణుల దర్శించునంతవరకును నా అలజాడి చల్లారదు. వేయేల? ఆ పద్మనేత్రుడగు రామచంద్రుని దర్శించవలెను. రాజలక్షణ లక్షితములగు ఆతని పాదముల నా శిరమును మోపవలెను. నా ఆత్మశాంతించవలెను. అంతే కాదు. ఆతడీ ఇక్ష్వాకు రాజ్యపీఠమున పట్టాభిషిక్తుడు కావలెను. అదియే నా శాంతికి పూర్ణరూపము. పోదము. రామాశ్రమమును వెదకుదము.

అవి చిత్రకూటమునందలి తాపసాశ్రమములు. రాముని పర్ణకుటీర మాశ్రమముల మధ్యభాగముననే.

శత్రుఘ్నుడును సుమంత్రుడును ఒకవంక బయలుదేరగా భరతుడు వశిష్ఠ మునీంద్రులతో వేరొకవంక వెదకనారంభించినాడు.

భరతుని భాగ్యరేఖ ఉదయించినది. భరతుడే పొగయొక్కకొనను ఆధారముగా గొని రామాశ్రమమును వెతకచుండెనో పైకిపోవు అపొగకు అడుగుభాగమాతని కంటబడినది. భరతునకు సముద్రమును దాటి అవ్వలఒడ్డుకు చేరినట్లనిపించినది. ఆభాగ్యరేఖను బలపరచినది అక్కడి ఆశ్రమవాసులదర్శనము. ఆ తాపసులు రామాశ్రమమిక్కడనేనని తెలిపినారు. అప్పుడే ఆతనికి శత్రుఘ్న సుమంత్రులును వశిష్ఠులును కలసినారు. వశిష్ఠుని తనతల్లులవెంట నిడుకొనిరండని పంపి, తాను శత్రుఘ్నునితో రామదర్శన కాంక్షియై పరుగు పరుగున నడువ నారంభించి నాడు.

తాపసుల పర్ణకుటీరములు బాటలుతీరి యుండవు. త్రోవలును అంతియే. కావుననే వారాయరణ్యసీమల నడువదగు మార్గములకు కొన్నిగురుతుల నేర్పరచు కొందురు. భరతున కాయాశ్రమాభ్యంతరముల గురుతులు కన్పట్టినవి. ఎత్తైన చెట్ల కొమ్మలపై నారచీరెల పీలికలును దర్భలును కట్టబడియుండుట నాతడు గమ

నించినాడు. శత్రుఘ్నా! ఇదియే మనము రామాశ్రమమునకు పోవు త్రోవ. లక్ష్మణుడీ గురుతుల కట్టియుండవచ్చునని ఆతనికి చూపుచు భరతుడు సరాసరి త్రోవను నడచినాడు. అంతలో ఆతనికి అందమై ప్రవహించు మందాకిని కనబడినది. భరతుని మనసు కదలబారినది. కన్నులు చెమ్మగిల్లినవి. చెమ్మగిల్లుటకాదు అంతలో కన్నులనుండి ధారలు ప్రవహించినవి.

వైదేహీ సహితుడై రాజ్యపీఠమున సింహాసనమలంకరింపదగిన రాముడు ఈ కారడవులవసించుచున్నాడా? ఆహా! నా జీవితమిందుకుదయించినదా? అని తలచి వెక్కి వెక్కి ఏడ్చినాడు. తన ఆవేదనను శత్రుఘ్నునకు చెప్పుకొనినాడు. అట్లే ఆతని అడుగులు ముందుకు సాగినవి. ధనుర్బాణశరాసనాలంకృతమైయున్న రాముని పర్ణకుటీరము కానుపించినది. అందేయున్నది ఈశాన్యభాగమునందగ్నివేదిక. అది రాముడు నిత్యమును ఆరాధించుకొను వైదికాగ్నియే. మరి రాముడెక్కడ? భరతుని మనసు పరుగులెత్తినది. చూపులును ఆతని మనస్సునను సరించినవి అంతలో రాముని విగ్రహము సాక్షాత్కరించినది అది అయోధ్యలోని రామ విగ్రహముకాదు. శాశ్వత బ్రహ్మవలె వెలుగొందు తాపస విగ్రహము. ఆతని శిరము జటామండల మండితము కాగా ఆతని నేత్రములు వికసితపుండరీకములైయున్నవి. ఆతడు ధరించినవి నారచీరెలుగాగా ఆతనిపైనున్న ఉత్తరీయము జింకచర్మము. ఆతడధిష్ఠించినది దర్భాసనము. ఆతని ముఖమండలమున ధైర్యోత్సాహములు ప్రదర్శించబడగా ఆతని విశాల వక్షమును ఆజానుబాహువులును సింహమధ్యమును రాజలక్షణ లక్షితములైయుండ ఆ ధర్మమూర్తి ఈ విశాల విశ్వంభరావలయ సామ్రాజ్యలక్ష్మికి ఆటపట్టైనది. మేనికాంతి అగ్నితేజమువలె వెలుగొందగా ఈతడు నా అన్నయేనా? అని పరికించినాడు భరతుడు. ఆ మూర్తికి ఇరుప్రక్కలనున్న సీతాలక్ష్మణులు భరతునకు గోచరించినారు. ఈతడు రాముడేనని నిశ్చయించుకొనినాడు

భరతునకు దుఃఖమాగలేదు. సకలరాజగణ సేవ్యుడై యలరారవలసిన రాఘవుడు నేడు వన్యమృగసేవితుడైయుండ, దుకూలముల దాల్చి నూత్నకాంతుల వెలుగదగు సుకుమారమూర్తి వల్కలముల దాల్చి అరణ్యసీమనుండ, వివిధ కుసుమ సుగంధ శోభితుడై విరాజిల్లెడు శోభనాంగుడు జడలను దాల్చి చరించుచుండ, చందనాదుల నలదగిన దేహమున భస్మమలది తాపసునివలె కన్పట్ట ప్రియసహోదరుడును భక్తశిఖామణియునగు భరతుని దుఃఖమునకు మేరయెక్కడ? దుఃఖభాగుడయ్యె ఎట్టకేలకు ధర్మాత్ముడగు భరతుడు పరుగుపరుగున వచ్చి, శ్రీరామచంద్రుని పాద సీమకు చేరినాడు. తందృష్ట్వా భరతశ్రీమాన్ దుఃఖశోక పరిప్లుతః.

భరతుని నోట మాటవచ్చుటలేదు. అన్నా! అనిపిలచినాడు గద్గదకంఠము పనే. అంతలో మరల నేలకూలినాడు. అప్పుడే శత్రుఘ్నుడును రాముని పాదసమీపమును చేరగా భరతశత్రుఘ్నుల నిద్దరబట్టిఎత్తి కన్నీళ్ళుతుడిచి రాముడు వారిద్దరకౌగలించుకొని తావమార్చినాడు. అంతలోననే వచ్చినారు సుమంత్రుడును గుహుడునుగూడ. దీనితరువాత ఘట్టము (అనగా భరతశత్రుఘ్నుల లేవనెత్తి ఆదరించిన తరువాత) రాముడు భరతుని కుశలప్రశ్నల నడుగుట.

ప్రశ్నలివ్వి.

రాము:—భరతా! నీవిట్లు వచ్చితివిగదా? తండ్రి ఏమయ్యెను? తండ్రి జీవించియుండ ఆయనను దుఃఖపెట్టి ఇచటకరుదెంచితివా? పితృమూర్తిని గౌరవించుచుంటివా? జ్ఞానసంపన్నులగు వశిష్ఠుల పూజనీయులై యుండెనా? కౌసల్యా సుమిత్ర కైకేయీలు పూజ్యురాండ్రై ఆనందించుచుండిరా? నీతిశాస్త్ర విశారదుడును ధనుర్వేదమున కుపాధ్యాయుడును అగు సుధన్వుని గౌరవించుచుంటివా? నీపురోహితుడు ధనాశచే నీచ కార్యములాచరించుట లేదుకదా? తగియెడువేళల నిద్రించుచుంటివా? అర్ధరాత్రి సమయముననే ఆర్థికమును గూర్చిన ఆలోచన చేయవలెను. రాజకార్యములను ఒక్కరితోగాని చాలమందితోగాని చేయకూడదు. వేయిమంది మూర్ఖులకంటె ఒక్కపండితుడు ఆలోచనలయందు ముఖ్యుడైయుండవలెను. అట్లుండెనా? ఉత్తమకార్యములందు నీచుల నియమించుటయు, అధమకార్యములందుత్తముల నియోగించుటయు వినాశకారణములు. ఉత్తమ మధ్యమ, అధమకార్యముల ఉత్తమ మధ్యమ అధముల నియోగించుచుంటివా? ఉగ్రదండముల విధించురాజును ప్రజలు నిందింతురు. నీవు నిందార్హుడవుకావుగదా? వేగులవాండ్ర వలన సకలవిషయముల నెరుగుచుంటివా? లోకాయతులగు బ్రాహ్మణుల పూజించుటలేదుగదా? (లోకాయతిక బ్రాహ్మణులన నాస్తికులు. వేదప్రమాణములేనివారు) వర్ణాశ్రమ ధర్మములు రక్షించబడుచున్నవా? అయోధ్యయను పేరు సార్థకనామమైయుండెనా?(అయోధ్యయన ఇతరులచే జయింపబడనిదని అర్థము) నియతకాలముల సేవకులకు జీతబత్తెములనిచ్చుచుంటివా? దేవద్విజగురువుల పూజించు చుంటివా? అక్కరలేని కాలమున కోపించుట, ఏమరుపాటు, సోమరితనము మద్యద్రవ్యముల సేవించుట, ఇంద్రియములకు వశుడవగుట, కీడు చేయదలచిన వారితో ఆలోచనసల్పుట, మంగళకార్యముల చేయకుండుట, మంత్రి సహాయములేక తానొక్కడే కార్యనిర్ణయముచేయుట, అనుదోషములకు నీవు గురి

యగుట లేదుకదా? దేశకళ్యాణ సూచకములగు వ్యవసాయ వ్యాపారములను చక్కగా పాలించు చుంటివా? ధర్మార్థకామములను ఉచితకాలముల సేవింపుచుంటివా? ధర్మము ను ప్రాతఃకాలమునను, మధ్యాహ్నకాలమున ధనచింతయు, సాయంత్రమున కామ మును, అనుభవించవలెను. ప్రాతఃకాల మధ్యాహ్నకాలముల నొకప్పుడు ధర్మార్థ ములను మార్చుకొన్నను కామమును మాత్రము వ్యత్యాసము చేయరాదు. అయోధ్యా పురమున స్త్రీ పురుషులెల్లరును రోగాదులు లేక సంతోషాయత్తచిత్తులై యుండిరా? ప్రజాపరిషత్తులు నిర్విఘ్నముగా జరుగుచుండెనా? నదీ మాతృకయగు అయోధ్యా నగరము సస్యశ్యామలమై సింహశార్దూలాది క్రూరమృగములచే బాధనొందక యున్నదా? (నదీమాతృకయన మాగాణిపంటలు గల దేశము, దేవ మాతృకయన వర్షము మీద ఆధారపడిన దేశము).

నిత్యమును సభాంతరమున ప్రజలకు దర్శన మిచ్చుచుంటివా? శత్రురాజుల రాజ్యముల యందారాజులపై పదునెనమండ్రు తీర్థులను వినియోగించితివా? తీర్థు లనగా మంత్రి (Minister) పురోహితుడు (Private Secretary) యువరాజు (Prince) సేనాపతి (Commander in chief) ద్వారపాలకుడు (Gate-keeper) అంతర్వంశికుడు (Palace controller) కారాగారాధిపతి (Superintendent of jails) అర్థసంచయకరుడు (ధనమును రాబట్టువాడు) (Revenue officer) కార్యనియోజకుడు (రాజకార్యములను వెల్లడించువాడు) ప్రాడ్వివాకుడు (న్యాయ విచారణకర్త) (judge) సేనానాయకుడు (సేవయందలి భటులకు జీత బత్తెముల విచారించువాడు నగరాధ్యక్షుడు (రాత్రికాలమున పట్టణమును రక్షించు శాఖకు అధికారి) కర్మాంతికుడు (ఉద్యోగులకు జీతములనిచ్చువాడు. (A/c general) సభ్యుడు (సభలను నిరుపద్రవముగ నడుపువాడు) ధర్మాధ్యక్షుడు (ఆస్తిపాస్తు లందు వచ్చు తగాదాల తీర్పు న్యాయశాఖాధికారి) దండపాలుడు (జారచోరాదుల దండించువాడు) (Migistrate) దుర్గపాలుడు కోటనుకాపాడువారికి పై అధికారి రాష్ట్రాంతపాలుడు (సరిహద్దులను కాపాడువాడు.)

ఈ పదునెనమండ్రు తీర్థులలో ముఖ్యులైన మంత్రి పురోహితయువ రాజులను విడచి తక్కిన సేనాపతి మొదలగువారి విషయమున గూఢచారుల ప్రయో గింతువా? మంత్రి, పురోహిత యువరాజులపై గూఢచారులక్కరలేదు. మిగిలిన పదునైదు మంది పైనను గూఢచారుల నుండవలెను. కాని ఆగూఢచారులొకరినొకరు ఎరిగియుండ కూడదు. అట్లుంచితివా? రాజులకు కన్నులు గూఢచారులు. రాజానశ్చారచక్షుషః

రాబడిఎట్లున్నది? ఖర్చు ఆదాయమును మించియుండెనా? దేశకాలముల గుర్తెరుగకయే శత్రురాజ్యముల పై ఒక్కమారుగా దండెత్తుచుంటివా? నీ రాజ్యమునందున్న బుద్ధి మంతులపై నీసేనకులు నేరారోపణ గావింపగా నీవు వారి చరిత్రల పరిశీంపకయే శిక్షింపు చుంటివా? భరతా! నీరాజ్యమెట్లు నడచు చున్నది? ధర్మాత్ముడగు రాజునకు స్వర్గము కరతలామలకము. అనిరాముడు భరతుని పై ప్రశ్నల వర్షమును కురిపించి నాడు. నిజమునకీ వర్షము నాడు భరతుని పైననే కురిపిన వర్షముకాదు. ఈ ధర్మ మేఘము ప్రపంచ కళ్యాణమునకై కురియు వర్షము. ఈ వర్షము కురియనినాడు ప్రపంచమున దుర్భిక్షము తాండవమాడును.

దీనికి రామాయణమున కచ్చిత్సర్గయని పేరు. నేనిప్పుడు చెప్పినది ఆ వర్ష ఋతువునందలి వర్షబిందువులను మాత్రమే. సంపూర్ణముగ ఈ సర్గను వివరించుచో ఇదియొక గ్రంధమగును. రామాయణములోని ఈ రాజ్యాంగ విధానమును అర్థము చేసికొని నేటి మన ప్రజాస్వామ్యమును పరిశీలించుకొనుట దొడ్డబుద్ధి. ముందు కథకు పోదము. భరతుని సమాధానము.

అన్నా! నాకు రాజధర్మమా? ధర్మయుతమగు రాజ్యములేని నాకు రాజధర్మము స్వర్గము నిచ్చునా? రఘువంశమున సమర్థుడగు జ్యేష్ఠుడుండ కనిష్ఠుడు రాజెప్పు డయ్యెను? ధర్మము నాపట్ల విపరీతమైనది. నేడు నీవు అయోధ్య కేతెంచి పట్టాభి షిక్తుడవగుచో నీవు చెప్పినది నిజమగునని కంట తడిబెట్టి, తండ్రిగారు లోకాంతర గతులయ్యెనని తెలిపినాడు. తండ్రి లోకాంతర గమనమొక చిత్రముగ నడచినదని నాడు. తండ్రి ప్రాణముల వదలునప్పుడు చివ్వరి శ్వాసయు నిన్నే స్మరించుచు, నీ మూర్తిపైననే చూపులు నిలువగా ఆయన బుద్ధి వృత్తియు ఇటునటు జనలేక నీవు దగ్గరలేని లోపమును తలచితలచి కుంగిపోవుచు పితృపాదుల భౌతిక కాయమును వదలినది. ఆర్యా! తండ్రికి దహన సంస్కారములు మాచే నడుపబడియు అవి పితృమూర్తికి తృప్తి హేతువుకాదు. ప్రియుడివ్వని పిండదానముల పితరులు గ్రహింపరని పెద్దల వాక్యము కావున నీవు తండ్రికి ఉదకదానాదికముల జరిపి ఋణ విముక్తుడవు కమ్మనినాడు.

ప్రియేణఖలుదత్తం హి పితృలోకేషురాఘవ
అక్షయ్యంభవతీత్యాహుః భవాంశ్చైవ పితృప్రియః.

భరతుడిచ్చిన సమాధానమిది.

మనమొక్కమారు రాముని వైపునకు తిరుగుదము.

పితృపాదుల మరణవార్త రామునకు గొడ్డలి పెట్టయినది. అతడు మూర్ఛిల్లి నాడు. మరల అతడు మూర్ఛనుండి లేవవలెనన్న శైత్యోపచారములవసరములైనవి. సీతా లక్ష్మణులు గావించిన శైత్యోపచారములచే రాముడు తెలివినొందినాడు తన దురదృష్టమునకాతడు చింతించి, చింతించి, పెద్దపెట్టున ఏడ్చినాడు. తనను కన్న తండ్రి అంత్యక్రియలను నెరవేర్ప నోచుకొనని పుత్రుడనైతినన్నదే ఆతని బాధకు కారణము. రాముని మనసునుండి ఇక అయోధ్య తొలగినది. తన వ్రతదీక్షసమాప్తి యైన తరువాతకూడ తానిక అయోధ్యకు వెళ్లుటలేదని తలచినాడు. రాజకార్యముల నిట్లు చేయుమని తన్ను శాసించు తండ్రి మరణించగా ఆ మహాకార్యమున తన్ను శాసించి నడుపువాడెవ్వడు? కావున నేనిక రాజ్యమును గైకొనను అను నిశ్చయ మును బహిర్గతము గావించి శోకించినాడు. అదియే భరతుడు తన్నయోధ్యకు వచ్చి పట్టము గట్టుకొమ్మన్న కోర్కెకు సమాధానమైనది. అది భరతుడు భరింపలేని మాట. భరతునకా రాముని సమాధానము గోరుచుట్టుపై రోకలిపోటు కాగా అతడును బాధనొందెను. అంతలో రాముని చూపులు సీతపై బడినవి. సీతా! నీవు మామగారు లేనిదానివైతివని దురపిల్లినాడు. అటునుండి, లక్ష్మణునివైపుకు తిరిగి హా! లక్ష్మణా! నీవు తండ్రిలేనివాడవైతివని తలచి తలచి ఏడ్వగా సీతా లక్ష్మణులును ఆపుకొనలేని దుఃఖముతో రామునితో కలసినారు. కొద్దికాలము గడచినది. వారి దుఃఖము కొంచెము వెనుకకు తిరిగినగాని ముందు చేయదగు కర్తవ్యములు నెరవేరవు. రాము డిప్పుడు తండ్రికి పిండదానము గావించవలెను. తర్పణ చేయవలెను. అక్కడ రామునకు రాజాన్నములు లేవు. తాననుభవించునదే పితృదేవతల కర్పించుట. కావున రామచంద్రులు లక్ష్మణునిచే గారపిండిని తెప్పించి, మందాకినియందు స్నాన మాచరించి ఉదకాంజలుల నర్పించి, ఆ గారపిండితోడనే పిండ దానము గావించినాడు. అంతతో మందాకినీ నదీతీరమునందలి కృత్యము నెరవేరినవి. తాత్కాలికమగు కర్మ కాండ ముగిసినది. పితృవియోగ దుఃఖము ప్రవాహమై మరల పొంగినది. భరత లక్ష్మణులున్న తన ఆశ్రమమున కేతెంచినాడు. తన బాహుద్వంద్వ మధ్యమున వారినిరికొంచుకొని ఏడ్వనారంభించినాడు. రాముడును వారును కలసి ఏడ్పు ధ్వని తరంగములు పర్వతమునంతను వ్యాపించగా భరతుడు రాముని కనుగొనెనని దూరము నందు సేనకు అర్థమైనవి. అంతలో వారి వాహనములనక్కడనే యుంచి సేనయు, ప్రజానీకము గూడ చిత్రకూటాశ్రమమును చేరుకొనగా, వశిష్ఠమునీంద్రులతో కాలి నడకను వచ్చుచున్న కౌసల్యా సుమిత్ర కైకేయులు కొంచెము వెనుక చిక్కి వచ్చినారు.

అందరకును రాముని దర్శనమబ్బినది. రాముడును తల్లులను గురువులను కూడ దర్శించినాడు. సీతారామలక్ష్మణులు ముగ్గురును పూజ్యులకు వందనములు నర్పింపగా వారును ఆ మువ్వుర కాశీస్సుల నందించినారు. మిగిలినవారి ఆదరాభిమానములను కూడ రాముడు చూరగొనకపోలేదు. అంతతో ఆ ఘట్టము ముగిసినది. తరువాతది భరతుడు రామున కందించిన విన్నపమును అతని విన్నపమునకు రాముడిచ్చిన సమాధానమును. ఇదియొక విలక్షణమగు ఘట్టము. సుసంపన్నమగు పైతృక రాజ్యలక్ష్మి తన్ను వరించగా భరతుడు కాదనెను. భరతుడే తన పాదములపైబడి ఈ సామ్రాజ్యము నీది అని వప్పచెప్పగా రాముడు కాదనెను. వారి సౌదర్యము లోకవిలక్షణమై ధర్మబద్ధమై నాటికిని నేటికిని లోకాదర్శమై నడచెను. ఈ ఘట్టమును మీరెట్లు వినవలెనో మీరే యూహించుకొనుడు.

నాటి రాముని పర్ణశాలాభ్యంతరమిట్లున్నది.

వశిష్ఠ జాబాలాది మునులందరొకవంక కూర్చొనినారు. సుమంత్రాది మంత్రిసత్తములందరొకవంక యుండిరి. ప్రజానీకమంతయు అక్కడనే యుండి రాముని ముఖచంద్రమండల దర్శనమున కాహ్లాదము నొందుచుండిరి. అక్కడనే యుండిరి కౌసల్యా సుమిత్ర కైకేయీలు కూడ. అప్పుడట్టి ప్రకృతి మండలము చూపులు రామునిపై నిలుపగా రాముని చూపులు భరతునివైపునకు తిరిగినవి. భరతుని హృదయము రాముడెరుగనిదికాదు. అతడెందుకు జడదారియై నారచీరెల ధరించి వనవాసివలెనుండెనో రాముడూహించనిది కాదు. రాముడు దీర్ఘదర్శి. రాముడింగితజ్ఞుడు. కాని భరతుని హృదయము బహిర్గతముకాక అతడెట్లు నిర్ణయించును? అంతే కాదు. లక్ష్మణుని అనుమానమును కూడ రాముడు తీర్పదలచెనేమో? భరతుని ముఖముననే అతని రాకను చెప్పించ దలచినాడు రామచంద్రుడు. ఇట్లు ప్రశ్నించినాడు లక్ష్మణుని ఎదుటనే.

భరతా! నీవు నేయు రాజ్యమును వదలి జడదారివై ఇక్కడికేల వచ్చితివి? అని.

రాముని ప్రశ్నకు భరతుడు వెంటనే సమాధానమివ్వ సమర్థుడు కాలేదు. కొంచెము తల వంచినాడు సిగ్గునొంది. రాముడు మరల తమ్ముని కౌగిలించి కాపి బుజ్జగించి అడిగినాడు. భరతుడు సరాసరి సమాధానమివ్వలేదు. అతడు దోసిలియొగ్గి విన్నముడై దాసుడయ్యె తన బాధను విన్నవించుకొనుచు సమాధానమిచ్చినాడు.

భరతుని విన్నపములోని సారమిది.

భరతుని దృక్పథమున దశరథుడు దోషి. కైకేయి దోషియే. వారిద్దరి దోషము లును తన కనుబంధమై తాను దేశాంతరమునందున్న సమయమున తన్నంటినవి. ఇప్పుడా బురదను తాను కడుగుకొని శుద్ధుడు కావలెను. ఇది భరతునకు పరేచ్ఛా ప్రారబ్ధమైనది. పాపమాతడు కోరుకొన్నది కాదు. ఇప్పుడు తానాచరించిన పాపము కాదు. ఒకరివలన సంక్రమించిన దోషము. దానిని భగవదనుగ్రహమను విశుద్ధ జలములచే కడుగుకొనదలచినాడు. జీవుడు శరణాగతినిట్లే చేయవలెను. కొందరు పాపోహం, పాపకర్మాహం, అనుట తగదని, పుణ్యోహం, పుణ్య కర్మాహం అని చెప్పుకొనవలెనందురు. అది చెప్పువారి అజ్ఞానము, లేక అహంకారము, జీవుడు శరణాగతినిట్లే చెప్పుకొనవలెను పాపములతి సూక్ష్మములు. జీవుని స్థూలదృష్టి తాను చేసిన పాపములను కనుగొనజాలదు. కావున భగవంతునివద్ద, "పాపోహం" అని చెప్పుకొని, "త్రాహిమాం కృపయాదేవ" అనవలెను. కథకు వత్తము.

రామా! నేను లేని సమయమున తండ్రి స్త్రీ వాక్య ప్రేరితులై నిన్ను అరణ్యములకు పంపి, ఆ దుష్కృత్య ఫలమునే ఆతడనుభవించినాడు. నా తల్లియు ఆమె కోరిన ఫలముననుభవింపక వైధవ్య ఫలమునందుకొన్నది. ఆమెకిది చాలదు. ఆమెకు లోకాంతరమున ఘోరాతి ఘోర నరకపాతమున్నది తప్పదు. కావున నీవు దేవేంద్రునివలె ఇక్ష్వాకు సామ్రాజ్య పీఠము నలంకరింపుమని ప్రార్థించుచు ఈ సోదరుని, ఈ శిష్యుని, ఈ దాసుని కరుణింపుమని కన్నీటి ధారల కార్చుచు రాముని పాదారవిందములపై శిరమును మోపినాడు ఇది భరతుని అభ్యర్థనము.

భ్రాతుశ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తుమర్హసి.

ఇక రామునివైపు తిరుగుదము.

రాముడు భరతునకు సమాధాన మందించుటయందు పురుషోత్తముడై రెండు గుణముల ప్రదర్శించినాడు. ఒకటి ఔదార్యము రెండు వ్రతదీక్ష. అతని వ్రతదీక్ష లోనిదే త్యాగశీలత. అతని సమాధాన సంగ్రహమిది.

రాముడు భరతుడారోపించిన ముగ్గురను దోషులు కారని నిరూపించినాడు. అందు మొట్టమొదటగనే భరతా! నీ యందణుమాత్రమైన దోషముకూడ లేదని అతని విశుద్ధహృదయమును తెలుపుచు తన హృదయమును స్పష్టపరచినాడు. తరువాత దశరథుడు దోషి కాడని నిరూపించి, తానిపుడు రాజ్యాభిషిక్తుడగుటకు

శాసనాతిక్రమమని నిరూపించినాడు. అట్టి పాపమును నేను చేయనని తేల్చినాడు. భరతుని గురించి రాముడు చెప్పినదాని ప్రమాణ వాక్యమిది.

"నదోషం త్వయిపశ్యామి సూక్ష్మమప్యరిసూదన."

భరతా! నీయందు సూక్ష్మాతిసూక్ష్మమగు దోషము కూడ లేదని విస్పష్ట ముగ ఉద్ఘాటించినాడు. ఈ కార్యమున నీవుకూడ కర్తవైయుంటివేమో నను అనుమానము నాకావంతయు లేదని చెప్పి భరతుని హృదయమున గుచ్చుకొని యున్న సంశయ కంటకమును తొలగించినాడు. తరువాతి విషయమేమి? దశరథుడు దోషి యనియు, కైక దోషురాలనియు, భరతు డుద్ఘాటించిన ఉద్ఘాటనము. దానిని గురించి రాముడు విప్పిచెప్పుచు భరతుని సంస్కరించినాడు. ముందు కైక నిర్దోష రాలనినాడు. భరతా! నీవజ్ఞానముచే తల్లిని నిందించుచుంటివిగాని జ్ఞానము కలిగి కాదనినాడు. ఇక్కడ రాముని వాక్యమిది.

"తచాపి జననీం బాల్యా త్వం విగర్హితు మర్హసి॥"

ఈ ఘట్టమున గీత నొక్కమారు స్మరింపుడు. అర్జునుడు ఈ జ్ఞాతుల నంద రిని చంపిన పాపమును నేను చేయననెను. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునా! నీవు ప్రాజ్ఞునివలె మాట్లాడుచుంటివే గాని, నీవు ప్రాజ్ఞుడవు కావనెను. "ప్రజ్ఞా వాదాంశ్చ భాషసే" అతడీతడే. అనగా ఆ కృష్ణుడీ రాముడే.

భరతుని రాముడిక్కడ బాల్యముచే కైకను నిందించు చుంటివని స్పష్టముగ చెప్పి, నీవింత అజ్ఞానయుతముగ మాట్లాడతగదని శాసించినాడు. ఇదియే రాముని లోని ఔదార్యము. తనను అరణ్యమునకు పంపిన కైకయందాతడు దోషమును చూడలేదు. ఆమెను నిందించుట కాతడు ఇష్టపడలేదు. తరువాతది దశరథుని విషయము. ఆత డెట్లు దోషి కాలేదో చెప్పి, తనకు పట్టము కట్టుకొనుటకును, భరతుడు కట్టుటకును అధికారము లేకపోవుటను నిరూపించినాడు. దశరథు డెట్లు దోషి కాడు? అను ప్రశ్నకు సమాధాన మిది.

కామకారో మహాప్రాజ్ఞ గురూణాం సర్వదానఘ
ఉపపన్నేషు దారేషు పుత్రేషు చ విధీయతే,
వయమస్య యథాలోకే సంఖ్యాతాస్సౌమ్య సాధుభిః
భార్యాః పుత్రాశ్చ శిష్యాశ్చత్వ మను జ్ఞాతు మర్హసి॥

భరతా! దశరథుడు ఆచరించిన ఈ కార్యము లోకమున పెద్ద లెవ్వరును ఆచరించనది కాదు. తనకు అనుగుణ్యముగ చరించు భార్యాపుత్రులయెడ తాము స్వతంత్రించి ప్రవర్తించ వచ్చును. భార్యాపుత్రులును శిష్యులును పురుషు ననుస రించుటను బుద్ధిమంతులు మన్నింతురు. కావున మన తండ్రి నన్నరణ్యము నందుండుమనియు, నిన్ను రాజ్యము చేయుమనియు శాసించగా ఆ శాసనమును మన మనుసరించవలెనేగాని కాదనుటెట్లు? తండ్రి ననుసరింప వలెను. తండ్రివంటిదే తల్లి గూడ. భరతా! తల్లిని నిందింపక తండ్రి అధికారమును కాదనక నీవు రాజ్యమును చేయుము. నేను వనవాసమును చేయుదు ననినాడు. మాతాపితరుల ఆజ్ఞను కాదని మార్చుటకు నీకును నాకును అధికారము లేదనినాడు. ఆజ్ఞాపించిన తండ్రి స్వర్గమునకేగగా ఆయన శాసనమును తిరస్కరించుటకు నీకును నాకును అధికారము లేదని రాముడు స్పష్టపరచినాడు. దశరథుని విబుధాధిపోపమః దేవేం ద్రునివంటివాడని ఆయన నిర్దోషి యని భరతునకు తెలిపినాడు. ఇది కాదన్న సర్వ లోకేశ్వరత్వము కూడ నా కక్కరలేదనినాడు.

"పిత్రాదత్తం యథాభాగం ఉపభోక్తుంత్వ మర్హసి
చతుర్దశ సమాస్సౌమ్య దండకారణ్య మాశ్రితః
ఉపభోక్ష్యేత్వహం దత్తం భాగం పిత్రా మహాత్మనా
"యదబ్రవీన్మాం నరలోక సత్కృతః
పితామహాత్మా విబుధాధిపోపమః"
తదేవ మన్యే పరమాత్మనోహితం
నసర్వలోకేశ్వర భావమవ్యహం॥

భరతునకు తెలిన పర్యవసానమేమి? రాముడు అయోధ్యకు రాననుట తెలినది. నీవే రాజ్యమును చేకొనుమనుట తెలినది. అంతతో ఆనాటి సంభాషణము ముగిసినది. ఆ రాత్రి యంతయు శోకమయమై గడచినది.

అది ప్రాతఃకాలము. రామాదులు మందాకినీ నదియందు స్నానమాచరించి, సంధ్యాద్యనుష్ఠానముల నిర్వర్తించినారు. వశిష్ఠాది మునీంద్రులును, సుమంత్రాది మంత్రిసత్తములును ప్రజానీకము గూడ రాముని ప్రక్క చేరినది. ఆ సభాస్థలి ప్రశాంతమై యున్నది. ఎవ్వరును ఎవ్వరితో గూడ పలుకక కూర్చొనినారు. రామున కిక మాట్లాడవలసిన పని ఏమియును లేదు. అతడు భరతున కివ్వదగిన సమాధానము

లేక సందేశము సమాప్తమైనది. కాని భరతుని సమస్య భరతుని దృక్పథ మున పరిష్కరింపబడలేదు. కావున ఇప్పుడు పెదవి విప్పదగినవాడు భరతుడే. రెండవ రోజున భరతుడే మాటాడ ప్రారంభించినాడు.

భరతుని సంభాషణమీ ఘట్టమున మృదుమధుర ఫణితితో శాస్త్రీయసిద్ధాంతము లతో తర్కయుక్తులతో చక్కగ నడచినది.

ఒక్కమాట మనము నిన్న రాముడు చెప్పిన దానియందలి సారమును స్మరించి, భరతుడెట్లు ఆయన విషయము ననుసరించెనో చూతము. నిన్న రాముని నిర్ణయమేమి? తన కిష్టముగు దారాపుత్రాదుల కోర్కెల తీర్చుట మహనీయులగు సాధులు ఒప్పుకొన్న మాట కావున దశరథుడు బిడ్డలమైన మనల శాసించుట యుక్తము కాకపోదని తెల్పి, ఆయన శాసనమును మన మనుసరించవలె ననినాడు.

రాముడు చెప్పినది యుక్తము కాకపోదు. శాస్త్ర సమ్మతము కూడ. కాని అందొక సూక్ష్మమగు లోపము భరతుడెరుగనిది కాదు. "రాముడు" ఉపపన్నేషు దారేషు అనిగదా అనెను? అనగా తనకిష్టమగు భార్యలని అర్థము. ప్రస్తుత సందర్భ మదికాదు. కైక ఇష్టురాలై లేదు దశరథునకు. దశరథుడిష్టముతో రాము నరణ్యమున కంపి భరతునకు రాజ్యమివ్వలేదు. కైకేయి నిర్బంధముచే విభాగించిన విభాగమిది. కావున రాముడు చెప్పినట్లు పితృశాసనము ననుసరించి తీరవలెనని ఎక్కడున్నది? దానిని మార్చుట కవకాశమున్నది. ఈ విషయము నాధారముగా గొని భరతుడు మాట్లాడ ప్రారంభించినాడు.

రామా! నా తల్లి నాకిచ్చిన ఈ రాజ్యమును నా తల్లిని ఒప్పించి నీకివ్వ వచ్చిన నన్ననుగ్రహింపుమని కోరినాడు.

"సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ
తద్దదామి తవైనాహం భుంక్ష్వ రాజ్యమ కంటకం॥"

ఇప్పుడు భరతుడు తెల్పినదేమి? ఈ రాజ్యమును నీవే నీది యని నిర్ణ యించితివి గావున నేను నీకివ్వదలచి యిచ్చుచుంటిని గావున నీవీ రాజ్యమును పరి గ్రహింపు మనినాడు. చక్కగ చెప్పినాడు భరతుడు. తాను పాలింపక తానెందుకీ రాజ్యమును ఇచ్చుచుండెనో రామునకు కారణమును ప్రతిపాదించవలెను గదా? ప్రతిపాదించినాడు.

మహతేవాంబువేగేన భిన్న స్సేతుర్జలాగమే
దురావారం త్వదన్యేన రాజ్యఖండ మిదంమహత్.

తానీ రాజ్యమును భరించలేడట. ఎట్లు ? పొరలివచ్చు ప్రవాహవేగమునకు కట్టతెగగా ఆ ప్రవాహ వేగమును ఆపలేనట్లు తానీ రాజ్యమును భరింపజాలడట. ఈ రాజ్యపాలనకు తాను సమర్థుడు కాడట. అశ్వవేగమును గార్ధభమనుసరించలేనట్లట. రాముడు గుర్రమట. తాను గార్ధభమట. గరుత్మంతుని ఇతర పక్షులనుసరించుట పంటిదట తానీ రాజ్యమును భరించుట. రామా ! నీవు గరుత్మంతుడవు నేనొక సామాన్యజాతి పక్షిని. నీవు రాజ్యమును పాలించుటకును, నేను రాజ్యమును పాలించుటకును సంబంధమేమున్నది ? అనినాడు కాని రాముని ముఖమండలమున మార్పు రాలేదు. చివ్వరకు ప్రజలుకూడ నిన్నే కోరుచుండిరి రామా! యని ప్రార్థించినాడు. ప్రజలును రాముని ప్రత్యేకముగ కోరినారు రాముడు మారలేదు. భరతుని శోకవేగ మరికట్టుటకు తత్వోపదేశము చేసినాడు. ఆ ఉపదేశ సారమిది.

భరతా జీవుడు అస్వతంత్రుడు. దైవప్రేరితుడై పడువవలెను ఈ జగత్తునకు రాకపోకలు స్వభావము. మానవుడెప్పుడైనను అనిత్యతయే స్వభావమగు ఈ జగత్తును స్థిరమనుకొనరాదు. అదియే దుఃఖకారణము.

అజ్ఞానయుతమగు అంతరాత్మ విషయ సుఖములకు గురియై రాత్రికాలము పందనుభవింపదగు భోగములను దలచి సూర్యుని అస్తమయమున కానందించును. పగటి సుఖములను తలచుకొని సూర్యోదయమునకు సంతసించును. కాల పురుషుడు తన ఆయుర్దాయమును సూర్యోదయ సూర్యాస్తమయములతో అపహరించుచుండె నని ఎరుగడు. జీవుడు తన మనస్సును తత్వశాస్త్రము వైపుకు త్రిప్పుకొని ఆలోచించుట చాల అవసరము. తనను గురించిన ఆలోచనయే మానవుని కృతార్థుని గావించును. బాహ్యములగు సుఖదుఃఖములకు నిత్యత్వము లేదు. వేదాంతముల వైపు తిరుగుటకు మనకింకను వార్ధక్యము రాలేదని అనుకొనకూడదు. ఆయుర్భాగ్యము క్షణక్షణమునకు క్షీణించుచుండును. దైవప్రేరితములై వచ్చిన సుఖదుఃఖములను ధీరుడై అనుభవించవలెను, నేనరణ్యమున నిట్లుంటిననిగాని నీ నెత్తిన రాజ్యభారము పడినది దీనిని నేనెట్లు మోయుదుననిగాని విచారించవద్దు. ఇదంతయు కాలతంత్రము. నన్ను గురించిన దుఃఖమును వీడి, నీకు రాదగిన ధీరత్వమును

గురించి నాకీ శోకమేలవచ్చినదని శోకించి, శోకకారణమును గుర్తెరిగి నీవాత్మో ద్ధరణమును గావించుకొనుమనినాడు

"ఆత్మానమనుశోచత్వం కిమన్యమనుశోచసి
ఆయుస్తే హీయతే యస్య స్థితస్యచ గతస్యచ."

ఇది మనకు రాముడందించిన దివ్యసందేశము. అవతారములిందుకే. కృష్ణావ తారమునందిచ్చిన గీతాశాస్త్ర సందేశమిదియే.

"ఉద్ధరేతాత్మనాత్మానం ఆత్మాన మవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః"

ఇక్కడ ఆత్మను ఉద్ధరించుకొనుటకు ఆత్మనే వాడుకొనవలెనని చెప్పినారు. అనగా మనస్సునే ఇక్కడ ఆత్మపదముతో చెప్పినారు మనస్సు మనకు బంధువు. మనస్సే శత్రువు. మన మనస్సును మోక్ష పురుషార్థమువైపుకు త్రిప్పుచో అది మనకు బంధువగును. ప్రపంచాభిముఖమును గావించుచో అది మనకు శత్రువై సుఖదుఃఖరూప సంసారగర్తమున పడవేయును. మోక్ష పురుషార్థ విచారణకు శాస్త్ర మాధారము కావలెను. అనగా వేదములను ప్రమాణముగా గ్రహించిన మతా చార్యులనే అనుసరించుట ముఖ్యము. ఇది రాముని ఉపదేశ సారము. ముందుకు పోదము.

ధర్మాత్ముడగు భరతుడు ధర్మమూర్తియగు రాముని తత్వబోధనంతను విని నాడు. భరతున కిప్పుడు కావలసినది రాముడయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడగుట గాని రాముడు చెప్పు వేదాంతము కాదు. భరతుడు చక్కని సమాధానమిచ్చినాడు.

రామా! నీవలె తత్వవేత్తలెందరుందురు? నీకు నీవే సాటియని రాముని గుణవర్ణనము చేసి తన విన్నపమును మాత్రము తాను వదలక, రాముని తత్వోప దేశమును గురించి చక్కని సమాధానమిచ్చినాడు. భరతుని సమాధానము కేవల తర్కయుతము కాదు. వేద సమ్మతము. తర్కము వేదశాస్త్ర బద్ధమై యుండవలె నని బోధించుచే సనాతన వైదికాచార్యుల ఉపదేశము. జగద్గురువులగు ఆదిశంక రులు, శ్రుతి మత స్తర్కోను సంధీయతాం॥ అని శాసించినారు.

భరతుని సమాధాన సంగ్రహమిది.

వేదము రెండు విధములగు ధర్మములనుపదేశించినది. ఒకటి ప్రవృత్తిధర్మము, రెండు నివృత్తిధర్మము. ప్రవృత్తి ధర్మమన బ్రహ్మచర్య గృహస్థ, వానప్రస్థాశ్రమములందు నడుపదగు ధర్మము. నివృత్తి ధర్మమన సన్న్యాసధర్మము. బ్రహ్మచర్యమన ఆయాశ్రమధర్మముల పాటించి, గురుకులమునందుండి వేదవేదాంగముల నభ్యసింపవలెను. గార్హస్థ్యమున తన వర్ణమునకు తగిన కన్యను పెండ్లియాడి గార్హస్థ్య ధర్మమును నడుపవలెను. అంతతో విషయ సుఖభోగముల నిత్యములని వైరాగ్యముదయించగా ఆ వైరాగ్యము నాధారముగా గొని వనమునకేగి వానప్రస్థుడు కావలెను. అదికేవల మోక్షైకసాధనము. గార్హస్థ్యము ధర్మార్థ కామముల ను త్రివర్గములకు నిలయము. మోక్షమునుగూడ ఈగార్హస్థ్యము నందుండి సామాన్య ధర్మమునగాక విశేషధర్మము నాశ్రయించి సంపాదించ వచ్చును. అప్పుడీ గృహమునే వనము గా నెంచుకొని వనమునందువలె చరింపదగు సామర్థ్యమును సంపాదించుకొనవలెను. ఈచతుర్విధ పురుషార్థములను శ్రుతిస్మృతులు ప్రతిపాదించినవి. వీటిని ఆధారముగా గొనియే రాముడు భరతునితో మాట్లాడుటయు, భరతుడు రామునితో మాట్లాడుటయు జరుగుచున్నది. ఇది నాయభిప్రాయము. ఇది నాఅభిప్రాయమనునది మాత్రము ఇద్దరును వక్కాణించరు. ముఖ్యముగ మీరు గమనింపదగినదీ విషయమే. ఇప్పుడు భరతుడు చెప్పిన సమాధానమును వినుడు. ఇందు సమాధానము శరణాగతియుకూడ ఇమిడియున్నవి.

రామా! శాస్త్రములు చెప్పిన ఆశ్రమధర్మముల ననుసరించుచో గార్హస్థ్యము అత్యంత శ్రేష్ఠము. ఇది ధర్మశాస్త్రవేత్తల సమయము (ప్రతిజ్ఞ). ధర్మజ్ఞుడవగు నీవెట్లు ఈధర్మమును వదలుదువు?

"చతుర్ణా మాశ్రమాణాంహి గార్హస్థ్యం శ్రేష్ఠమాశ్రమం
ప్రాహుర్ధర్మజ్ఞ ధర్మజ్ఞాః తంకథం త్యక్తుమర్హసి?

అని ముందు వనవాస జీవితమిప్పుడు మీరు చరించుట ధర్మశాస్త్ర సిద్ధము కాదనినాడు. కాక క్షత్రియుని ముఖ్యధర్మము రాజ్యపాలనము. జడదారివై అరణ్యమునందుండుట ధర్మముకాదుగదా? గార్హస్థ్యము నందుండి, సుఖభోగము లనసుభవించుచు పుణ్యసంపాదనను చేయదగు మార్గమును వదలి, ప్రజలను పునీతుల గావింపవలసు బాధ్యత రాజుయందుండగా మీరీ ధర్మము నాశ్రయించుట యుక్తము కాదు రామచంద్రా!

ఇది ఇట్లుండ పుత్రశబ్దమునకు పున్నామమను నరకమునుండి పితరుల నుద్ధరించుటయని అర్థము. అట్టి నీవు తండ్రి ఆచరించిన ఈదోషము నుండి తండ్రి నుద్ధరించక యుండుట ధర్మశాస్త్ర సిద్ధముకూడ కాదుగదా? తల్లి దండ్రు లిద్దరును కలసివేసిన ఈపాపమును వారికి తొలగించి, ప్రజలను రక్షించు పుణ్యమును కట్టుకొని నన్నును ఉద్ధరించుటకై అయోధ్యకు రావగి యుంటివని సమాధానపూర్వకముగ రాముని అర్థించినాడు.

"శిరసాత్వ భియాచే హంకురుష్వ కరుణాం మయి.
బాంధవేషుచ సర్వేషు భూతేష్వివ మహేశ్వరః"

నాయందు కరుణ చూపుమనినాడు. బాంధవులందరి యందును కరుణనుచూపుమని మహేశ్వరునకు పోల్చినాడు. రాముని మనసు కరగలేదు. ఆతని ప్రతిజ్ఞ నాతడు వదలలేదు. ప్రజల కన్నులనుండి అశ్రుకణములు రాలినవి. అందు సంతోషమొక భాగముకాగా దుఃఖమొక భాగమును పంచుకొన్నది. ఆరాముని ప్రతదీక్షకు వారాశ్చర్య చకితులై ఆనంద భాష్పములు రాల్చుచు రాముడయోధ్యకు రానందుకు దుఃఖభాగులు కాక తప్పలేదు. వారందరును తల్లులును కూడ భరతుని ప్రశంసించి రాముని రమ్మని యాచించినారు. మరి భరతుని మాటలకు సమాధానమేమని ఇచ్చెను? రాముడు కైకేయీ దశరథుల కార్యమును తప్పని ఒప్పుకొనడు. కావున ఒక చక్కని సమాధానము నిచ్చినాడు.

భరతా! ఈరాజ్యము నీకు తల్లి ఇప్పుడు ఇచ్చినదికాదు. నీకు జన్మహక్కైయున్నది. నీతల్లిని వివాహమాడునప్పుడే తండ్రిగారు ఆమెయందు జన్మించు పుత్రునకు రాజ్యము నిచ్చెదనని నీ మాతామహునితో ప్రతిజ్ఞచేసి, వివాహమాడినాడు. కావున రాజ్యము నీదికాని నాదికాదనినాడు. అది యట్లుండ కైకేయి దేవాసుర సంగ్రామమున మన తండ్రిని రక్షించి ఆయన సంతోషముతోడ యిచ్చిన రెండు వరములనే అప్పుడు కోరుకొనక ఇప్పుడు నా అరణ్యవాసమును, నీరాజ్యప్రాప్తియు కోరినది. ఆవరముల రెంటిని రాజగు దశరథుడిచ్చి, నన్నరణ్యమున కేగుమని ఆజ్ఞాపించగా వచ్చితినిగాని నేను గార్హస్థ్యమును చరింపక వనవాసినగుటకు రాలేదు. తండ్రి సత్యవాదియై వరముల నివ్వగా అతని సత్యమును ప్రతిష్ఠచేయుట పుత్రధర్మముకావున నీవును నేనును ఆయన సత్యవ్రతమును భంగపరచ కూడదు. భరతా! నీవయోధ్యకు బోయి, రాజచ్ఛత్రము క్రింద నిలచి, ప్రజలను పాలించి,

తండ్రిగారిని ధన్యులగావింపగా నేను ఈ యరణ్యమున వసించి, చెట్లనీడల నను భవించుచు మృగరాజులకు రాజునై చరించి తండ్రిగారి సత్యప్రతిజ్ఞను సార్థకము కావించెదను. నీకు శత్రుఘ్నుడు సహాయముగాగా నాకు లక్ష్మణుని సాయమువ్నది. కావున విషాదమును వదలి మన కర్తవ్యమిదియని నీవయోధ్యకేగుము. నేను అరణ్యముల ప్రవేశించెదననినాడు.

రాముడిప్పు డేమని తెల్పెను? కైకేయీ దశరథులు దోషులని భరతుని వాద మును రాముడొప్పుకొనలేదు. తాను గార్హస్థ్య ధర్మమును వదలుటను భరతుడు నిషేధించగా నేను గార్హస్థ్యమును వదలి వనస్థుడను కాలేదని తెల్పి, తండ్రి సత్య పాశబద్ధుడై కైకేయికిచ్చిన వరములను నేనును నీవును గూడ ఒప్పుకొనవలసిన దేనని స్పష్టపరచినారు. పర్యవసానముగ మనము నలుగురముకలసి తండ్రిని సత్య వ్రతుని గావించుట పుత్రధర్మమని ఖండితముగా చెప్పినాడు. భరతుని కోరిక నెర వేరలేదు. వచ్చినవారితో జాబాలిమహర్షి చక్కనివక్త. రాముడయోధ్యకు వచ్చుటకు అతడొక మహాప్రయత్నమును చేసినాడు.

రాముడింతవరకు చెప్పినదేమి? తండ్రికి స్వర్గమును కల్పించవలెనన్న అతని సత్యవ్రతుని చేయవలెనని. ఇదివేదవాదము. ఇది విశ్వాసముపై ఆధారపడి యున్న సిద్ధాంతము.

జాబాలి ఒక వాదమునుచెప్పి, రాముని రాజ్యమును గ్రహించమనినాడు. జాబాలి చెప్పిన ప్రబోధమిది.

సృష్టి ఖండమున తెలివిగల వర్గమొకటియు, తెలివితక్కువవర్గ మొకటియు మానవ సమాజమునందున్నదని జాబాలివాదము. ఆ తెలివితక్కువ మానవసమాజ మును తెలివిగల సమాజము స్వర్గమున్నదని ఈలోకమున చచ్చినవారు స్వర్గ లోకము నరకలోకముల కేగుదురనియు, తెలివితక్కువ వారిని నమ్మించుటకు గ్రంథములను వ్రాసి వీరివలన జీవనము చేయుదురనియు అతడు వర్ణించినాడు.

వేదశాస్త్రము లనునవి మానవకల్పితములుగాగా అవి స్వయంభువములు బ్రహ్మ ముఖమునుండి వెడలివచ్చినవని అమాయకులను నమ్మించగా పాపము అమాయకులు కంటికి కనబడని స్వర్గ నరకములనునమ్మి దాన ధర్మములను పేరను, పితృశ్రాద్ధములను పేరను ధనవ్యయమును చేసుకొనుచుండిరేగాని అంతకంటే

వేరేమియులేదనినాడు. మానవ సమాజమంతయు ఒక్కటైయుండ కొందరగ్ర వర్ణమున పుట్టిరనియు మరికొందరు నిమ్నజాతులై పుట్టిరనియు, నిమ్నజాతుల అగ్రవర్ణములకాళ్ళు పట్టుకొని వారిసేవ చేసినగాని వారికి స్వర్గము రాదనియు నమ్మించి తమ గౌరవములను పెంచుకొనిరేగాని వర్ణములనునవి సృష్టిలోనివికావని నిర్ణయించినాడు. తండ్రి సత్యవ్రతమును కొడుకు నిలబెట్టుటయను సిద్ధాంతము అమాయక సిద్ధాంతముగాని తెలివిగల సిద్ధాంతము కాదనినాడు. తండ్రియను పేరు గలవాడెప్పుడో భస్మమయ్యెనుగదా? ఇంక ఆత్మ ఎక్కడున్నది. నాలుగుభూతముల సమ్మేళనమే సృష్టి. భూతములు భూతములలో కలవగా ఆత్మ ఎక్కడున్నది ? దేహమే ఆత్మ. దేహమునకంటె వేరుగ ఆత్మ ఉన్నచో మనకెందుకు కనబడదు ? కావున పురుషుని శుక్లమును, స్త్రీయొక్క శోణితమును కలవగా సంతానము కలుగుట స్వభావమైయుండ కర్మను ఈశ్వరుని కల్పించి పుణ్యపాపములున్నవని ఆమేధావులు అల్పప్రజ్ఞ కలవారలని నమ్మించుచుండగా తెలివిగలవాడవైన నీవుకూడ ఇట్లు తండ్రిని సత్యవ్రతుని చేయుటకు రాజ్యమును వదలుట యుక్తముకాదని ప్రబో ధించినాడు. ఇది జాబాలి ప్రబోధము. దీనినే నాస్తిక వాదమందురు. లేక బౌద్ధవాద మందురు. చార్వాకమనికూడ దీనికిపేరు.

ఈవాదము నేటివేకావు. ఏనాడును కలవాదములే. జాబాలి క్రొత్తవాదమును చెప్పలేదు. బృహస్పతి ఒకప్పుడు రాక్షసులను నాశము చేయుటకీ వాదమును చెప్పినాడు. దీనికి విరోచన సిద్ధాంతమని కూడ పేరు. చార్వాకబౌద్ధములు కొద్ది తారతమ్యములు గల వాదములు. ఆయిద్దరును వేదములనొప్పుకొనరు. వినుటకు సుందరముగనుండు వాదమునకు చార్వాకవాదమని పేరు. విజ్ఞానమే ఆత్మయను వాదమునకు బౌద్ధమని పేరు. చార్వాకమునకు ప్రత్యక్షమొక్కటే ప్రమాణముకాగా బౌద్ధము అనుమానప్రమాణమును కూడ తీసికొన్నది. రాముడిప్పుడే సిద్ధాంతములోని వాడనునది ప్రశ్న. ఇక్కడ రాముడు కన్నుల నెఱ్ఱచేసి, జాబాలిని నిన్ను నాతండ్రి ఈరాజ్యము నందుంచినందుకు తండ్రిని నిందించుచున్నాను గాని నిన్ను నిందించుటలేదని జాబాలివాదమును ఖండించినాడుగాని ఆతనిని అనుసరించలేదు. అంతతో రాముడూరుకొనలేదు. వేదములను ప్రమాణము గావించి కర్మను సిద్ధాంతీ కరించి, ఈసూర్యచంద్ర గ్రహాది మండలములన్నియు కర్మ విశేషముచేతనే నిలిచియుండగా నాకీనాస్తికవాదమును చెప్పుచుంటివా ? అని జాబాలిని ఖండించి నాడు. పితృలోకములున్నవని నమ్మవలెననినాడు. పూర్వకర్మలేకున్న ఈసృష్టి

భిన్నత్వమునకు సమాధానమేమున్నది? ఒకే తల్లిదండ్రులకు సంతానములోని భిన్నత్వ మెట్లు వచ్చుచున్నది? ఒకడు రూపసియగుట వేరొకడు కురూపియగుట ఎట్లు కలుగుచున్నది? శుక్లశోణిత సంయోగమొక్కటే సంతానము పుట్టుటకు కారణమగుచో ఆ రెండును కలసినప్పుడెల్ల ఏందుకు సంతానము కలుగుటలేదు? కన్నులకు కనబడినదానినే నమ్ముచో ఈతడు వీనిపుత్రుడని నిర్ణయమెట్లు కుదురును? ఇట్టివెన్నియో అసంబద్ధములు బౌద్ధ చార్వాకసిద్ధాంతము లందుండుటచే "యథాహి చోరస్సతథాహిబుద్ధః" అని జాబాలిని చివాట్లు పెట్టినాడు. తల్లిదండ్రులనువారు ఉన్నమైపోగా ఈరాజ్యము పైతృకమెట్లైనది? కావున చార్వాక బౌద్ధములు రామ రాజ్యములో నివికావు. రామరాజ్యము వాటికి వ్యతిరేకము. తరువాత కథ ఏమి?

చివరకు జాబాలి నాసిద్ధాంతమది కాదు రామచంద్రా! నేనెట్లైనను నిన్ను అయోధ్యకు మరలించవలెనని చెప్పితినని చెప్పుకొనగా వశిష్ఠ మునీంద్రులును జాబాలి నాస్తికుడు కాదని వ్యాఖ్యవ్వగా రాముడు శాంతించినాడు. ఇంతతో జాబాలి భాగము ముగిసినది. భరతునికి జాబాలి వాదము సహాయము కాలేదు. వశిష్ఠమునీంద్రులు గురువుగారి నామాటను వినుమని రామునికి చెప్పినారు. రాముడు ఒప్పలేదు. భరతుడు రాముడెట్లు ఒప్పించుట? అని ఆలోచించినాడు. ఆతని అంతరాత్మ భరతునకొక మాటచెప్పినది. ఇది బాగున్నదనుకొనినాడు. ఏమది? రాముడు అయోధ్యకు వచ్చువరకును ఆహారమును వర్జించి బ్రాహ్మణునివలె ఒకవైపు తిరిగి దర్భలపై పరుండుట అట్టి నిర్ణయమునకు వచ్చినాడు. సుమంత్రుని పిలిచి దర్భాసనమును పరచమనినాడు రాముని పర్ణశాల ముందుగనే. సుమంత్రుడు పేక్ష చేయగా భరతుడు తానే స్వయముగ దర్భాసనమును పరచినాడు.

రాముడు రాజర్షి. రాజర్షియేకాదు. వారియందగ్రగణ్యుడు. వాల్మీకి ఇక్కడ "రాజర్షి సత్తమః అని రామునికి వాడినారు. రాముడు భరతునివంక తిరిగి, భరతా! అప్పుయిచ్చిన బ్రాహ్మణుడు తన అప్పును రాబట్టు కొనుటకై అప్పుతీసికొనిన వాని వాకిట ఒకప్రక్కనే పరుండి, ఇటునటు పొరలక పండుకొనును. నీకు నేనేమి అపకారము చేసితినని నీవిపని చేయతలపెట్టితివి? ఈకార్యము బ్రాహ్మణునకు తగును గాని కిరీటమును ధరించు క్షత్రియునకు ధర్మము కాదు. లేలెమ్మని చెప్పి, నీవు స్వధర్మమును వదలి పరధర్మము నాశ్రయించితివి గావున ఆచమించి, వన్ను తుము అనినాడు. వింటిరా? రాముని వర్ణధర్మ నిర్వహణను గురించి? భరతు ల్లిచేసి నిర్దోషియయ్యె రామునితో మాట్లాడినాడు.

ధర్మశాస్త్రములలో ఒకరు ఆచరించవలసిన ప్రతదీక్షను వారికి బదులు మరి యొక రాచరించవచ్చునని యున్నది. దానిని ఆధారముగా గొని భరతుడు రామునికి బదులు నేనరణ్యవాసము చేసెదననినాడు. కాని ఈ ధర్మము ఆపద్ధర్మము. దీనికి రాముడు నేనీయరణ్యవాస ధర్మము నాచరింపలేని వాడను కాను. నాకు ఆపత్తు రాలేదు. కావున నీవు నాకు బదులుగ ఉండుటకు నేను ఒప్పననినాడు. పర్యవసానమున భరతుడు రాజ్య స్వీకరణమున కంగీకరించలేదు. రాముడును అంతియే. దేవతల కాశ్చర్యము కలిగినది. ఇటువంటి సత్పుత్రులను కన్న దశరథుని వారందరును ప్రశంసించి రామచంద్రునే బలపరచినారు. దేవతల కార్యమిప్పుడు బలవత్తర మైనది. రామునకిప్పుడు రావణ సంహారము ముఖ్యముగాని రాజ్యము ముఖ్యము కాదు. కావున దేవతలు రామునే యనుసరించినారు. భరతుదేమి చేయును? రాముని కాళ్ళమీదపడి మరల ఏడ్చెను. చివరకు రాముడు అరణ్యవాసానంతరము అయోధ్యకు వచ్చుట కొప్పుకొనినాడు. ఇప్పుడు మాత్రము నేను చంద్రునిలోని లక్ష్మి తొలుగుగాక, హిమవంతునినుండి మంచు పోవుగాక, సముద్రము చెలియలి కట్టను దాటుగాక నేను మాత్రము నా ప్రతినను వదలననినాడు.

"లక్ష్మీశ్చంద్రాదపే యాద్వా
హిమవాన్వా హిమంత్యజేత్
అతీయా త్సాగరోవేలాం
నప్రతిజ్ఞా మహంపితుః.

మంత్రులుగాని ఋషులుగాని మరెవ్వరైనను రాముని ప్రతినను తొలగించ లేకపోవుటచే భరతుడు దీనుడై సువర్ణ పాదుకలను రామునకిచ్చి ఈ పాదుకలపై రాముని పాదములనుంచుమని కోరి, ఆ పాదుకలు శిరమునందుంచుకొని ఈ పాదుకలే రాజ్యము చేయునని భరతుడు నిర్ణయించుకొనినాడు. రాముడట్లే చేసినాడు. అప్పుడు భరతుని ప్రతిన ఇది.

రామా! నేనీ పాదుకలకే పట్టము గట్టెద. రాజ్యతంత్ర మీ పాదుకలకే విన్న వించెద. నేను పట్టణమునందుండను. నగరమున కవ్వలనొక గ్రామమునందుండెద.

జడదారినై నారచీరల ధరించియే యుండెద. నీవు పదియైదవ సంవత్సరము వచ్చిన రోజుననే దర్శనమివ్వకున్న అగ్నియందు ప్రవేశించెదనని నాడు. అమూల్యమగు ఆ భరతుని ప్రతిజ్ఞను రాముడంగీకరించినాడు. భరతుడు తన సైన్యముతో అయోధ్యకు మరలినాడు.

అవి భగవత్పాదారవిందములు. జీవరాశి శుభయంకరములు. సమస్త లోక పూజ్యములు. నేడు భరతుని శిరము నధిరోహించిన ఆ సువర్ణ పాదుకలు రామునకు ప్రతీకలై అయోధ్యా నగరమున ప్రతిష్ఠితములు కాలేదు. భరతుడయోధ్యకు చేరలేదు. ఆతడు చేరినది నందిగ్రామమునకు. అదియే భరతుని రాజధాని. రాముని పాదుకలక్కడే ప్రతిష్ఠింపబడినవి. భరతునిచే రామరాజ్యము నడుపబడుచున్నది. చిత్రకూటమునకు వత్తము. రాముని వృత్తాంతమరయుదము.

రాముడా చిత్రకూటము నందడుగిడినది మొదలు అక్కడి మహర్షులకు రాక్షస బాధలు పెరిగినవి. వారక్కడనుండి పయనము కావలసి వచ్చినది. ఈ విషయమును వారు రామునకు తెలుపక తప్పలేదు, తెలిపి వారక్కడనుండి పయనము కాగా రాముడును ఆ ప్రదేశమును వదలినాడు.

అది అత్రి మహర్షి ఆశ్రమము. ఆయన భార్య అనసూయా మహాసాధ్వి. ఈ సాధ్వీమణియే బ్రహ్మవిష్ణుమహేశ్వరుల ముగ్గుర బాలుర గావించి బిడ్డలుగాపెంచుకొని చన్నిచ్చిన వృద్ధ తాపసి. అత్రి అనసూయలకు జన్మించిన మహనీయులు దత్తాత్రేయులు. ఇదియొక విచిత్రమగు అవతారము. ఇతడవధూతమూర్తి. అత్రి మహర్షికి అత్రియను పేరెందుకు వచ్చెనో కూడ చెప్పెదను. మహాభారతమున ఆ మహర్షియే తన నామ నిర్వచనమిట్లు గావించినారు.

"అరాత్రిరత్రి సారాత్రి ర్యాంనాధీతే త్రిరద్యవై.
అరాత్రిరత్రిస్తేత్యేవ నామమే విద్ధిశోభనే. అను.142.అ.

అత్రి మహర్షి ఒకప్పుడు ఒకేరోజున వేదములన్నిటిని ముమ్మారు పఠించి రాత్రులను పగళ్ళను గావించెనట. కావున ఆతడత్రియని పిలువబడెనట. కాక తాను వేదాధ్యయనమును చేయని రాత్రి లేదట. అందుచే ఆతడత్రియట. అంతే కాదట. ఆతడు పాపమునుండి లోకమును రక్షించునట. కావున ఆతడత్రియట. ఈ శ్లోకమున కర్థము మహాభారత వ్యాఖ్యాత నీలకంఠులనను సరించి చెప్పినాను.

రాఘవేశ్వరులాకరాత్రి అత్రిమహర్షివారి ఆశ్రమమున వసించినారు. వృద్ధ తపస్విని అనసూయ. ఆమె ప్రభావము వర్ణనాతీతము. ఆమె ఒకప్పుడు పదిరాత్రుల నొక్క రాత్రియగునట్లు సూర్యచంద్రుల శాసించగలిగిన మహారాజ్ఞి. మరియొకప్పుడు లోకమున వర్షములు లేక దుర్భిక్షము రాగా గంగాదినదుల ప్రవహింపచేసి భూతముల కన్నమిడిన అన్నపూర్ణావతారము కూడ. ఆ మహర్షియే తన పత్నియొక్క ప్రభావమును రామునకెరింగించి ఆమెకు సీతచే వందనము చేయించమనగా అట్లే చేసినారు రాముడు. ఆ అనసూయా మహాసాధ్వి సీతతో చాలాసేపు మాట్లాడి సీత తన భర్తతో అరణ్యముల కేతెంచుటను ప్రశంసించి సీతాకాంత ముఖముగ సీతాకళ్యాణ కథను విని, ఆమెకు దివ్యాంగరాగముల నొసగి, అలంకరించి, సాయంకాలమునకు రామునొద్దకు పంపగా రాముడానందించుచు ఆ విప్రపత్నిని ప్రశంసించి, ఆ రాత్రి అక్కడనే వసించినారు. తరువాత అత్రి మహర్షివారి ఆజ్ఞను గైకొని దండకారణ్యముల ప్రవేశించుట జరిగినది. ఇంతవరకిది అయోధ్యకాండ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఓమ్

శ్రీ మహాగణాధి పతయే నమః

# అరణ్యకాండము

శ్లో॥ ఏకేన బాణ మపరేణ కరే చ చాపం
హర్షాద్వహంతమసమాన జటా శిరస్కం
సీతా సహాయ మనుజేన సమం చరంతం
శ్రీరామచంద్ర మనిశం కలయామి చిత్తే॥

## - దండకారణ్యముల చరిత్ర -

ఆర్యమహాశయులారా!

మన మిప్పటికి మన రామాయణ మహాకావ్య కథా కథనము నందెక్కడ నిలచితిమి?

అత్రిమహర్షివారి ఆశ్రమమున నిలచితిమి. సీతారాములకు మహర్షివారందించిన ఆతిథ్యము ముగిసినది. అంతతో అయోధ్యకాండ ముగిసినది. ఇక రాఘవేశ్వరుని దండకారణ్యపయనము సాగవలెను. అదియే అరణ్యకాండమునకు ప్రారంభము. నేటి ప్రవచనమదియే.

దండకారణ్యము లొకనాడు ఇక్ష్వాకు మహారాజు పరిపాలించిన మహాసామ్రాజ్యము. ఆదిలక్ష్మికి నివాసస్థానము. నేడవి మహారణ్యములైనవి.

సూర్య వంశమునకు మనువు మొదటివాడు. ఆమనువున కుత్పన్నమైన ఇక్ష్వాకువు. రెండవవాడు. ఆ ఇక్ష్వాకువునకు నూర్వురు పుత్రులు. అందు దండకుడు చివరివాడు. ఆ దండకుని చేతికందిన సామ్రాజ్యప్రదేశమే నేడు అరణ్యసీమలైనవి.

దండకుని చిన్ననాటి దుండగములనుచూచి ఈతడెప్పటికైన ఒక మహానీయుని చేత దండితుడు కాక తప్పదని తన పుత్రునకు దండుడను నామకరణము గావించినాడు ఇక్ష్వాకువు.

దండకుడు యువకుడై సామ్రాజ్యమునేలు సమయమది. శుక్రాచార్యులు దండకుని పురోహితుడు. దండకుని రాజధానిలోనిదే శుక్రాచార్యుని ఆశ్రమము అరజ అను కన్యకామణి శుక్రాచార్యుని పుత్రిక. ఆకన్యక లోకైకసుందరి.

దండు డొకనాడు శుక్రాచార్యుని ఆశ్రమప్రాంతమునకు రాగా ఆవనమున విహరించు "అరజ" దండుని కంటబడినది. కామము గ్రుడ్డిది.

దండుడు అరజను సమీపించి కోరినాడు కామోపభోగమునకు. అరజ తన తండ్రి శుక్రాచార్యుడని తెలిపి, ఆతని ప్రభావమును కూడ వర్ణించినదిగాని ఆతడు కన్యక వాక్యములను లెక్క సేయక ఆమెను బలాత్కారముగ అనుభవించినాడు. నాటి మహర్షులకు శిక్షాదండములు వారి వాగ్వజ్రములు.

ధూళిధూసరితయై కంటనీరుకార్చు పుత్రిక అబ్రహ్మణ్యుని కంటపడగా శుక్రాచార్యులు ఆశ్రమ బాలురవలన దండుని దుర్మార్గమును తెలిసికొని ఈనాటికి ఏడవరోజుకు ఈసామ్రాజ్యము మట్టివానతో నాశమై పోవుగాకయని శపించినాడు. ఆనాటికి తన ఆశ్రమమున వసించు ఆశ్రమవాసులెందరో యుండిరికాని వారందర కును తనశాపమును తెలిపి వారినా ప్రదేశమునుండి తరలించినాడు. తన పుత్రికనేమి చేసెను?

అరజను తపస్సునకాజ్ఞాపించి ఆప్రదేశమునకొక ఆమడదూరమున సరస్సు నొకదానిని చూచి పుత్రికకు స్థానమును కల్పించినాడు. ఆమె తపస్సు చేసుకొను ప్రదేశమున మట్టివాన కురవదు. తాను వేరొక ప్రదేశమున కేగినాడు

దైవికములై వచ్చు పాప ప్రారబ్ధములను క్షయింపజేయునది తపస్సు. కావున అరజను తపస్సుచేసి శుద్ధురాలవు కమ్మని తాను వెళ్ళిపోయెను

భారతీయ శాస్త్రములు నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత కర్మలను వాటిని మానవజీవితమును పవిత్రము గావించుటకు విధించినవి. ప్రస్తుతము అరజ తపస్సు ప్రాయశ్చిత్త భాగములోనిది.

అది దండకుని సామ్రాజ్యలక్ష్మికి అస్తమయకాలము. భార్గవుడు శపించిన నాటికది ఏడవరోజు. దేవేంద్రుడు మేఘముల కాజ్ఞాపింపగా అవి దండకుని రాజ్యమున ధారాపాతములై మృద్వర్షమును వర్షించినవి. అక్కడి చరాచరములు నశించగా అది మహారణ్యమైనది. దానికి ఆమడదూరమునందున్న ప్రదేశము మాత్రము

శుక్రాచార్యుని అనుగ్రహమునకు పాత్రమగుటచే అది మునులకు ఆశ్రయమైనది. మునులకు ఆశ్రయమైన ప్రదేశమునకు జనస్థానమని పేరు. ఆ దండకారణ్యము ఇతర మానవులకు చొరరానిచోటు. అప్రమేయుడును పరాక్రమ శాలియైన రాముడు సీతాలక్ష్మణులతో ఈనాడు ప్రవేశించినది ఆమహారణ్యములోనికే.

శ్రోతలారా! ప్రప్రథమముగ రామునకు దర్శనమిచ్చినది ఆ తాపసాశ్రమ మండలములే.

భారతీయ మహర్షుల ఆశ్రమములు చతుర్దశ భువనాత్మకమగు సృష్టి ఖండము లోని విజ్ఞానమునకు నిలయములు.

నాలుగు వేదములను ఆరుశాస్త్రములను మూర్తులై ఆ తాపస మూర్తుల సేవించుచుండును. నాడా తాపసాశ్రమముల వలెన పాఠనమునందు లేని కళలు లేవు. ఆధ్యాత్మిక సాధనలులేవు. అవి బ్రహ్మ విద్యాస్థానములు. భూమండలమును స్వర్గధామము గావించినవి ఆమహర్షుల పుణ్యపుంజములు. ప్రస్తుతమున వాల్మీకి మహర్షి ఆ తాపసాశ్రమములను వర్ణించుచు స్వర్గములోని అప్సరసలు నిత్య మును ఆఆశ్రమముల వసించుచుండురని వర్ణించినారు.

## రాముని మున్యాశ్రమ ప్రవేశము

రాముడు తారకరాముడు. నాటి మునుల దృష్టియందు రాముడు మానవ మాత్రుడైన ఒక రాజు మాత్రమేకాడు. అతడు ఉపనిషచ్ఛ్రుతిపాద్యమగు బ్రహ్మము. ఓంకారములోని అకార ఉకార మకార, అర్ధమాత్రలు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులని రామోత్తరతాపి న్యుపనిషత్తు వర్ణించినది.

ఓంకారములోని అకార ఉకారములచే లక్ష్మణ శత్రుఘ్నులు చెప్పబడగా మకారముచే భరతుడు చెప్పబడినాడు. ప్రణవములోని చివ్వరిదగు అర్ధమాత్రయే రాముడు. ఈదృష్టితోడనే దండకారణ్యములకేగిన కోదండరాముని ఆ మునులు దర్శించిరని వాల్మీకి తెలపినారు. కావున ఆమునులను వాల్మీకి "దివ్య జ్ఞానోప సంపన్నాః" అని వర్ణించినారు.

రాముడు తాపసాశ్రమముల ప్రవేశించినాడు. సతీ సోదరులతో వెంటనే మునుల దర్శించినాడు. మునులును రాముని దర్శించినారు. అప్పుడు ఆ మహర్షులు

రామునెట్లు చూచిరి? వారికి రాముడప్పుడు నెలపొడుపునాటి చంద్రునివలె కన్పట్టె నట. "తంసోమ మివోద్యంతం" అనినారు మహర్షి రాముడిప్పుడు ఉదయచంద్రుడు కాగా తరువాత ఆ మహర్షులకాతడు షోడశ కళాత్మక పూర్ణచంద్రుడు కాగలడు. ఇది కవి భావము.

భగవత్తత్త్వము రెండు విధములు. ఒకటి సగుణము, రెండు నిర్గుణము. ప్రస్తుత రామబ్రహ్మము సగుణము. మానవుల కచ్చెరువు కలిగించు సౌందర్యరాశి. సతీసోదర సమేతముగ కోదండమును చేతబట్టి వనమున కేతెంచిన ఆ రాముని సౌభాగ్యగరిమ ఆ వనవాసుల కెల్లరకును ఆశ్చర్యమును కలిగించినవి.

శ్లో॥ రూప సంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతాం
దదృశుర్వి స్మితాకారాః రామస్య వనవాసినః॥

ఎల్లజీవులకును మోహమును కల్పించునది రూపముగదా? కావున రాముని అప్రాకృత దివ్యసౌందర్యము అతనిని దర్శించిన వారందరకును ఉపాస్యమై ఆశ్చర్యమును గొలిపినది.

తన సంకల్పముచే కల్పించుకొన్న ఆ పరబ్రహ్మముయొక్క కనుముక్కుల తీరు ముఖమండలమునకు శోభను కూర్చగా ఆ మూర్తియొక్క విశాల వక్షమును, ఆజానుబాహువులును, సింహమధ్యమును ఆ మూర్తియొక్క దేహమధ్య భాగమున కొక ప్రత్యేక సౌందర్యము నొసంగినవి. ఇట్లే ఊరు జాను పదద్వంద్వములును చూపరుల చూపుల నాకట్టుకొన్నవి. ఇవి రూప సౌభాగ్యము తరువాతది దేహ కాంతి. అది ఏ ఇతర జీవునియందును కనుపట్టని కాంతి. అది వినీలాకాశములోని నీలిమ. అది భగవానుని దివ్యదేహమున మాత్రమే చూపట్టును. రాముని దివ్య దేహమును చూడదగిన కన్ను కలిగి చూడగా ఏ జీవి చక్షురింద్రియమును ఆశ్చర్యము మొలకెత్తదు? ఏ జీవుని హృదయము కదలబారదు? కావున ఆ వనములోని చేతనము లన్నియు ఆశ్చర్యముగ చూచినవి. రామునొక్కనే చూచినవా? కాదుకాదు. వైదేహీ లక్ష్మణుల కూడ చూచినారు. కనురెప్పల వాల్చక చూచినారు. తాత్కాలికముగ వారు దేవతలై చూచినారు.

ఇదియే భగవంతుని చూడదగిన చూపు. రెప్పలు ఆవరణము. ఆవరణను తొలగించుకొని భగవంతుని చూడవలెను.

"వైదేహీం లక్ష్మణం రామం నేత్రైరనిమిషైరివ
ఆశ్చర్యభూతాన్ దదృశుః సర్వే తే వనచారిణః"

## ఋ షు ల శ ర ణా గ తి

ఒక చూపున రాముడు సర్వజగద్రక్షకుడు. వేరొక చూపున దశరథ పుత్రు డగు రాజు. కావ్యమిట్లే నడచినది. మునులిట్లే చూచినారు.

ధర్మపాలో జనస్యాస్య శరణ్యస్త్వం మహాయశాః.

రామా! నీవు ధర్మసంస్థాపనకై అవతరించిన జగద్రక్షకుడవు. కావున నీవే ఈ జనులకు శరణ్యము అనినారు. సామాన్య జనులందరును పడు రాక్షస బాధల తొలగించి రక్షింపుమని సామాన్య జీవుల పక్షమున రాముని శరణాగతులైరి. తరు వాత తమ శరణాగతి. అది ప్రత్యేకము.

మహర్షులు నాటి రాక్షస బాధలను తమ తమ తపః ప్రభావమున రక్షించు కొనగలరు. కాని వారట్లు చేయలేదు. చేయదలచకయే చేయలేదు. అట్టి తమ అభి ప్రాయమును రామునకు తెలిపి ఋషులు శరణాగతిని పొందినారు.

కామక్రోధముల జయించి భౌతిక బాధలకు ఓర్చినగాని భక్తులుకారు. భక్తుల స్థితి ఇది.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖక్షమీ. భగ.గీ.

ఇదియే ఋషుల శరణాగతిలోని ప్రత్యేకత.

న్యస్తదండా వయం రాజన్ జితక్రోధా జితేంద్రియాః
రక్షితవ్యాస్త్వయాశశ్వత్ గర్భభూతా స్తపోధనాః"

శరణాగతియన, నా భారమంతయు వానిపై ననే యుంచితినని మాటల చెప్పుచు ఆయన శాసించిన వేదశాస్త్ర శాసనముల ధిక్కరించుచు వాడే నాచేత చేయించుచుండె నని చేతలతో అభినయించుట శరణాగతి కాదు. వీరు వంచకులు.

ఋషులు, రామా! మా తపోధనమును మేము కోల్పోవకుండ మా తపో ధనమును కామక్రోధాది రాక్షసులు హరించకుండ రక్షింపుమనినారు. మేము ప్రస్తు

క్షేమున రాక్షస బాధల నోర్చుకొనుట తపోధనమును హరించు కామక్రోధముల జయించుటేనని విన్నవించుకొనినారు. మేము నీ గర్భములోని వారము. నీవే మా హృదయమున ఆరాధింపబడునాడవు కూడనని విన్నవించుకొని రాముని కాతిథ్యముల నొసంగినారు.

రాముని అరణ్య ప్రవేశమగుటతోడనే శరణాగతులైన ఈ మునులొక తెగ వారు. వీరు పారమార్థిక జీవితమును గడుపుటకే ఈ శరీరమును ధరించిన జ్ఞానులు. లేక భక్తులు, ప్రపన్నులు. జ్ఞానయోగ భక్తియోగములలో కర్మయోగము ఉండక పోదు. కాని వారి కర్మ లోక సంగ్రహము కొరకే. దండకారణ్యముల ప్రవేశించ గనే ఈ జ్ఞానుల ఆతిథ్యమందినది రామునకు. ఆ రాత్రి అక్కడ గడచినది.

తెల్లవారినది. సీతారామలక్ష్మణుల పయనము సాగినది. వారు తాప సాశ్రమ ములనుండి గహనారణ్యముల ప్రవేశించినారు.

విరాధుడను రక్కసుడొక శాపగ్రస్తుడు. ఇంతకు పూర్వమితడు తుంబురు డను గంధర్వుడు. ఇతడు కామార్తుడై రంభతో కూడగా కుబేరుడీతనిని రాక్షసు డవు కమ్మని శపించినాడు. ఆ కుబేరుడే రామలక్ష్మణులచేత నీకు నా శాపమోక్షము కలుగునని వరమిచ్చినాడు. విరాధుని తండ్రి జయుడు. తల్లి శతహ్రద. ఇతడు తపస్సుచేసి బ్రహ్మవలన శస్త్రాస్త్రములచేత చావులేకుండ వరములను తీసికొని నాడు. ఆ వరబలముచే వాడు వీరను భేదము లేకుండ రాక్షసులను కూడ పీడించగా వారే ఈతనిని విరాధుడని పిలిచినారు. విరాధుడన లోకకంటకుడని భావము. ఆ రాక్షసునకిప్పుడు శాపమోక్షకాలము రాగా, సీతారామలక్ష్మణుల దర్శనమైనది. వీరు నాకు శాపమోక్షమును కల్పింపువారని ఆతడెరుగడు. రాక్షసత్వముచే సీతనెత్తుకొని పోవగా రామలక్ష్మణులాతని వెంటబడినారు. ఆతడు సీతను వదలి రామలక్ష్మణులనే భుజములపై నెక్కించుకొని పోవగా వారిద్దరును ఆ రాక్షసుని భుజములు నరికి, ఆతనిని గోతియందు పాతిపెట్ట యత్నించినారు. అప్పుడాతనికి పూర్వస్మృతి కలిగి నది. రాముడు భగవంతుడని గ్రహించి రాముని స్తుతించినాడు. అంతతో ఆతని రాక్షస తనువు తొలగగా రాముడు పోదగిన చోటును ఆతడే చెప్పి పంపినాడు. ఆతని గంధర్వ శరీరము ఆతనికి వచ్చినది.

విరాధుడు చెప్పిన విధముగా రాముడు భార్యా సోదరులతో శరభంగ మునుల ఆశ్రమమున కేగినాడు.

శరభంగ మహర్షి చాల వృద్ధుడు. అతనికెప్పుడో బ్రహ్మాది లోకములనుండి ఆహ్వానములు వచ్చినను రామదర్శనమునకయ్యే అతడు వేచియుండెను. ఇప్పుడు రాముని దర్శనమబ్బినది. మహర్షి రామున కాతిథ్యమొసంగి రాముని సుతీక్ష్ణాశ్రమమున కేగుమని తెలివిచ్చి, ఒక్క రెండు ఘడియల కాలము రాముని తనముందు నిలిపికొని చితియందు తన శరీరమునుంచి తననుండియే యోగాగ్నిని రగిల్చి స్థూలశరీరమును ఆహుతి గావించి తేజోమయ శరీరముతో బ్రహ్మలోకమున కేగినాడు. అయన బ్రహ్మలోకమున చతుర్ముఖునిచే స్వాగతము నందుకొనుటను రాముడు దర్శించినట్లు వాల్మీకి చెప్పినారు.

ఇక రాముడు సుతీక్ష్ణాశ్రమమున కేగవలెను. ఇంతలో కొందరు మహర్షులు శరభంగాశ్రమముననే రాముని శరణుజొచ్చుట జరిగినది. వారు వైఖానసాది మహర్షులు. వారితోపాటు కొందరు గృహస్థులగు బ్రాహ్మణులు కూడ వానప్రస్థాశ్రమమున చరించువారుండిరి. అందులో కొందరు మహర్షులను రాక్షసులచే భక్షితులు కాగా రాక్షసుల కలవిగాని వారు మాత్రము బ్రతికి యుండిరి.

వీరు కేవలముగ రాక్షసుల బాధలనుండి మమ్ము రక్షింపుమని శరణుగోరిన మునిబృందము.

"పరిపాలయ నో సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ॥

రాముడు వీరి శరణాగతిని పరిగ్రహించి వీరు చూపిన మహర్షుల శవములు కుప్పలు కుప్పలుగా పడియుండుటను కూడ చూచి ఆ తపోధనుల కభయప్రదానము గావించినాడు. మహర్షులారా! చచ్చినవారు చావగా మిగిలిన వారిని బాధపెట్టు రాక్షసానీకము నాశము గావింతెద. సోదర సమేతుడనై ప నా ప్రభావము చూపెద చూడుడని శపథము గావించినాడు.

"పశ్యంతు వీర్యమృషయస్సభ్రాతుర్మే తపోధనాః॥

ఇది శరభంగాశ్రమములోని విషయము. తరువాతది సుతీక్ష్ణాశ్రమప్రవేశము. సుతీక్ష్ణాశ్రమము శరభంగాశ్రమమునకు చాల దూరమునందున్నది. కొన్ని నదులను దాటవలెను. గహనారణ్యములు కూడ కొన్నిటిని గడవ వలెను.

కొందరు బ్రహ్మర్షులు వెంటరాగా సీతాలక్ష్మణులతో కూడ సుతీక్ష్ణాశ్రమమున కేగి నారు శ్రీరామచంద్రులు.

శరభంగుని వలెనే సుతీక్ష్ణమహర్షి కూడ రాముని రాకకై ఎదురుచూచుచున్న యోగిపుంగవుడు. రాముడు మహర్షుల ఆజ్ఞ ననుసరించి తన మజిలీలను నిర్ణయించుకొనినాడు వారును రాక్షస సంహారమునకై రాముని ఎక్కడ నిలుపవలెనో ముందుగనే నిర్ణయించుకొన్న వారగుటచేత సుతీక్ష్ణ మహర్షివారును ఆనాటికక్కడనే రాముని నిలుపుకొని మరునాటి ప్రాతఃకాలమున సాత్వికములగు తాపస భోజ్యములచే సీతారామలక్ష్మణుల కాతిథ్యము నొసంగి మరికొన్ని ప్రదేశములకేగి తిరిగి మరల తన ఆశ్రమమునకు రావలసినదిగ కోరినారు రాముడట్లే సీతాలక్ష్మణులతో మునిబృందము కూడ తనవెంటరాగా మరికొన్ని ఆశ్రమప్రదేశముల దర్శించి అక్కడక్కడ చూపట్టెడు ప్రకృతి సౌందర్యమును తిలకించుచు ధర్మభృతుడను మహర్షి రామున కక్కడక్కడ ఆశ్రమవాసుల విశేషముల తెలుపుచుండ పంచాప్సరో వరమును చూచి మాండకర్ణి తపఃప్రభావమున కచ్చెరువందినాడు.

మాండకర్ణి యను మహర్షి పదివేల సంవత్సరములు తపము గావించి తన తపఃప్రభావ సంపన్నత్వమున యోజన ప్రమాణముగల ఒక సరోవరమును నిర్మించుకొని ఆ సరోవరము క్రింద అయిదుగురు అచ్చరమిన్నలతో విషయసుఖముల ననుభవించు చుండెను. అది పంచాప్సరోవరము. ఆ తటాకమున కడుగు భాగమున వారాలపించెడు మధురగానములు బయటకు వినిపించు చుండును.

రాముడట్లు ఋషిమండలముల చరించుచు పది సంవత్సరముల గడిపినాడు. తిరిగి సుతీక్ష్ణాశ్రమమునకు చేరుకొనినాడు. ఆ మహర్షి వారి ఆజ్ఞానుసారముగ వారి ఆశ్రమముననే మరికొంత కాలము గడచినది బ్రహ్మర్షులతో.

అప్పటికి పాపభూయిష్ఠుల పాపకర్మల ఫలములును పుణ్యమూర్తులైన భక్తశేఖరుల పుణ్యఫలములును ఫలించు కాలము ఆసన్నమైనది. రామునకు అగస్త్య మునీంద్రుల ఆశ్రమము స్మృతికి వచ్చినది. సుతీక్ష్ణమహర్షియు రాముని ఆ మహాతపస్వి దగ్గరకు పంప సంకల్పించినారా నాడే. అంతర్ముఖుల సంకల్పములట్లే యుండును.

రాముడు మహర్షి వారిని అగస్త్యాశ్రమ మెచ్చట యుండెనని అడుగగా సుతీక్ష్ణమహర్షి ఆ యాశ్రమమును గురించి రామునకు వివరించినారు.

సుతీక్ష్ణాశ్రమమునకు దక్షిణ దిశయందున్నది అగస్త్యాశ్రమము. అగస్త్య భ్రాతాశ్రమమును అన్నగారి ఆశ్రమమునకు ముందే యున్నది. త్రోవ మధ్యము నందున్నది పిప్పలీవనము. ఆ వనసీమల మధ్యనుండి రాముడు సీతాలక్ష్మణులతో అగస్త్యభ్రాతాశ్రమమునకు చేరుకొనినాడు. వనసీమలలోని ప్రకృతి సౌందర్యమును తిలకించుచు, ఆ రాత్రి వారు అగస్త్యభ్రాతాశ్రమముననే వసించినారు.

ఉదయమైనది. అగస్త్యాశ్రమమునకు సీతాలక్ష్మణులతో కూడ రాముని పయనము సాగినది

అది అగస్త్యాశ్రమ ముఖద్వారము. రాముడక్కడనే నిలచి శిష్యునిముఖముగ తన రాకను మునివర్యులకు తెలిపినాడు.

అఖండ బ్రహ్మచైతన్యము భక్తానుగ్రహముచే ఇట్లు మూడు భాగములై వచ్చి చక్షుర్గోచరమగుట అగస్త్యులెరుగని విషయము కాదు.

మునిచంద్రుడు రామచంద్రునకెదురుగ నిలచి, ఆశ్రమాభ్యంతరమునకు తోడ్కొని వెళ్ళినారు.

అగస్త్యుని ఆశ్రమాభ్యంతరమునందెందరో దేవతలు వసింతురు. సిద్ధులెందరో అందుండి తమ నారాధించిన వారికి వరముల నిత్తురు. చతుర్ముఖేంద్రాది దేవతాస్థానములను అష్టదిక్పాలకులను గాయత్ర్యాది ఉపాస్య మూర్తులను అగస్త్యాశ్రమమున సాక్షాత్కరించగా రాముడా మూర్తుల దర్శించి, ఆ యాశ్రమాభ్యంతరమందలి క్రూరమృగముల మైత్రికి అచ్చెరువందినాడు. అచ్చటి క్రూర మృగముల మైత్రిని శ్రీనాథకవి చక్కగ వర్ణించినాడు కాశీఖండమున ఆ వర్ణనను వినిపింతును వినుడు.

"కండూయనము సేయు గరటి శుండాదండ
పుష్కరమ్మున సింహపోతకంబు
వాలారునఖముల వదన మించుక ఎత్తి
ముద్దాడు పులి లేటి ముద్దరాలి
నిండుకౌగిట జేర్చి నెమ్మిమై దోడేలు
కొదమచుంబోతును గుస్తరించు
గుంజమంటవ కుటీకోడ మధ్యంబున
నాఖుతో చెరలాడు నడవిపిల్లి

ఎండ దాకకయుండంగ నెత్తిపట్టు
బగల ముంగికి భుజగంబు పడగ గొడుగు
కోతితో మైత్రి వాటించు కొండగౌరియ
యౌర్వశేయుని పుణ్యాశ్రమాంతరమున."

అంతలో మునీంద్రుల అగ్నిహోత్రగృహము రామునకు దృగ్గోచరమైనది. పూజ్యపాదుల చరణసన్నిధి కేగినారు రాఘవేశ్వరులు. రాము డిప్పు డగస్త్యుని కతిథి. కావున మునివర్యులు రామునకు ఆసనార్ఘ్యవిధుల నర్పించినారు.

ఇంతతో అగస్త్యమునీంద్రులు రామునకందించదగు ఆతిథ్యము సమాప్తము కాలేదు. వేరొక ఆతిథ్యమున్నది. అది దేవరహస్యము. ఖరదూషణ త్రిశిరసాదు లను రాముడు వధించవలెను. వారు సామాన్యములగు బాణములచే చచ్చువారు కారు.

రాము డొకనాడు తన బాల్యముననే పరశురాముని జయించి ఆయన వద్ద నున్న వైష్ణవాస్త్రమును తనస్వాధీనము గావించుకొని అది వరుణదేవుని కిచ్చినాడు. అది దేవేంద్రుని దగ్గరకు చేరినది. అది కేవల రాక్షస సంహారమునకై బ్రహ్మచే నిర్మించబడిన మహాస్త్రము. దేవేంద్రుడా యస్త్రము నిప్పుడు అగస్త్యమునీంద్రుల దగ్గరకు చేర్చినాడు రామున కిచ్చుటకే. ఆ యస్త్రమునే కాదు అక్షయతూణీరమును రెండు ఖడ్గములను కూడ సహస్రాక్షు డందించి పెట్టినాడు మునీంద్రునకు. మునీంద్రులు తామిచ్చిన ఆతిథ్యము పరిపూర్ణముకాగా ఈ ధనుర్బాణ ఖడ్గశరాసనములను కూడ రామున కొసంగినారు ఇవి దేవేంద్ర దత్తములని చెప్పి. రాముడు వాటిని మునివర్యుల ఆశీస్సులతో అందుకొనినాడు. అంతతో వారి సంభాషణము ముగియ లేదు. అతిథిసత్కారము మాత్రమే ముగిసినది.

అగస్త్యమునీంద్రులు రామలక్ష్మణులు తనఆశ్రమమున కేతెంచుటచే తనకు కలిగిన ఆనందమును ప్రకటించి సీతతోకూడ మా యాశ్రమమున వసించి మార్గా యాసమును తీర్చుకొమ్మని ఆదర వాక్యముల పలికినారు. కాని రాముని కార్య క్రమము ఇది కాదు. ఆతడు వేరొక మహత్కార్యమును స్వీకరించి, తాను వేరొక ప్రదేశమున నుండ నిర్ణయింపుమని మహర్షిని కోరినాడు.

రాముని సంకల్పము అగస్త్యు డెరుగనిది కాదు. "సాధులహృదయము నాయది, సాధుల హృదయంబు నేను" అన్న భగవదుక్తి త్రికాల సత్యముగదా!

అగస్త్యమునీంద్రుడు లొక్క ముహూర్త మాత్రము కన్నులమూసి ధ్యానించి వారు. పరమ పావనమై దేవతల కష్టముల నీడేర్చదగు పంచవటీ క్షేత్రము మునీంద్రుల కన్నులయెదుట నిలిచినది. ఇప్పుడు సీతారామ లక్ష్మణులను వసపదగిన దక్కడకే. ఆ ప్రదేశమునే రామునకు అగస్త్యమునీంద్రులు నిర్ణయించినారు. ఇక్కడ వాల్మీకిమహర్షి అగస్త్యులు రామునకు నిర్ణయించిన ప్రదేశ నిర్ణయము నిట్లు వర్ణించినారు.

ధ్యాత్వా ముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరం వచః॥

ధీరుడును ధర్మాత్ముడునగు అగస్త్యమహర్షి రెండు ఘడియల కాలము ధ్యానించి ధీరతర వాక్యమును పలికెనట. ఈ వర్ణనలోని అంతరార్థమేమి ?

"తస్యధీరాః పరిజానంతి యోనిం" అని శ్రుతి. ధీరులగువారే భగవత్తత్వము నెరుగుదు. కావున ధీరుడును ధర్మాత్ముడును అయిన ముని సీతాపహరణ కథాఘట్టమునే గాక రావణవధాంతము వరకును దర్శించి, రాముని భవిష్యత్కార్య కలాపమును కూడ తన తాపసనేత్రమున దర్శించియే ధీరతరముగ రాముని పంచవటీ క్షేత్రమున కేగుమని పలికెననినారు కాకున్న భార్యాసోదరులతో వచ్చిన రాముని రాక్షసుల నోటి కందించునా ? సీత, లోకవిలక్షణ యని అగస్త్యులెరుగకపోలేదు. ఆమె మహా తపస్విని యని ఆత దెరుగును. "శ్లాఘ్యా చ వ్యపదేశ్యా చ యథా దేవీ హ్యరుంధతీ॥ అని సీతను ప్రశంసించినారు మునీంద్రులు. కావున సీతారాముల దివ్యత్వము నెరుగుటను అగస్త్యమునీంద్రులకు వాడిన విశేషణములతో వాల్మీకి మనకు తెలిపినారు. కావుననే అగస్త్యులు రాముని రాఘవా! నీవు నీ పితృవాక్య పరిపాలననునెరవేర్చి మరల అయోధ్యకేగుదువని భవిష్యత్తును వచించి నీవెందుకు మా ఆశ్రమము నుండి పయనమగుచుంటివో నాకు నా తపస్సుచే ముందుగనే తెలుసు ననినారు అగస్త్యులు.

హృదయస్థశ్చ తే ఛందో విజ్ఞాతస్తపసా మయా.

అంతేకాదు. రామునితో నీవు నీ భార్యను రక్షించుకొనగల శక్తుడవు కూడ వని వ్యంగ్యముగ అక్కడి రాక్షస బాధలను రామునకు తెలిపినారు మహర్షి. అక్కడ ఉండి తాపసులను రక్షించదగు బాధ్యత నీకు కలదని రాముని అవతార రహస్యమును వెల్లడించినారు కూడ. ఆ శ్లోకమును వినుడు.

"భవానపి సదారశ్చ శక్తశ్చ పరిరక్షణే
అపిచాత్రవసన్ రామ తాపసాన్పాలయిష్యసి॥"

విషయము నెంత నిగూఢముగ తెలిపిరో చూచితిరా? ఖరరాక్షస వధానంతర కథావస్తువు నంతను రాముని సామర్థ్య ప్రకటనలో ఇమిడ్చి, ఆ యవతారచరిత్రను వర్ణించినారు మునీంద్రులు. కథకు వినోదము.

అగస్త్యాశ్రమమునకు పంచవటీక్షేత్రము రెండు యోజనముల దూరమునందున్నది? అది యొక మహాపవిత్ర క్షేత్రము. అందైదు మర్రిచెట్లు ఎంత కాలము నుండియో ఉండగా దానికా పేరు వచ్చినది. పవిత్ర గోదావరీమతల్లి ఆ క్షేత్రమునకు సమీపముననే ప్రవహించు చుండును. అగస్త్యాశ్రమము నుండి చూడగా కనుచూపు మేరకే యున్నది మధూకవనము. ఆ వనమునకుత్తరముగ నున్నది ఒక మర్రి. ఆ చెట్టునకుత్తరముగ పోవుచో ఆ ప్రదేశము కొంచెము మిట్టయగుటచే ఆ మిట్టను ఎక్కగా పర్వతమొకటి యున్నది. ఆ పర్వతమున కతి దగ్గరనె యున్నది పంచవటి, కావున అగస్త్యమునీంద్రులా మధూక వనమును చూపి, త్రోవను చక్కగ చెప్పి రాముని పయనము గావించినారు.

ఈనాటి యుపన్యాసము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

శ్లో॥ సీతాయా దక్షిణే పార్శ్వే లక్ష్మణస్యచ పార్శ్వతః
తన్మధ్యే రాఘవం వందే ధనుర్బాణధరం హరిమ్

# పంచవటీక్షేత్రము

మహాశయులారా!

మన అరణ్యకాండము నందిది రెండవరోజు. నిన్న రామచంద్రుడగస్త్యాశ్రమము నుండి బయలుదేరినాడు. ఈనాటి యుపన్యాసము ఆ పురుషోత్తముని పంచవటీ ప్రవేశమును, శూర్పణఖా వృత్తాంతమును, పురాతనములగు అయిదు వట వృక్షముల ఉనికిచే దానికి పంచవటియని పేరు వచ్చినది. ఈ రామాయణ మహాకావ్యమున దేవమానవరాక్షస పాత్రలతోపాటు రెండు పక్షులు కూడ ముఖ్య పాత్రలై నిలచినవి. అందొకటి జటాయువు రెండవది సంపాతి. జటాయువు మన అరణ్యకాండమునందొక ముఖ్యపాత్ర కాగా సంపాతి కిష్కింధకాండయందు మన కగపడును.

రాఘవేశ్వరులు సీతాలక్ష్మణులతో అగస్త్యాశ్రమము నుండి పంచవటికి వచ్చుచుండగా రాముని కంటబడినది. చూచినక్షణమున రాముడా పక్షిరాజును రాక్ష సుడనియే భావించినాడు. కాని దగ్గరకేగి, కోభవాన్ నీవెవరవని అడుగగా ఆ పక్షి రాజు నేను ప్రజాపతిసంతతిలోని దానను, నీ తండ్రియగు దశరథున కాప్తమిత్రుడ నన్నది. రామున కాశ్చర్య సంభ్రమములు కలిగినవి. దానిని కౌగలించుకొనినాడు. అది రామునకప్పుడే ఆప్తమిత్రుడు కాగా దానితోకూడ పంచవటి కేగినాడు.

రాముని పంచవటీ క్షేత్ర ప్రవేశముతోడనే మహారాక్షసవధకథా ఘట్టమునకు మొదలు.

ఆ మహారణ్య మధ్యభాగముననే రామాజ్ఞతో లక్ష్మణుడొక సుందరభవనము వంటి పర్ణశాలను నిర్మించినాడు. అది వాస్తుశాస్త్ర ప్రసిద్ధము. దానిని లక్ష్మణుడు తానారాధించు దైవమునకు నిర్మించుకున్న ఆలయమని కూడ మనము భావించ వచ్చును.

నూతన మందిరమునందు ప్రవేశించదగు శాంతి కలాపముల నిర్వర్తించియే వారందు ప్రవేశించినారు. శీతవాతాతపములు వారిని బాధించుటలేదనినారు వాల్మీకి. అది వారికి స్వర్గధామముకాగా వారందు దేవతలై వసించిరని కూడ వర్ణించినారు. తృప్తులగు వారికి సుందరభవనములును పర్ణశాలలును ఒక్కటేననుటకీ వర్ణన మొక ఉపదేశము.

అది హేమంతము. సీతారామలక్ష్మణులకు గోదావరీస్నానము తప్పలేదు. ద్వంద్వములగు శీతోష్ణములు సహించుటే వనమున వసించు ముని జీవితమునకు లక్ష్యము.

ప్రకృతికది వన్నెదిద్దెడు ఋతువు. ధాన్యలక్ష్మికది నివాసమందిరము. వాల్మీకిమహర్షి సంవత్సరకాలమునకంతకును శుభమును కూర్చు ఋతువిదియనుచు భూదేవికీ ఋతువు శోభను కూర్చుచున్నదని వర్ణించినారు.

"అలంకృత ఇవాభాతి యేన సంవత్సర శ్శుభః"

ఈ ఋతువునందు పండెడు పంటలను కూడ వర్ణించినారు కవి. ఋతుస్వభా వము వంతను తీర్చిదిద్దినాడు. అదియొక గ్రంథమగును. కథకు వర్తము.

ఒకనాటి ఘట్టము.

సీతారామ లక్ష్మణులు గోదావరీనదికి స్నానార్థము వెళ్ళి రాముడు రుద్రుడు కాగా సీతాసాధ్వి పార్వతివలె కన్పట్ట లక్ష్మణుడు సాక్షాన్నందీశ్వరు డనునట్లుండి పర్ణశాలకు చేరినారు. వాల్మీకి వర్ణన ఇది.

"కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా
రుద్రస్సనందీ భగవానివేశః"

సాక్షాన్నారాయణు డిక్కడ రుద్రుడై ఏల వర్ణింపబడినాడు? వైకుంఠవాసి కుటుంబమొక్క మారుగ కైలాసవాసియై గోదావరినుండి వచ్చిరని ఏల వర్ణించ బడినది? వాల్మీకి చమత్కారమిదియే.

ఖరదూషణ త్రిశిరసుల సంహారమున రాముడు రుద్రుడుకాగా ఆ వీరపత్ని సీత పర్వతరాజ పుత్రియై ఆరుద్రుని లోకోత్తర రౌద్రమును చూడవలసియుండును. భక్తాగ్రేసరుడగు లక్ష్మణుడు రామాజ్ఞను పాలింప నందీశ్వరుడయ్యెను. ముగ్గురు మూర్తులలోని తక్కువ ఎక్కువలను చెప్పుట పురాణేతిహాసముల లక్ష్యముకాదు. ఒక్కొక్క కాలవిర్వాహకత్వము నందొక్కొక్క మూర్తియై అఖండ బ్రహ్మ చైతన్యము చరిత్రకు లక్ష్యమగుచుండును. ఇదియే ఉపనిషత్సిద్ధాంతము.

పర్ణశాలలో నివసించియున్న రాముని విలక్షణదృశ్యము నొక్కమారు తిలకింతము. ఇరుప్రక్కల సీతాలక్ష్మణులు, మధ్యభాగమున రాముని దివ్యమంగళ విగ్రహము. ఆజానుబాహువులతో ఆకర్ణాంత నేత్రములతో సింహమధ్యముతో కూర్చొని యున్న ఆ రామమూర్తికి కట్టిన నారచీరెలును శిరమునందలి జటామండలమును ఒక లోకోత్తర సౌందర్యమును కూర్చగా ఆసుందరేశ్వరుడు నవమన్మథ మన్మథుడై కన్పట్టుచుండెను.

శూర్పణఖ రావణుని చెల్లెలు. ఖరదూషణ త్రిశిరసులు రావణునకు తల్లి వైపు చుట్టములు. పదునాల్గువేల రాక్షసులకు ఆ ఖరదూషణ త్రిశిరసులు ముగ్గురును నాయకులు. శూర్పణఖ ఉండునది ఖరదూషణాదుల దగ్గరనే. ఇదియొక రాక్షస సమాజమునకు ప్రత్యేకమగు నివాస స్థానము.

ఒకనాడు శూర్పణఖ ఈ మహారణ్య మధ్యమున విహారయాత్ర గావింప బయలుదేరినది. ఆ మహావికృతరాక్షసికి పర్ణశాలాభ్యంతరమున సతీసోదరులకు

మధ్యగా సుఖాసీనుడై యున్న రామదర్శన మబ్బిన్నది అది శాపగ్రస్తులకు మోక్ష కాలము.

శూర్పనఖ ఇంతకు ముందెన్నడును ఈ దండకారణ్యమున దర్శించిన విగ్రహము కాదిది, దండకారణ్యమున కాదు,మరెక్కడనుకూడ ఆరాక్షసికంట బడ లేదిట్టి విగ్రహము.

ఒక్కమారుగ శూర్పనఖకీ శ్యామసుందరునిపై కామము ద్రేకించినది. ఆ రాక్షసి తన వికృతరూపమును మార్చుకొన్నది. సుందరాంగియైనది. రాక్షసులు కామ రూపధరులుగదా! సరాసరి రామునివద్దకేగినది. ఆ రాముని రాకను కారణ మడిగినది సరాసరిగ.

రాముడ బద్ధమాడువాడుకాడు. అందును ఆశ్రమవాసము. తత్రాపిని స్త్రీ సమ క్షము. ఆతడు తన చరిత్రనేల మరగు పరచును? తన యథార్థచరిత్రనే చెప్పినాడు. నీవెవ్వతెవను నది తరువాతి ప్రశ్నయేకదా?

రాముడు సౌందర్యవతియై వచ్చిన శూర్పనఖను రాక్షస స్త్రీయని గుర్తుపట్టి నాడు. సూటిగ శూర్పనఖను నీవు రాక్షసస్త్రీవని నాకు తోచుచున్నది. నీవిక్కడి కేల వచ్చితివో చెప్పుమనినాడు.

ఆ రాక్షసి అబద్ధమాడలేదు. రావణకుంభకర్ణ విభీషణులకు నేను సోదరి నన్నది. మా తండ్రి విశ్రవోబ్రహ్మయన్నది. నా ముగ్గురు సోదరులలో విభీష ణుడు ధర్మాత్ముడని చెప్పినది. కుంభకర్ణుని నిద్రమోతు తనమును వర్ణించి, రావ ణుని ప్రభావమును, ఖరదూషణాదుల బలమును కూడ చెప్పి, నేను నీ సౌందర్య మును చూచి నిన్నుకామించి వచ్చితినన్నది నన్ను నీవు భార్యనుగా పరి గ్రహించమన్నది. నీ భార్యా సోదరులు మన దాంపత్య జీవితమున కడ్డమగుచో వీరిద్దరను భ్రమింగుదునన్నది ఈ పర్వతారణ్యభూముల స్వేచ్ఛగ చరింతమన్నది.

జనస్థాన వినాశమునకి శూర్పనఖ కామోద్దీపనము బీజమనక తప్పదు. ఆ రాక్షసి పలుకులకు రాముని ముఖమంతలమున చిరునవ్వు మొలకెత్తినది. రాముడు లక్ష్మణుని వద్దకు పంపినాడు. ఏమనిచెప్పి పంపినాడు? అతడు "అకృతదారుడు, అనురూపశ్చతే భర్తా" అని చెప్పుచు మేరువునకు సూర్యకాంతివలె ఆతనికి నీవు తగుదువని చెప్పి పంపినాడు.

ఆ రాక్షసి రాముని వదలినది లక్ష్మణుని సమీపించినది లక్ష్మణా! నీవునాకు భర్తవు కమ్మన్నది. నేను నీకు తగిన భార్యనన్నది. లక్ష్మణుడు నవ్వినాడు. ఆ రాక్షసి పిచ్చితన మాటలనికి కోపమును తెప్పించలేదు. కాని సమాధానమిట్లిచ్చినాడు.

కథం దాసస్య మే దాసీ భార్యా భవితుమిచ్ఛసి?

నేనొకరికి దాసుడను. నీవు నాకు భార్యవై దాసివగుటకు ఏమి బాగుండును? అని అంతతో ఆగక నాకు నాథుడైయున్న ఆ రామునే పెండ్లియాడుమని సలహా నిచ్చి, సీత సౌందర్యమును వర్ణించుచు ఆసీతను విడిచి నిన్నే అతడు పెండ్లి యాడునని కూడ చెప్పినాడు. అతడు శూర్పనఖతో మాట్లాడినది చమత్కార భాషణము. రాక్షసికి చమత్కారము తెలియలేదు. మరల రామునిదగ్గర కేగినది. పర్ణశాల లోపలికి వచ్చినది. అతి తీవ్ర రూపమున సీతను మ్రింగుట కుద్యమించినది. కాని రాముని హుంకారమారాక్షసిని అడ్డగించినది. వెంటనే రాముడు లక్ష్మణుని పిలిచి ఈరాక్షసిని వికృత రూపను గావింపుమని ఆజ్ఞాపించినాడు. లక్ష్మణుడు వెంటనే ఆరాక్షసి ముక్కుచెవులు కోసి శిక్షించినాడు. ఇది ఈనాటిఘట్టము.

ఒక్కమాట.

కొందరు ఒకస్త్రీ వచ్చి తన్ను కామించగా తనకు ఇష్టములేకున్న పొమ్మన వలెనుగాని ముక్కుచెవుల కోయుట రామునిదేమి న్యాయము? అని అందురు. నేటి విజ్ఞానవంతుల విమర్శనాజ్ఞాన పాటవము భారతీయ గ్రంధములయందలి రంధ్రాన్వేషణకే పనికి వచ్చుచున్నదిగాని భారతీయ విజ్ఞాన భాండారములలోని విజ్ఞాన రత్నముల సేకరింప సమర్ధమగుటలేదు. విమర్శింతము.

నిన్ను పెండ్లి చేసుకొనదలచినాను. ఇప్పుడున్న నీభార్యను మ్రింగుదును. తమ్మునికూడ మ్రింగుదునని సతీసోదరుల మ్రింగజూచిన రాక్షసి నేమిచేయవలెనట? దాని నోటికి వీరినందించవలెనా? అక్కడికిని రాముడు మొదటిసారి దాని దృష్టిని మార్చుటకు మాత్రమే లక్ష్మణుని వద్దకు పంపినాడు. లక్ష్మణుడు కాదనగా మరల వచ్చి సీతను మ్రింగబోయినది. హుంకారమున దాని ఉద్యమమును నివారించి, లక్ష్మణునిచే శిక్షింపజేసినాడు. అతడు శిక్షింపజేసినది తనను పెండ్లి చేసికొమ్మందుకు కాదు. సీతను మ్రింగబోయినందుకు. అది యట్లుండ శూర్పనఖయే రామలక్ష్మణులను "తాపసౌ ధర్మచారిణౌ" అని తమ్మునితో చెప్పినదిగదా! విమర్శకులకీ సత్యములు కనబడవు.

కథకు వినోదము.

ముక్కుచెవులు తెగిన ఆరక్కసి వర్షాకాల మేఘమువలె గర్జించుచు, వర్ష ధారలవలె కారుచున్న రక్తధారలతోనే ఖరునివద్దకు వెళ్ళి స్మృతి తప్పి నేలకూలి నది. ఆదృశ్యమును చూచిన ఖరునకు నాసోదరికిట్టి అవమానమును కల్పించిన వాడెవ్వడన్న రాక్షసాహంకారమొక్కమారుగ విజృంభించినది. కన్నులెర్రబడినవి. మతి తప్పిపడియున్న శూర్పణఖను లేవగా ఎట్టకేలకు కళ్ళను తెరచినది ఆమహా రాక్షసి. దానినే వృత్తాంతమడిగినాడు.

శూర్పణఖ ఏమని చెప్పును? సరాసరిగ తన వృత్తమును బయటపెట్టక రామ లక్ష్మణుల వర్ణించినది. ఆవర్ణన మపూర్వము.

రక్కసి కెక్కడనో వెనుకప్రక్క దాగియున్న భాగ్యరేఖ నేడుదయించి నది. కాకున్న రాముని రూపురేఖా విలాసములు దాని హృదయమున హత్తుకొనునా? కామరూపమున హత్తుకొన్నవి. శూర్పణఖ వర్ణనలోని ప్రధానాంశమేమి? రామ లక్ష్మణుల రూపురేఖావిలాసముల వర్ణించి తన కామమును రాముని వర్ణించుటతో అనుభవించుచు ఒకవంక వారు దశరథపుత్రులనియు మహాబల పరాక్రమములు కల వారనియుచెప్పి, నిజమునకు వారు దేవతలా? మానవులా? అని ఊహించుటకు అలవి కాదన్నది.

"దేవౌ వా మానుషౌ వా తౌ న తర్కయితు ముత్సహే"

వారిచరిత్ర ఊహకు అందరాని అతర్క్యమగు చరిత్రయన్నది. మహర్షి రాక్షసి ముఖముగకూడ వెలువడిన బ్రహ్మవస్తువును మనకందించినారు. ప్రకృతియే సీతయని చాటినారు రాక్షసి ముఖముగనే.

తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా
దృష్టా తత్ర మయా నారీ తయోర్మధ్యే సుమధ్యమా॥ అని.

తరువాతది రాముడు జనస్థానమున ప్రదర్శించిన మహాబల పరాక్రమ వర్ణ నము. అక్కడనే దేవతలకు కూడ భయభ్రాంతులు కలుగునట్లు తనలోని అనిర్వచ నీయ పరాక్రమమును చూపినారు. అది క్రోధమయ విశ్వరూపము.

# యుద్ధము

అది రాక్షసుల కంతకాలము. శూర్పనఖ సీతను వర్ణించి నాకీవికృతరూప పరాభవమునకు మూలకారణము ఆ ప్రమదయేనని ఖరుని యుద్ధమునకు పురి గొలిపినది.

వెంటనే ఖరుడు కదలలేదు. సీతారామ లక్ష్మణులను చంపి తీసుకొని వచ్చుటకు మహాబల పరాక్రమ శాలురగు పదునాలుగుమంది రక్కసుల పంపినాడు, శూర్పనఖయు వారికి దారిచూపు నెపమున బయలుదేరినది. వారి యుద్ధము మొదటిది.

ప్రేక్షకులారా!

ఇక మీరిప్పుడు దశరధరాముని చూచుటకాదు ధర్మదేవత తనచేతనొక బాణమును ధరించి దుష్టరాక్షస సంహారమున కేతెంచినదని రామునిపై చూపుల నిలుపుడు. రాముడే ధర్మదేవత, ధర్మదేవతయే రాముడు

రాముడా పదునాల్గుమంది రక్కసుల చూచినాడు. సువర్ణమయమగు మహా చాపమును చేతబట్టినాడు ధనుష్టంకారము మూడుమ్రోత మోగినది. ముందుగనే సీతను రక్షించుటకు లక్ష్మణుని ఆజ్ఞాపించినాడు. ఇక వారిని పరిమార్పవలెను. కారణమును ప్రతిపాదింపక మరణశిక్ష నెట్లు విధించును? రాక్షసుల కెదురై నిలచి తన వృత్తాంతమును తెలిపి, ఆదండకారణ్యమువసించు మహర్షులు తన్ను అభ్యర్థించిరని చెప్పి, వారి పావనిరూపణతో వారిపై యుద్ధమును ప్రకటించినాడు. వారితో రణరంగము సాగినది. శూర్పనఖ చూచుచుండగనే వారు భూమిపై వ్రాలి ప్రాణముల కోల్పోయినారు. వారొక విధముగ పుణ్యజీవులు. కాకున్న రాముని కభిముఖులై ప్రాణములనెట్లు విడుతురు?

దండకారణ్య రాక్షస వధాఘట్టము వీరితో ప్రారంభమైనది. ఇక ఖరునితో కలసి మహాసైన్యము కదలవలెను.

ఆమహాసైన్యమును కదిలించి ఖరాది రాక్షసులను సంహరించుటకు నిమిత్తము శూర్పనఖయే కావలెను.

శూర్పనఖ సరాసరి ఖరునివద్ద కేగినది. సోదరుని రామునితో యుద్ధమునకు పురిగొల్పి ది. పదునాలుగు వేలమంది రాక్షసులతో చతురంగబలములతో ఖరుడు రామునిపై దండెత్తినాడు రాముడెవ్వడని ఖరుడూహించెను! రామలక్ష్మ

ఖులు సామాన్యమానవులని అడడూహించుచో ఇంత సైన్యమెందుకు? ఆ రాక్షసుల దృష్టిలో రాముడు అమానుష పరాక్రముడు. నేటి అధునాతన వైజ్ఞానికుల దృష్టిలో మనుష్యమాత్రుడయ్యేను. కారణమును నేనూహింపలేను.

ఖరుని యుద్ధయాత్రసాగినది. రథ గజ తురగ పదాతి సైన్యము భూభాగము నాక్రమించినది. వారి శంఖధ్వానములు దిక్కుల పిక్కటిల్ల జేసినవి. ఆరక్కసుల వీరాలాపములు మిన్నుముట్టినవి. అప్పుడా సైన్యము కదలగా భూభాగము కదులుచున్నట్లున్నది. అయ్యును ఖగోళ భూగోళములు రెండును ఖరా! నీకు జయము చేకూరదని శకునరూపమున జోస్యము చెప్పినవి. అహంకారులకీ శకున శాస్త్ర మెందుకు? అకాలమృత్యువుకు బలియగువారికి శాస్త్ర విశ్వాసముండదు.

ఖరుడు వెనుకకు తిరుగలేదు. ఇదియొక విచిత్రమగు యుద్ధదృశ్యము. ఇది ధర్మాధర్మముల పోరాటము. మహర్షిబృందమును దేవతాసమూహమును ఈ యుద్ధమున సైనికులుకారు. సైనికులు కాకపోరు. సంకల్పములకొాక సత్కీర్తిని చేకూర్చుకొన్న సైనికులు. వీరు మాకెందుకు? అనుకొనలేదు. ఈచతుర్దశసహస్ర రాక్షసులతో పోరాడనున్న రాముని, పోరాటమునుకూడ చూచుటకు ప్రేక్షకులై నిలిచి ఆశీస్సులను అస్త్రములతో రామునకు సాయము చేసినారు క్రిందమహర్షులు, పైన దేవతలు.

> "స్వస్తి గోబ్రాహ్మణేభ్యస్తు లోకానాం యేభిసంగతాః
> జయతాం రాఘవస్సంఖ్యే పౌలస్త్యాన్ రజనీచరాన్
> చక్రహస్తో యధా యుద్ధే సర్వా ససురపుంగవాన్"

ఇది నేలపై ఋషుల జయధ్వానములు. వీరికంఠములతో ఆకసమున నిలచిన దేవతల కంఠరవములు కలసినవి. రాముడు మాత్రము శకునముల పరికించినాడు. తనజయమునునిశ్చయించుకొనినాడు. సీతలక్ష్మణునిచే ఒక పర్వత గుహయందు రక్షింపబడుచున్నది. రాముడు యుద్ధమునకు సన్నద్ధుడై నిలిచినాడు.

రాక్షస సైన్యమంతయు తమ తమ ఘోరవర్మ ఆయుధ ధ్వజ విశేషములతో రథముల నధిరోహించి కొందరును, పదాతులై కొందరును సింహనాదముల గావించుచు రామునకభిముఖులై నిలచినారు. ఆ రాక్షసానీకముయొక్క శంఖదుందుభి నినాదములతో ఆవనమంతయు నిండి కోలాహలముగా నున్నది. ఆఘట్టమున

రాముని చూపులొక్కమారుగ ఆరాక్షసానీకముపైకి వెళ్ళినవి. నలుమూలల తిరిగినవి. ఆరణ పండితుని దృష్టులు మరల రాముని వద్దకు రాగా రాముడు ఉగ్రమూర్తియై ప్రళయ కాలమందలి అగ్నిహోత్రుని వలె వెలిగినాడు. ఆరుద్రమూర్తిని వనదేవతలు చూడ జాలక పరుగులెత్తినవి. ఆరాక్షసానీకముతో రాముని యుద్ధము కొనసాగినది.

రాముడా రాక్షస మండల మధ్యమున కేగినాడు. ఖరుడు రథస్థుడై రాముని ఎదిరించగా రాక్షసులందరును రాముని చుట్టుముట్టగా ఖరరాక్షసుని బాణ సహస్ర ములు రాముని ముంచివేయగా, రాముడా రాక్షసులు వదలు బాణసహస్రములను సముద్రుడు తనలోనికి వేవేగ వచ్చు నదీనదముల గ్రహించినట్లు గ్రహించినాడేగాని కొంచెమైనను వ్యధనొందలేదట. అనగానేమి? రాక్షసులందరును ఒక్కరూపులై రాముపై బాణవర్షములు కురిపించగా రాముడవలీలగ ఆబాణముల ఖండించుచుండెనేగాని ఆబాణముల తాకిడికాతడు గురికాలేదు. మరి రాముడు ప్రయోగించు బాణములో? అవి రాక్షసుల లోపలికివెళ్ళి వారి ప్రాణములను తోడుకొని వచ్చుచున్నవేగాని అవి వ్యర్థమగుటలేదు. ఇక సైన్యము బ్రతుకు టేమున్నది? కన్నుమూసి కన్ను తెరచినంత కాలముననే రాముడా రణ రంగమున పదునాలుగువేల రాక్షసులను హతము గావింపగా ఖర దూషణ త్రిశిరసులను వారుముగ్గురు మాత్రమే మిగిలినారు. వీరిముగ్గురతోటియే రాముని ద్వంద్వ యుద్ధము మిగిలినది.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణాం
హతాన్యేకేన రామేణ మానుషేణ పదాతినా.

బలవంతులగు పదునాలుగువేల రక్కసులతో ధర్మమూర్తియగు రాముడొక్కడెట్లు యుద్ధము చేయునో చూతమని వారందరును కుతూహల పడినారు. మనమొక్క మారు వాల్మీకిమహర్షి నారద మునీంద్రులను ప్రశ్నించిన ప్రశ్నల దగ్గరకేగుదము. మునీంద్రా! "కస్యబిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే". ఎవడు క్రోధ మూర్తియై రణరంగమున నిలుచుచో దేవతలుకూడ భయచకితులగుదురో అట్టి పురుషుని చెప్పుమనినారు. అతడే ఇతడు. రౌద్ర రాక్షస హంతయై నిలిచినాడు. అట్లు ఉగ్రమూర్తియైయున్న రామచంద్రుని చూచి భూతములన్నియు గజగజ లాడినవట.

"ఆవిష్టం తేజసా రామం సంగ్రామ శిరసిస్థితం
దృష్ట్వా సర్వాణి భూతాని భయాద్వివ్యధిరే తదా.

అప్పుడు రామమూర్తియందు ప్రవేశించిన తేజము రుద్రతేజమనినారు వాల్మీకి. "బభూవరూపం క్రుద్ధస్య రుద్రస్యేవ పినాకినః"

రాముడిప్పుడు పినాకపాణియైన రుద్రమూర్తియేకాదు. అగ్నిమూర్తి కూడ నట. "విధూమోగ్నిరి వోత్థితః" పొగలేక జాజ్వల్యమానమై వెలుగొందు అగ్ని మండలమువలె వెలుగొందెనట రాముని తేజము. ఇదిరాముని వీరరస ప్రధానమగు మూర్తి. నిజమునకు రామావతారమున రామ రావణ యుద్ధమునకంటె రాముని పరిపూర్ణ రసము రసవాహినియై ప్రవహించినది ఈరణరంగమునసే. రాముని వీరరస ప్రధాన కళ్యాణ విగ్రహమును దేవతలీ రణరంగమున దర్శించుట జరిగినది. ముప్పది మూడుకోట్ల దేవతలును తమ విమానములనెక్కి ఈ మూర్తిని చూతమనియే వచ్చినారు పద్నాలుగు వేలమంది రాక్షసులు, రాముడొక్కడు యుద్ధమెట్లు జరుగును ? అన్నది దేవతల ప్రశ్న.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణాం
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి ?

సైనికులు నాశము కాగా మిగిలినవారు ఖర దూషణ త్రిశిరసులు ముగ్గురు. అందు దూషణ త్రిశిరులను వారిద్దరును చావగా ఖరుడొక్కడే మిగిలినాడు. ఖరుడును విరధుడు కాక తప్పలేదు. కాని ఖరుని చేతనొక గద మిగిలినది. గదను చేతధరించి ఆతడు భూమిపై నిలిచినాడు. ఖరుడే ఇక్కడ ప్రధాన నాయకుడీ రాక్షస గణమునకు. ఆతనికి కొన్ని నిర్ణయములు చెప్పి, ఆతనితో యుద్ధమును చేసి, ఆతనిని అంతమొందింపదలచినాడు రాముడు, రాముడు ఖరునకి సమయమున చెప్పినవి మాటలుకాదు. శాస్త్ర సిద్ధాంతము.

ఇప్పుడు చేసిన కర్మ జన్మాంతరమున ఫలమునిచ్చునా ? ఈలోకమునకూడ ఇచ్చునా ? అన్నవి ప్రశ్నలు. రాముడీ రెంటికిని సమాధానమిచ్చి లోకకంటకుడగు వాడెంత బలవంతుడైనను ఆతనిని మృత్యువుబలిగొనక తప్పదని నదుపదేశమిచ్చి చంపినాడు. అందొక ఉపదేశమిది.

"ఉద్వేజనీయోభూతానాం నృశంసః పాపకర్మకృత్
త్రయాణామపిలోకానాం ఈశ్వరోపి న తిష్ఠతి.

ఎవ్వడు లోక కంటకుడై ఘాతుక కృత్యములకు పాల్పడునో ఆతడు మూడు లోకముల ప్రభువయ్యును జీవింపజాలడట. ఆతీక్షణస్వభావుడగు వాని చావును సర్వ

జనులను కోరుచుందురట. అందుకు విష సర్పము నుదహరించినాడు. తీక్ష్ణం సర్వజనోహంతి సర్పం దుష్టమివాగతం" అని.

రెండవది.

"అవశ్యం లభతే జంతుః ఫలం పాపస్య కర్మణః
ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్ప మివాంతరం.

ఏ జంతువైనను పాపకర్మఫలమును అవశ్యమనుభవించును. కాని కాలము రావలెను. పుష్పఫలాదికము ఎట్లు ఋతుకాలము ననుసరించునో కర్మఫలము జీవుల నట్లనుసరించునట.

ఈ మాటలను చెప్పి ఖరునితో యుద్ధము నారంభించినాడు. ఖరుని చిత్తమే మైన మారునేమోయని ఉపదేశించినాడు. మారలేదు ఆ దుర్మార్గుని చిత్తము యుద్ధము తప్పలేదు. ఖరుడ సామాన్యుడు. ఖరుని యుద్ధము రాముని వెనుకడుగు వేయించినది. నిమిత్త మాత్రముగ రాముడు వెనుకడుగు వైచి ఒక మహోగ్ర బాణమును తీసినాడు. అది దేవేంద్ర దత్తము. దేవేంద్రుడు పంపినది. బ్రహ్మదండ సమానము. అదియే ఖరుని కూల్చినది. ఖరుడు చచ్చినాడు. యుద్ధము సమాప్తమైనది. దేవర్షి బ్రహ్మర్షి రాజర్షుల కోర్కెలు తీరినవి. లోక కల్యాణము చేకూరినది. వారందరును రాముని సమీపించి తమ హర్షమును తెలిపినారు. ఒక్క విషయము.

రాముని క్కడకు చేర్చిన వారెవరు? ఋషులందరును కలిసి మేమే నిన్నిక్కడకు చేర్చితిమని చెప్పినారు. శరభంగాశ్రమమునకు దేవేంద్రుడు వచ్చుటను చెప్పినారు. యుద్ధరంగము శాంతమైనది. మహర్షులతో ధనుర్ధారియైన రాముడు పర్ణశాల కేగినాడు.

అది సీతారాముల పర్ణశాల. మహర్షులందరితో ధనుర్ధారియై రాముడు రాగా సీతాకాంతయు లక్ష్మణుడును గిరి గుహనుండి ఆశ్రమమున కేతెంచినారు. సీతాకాంత చూపులొక్కమారుగ తన ప్రాణనాథునిపై బడినవి. అలయక సొలయక ఒక్క అర్ధాధిక ముహూర్తకాలమున పదునాలుగువేల రాక్షసానీకమును వధించి వచ్చిన ఆ మనోహర మూర్తిని చూచిన సీతాకాంత హృదయ మొక్కమారుగ ఉప్పొంగినది. ఆమె విదేహరాజతనయ. రాముని చుట్టియున్న మహర్షులందరును

ఆమెకు బిడ్డలై కన్పట్టగా ధనుర్బాణముల ధరించి మనోహర మూర్తియై తన ఎదుట నిలిచిన ప్రాణనాధుని చూచి ఎట్లూరకుండగలదు? అలోకైకజనని తన బిడ్డలకంవరకును ఆనందమును చేకూర్చిన ప్రాణనాథునకు తన సంతోషమును తెలుప రాముని గాఢాలింగనము గావించినది. ఈ సంఘటననెంతయో మనోహరముగ వాల్మీకి వర్ణించినారు తగిన పదజాలమున. శ్లోకమిది.

"తందృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"

శత్రువుల సంహరించి మహర్షులకు సుఖమును కల్పించి వచ్చిన భర్తను చూచినదట సీతాకాంత. సీతాకాంత కాదట, వైదేహియట. వాల్మీకి ఇక్కడ సీతయన లేదు వైదేహియనినారు. చూచుటతోడనే ఆమె మనస్స్వస్థమైనదట, సంతోషమున నిండినదట. కావుననే ఆమె వైదేహియైనది. విదేహరాజతనయ సార్థకనామధేయము గలదైనది ఒడలు మరచినది. ఆమె శరీరమును మరచి భర్తను కౌగలించినది. సామాన్యముగ కౌగలించుటకు ఆలింగన పదమును వాడక పరిషస్వజే అనినారు. ఈ పదముయొక్క ప్రత్యేకత ఏమి? కౌగిలింత సామాన్యముగు ప్రేమను సూచించగా పరిష్వంగము గాఢమగు ప్రేమను చెప్పును. తన ఉన్నత కుచమండలముంతో నాధునికి యుద్ధమునందు కలిగిన శరీర వ్రణముల మాన్పినదా? యనునట్లు కౌగిలించినదను భావమును కవి సూచించినారు. అనగా ఆమె శరీరమునందలి ఒక భాగమునేగాక ఆ శృంగార మూర్తియొక్క వెనుక ముందరలను పార్శ్వ భాగములను కూడ గాఢానురాగమున కౌగలించి, స్పర్శ సౌఖ్యమును కల్పించినదని భావము. ఋషివర్యులింత శృంగారమునేల వర్ణించిరి? అని మీరనుకొనవచ్చును. మీరనుకొనుట కాదు, నన్నొక మిత్రుడు అడిగినాడు కూడ. మీకీ ఘట్టమునందలి సంభాషణను వినిపించెదను.

మిత్రు: శాస్త్రిగారు! కోపించకండి. నాకొక సందేహమును తీర్చుకొనుటకయ్యే మిమ్ములనడుగుచుంటిని.

నేను: తప్పక అడుగవలసినదే.

మిత్రు: ఆర్షగ్రంథములు చాల ధర్మయుక్తములుగదా?

నేను: అవును.

మిత్రు : మరి ఆ గ్రంథములయందు దేవుడు పేరు చెప్పి పచ్చి శృంగారమును వర్ణించుట సభ్యతయేనందురా?

నేను : వారు వర్ణించునది పచ్చిశృంగారము కాదు. పరిపక్వముగ పండిన శృంగారము.

మిత్రు : అంటే?

నేను : నీవనుకొన్న పచ్చిశృంగారము మోహములోనిది. పండినశృంగారము ప్రేమ మూర్తులలోనిది. మోహముచే అనుభవించు శృంగారమున దుఃఖమిమిడి యుండగా ప్రేమ శృంగారమున జన్మరాహిత్యమునకు తావు కలుగును. సీతా రాములు ప్రేమమూర్తులు. పార్వతీ పరమేశ్వరులు ప్రేమమూర్తులు. రాధా కృష్ణులు ప్రేమమూర్తులు. పార్వతీ పరమేశ్వరులకే కామేశ్వరీ కామేశ్వరు లని పేరు. రాధాకృష్ణులును, సీతారాములునుకూడ కామేశ్వరీ కామేశ్వరులే. పరిపూర్ణానందము నొసంగునది ప్రేమ. క్షణికానందము నొసంగి, మరుక్షణ మున దుఃఖరూపముగ పరిణమింప చేయునది మోహము. ప్రేమమూర్తుల శృంగారము అఖండము. ఆ శృంగారమున ఖండత్వములేదు. పూర్ణానుస్వా రము విసర్గలైనట్లు (అరసున్నలైనట్లు) పరిపూర్ణ శృంగారము, లేక పరి పూర్ణ ప్రేమ రెండు ఉపాధులైనది. అంతియే. అఖండాత్మ ఖండాత్మయగు జీవున కాశ్రయమైనది. స్త్రీత్వము ఖండాత్మయగు జీవుడు కాగా, పూర్ణాత్మ పురుష ఉపాధితో జీవున కాశ్రయమైనది. రాముడు పూర్ణానంద విగ్రహము. సీత జీవుడు (లేక) క్షేత్రము, మాతృమూర్తి. సీతారాముల పవిత్ర ప్రేమా మృత స్వరూపముగ దర్శించినవారు మహర్షులు. వారా సీతారాముల పరి పూర్ణ శృంగారము వర్ణించి కృతార్థులై మనల కూడ కృతార్థుల గావింప మన ఇతిహాస పురాణకావ్యములందు అపవిత్ర శృంగారమును వర్ణించినారు. పర బ్రహ్మము రస స్వరూపము. "సోవైరసః" అని శ్రుతి. కామేశ్వరుని ప్రేమ రత్నమణికి ప్రతిపణమై యున్నది కామేశ్వరీ మహాదేవి కుచ ద్వంద్వము. "కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ" అని లలితా సహస్రము. ఆ పరమేశ్వరి కుచద్వంద్వము ప్రణవము. (ఓంకారము) మిమ్ములను మిత్రులుగనే గ్రహించి నేనొక సలహాను చెప్పదలచినాను. మీరెప్పుడును ప్రస్తుత కాలమున నవీన పండితుల పాండిత్య విమర్శల నాధారముగా గొని మన గ్రంథములను చూడ ద్దని. మీకేమైన కోపమా?

మిత్రు : నా సందేహము తీరినది

నేను : ఏ నిర్ణయముపై తీరినది?

మిత్రు : పరిపూర్ణాత్మకీర్తులై స్వార్థపరులుగాక, విషయ భోగముల వదలిన మహర్షులకు సభ్యత తెలియనిచో అల్పప్రాణులును, అల్పాయుష్కులును అయిన వీరికి సభ్యత తెలియుటేమిటి? అని నా మనస్సునకు నిర్ణయమైనది ఇప్పుడు. ఇట్లే మిమ్ములను మీ ఉపన్యాసములలో కలుగు సందేహముల నక్కడక్కడ అడుగుచుండెదను. క్షమించి చెప్ప ప్రార్థన.

నేను : ఇంతకంటె నాకు మహాభాగ్యమేమున్నది? తప్పక చెప్పెదను. ఉపన్యాస మధ్యమున కాక ఒంటరిగా వచ్చి అడిగినందుకు చాల సంతోషమని చెప్పి మిత్రుని పంపినాను. ఈ ఘట్టమున రాముని సీత కౌగలించినదన్న వర్ణన లోని రెండవ శ్లోకమిది.

"తతస్తు తం రాక్షస సంఘమర్దినం
సభాజ్యమానం ముదితైర్మహర్షిభిః
పునః పరిష్వజ్య శశిప్రభాననా
బభూవ హృష్టా జనకాత్మజా తదా.

రాక్షస సంఘమును మర్దించి ఆనందాతిరేకము ననుభవించు మహర్షులచే పూజింపబడు ఆ రఘురాముని ఆ జనకాత్మజ పరమానందమున చంద్రమండల సదృశ ముఖమండలముతో మరల మరల కౌగలించి ఆనందించినదట ఆ సమయమున.

ఇంతటితో ఈనాటి ఉపన్యాసమును ముగింతము తరువాతి కథాభాగమురేపు. లేవకండి. ఈనాటి కథాశ్రవణమువ కలుగు ఫలమును స్కాందపురాణము ఇట్లు చెప్పినది.

"శ్రుత్వా శ్రీరామ జననం పాపబంధాత్ప్రముచ్యతే
తదైవ శృంఖలాబంధాత్ ఋణబంధాద్విముచ్యతే.
శ్రుత్వా పుష్పవతీ నారీ తనయం వంశవర్ధనం
లభతే రాఘవేంద్రస్య ప్రసాదా త్కీర్తివర్ధనం.

ఈ ఖరదూషణాదుల వధించిన శ్రీరామ విజయమును వినుటచే పాపము తొలగునట. కారాగృహబంధము విముక్తమగునట. ఋణవిముక్తుడగునట. రజస్వలయైన అయిదవ రోజునుండి ఈ కథాశ్రవణము చేసినస్త్రీకి రామానుగ్రహముచే సత్సంతానము కలుగునట గూడ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 3 వ రోజు

శ్లో॥ జయతు విజయకారి జానకీ మోదకారి
తపన కుల విహారి దండకారణ్యచారి
దశవదన కుఠారి దైత్య విచ్ఛేదకారి
మణి మకుట ధారి చండ కోదండధారి

మహాశయులారా !

అరణ్య కాండము నందినాటి ఉపన్యాసము మూడవది. రాఘవేశ్వరుని జ్యావల్లీ వినాదము జనస్థానమున శాంతించినది. ఇక లంకాద్వీపమున మారు మ్రోగవలెను. సీతాపహరణము దాని కథా బీజము.

అకంపనుడు జనస్థానమున మిగిలిన రాక్షసుడు. రావణుని హితుడు. జనస్థాన వినాశము రావణునకు తెలుపుటకై ఆతడు లంకకేగినాడు. అప్పుడే ప్రహస్తాది మంత్రి వర్గముతో తీర్చిదిద్దిన సభాస్థలి నలంకరించి కూర్చొనినాడు రాక్షసరాజగు రావణుడు.

అకంపనుడు రావణునకు జోహారుల నర్పించి జన స్థాన వృత్తాంతమును తెలిపినాడు. కాని రాముని పరాక్రమమును మాత్రము విశదీకరింపలేదు. తాను చెప్పుదానిని క్షమించి రక్షించుటకు దశగ్రీవుడభయప్రదానము చేసిన గాని చెప్ప

వీలు లేదు. రావణుని ఆజ్ఞయైనది. అకంపనుడు రాముని చరిత్ర సంతను సంగ్రహముగ చెప్పి, అతని స్వరూప స్వభావ సౌందర్యముల వర్ణించి ఆతడొక్కడే మూడు ఘడియల కాలమున జనస్థానమును హతమార్చినాడని తెలిపినాడు.

రావణుడు తన పరాక్రమమునకు దీటగు పరాక్రమ మీముల్లోకములందును లేదని ఆత్మనిశ్చయము కలిగియున్న వ్యక్తి. రాముడొక్కడే ఆరాక్షసుల చంపెనన్న వార్తను ఎట్లు నమ్మును? "ససురేంద్రేణ సంయుక్తో రామస్సర్వామరైస్సహ" రామునకేమైన దేవతలతో వచ్చి దేవేంద్రుడు సాయము చేసెనా? అని ప్రశ్నించినాడు. ఆ ప్రశ్నకు అకంపనుడు సమాధానము చెప్పవలెను. ఆతని ఒళ్లు వణకినది. ప్రభూ చెప్పమందురా? అని సవినయముగ ప్రశ్నించి రాముని అద్భుత పరాక్రమముతో కూడిన యుద్ధము వర్ణించినాడు.

ఆ రాముడు జ్యావల్లీ నినాదమును గావించి, నారిని ఆకర్ణాంతముగ లాగి విశిఖ వ్రాతముల వదలునప్పుడు ఆబాణసహస్రములు అయిదు తలల సర్పరాజములై రాక్షస సమూహమును భక్షించుట గాక అప్పుడు వారే యేదిక్కులకు పరుగులెత్తి తప్పించుకొన జూతురో ఆయా దిక్కులకెల్ల ఈబాణ సహస్రములు పరుగులెత్తి వారిని చంపినవని చెప్పినాడు.

శత్రువులకు దుర్నిరీక్ష్యుడై లోకమునెల్ల గజగజలాడించిన రావణుడు అకంపనుని మాటల వినగనే ఆరాముని సంహరింతునని ఉగ్రమూర్తియై లేచినాడు.

అకంపనుడు రావణుని బలా బలముల నెరుగనివాడుకాదు. నిజమునకు రావణుని సచివుల కందరకును రావణుని నిరంకుశత్వము నెట్లు మరల్పవలెనో తెలిసియే వారాతనివద్ద మెలగుచుండి . రామునితో యుద్ధమున మీరు గెలవలేరన్నచో అప్పుడే ఆతడు తనను చంపును. అందుకు అకంపనుడు రాముని యుద్ధరంగమున గెల్చుట సాధ్యము కానిపనియని రావణునకు చెప్పచునే రాముని చంపదగు వేరొక ఉపాయమును గూడ చెప్పినాడు.

అకంపనుడొకమారు రాముని భార్యయగు సీతను వర్ణించి, రాముడు కాముకుడని చెప్పి, ఆ సీతను మీరెత్తుకొని వచ్చుచో ఆ ప్రియురాలి వియోగమును సహించలేడని ఆతీండు తనంతట తానే కృశించి చచ్చునని సలహా నిచ్చినాడు.

రావణునకు అకంపనుని వాక్యము చాల నచ్చినది. తలను పంకించినాడు రావణుని వంటివారి దగ్గర బ్రతుక తలచిన వారట్లే మాటలనేర్చి బ్రతుకవలెనేమో.

రావణుడు సీతాపహరణమునకు ప్రయాణమయ్యెను. సారథి రథమును గూడ ఆయత్తపరచినాడు.

రావణుని రథము దివ్యము. అదిభూమిపై నడచునదికాదు. ఆ రథవాహకములు గుఱ్ఱములు కావు. గార్దభములు. ఆ దివ్యస్యందనము మేఘ మండలములను గూడ చాటుగావించుకొని మహావేగముగ ప్రయాణించును. ఇప్పుడట్లే ప్రయాణించినది.

మారీచుడు రావణుని ముఖ్యస్నేహితుడు. సచివుడు కూడ. అతడిప్పుడు ఒక ఆశ్రమమును నిర్మించుకొని ఈ దండకారణ్యములందే వసించుచుండెను. ఇది ఋషి జీవితము కాదు. రావణుని రథము మారీచాశ్రమము వద్ద నిలిచినది. మారీచుడు మనకు క్రొత్తవాడు కాడు. ఇతడు తాటకి కొడుకు. తాటకియు మారీచుడును కూడ మనకు బాలకాండ యందు పరిచితులు. తాటకి చావగా మారీచుడు బ్రతికియుండెను.

రావణుడు రథము దిగి ఆశ్రమమున కాలుబెట్టినాడు. మారీచుడు లేచి పాద్యార్ఘ్యములనిచ్చి గౌరవించుట జరిగినది. తరువాత కుశలప్రశ్నలలో రావణుడు జనస్థాన వృత్తాంతమును మారీచునకు తెలిపినాడు. ఇక ప్రస్తుతమగు తన అవసరమును చెప్పవలెను. చెప్పినాడు. తానిప్పుడు చేయదలచిన సీతాపహరణ మహా కార్యమునకు నీసహాయము లేక నెరవేరదని.

నేటి మారీచుడు ఒకనాడు రావణుడెరిగిన మారీచుడుకాడు. రాముని బాణపు దెబ్బలలోని రుచిని కనుగొన్న మారీచుడు. ప్రస్తుతమున రావణుని హితమును కోరిన మారీచుడు. రావణుడు తలబెట్టిన ఈ నీచకార్యము రావణుని స్వబుద్ధి కాదని ఆతడు గ్రహించినాడు. పరోపదేశమని నిర్ణయించుకొనినాడు. వినయ పూర్వకముగనే రావణుని సూటిగ ప్రశ్నించినాడు.

ఆఖ్యాతాకేన సీతాసామిత్రరూపేణ శత్రుణా

మహారాజా! నీకీ ఉపాయమును చెప్పిన మిత్రరూప శత్రువెవ్వరని. అంతతో ఊరుకొనలేదు. నీవు తలబెట్టిన ఈకార్యము నీవినాశనమునకేగాక సర్వ రాక్షసవినాశనమునకు గూడ కారణము కాగలదని ఉద్ఘాటించినాడు. మనకు పర్యవసానమేమితెలినది? అకంపనుని ఉపాయము రావణుని చంపుటకేనని తెలినది. ఇట్టి వారెందరో రావణుని దగ్గర ఉండిరి. మిత్రరూప శత్రువు లిట్లుందురని కావ్యవాణి వలన మనము గ్రహించవలెను.

తరువాతి కథ.

రావణునకు మారీచుడు రాముని పరాక్రమమును వర్ణించిచెప్పి, రాక్షసేంద్రా! నీవు నీలంకకేగి నీభార్యలతో క్రీడించి తృప్తినొందుట మంచిదని చెప్పి, రాముడు అతని ఏకైక పత్నితో అరణ్యముల వసించువని హితబోధను చేసినాడు. సామదాన భేద దండోపాయములతో రావణుని ఈకార్యము నుండి మరల్చినాడు. ఈఘట్టమున రాముడను సింహము, రాక్షస మృగముల చంపి ప్రస్తుతము విశ్రమనొంది యున్నది. ఆ సింహము నెందుకు లేపెదవని భయపెట్టగా రావణుడు తిరిగి లంకకేగినాడు. ప్రస్తుతమున రావణుడీ కార్యమునుండి విరమించినాడు. వచ్చిన దారిని లంక కేగినాడు. తన విశాల భవనమున ప్రవేశించినాడు.

మృత్యువు జీవులను బలిగొన దలచినప్పుడు వారి కర్మను గుణ్యముగ ఆ ఫలమునందించ దలచి తన దగ్గరకు పంపించదగు ప్రేరకులను ఆజీవుల దగ్గరకు పంపును. అప్పుడా ఫల పరిపాకము గావించు దేశకాలములు మృత్యువున కధీనములై యుండును.

రావణ వినాశనమునకును లంకాపురీ విధ్వంసమునకును హేతుభూతమగు పాత్ర శూర్పణఖ యనక తప్పదు.

మారీచాశ్రమము నుండి సీతాపహరణ కార్యమును విరమించుకొన్న రావణుడు తన పుష్పకవిమానాగ్రభాగమున సూర్యమండల కాంతివలె వెలుగొందు కాంచన సింహాసనము నధిష్ఠించియున్న సమయమది. అతని మంత్రిమండలి అంతయు అతనిని చుట్టియున్నది. దానిని మరుద్గణముతో కూడిన దేవేంద్ర సభ యనుట అతిశయోక్తి కాదు.

నేడే మహాభాగ్యవంతుని భాగ్యమును కూలద్రోయ తలచుకొన్నది శూర్పణఖ. అందుకు కారణము లేకపోలేదు. ఉన్నను అది అంతర్గతము. శూర్పణఖకు వైధవ్యమును చేతబెట్టినవాడు రావణుడే. శూర్పణఖ భర్త రావణుని చేతిలోనే చచ్చెను. కావున రావణుని నాశనము గావింపదగు సమయమిదియేనని శూర్పణఖ యూహించెనేమో ? శూర్పణఖకు రాజనీతి లేదని మనమనుకొనకూడదు.

శూర్పణఖ సరాసరి లంక కేతెంచినది. సభాసీనుడైన రావణుని చూచినది. రావణుని ఉనికిని విమర్శించినది. జనస్థానమట్లు రామునిచే నాశనము కాగా రాక్షస

రాజువైన నీవిట్లు కూర్చుని శత్రువు నుపేక్షించుట రాజనీతి కాదని రాజనీతిని ఉపన్యసించి సోదరుని చివాట్లుపెట్టి రావణుని చిత్తమును ఉద్రేకింప జేసినది. అకంపనుని వలన రాముని బలపరాక్రమములను విన్న రావణుడు శూర్పణఖను మరల ప్రశ్నించి యుద్ధవిశేషముల నన్నిటిని అడిగి తెలుసుకొనినాడు. ఇంతవరకు అకంపనునకును శూర్పణఖకును తేడాలేదు. కాని శూర్పణఖ సీతాపహరణ కార్యము నందు రావణుని నిమగ్నుని గావించినది. అది శూర్పణఖలోని నేర్పరితనము. శూర్పనఖ తన వికృతాకారమునకు కారణమును చెప్పుచు రామలక్ష్మణుల దగ్గరకు తాను వెళ్ళినది రావణుని కొరకేనని రావణుని ఆశగొలిపినది. నీ కొరకు వెళ్ళియే నేనిట్టి అవస్థపాలైతినన్నది. నాకొరకేల వెళ్ళితివి ? అందువేమో. రాముని భార్య యగు సీత త్రిలోకసుందరి యగుటచే ఆ సీతను నీకు పెండ్లాముగ చేయుటకు యత్నింప వెళ్ళితినన్నది. ఆమెలోని సౌందర్యమున కుపమానము దొరకదన్నది. ఆమె ఎవరిని సంతోషమున కౌగలించుకొనునో వానికిక కొరతలేదన్నది. ఆమె కౌగలించిన పురుషుడు దేవేంద్రుని కంటె గొప్పవాడన్నది.

యస్య సీతా భవేద్భార్యా యం చ హృష్టా పరిష్వజేత్
అతిజీవేత్సర్వేషు లోకేష్వపి పురందరాత్.

ఈవిధముగ చెప్పుట అకంపనునకు కుదరలేదు. రావణుని హృదయమున సీతా సౌందర్యమునేగాక ఆసుందరి ప్రత్యేకతను ముద్రించినది. రావణుని ఎవ్వరు కాదన్నను ఆ సీతాపహరణ కార్యమునుండి వెనుదీయకుండునట్లు తయారుచేసినది. శూర్పణఖ ఉపన్యాసములోని ప్రత్యేకత ఏమి? నీమీదనున్న ప్రేమచేతనే నాకీ గతి పట్టినదని తెల్పినది. కాని ధర్మాత్ముడగు రాముడు నన్ను చంపక వదలెనన్నది. నీకు చెప్పితినని కాదు, ఆసీతను చూచిన నీకే తెలియుననని రావణుని గట్టిపరచినది.

రావణుని హృదయమున సీత దివ్యసౌందర్యము ముద్రితమైనది. మన్మథుడును తన బాణమును రావణునిమీదికి అనుసంధించినాడు. మారీచుడు వర్ణించిన రాముని వీరత్వమును రావణుడు తలచలేదు. రాముని వలన భయము తీరినది. ఏదియో తనలో నిశ్చయించుకొనినాడు.

రావణుడు సభనుంచి లేచినాడు తానెక్కడికి పోవుచుండెనో ఎవ్వరికిని చెప్పలేదు. వాహనశాల కేగినాడు. రథమునెక్కినాడు. అది రావణుని సంకల్పము ననుసరించి వెళ్ళదగు రథము. (కామగము)

అతడు పదిశిరములతో ఇరువది బాహువులతో తన తేజమును విరజిమ్ము చునే బయలుదేరినాడు. మరల తన ఆప్తమిత్రుడగు మారీచుని ఆశ్రమమునకే వెళ్ళినాడు మారీచునితో పాతపాటనే పాడినాడు. నా సీతాపహరణమునకు నీ సాహాయ్యము తప్పదనినాడు

మారీచుని గుండె బ్రద్దలైనది. ఒడలు వణకినది. పెదవులెండినవి. ముఖము శుష్కించినది. మృత్యువాతని కెదురై నిలచెనను భావముదయించినది. ఇప్పుడు రామరావణులిద్దరును అతనికి మృత్యువులయ్యే యుండిరి. రావణుడు చెప్పినది కాద న్నచో ఇతడు మృత్యువు. అవునన్నచో రాముడు మృత్యువు. ఎట్లయినను తన చావు తప్పదనుకొనినాడు.

వాల్మీకి మహర్షివారి దృక్పథమున మారీచుడిప్పుడు మహాప్రాజ్ఞుడయ్యెను.

"ప్రత్యువాచ మహాప్రాజ్ఞః మారీచో రాక్షసేశ్వరం॥"

అనినారు మహర్షి.

రాముడెవ్వడో రావణున కాతడు తన అనుభవమును ఆధారముగాగొని బోధించినాడు.

ఆతని బోధామృత ముఖ్యసూత్రమిది.

"రామో విగ్రహవాన్ ధర్మః సాధుస్సత్య పరాక్రమః
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవానివ."

రాముడు విగ్రహరూపము ధరించియున్న ధర్మమట. సాధుమూర్తి యట. అతని పరాక్రమము త్రికాల సత్యమట. రాముడీ భూలోకమునందలి అయోధ్యా రాజ్యమునకే రాజుకాడట. సర్వలోకములకును అతడు ప్రభువట. ముప్పదిమూడు కోట్ల దేవతలకెల్ల ఇంద్రుడు ప్రభువో అట్టివాడట రాముడు. ఇది మారీచుని నిర్ణ యము. ఈ నిర్ణయమును చెప్పి, ప్రస్తుత పరిస్థితిని చెప్పినాడు.

రావణా! రాముడు దండకారణ్యమున ప్రవేశించిన తరువాత నాజీవితము మారినది. నేనొకనాడు దీప్తజిహ్వ తీక్ష్ణ దంష్ట్రిలతో కలసి ఋషుల మాంసభక్షణము నను వారి రక్తపానమును కాలముగడపుచు, రాముడు తాపసవేషమున చరించుటచే ఆతడిప్పు డహింసావ్రతమును పాటించుచుండెనని భ్రాంతినొంది, మృగవేషమున ఆ యిద్దరితో రాముని మీదికి పోయితిని. నిజమునకు నేను రాముడు బాల్యమున విశ్వామిత్రయాగ రక్షణ సందర్భమున నా మీద ప్రయోగించిన బాణపుదెబ్బను మరువలేను. అయ్యును ఆతనిమీదికి ఉరికినాను. రామునిమీదనున్న పూర్వ వైరము నన్నువదలలేదు. కావున ఆవైరమును తీర్చుకొనుటకై వెళ్ళినాను. రాముని పరాక్రమ మసామాన్యము. మృగశరీరధారులమైన మాముగ్గురనతడు గ్రహించి మా ముగ్గురపైన నొక్కమారుగ మూడు బాణముల నొదలినాడు. ఎట్లకేలకు నేనా బాణపాతమునుండి విముక్తుడనైతినిగాని దీప్తజిహ్వ తీక్ష్ణదంష్ట్రిలు మాత్రము ప్రాణముల కోల్పోయినారు. అంతటితో రామునిపైనున్న క్రోధము నా మనసున శాంతించినది. రాముని నేను జయించలేనను భావము నాకు స్థిరమైనది. నా అంత రాత్మయే నాకు సన్యాసమిచ్చినది. అంతతో నాలోపలదాగియున్న దుష్కృత్య వాసనలన్నియు ఉపశమించినవి. రాముడు కోదండపాణియై దండపాణివలె నాఅంత రాత్మయందు నిలిచినాడు. ఈ దండకారణ్య మధ్యభాగమునందున్న ప్రతి వృక్షము నందును రాముడు నాకు సాక్షాత్కరించుచుండెను. కామకాదు. వృక్షాగ్రములందు రాముడు. ఆకు ఆకునరాముడు. పువ్వు పువ్వునరాముడు. లతాపుష్ప నికుంజము లన్నియు నాకిప్పుడు రామునయ్యే కన్పట్టుచున్నవి. రాముని జ్యావల్లీనినాద తరంగ ములు నా శ్రవణరంధ్రములనిండి నన్నాక్రమించగా ఆతని బాణపుదెబ్బను గ్రహించిన నా చిత్తము రామమయమైనది. రకారము ఆద్యక్షరమైన ఏ ఒక్క శబ్దమును విన్నను నాచిత్తము భీతిల్లుచున్నది. రత్నరథ శబ్దముల నుచ్చరింప నావాక్కు భయ పడుచున్నది. నిన్ను రావణా! యని సంబోధించుటకు భయము నొందుచున్నది నా చిత్తము. నారచీరెలధరించి, చేతనున్న తీక్ష్ణ కోదండముతో రాముడు నాకీ ప్రదేశమునంతటను సాక్షాత్కరింపగా నేనీ జాగ్రదవస్థనుండి తొలగి నిద్రింప నారంభించినాను. స్వప్నమున గూడ నన్ను రాముడుచంపునన్న భయము వదల లేదు. స్వప్నమునందును రాముడే నాకన్నులఎదుట నిలబడుచుండెను. వేయేల? రావణా! జాగ్రత్స్వప్నముల రెంటియందును రామునే చూచుచుంటిని గాని వేరొక వస్తువు నాకంటికి కనబడుట లేదనినాడు. రావణునకిట్లు బోధించి మారీచుడు రాముని తో యుద్ధమునకుదిగి పీరుడవై తనువును చాలించుటగాని, ఓరిమి వహించి కీర్తి

నొందుటగాని నీకు మంచిదని చెప్పి, నిన్ను అనుసరించుట నాకిష్టములేదనినాడు. నీవు రామునిచేత తప్పక చత్తువనినాడు. నిన్ను బంధువుగ భావించి హితమును చెప్పితిననినాడు.

రామునిపై నిందలు మోపువారికిది బుద్ధిచెప్పిడీ ఘట్టమని నా ఊహ. కథను తిలకింపుడు.

మారీచుని బోధలు రావణునకు రుచించలేదు. నేను నిన్ను సలహా వడుగుటకు రాలేదనినాడు. నా చేతిలో చచ్చెదవా? నాకు సాయముచేతువా? అని సరాసరిగ అడిగినాడు. మారీచుని సమాధానమిది. రావణా! ముందు నాచావును, తరువాత సబాంధవముగ నీ చావుననినాడు. రావణుడప్పటికను మారలేదు. తన సీతాపహరణ కార్యమునకు మారీచుని కర్తవ్యమును నిర్ణయించినాడు. ఉపాయము రావణునిది, ఆచరణ మారీచునిది.

మారీచుడు బంగారులేడియై సీతను లోభపెట్టవలెను. ఆ లేడిని ఆమె కోరి, తెచ్చుటకు భర్తనుపంపును. ఆ లేడి రామునినాలదూరము గొనిపోవలెను. అక్కడ హా! సీతా! లక్ష్మణా! అని ఆర్తస్వరమున పలుకవలెను. అందుకు భయపడి లక్ష్మణుడు కూడ వెళ్ళగా సీత ఒంటరిదికావలెను. అప్పుడు తానెత్తుకొని పోవలెను. ఇది రావణుని ఊహా. దీనినే మారీచునకు తెలిపినాడు.

కాలము కలసివచ్చినది. మారీచుడు తల ఊపినాడు. నీవిప్పుడు మారీచుడవనిపించుకొంటివని ప్రస్తుతించి తనరథముపై నెక్కించుకొనినాడు. వారి రథము ఆకసమున కెగసినది.

## మా య లే డి

అది జానకీరాముల పర్ణశాల. ఆ పర్ణశాలాభ్యంతరముననే లక్ష్మణార్యుడును కలడు.

రాముని పర్ణశాలకు చుట్టును కదళీవనము, అశోకములును ఉన్నవి. కన్నులకింపులై కెంపులవలె కన్పట్టు కొండగోగు పూగుంపులక్కడ లేకపోలేదు. అది ఒక విధముగ విహారస్థలమైయున్నది. కావుననే సీతాకాంత ఆవన శోభల తిలకించుచున్నది. పుష్పాపచయమును కూడ చేయుచున్నది.

సృష్టిఖండమునందెన్ని చిత్రములున్నవో ఎవ్వరెరుగుదురు? రాబోవు కాల ప్రభావములు కూడి అట్టివే. శంకరులీ సృష్టినిగురించి దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృత మనినారు. దీని ప్రభావము అనిర్వచనీయము.

అక్కడనే చరించుచున్నదొక బంగారులేడి. దాని ముఖము తెలుపునలుపుల కలయికగలిగి ముఖమునకు పై భాగమున ఎర్రదామరవలె భాసింప, క్రిందిభాగము నల్లకలువరేకుల నలుపుదనము కలిగియున్నది. దాని శృంగాగ్రములు నీలమణి ప్రభాభాసురములు. దాని ప్రక్కభాగములు వెనుకకు పువ్వారంగు దగిలి సువర్ణ నిర్మితములట్లుండును.

దాని శరీరముపైనున్న చుక్కలు తెల్లని తెలుపులై యుండుటచే ఆచుక్కలు చెక్కిన వెండి పూవులవలె కాన్పించును. దాని యుదరము చూచువారలకు చంద్ర జ్యోత్స్నయై తెల్లగ కానుపింపగా దాని పుచ్ఛము ఆకాశమున చూచునట్టు ఇంద్ర ధనుస్సువలె నానావర్ణ విరాజితముగ యుండి చూపరుల కాశ్చర్యమును గొలుపు చుండును. దాని గిట్టల చూచిన అవి వైడూర్యమణులని భ్రాంతి పడ పోదు. ఆ మృగమునకుపై అవయవ నిర్మాణమట్లుండ అదియొకప్పుడా పలింపగా దాని నాలుక మేఘమధ్యమందలి మెరుపుతీగవలె తళుక్కుమనుచు అగ్నిజ్వాలలవలె వెలుగు చుండును. దాని రోమరాజి బంగారు తీగెలని తప్పక నమ్ముదురు. వేయేల? దానిని రత్నసారముల నిర్మించ బడినదనుట యుక్తము.

వన్యమృగములు దానిని సమీపించును గాని అమ్మృగమును వాసన చూడగనే పారిపోవును. అందుచే అది మృగజాతికి చెందిన సామాన్యమృగము కాదని బోధ పడుచున్నను కాలమునకే శక్తి సంపన్నత్వ మెక్కువ యగుటచే సీతాకాంత దానిని మృగమనియే భావించినది. ఆ ముగ్ధురాలి భావమూ వింత మృగము గ్రహించ కుండునా? మారీచమృగము సీతాకాంత ముంగట తన చాకచక్యమును చూపుచు గంతులిడ నారంభించినది. సీతకిది క్రీడామృగమైనది. తన చెల్లెండ్రకు దీనిని ఆట వస్తువుగ చూపుదమనుకొన్నది. రామలక్ష్మణుల పిలచి ఆమృగమును చూపి దానిని తన కందింపుమని రాముని కోరినది.

రామునకా మృగముయొక్క స్వరూపము తెలియునో తెలియదో మనకు స్థూలముగ తెలుసుకొనుట కవకాశము లేదు. రాముడు సీత కోర్కెను మన్నించి లక్ష్మణునకు ఆమృగమును తెచ్చి మీ వదినకిత్తునని ఎరింగించినాడు. లక్ష్మణుడు

యథార్థవాది. ఆకార్యముష్టండి రాముని మరలింపయత్నించినాడు. ఇదిమృగముకాదని స్పష్టముగ చెప్పినాడు. అప్పటి రాజుల నెందరనో భ్రాంతులగావించి వారి నీరాక్షస మృగము పొట్టను పెట్టుకొనుచున్నదని తెలిపినాడు. ఇతడు మారీచుడు కావచ్చునని కూడ వ్రాకుచ్చినాడు సీతకాతని మాటలు నచ్చలేదు. రాముని గట్టిగ కోరినది. రాముడాహరిణ సౌందర్యమును చంద్రమండలములోని మృగము వంటిదని దాని దివ్యత్వమును వర్ణించి ఎట్లైన దానిని వెంటనంటి అమృగమును హరించుటకు కొన్ని కారణముల ప్రతిపాదించినాడు.

ఆ కారణము లివ్వి.

ఒకటి అది మృగరత్నమగుట. రెండు మాంసమువకై వేటాడుట. మూడు అది రాక్షస మృగమగుచో ఋషులకిచ్చిన శరణాగతికి దానిని వధించుట. ఇందే కారణమును పురస్కరించుకొన్నను దాని వెంటవెళ్ళి దాని సంపాదనకు యత్నించుట అవసరమనినాడు. కాని మూడవకారణమున అతడు రాక్షసుడగుచో ఒంటరిగ పోవుట ప్రమాదము కాదా? అను ప్రశ్న లక్ష్మణున కుదయించవచ్చును గావున అగస్త్యమునీంద్రుని గర్భమున వాతాపి దగ్ధమైనట్లు నాధర్మతేజమున రాక్షసుడు దగ్ధమగునని ముందుగనే సమాధానమిచ్చినాడు. కావున మారీచమృగము ముందును రాముడు వెనుకను బయలుదేరినారు. రామునిప్పుడే మనవలెను? దేశకాలజ్ఞుడగు రాముని అజ్ఞుడనవలెనా? లేక సర్వజ్ఞుడై భావికాలమును గుర్తెరిగి మృగము వెంట వెళ్ళెననవలెనా? ఎట్టి ప్రజ్ఞావంతులైనను కొన్ని సమయముల మందప్రజ్ఞులగుదు రవి మానవులకుచాటి ఆదర్శమూర్తి యయ్యెననవలెనా? రామునే మనవలెను? రాముడజ్ఞుడను కొను అజ్ఞులకు మన సమాధానమక్కరలేదు. రాముడాదర్శమూర్తి యగుటకే అవతరించెనను వాదమున అన్ని సమాధానములును కుదురును. చంద్ర మండలములోని మృగమును భూమండలములోని ఈమృగమును దివ్యమృగములని నిర్ణయించిన రాముడు అజ్ఞుడగునా? మృగలాంఛనుడు చంద్రుడు. చంద్రమండలము లోని మృగమెట్లు చిహ్నమో అట్లే ఇదియు నామమాత్ర మృగమని చాటినరాముడు అజ్ఞుడెట్లగును? రామావతారమును గురించి మనము ప్రధానముగ గ్రహించదగినది మర్త్యత్వ ప్రకటనకు ప్రాధాన్యతనిచ్చుచు తన సర్వజ్ఞత్వమును అవసరమగుచోట వ్యంగ్యముగా చూపుచుండునను విషయము. కథకు రండు. మాయలేడి రాముని అంతదూరము గొనిపోయినది ఆశ్రమును లేడి మానవుని తన వెంట గొనిపోయి నట్లే చరించినది.

దాని అంత్యకాలము రాముడెరుగనిదికాదు. మాయకు వశీకరుడైన వానివలెనే రాముడా మారీచునితో చాల దూరము పోయి బ్రహ్మనిర్మితమైన దివ్యాస్త్రమును తీసినాడు. అది మృగమే ననుకొన్న రాముడు బ్రహ్మనిర్మితమగు అస్త్రమును తీయునా? రాక్షస సంహారకమగు దివ్యాస్త్రమును తీసి బాణమునందు నుసంధానము గావించి మారీచుని మరణకాలమును గుర్తెరిగి జ్యావల్లిని ఆకర్ణాంతముగ లాగి బాణమును వదలినాడు. హా! సీతా! లక్ష్మణా! యని ఆర్తుడై శ్రీరామచంద్రుని కంఠస్వరమునే అనుసరించి పలుకుచు క్రింద కూలినాడు మారీచుడు. మారీచుని భయంకర రూపము బయటపడినది. కామరూప ధరుల స్వస్వరూపము మరణకాలమున బయటపడును. రాముని కర్తవ్యము నెరవేరినది. మనమొక్కమారు రాముని పర్ణశాల కరుగు వత్తము.

## సీతాపహరణము

రావణుడు సీతాపహరణమునకై పన్నిన పన్నాగము ఫలించినది. సీతను ఒంటరి దానిని గావించుట రావణుని ఆశయము. దొంగతనమునకు కావలసిన ప్రథమ కర్తవ్యమేమి? తానపహరింపదలచిన వస్తువును నిస్సహాయత కలదానిని గావించి ఆ వస్తువును గ్రహింపవలెను.

సీతకు రాముని కంఠస్వరము దీనమై వినబడినది విజయునకు భర్త దీనుడై రక్షింపుమన్న స్వరమును వినిపింపగా భార్య ఏమనుకొనును? భర్తృ సంరక్షణమే స్త్రీకి ముఖ్య లక్ష్యము. భర్త బ్రతికిన తాను బ్రతికినట్లని భావించు స్త్రీయే సీతాకాంత. భర్తృ జీవితము తరువాతి జీవితమును ఏ స్త్రీయైనను కోరదు. మాంగళ్య అమాంగళ్య జీవితములు రెండున్నవని తలచిన ఆడువారి విషయము నేను చెప్పినాను.

తనకు వినిబడిన కంఠస్వరము సీతను కదలించినది. సీత హృదయము కంపించినది. భయభ్రాంతయైనది. అప్పుడామె కర్తవ్యము తన రక్షణకై నిలిచి యున్న లక్ష్మణుని రాముని సహాయమునకు పంపుటయే. కావున సీత లక్ష్మణుని రామునివద్దకు పంప ప్రయత్నించి, లక్ష్మణుని ప్రేరేపించినది.

లక్ష్మణుడు రాముని పరాక్రమము నెరిగిన వీరశిఖామణి. సీత కూడ రాముని పరాక్రమము నెరుగనిదికాదు. కాని సీత అబల. ఉపాధిధర్మము ఉపాధిని వదలి

ఉండదు. ఒక కాలమున అది కనబడకున్నను సూక్ష్మవాసనారూపమున అంతఃకరణ మున దాగియే యుండును. సీత లక్ష్మణుని రామునివద్దకు అతనికి సహాయకునిగ పంపుటయే లక్ష్యముగ అతని ప్రేరేపించినది. లక్ష్మణుడు తాను రాముని దగ్గరకు వెళ్ళనక్కరలేని కారణములన్నిటిని ప్రతిపాదించినాడు. అందు ముఖ్యకారణము రఘువంశీకులు తమకు వచ్చిన మరణభయమును గురించి దీనవాక్యమున పలుకరను మాటను గ్రుద్ది చెప్పినాడు.

భర్తకేదియో ఆపద వచ్చినదని తలచిన సీతకు లక్ష్మణుని హేతువులు నచ్చ లేదు. తన్ను పాలించుట ప్రధానముగా గలిగి మాటాడిన లక్ష్మణుని, సీత అపార్థము చేసుకొన్నది. లక్ష్మణుడు తన్ను కామించి సోదరుని ఆపత్తును వెనుకకు నెట్టెనను కొన్నది మనోబుద్ధి చిత్తాహంకారములతో కూడిన అంతఃకరణకు సత్యమునే ఊహింపగల శక్తి ఉన్నదనుట పరమ సిద్ధాంతము కాదు. రాగద్వేషములకు అవ కాశమునిచ్చు అంతఃకరణకు భ్రమ ప్రమాదములున్నవను వైదిక సిద్ధాంతమును కాదనువారికే నాస్తికులని పేరు. ప్రకృతమున సీత నాస్తికురాలు కాదు. కాని భర్త కేదియో ఆపత్తు కలిగినదని నమ్మిన ఆపన్నురాలు. కావున సత్యమునూహించలేక పోయినది. లక్ష్మణుని అపార్థము చేసుకొన్నది. లక్ష్మణునిపై కోపపూరితయైనది. క్రోధము రాబోవు అనర్థకమును చూడజాలదుగదా? తన ఒంటరితనము వలన తనకు రానున్న అనర్థకమును ఆమె ఆలోచించలేకపోయినది.

లక్ష్మణా! నీవు నన్ను పరిగ్రహింపకోరి రాముని రక్షించుటకు పోననుచుంటి వన్నది. అది లక్ష్మణున్నకు భరింపరాని మాట. కన్నీరు కార్చుచు సీత ఈ మాటను మాట్లాడినను లక్ష్మణుడు చలించకయే రాముని వీరత్వమునుతెలిపి ఆమె భయమును నివారింప యత్నించినాడు. ఆమెను రాముని గూర్చిన భయము వదలలేదు. దీనికే కాలగతియని పేరు. ఆ సీతాకాంతకు కోపము పెరిగినది. లక్ష్మణుని రాముని జ్ఞాతిగ పేర్కొన్నది. నీవిప్పుడు చూపునది జ్ఞాతి శత్రుత్వమన్నది. లక్ష్మణా నీవు పరమ పాపివై ఇట్లు మాట్లాడుచుంటివని ఘాటుగ పలికినది. భరతుడు నిన్ను పంపగా వచ్చితివన్నది. అది జరగదన్నది

ఒక్కమాటు మనము లక్ష్మణునివైపు తిరుగుదము. సీత కఠినోక్తులు రామాజ్ఞను పాలింపదగు లక్ష్మణుని సేవా ధర్మమును అతిక్రమించినవి. లక్ష్మణుడు చలించినాడు. సీత కఠినోక్తులు శూలములై లక్ష్మణుని హృదయమున గుచ్చు

కొన్నవి. బాధ భరింపరానిదైనది. సీతకు రానున్న ఆపదకూడ ఆతడెరుగకున్నను లక్ష్మణుని మనసునందొక విధముగ గోచరించుచునే యున్నది. రెండు ఘట్టముల మధ్యభాగమున లక్ష్మణుడు నిలిచినాడు. కాని భావికాలపూతని అప్పులకు తరిమినది. పోవుటకు కాలాడకున్నను ఆతని పయనమునకే కాలము బలమును చేకూర్చినది. ఆతడిక సీతకు అడ్డు చెప్పలేదు. రాముని దగ్గరకు పోవుటకే నిశ్చయించుకొనినాడు.

సీత కఠినోక్తులకు సమాధానమును కఠినముగ చెప్పలేదు. నా అంతరాత్మ యొక్క పారిశుధ్యమును తెలుపువారు దేవతలేనని వ్రాకుచ్చి, సీతాకాంతను ఓదార్చినాడు. తల్లీ! నన్ను నీవు శంకించుట స్త్రీ స్వభావము చేతనేనని మాత్రము తెలిపినాడు. కాని ఎంతటి క్షమావంతునకైన వాత్సల్యములు పీడించకపోవు. లక్ష్మణుడు పయనించునప్పుడు సీతకు అభివాదన గావించియు చేసీ చేయని నమస్కారముచే తన బాధను ప్రకటించి, సీతకు మంగళాశీస్సుల నొసంగుచు మరల మరల వెనుకకు తిరిగి చూచుచు పయనించినాడు. ఒక్కమాట.

లక్ష్మణుడు పోవునప్పుడు ఏడు గీతల గీసి సీతనీ గీతల దాటవద్దని చెప్పినట్లు చెప్పుదురుగాని అది రామాయణమునందున్న కథకాదు

తరువాత జరిగిన కథ ఏమి?

పవిత్రములును పవిత్రతమములును అగు వేషములను కొందరు దుర్మార్గులు తమ దుర్మార్గ కార్యములకు వినియోగించుట సృష్టియందు క్రొత్త విషయము కాదు.

సన్యాసాశ్రమము పరమ పవిత్రమైనదనుట కెట్టి సంశయమును లేదు. దీనిని కొందరు కపట కార్యములకు వినియోగించుట కూడ కలదు.

పంచవటీ క్షేత్రమున సీతయున్న పర్ణశాలనుండి లక్ష్మణుడు వెళ్ళగనే ఒక సన్యాసి సాక్షాత్కరించినాడు. ఆతని ముఖమునుండి వేదఘోష వెలువడుచున్నది. చంకన యోగదండమున్నది. ఆతని మేనిపైనున్న జందెమును, రుద్రాక్షమాలికలును ఆతనినొక మహానుభావునిగనే తెలుపుచున్నవి. ఆతడు ధరించిన పాదుకలును, చేతనున్న కమండలమును, పైనున్న గొడుగును ఆతడు త్రిదండి సన్యాసియని తెలుపుచున్నవి. పయోముఖ విషకుంభముల చూడగనే తెలుసుకొనుట చాల కష్టము. కార్య

రూపము నొందినగాని దుర్మార్గుల హృదయమును గుర్తింపగలేము. త్రిలోక సుందరి యగు సీతను దర్శించిన ఆ పరివ్రాజకుడు పూర్వస్థితి పోవుటమ్మేలదు. గురి యయ్యెను. సీత సౌందర్యమాతడొకప్పుడు వినియున్న వాడగుటచే నాటి సంస్కార మిప్పుడు సన్యాసిని సన్యాసిని గావించినది.

ఆతడప్పుడు మన్మథ శరాకృష్టుడయ్యె సీతను పలకరించినాడు. అతడే మన కథానాయకుడు రావణుడు. ఆతడెవ్వడో సీత ఎరుగకున్నను అచ్చటి వన దేవతలును, గోదావరీనదియు, ఆ కఠోరహృదయుని ఎరుగనివారు కారు. ఆ ప్రదేశమునందున్న భూతములన్నియు ఆ చండశాసనుని శాసనముల ననుభవించనివి కావు. కావున ఆ కపటసన్యాసి రాగనే వారందరును మౌనము వహించినారు. సీతను పలకరించిన పలకరింపులలో తేనెలుట్టిపడు నట్లుండెను గాని కఠినములై లేవు ఆ పలకరింపులు. సీత ఆ కఠిన కాంతారమున ఒంటరిగ యుండుట కాత డెంతయో వెతచెందినట్లు పలుకరించినాడు. కళ్యాణీ! అని సంబోధించి, దేవ గంధర్వులు కూడ చరింపలేని ప్రదేశమున. ఇది రాక్షసావాసము. నీవేల యిందు ఒంటరిగ చరించు చుంటివని జాలిబడి యడిగినాడు. సౌధాంతర్భాగముల చరించ దగు సుకుమారగాత్రివి నీవనినాడు నిన్ను చూడ చూడ నా మనసుకు పిచ్చెత్తు చున్నదనినాడు. నీవు దేవతాస్త్రీలలోని దానవని భావించుచుంటి ననినాడు. చివరకు రతీదేవివలె యుంటివని వాపోయి నీవా? ఈ క్రూరమృగ నిషేవిత వనవాసమని, ఆమె జన్మకథను, అత్తవారింటి చరిత్రను కూడ సాకల్యముగ ప్రశ్నించినాడు.

సీత ఆ జడదారి ప్రశ్నలకు వెంటనే జవాబు లివ్వలేదు. ఆతడు నిలచి యుండెనుగదా! అతనిని గౌరవించక మాట్లాడుట ధర్మముకాదని ఆమె నిర్ణయము. భారతీయ ధర్మము వచ్చినవారికి ఆసనమిడి పాద్యార్ఘ్యముల నిచ్చి, క్షేమసమాచారముల నడిగి వారి ప్రశ్నలకు సమాధాన మివ్వవలెను. ఆ ధర్మమునే సీత అనుసరించినది. అతిథి సత్కారముల గావించినది. కందమూలములు సక్కాడుంచినది. స్వస్థచిత్తమున భుజింపుమన్నది.

"కాషాయ దండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః" అను ఆర్యోక్తిని పాటించినది. సన్యాసివేషమునన్న రావణుని మనస్సు సీతాపహరణమునకు తొందరపెట్టినది. ఆ రాజపత్నిని అపహరించ నిశ్చయించినాడు. తన చావునకే సీతాపహరణమునకు పూనుకొనినాడు.

సీతాకాంత తన కర్తవ్యమును కాయిక వ్యాపారము నిర్వర్తించుచునే రామ లక్ష్మణుల రాకకై మనసున తొందరపడు చున్నది.

ఇక సీత కర్తవ్యము ఆ కపటసన్యాసి ప్రశ్నలకు త్తరమిచ్చుటే. బ్రాహ్మణు డేమైన శాపము నివ్వవచ్చును. పెద్దలగువారికి కోపము రాకుండ కాపాడుకొనుట చాల అవసరము. కావున సమాధానమివ్వ దలచినది. తాని యరణ్యములకు వచ్చుటకు కారణమును, తన జన్మస్థలమును, తన భర్తయొక్క ప్రభావమును చక్కగ సంగ్రహరూపమున వ్యాఖ్యానించినది. ఆ సమాధానముననే రాముడస మర్థుడై అరణ్యములకు రాలేదని తెల్పి, ధర్మప్రభావుడై పితృవాక్య పరిపాలనకై ఏతెంచినాడన్నది. సతీమణుల కర్తవ్యము భర్త ననుసరించుటను కూడ తెలిపినది. తానను భవించిన భాగ్యభోగ్యముల వర్ణించినది తాను ను తన భర్తయు ధర్మ పరి పాలనకై ఆ భాగ్యభోగ్యముల వర్జింతిమని చెప్పినది. ఒక్క మాటలో రాముని ప్రతిభను చెప్పి, రామునితోగల అన్యోన్య దాంపత్యమును తెలిపినది.

తన భర్త మహాతేజము కలవాడనుటతోడనే ఆపక అతని యౌవనమును కూడ చెప్పి, తన వయోవిశేషమును కూడ తెలిపినది. ఇట్లు తెలిపి, నీవెవ్వరవు? నీ గోత్రమేమి? నీ నివాసమే అరణ్యమేలైనది? అని తిరిగి ప్రశ్నించినది. ఆ కపటసన్యాసి ఇక తానెవ్వరో చెప్పి సీత నెత్తుకపోవలెను.

నేను లంకాధీశ్వరుడను. నా పేరు రావణుడు. నేను పౌలస్త్య వంశము నకు చెందినవాడను. నేను నిన్ను పట్టమహిషిగ కావించుకొనదలచి వచ్చితినని చెప్పి, అయిదు వేలమంది దాసీస్త్రీలు నీకు పరిచర్యలగావింతురని ఆశను గొలిపి రావణుడు సమాధాన మిచ్చినాడు. సామాన్యముగనే ఆమె వశ మగునని ఊహించి నాడు రావణుడు.

సీత భారత నారీమణులకు మహారాణి. కర్తవ్యాకర్తవ్యముల నెరిగిన రాజ పుత్రిక. వీరపత్ని. ఆమె రావణునివంటి నీచుల శిక్షింపచేయుట కేతెంచిన మహా రాణి. కావున ఈ సమయమున ఆమె భయభ్రాంత కాలేదు. రావణునకు బుద్ధి చెప్పుటకు వెనుదీయలేదు. రావణుడు వర్ణించుకొన్న ప్రతిభావిశేషములలోని ప్రతిభను చక్కగ ఖండించినది. రామరావణుల తారతమ్యమును తూచి, పాతి వ్రత్య ప్రభావము సహజాలంకారమైయున్న సతీమణులదృక్పథమున నీవు వీరుడవు కావు సరిగదా? జంతువులయందు కూడ నీచజంతువైన నక్కవని రావణుని

తేల్చినది ప్రపంచమున సహజతేజః ప్రభావ సంపన్నములగు వస్తువుల నొక్కచో చేర్చి, వాటితో పోల్చుటకు వీలుగాని నీచవస్తువుల రావణునిముందుంచి నీవు ఆ నీచపదార్థములలో చేరిన వాడవని తేల్చి, రాముని సహజ వైశిష్ట్యమును ప్రకటించినది.

సీత రామ రావణులు పోల్చిన పోలిక లివి.

బంగారము, సీసము, చందనగంధము, బురద, అడవిఏనుగ, అడవిపిల్లి, అను వాటిని రావణుని ముందుంచినది. రామునకు నీకును ఆ పదార్థములకున్న అంతరమున్న దన్నది.

"యదంతరం కాంచన సీస లోహయోః
యదంతరం చందన వారి పంకయోః
యదంతరం హస్తి బిడాలయోర్వనే
తదంతరం దాశరథేస్తవైవచ॥

లోహసామ్యమున్నను జన్మసామ్యము లేదు బంగారమునకును, సీసమునకును. సహజతేజము కలిగి జన్మశుద్ధత్వము కలది బంగారము. సీసము లోహమలము. ద్రవద్రవ్యములే చందనమును బురదయు, కాని సద్వాసనా వాసితము చందన గంధము. బురద మలము. చందనము నలంకరించుకొనువారు రసికులగువారు. బురదను వాడుకొనునవి జంతువులు. ఆ జంతువులయందును పందికి బురదయన్న చాల ఇష్టము పందు లలుముకొని పులుముకొను బురద ద్రవమున చందనమువలెనున్నను నీచఉపాధులకు మాత్రమే భోగ్యము. ఏనుగయు, పిల్లియు రెండును అడవియందే పుట్టి ఆ అడవియందే చరించుట సమానము కావచ్చును కాని జన్మయందా రెంటికిని సంబంధము లేదు. గుణభేదమును కలదు. జన్మస్థల ప్రధానము కాదు. కావున రాముడు బంగారముకాగా నీవు సీసమవు. రాముడు చందనముకాగా నీవు బురదవు రాముడు అడవిఏనుగవంటి వాడు కాగా నీవు పిల్లివి అన్నది.

రావణుడు సీత సామదానభేదములకు వశురాలు కాదని నిశ్చయించు కొనినాడు. దండమునే ప్రధానము గా వించుకొనినాడు.

రావణా! నీ ప్రతాపము నిక కట్టిపెట్టుమన్నది.

దేవేంద్రుని భార్యను ఎత్తుకొనిపోయి నీవు బ్రతికిన బ్రతుక వచ్చును. కాని నన్ను దూషించి అమృతపానము చేసి కూడ నీవు బ్రతుకజాలవన్నది.

ఇంతవరకు రావణుడు పరివ్రాజక వేషము తోడనే సీతతో మాట్లాడినాడు. ప్రయత్నము ఫలించలేదు. కపటరూపమును వదలినాడు. తన భయంకర రూపమును చూపినాడు. ఆరూపముతో తనను కామించుమని కోరినాడు అదియు సిద్ధించలేదు. ఆరూపముతోడనే సీతను ఎత్తుకొనిపోవ నిశ్చయించినాడు. తన ఎడమ చేతితో సీత తల వెంట్రుకలను పట్టుకొని కుడిచేత తొడలనుపట్టి ఒడిలోనికెత్తుకొనునట్లు సీతను ఎత్తి మాయామయమగు తన రథము నంమించినాడు.

ఇప్పుడెత్తుకొని పోవు సీత మాయ సీతయని వాల్మీకమున లేదు. సీతను చేతితో ముట్టలేదు, గడ్డ పెళ్ళగించెనని కూడ వాల్మీకి చెప్పలేదు.

వాల్మీకి సిద్ధాంతము ననుసరించి రావణుని తపస్సు గొప్పదగుటచే సీతను ముట్టుకున్నను రావణుడు నాశము కాలేదని సుందరకాండయందు హనుమంతుడు వానరులతో చెప్పినాడు. కావున మాయాసీత వాదమక్కరలేదు. మరొక వాదము న్నది రావణుడు సీతను తల్లిగ భావించి తీసుకుపోయెననునది కూడ. అది ఒక వ్యాఖ్యాత అభిప్రాయము. దానికి వారు సీతను రావణుడు బుధుడు రోహిణీ నక్షత్రమును గ్రహించినట్లు అన్న ఉపమానమును చూపెదరు. అది సరిపోదు. వాల్మీకి జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధములగు ఉపమానములను చాలచోట్ల వాడినారు. యుద్ధ కాండమున రామరావణ యుద్ధమునందు దేశాష్టకములైన కొన్ని ఖగోళ దృశ్య ములలో బుధగ్రహము రోహిణిని ఆక్రమించుట కూడ ఒకటిగా వర్ణింపబడినది. తల్లినిగా సీతను రావణుడు భావించి తీసికొనిపోవుచో సీత రావణుని మాట్లాడిన కఠినోక్తులకు అర్థము కుదరదు. కథంతయు అడ్డము తిరుగును. కావున ఆ అర్థ మక్కరలేదు. రావణుడు కాముకుడయ్యే సీతను ఎత్తుకొని పోగా రాముడాతని వధించుటయుక్తము. ఒక విధముగ అన్వయింపవచ్చును. సీత లోకమాత ఆమెను పరిగ్రహించె ననవచ్చును. కథకు వర్తము.

సీత రావణుని రథము నందుంచబడినది. రక్షకులు లేరు. ఎలుగెత్తి ఏడ్చి నది. సీత విలాపము అరణ్యరోదనమైనది. దుఃఖభాగినియగు సీత మ్రొక్కని దేవతలు లేరు దేవతలు స్వార్థపరులై యూరకుండిరి.

చతుర్ముఖ బ్రహ్మగారు మాత్రము రావణుడు చేయదగిన పనినే చేసినా డని సంతసించినాడు. రామునిచేత రావణుడు చావగలడని అతని అభిప్రాయము. ఆసమయమున సిద్ధులగువారు రావణుని నాశమునుకోరి మౌనమును ధరించినారు. హా! రామా! లక్ష్మణా! అన్న సీత రోదనధ్వనిని ఎవరును వినిపించుకొనలేదు. నన్ను రావణుడెత్తుకు పోయెనని రామునకు తెలుపుడని వనదేవతలకు జంతుజాలము నకు మృగ పక్షి గణములకు సైతము చెప్పివేడ్చినది. కైకకోరిక నెరవేరినదని విలపించినది. అంతలో జటాయుపక్షి ఆమెకంటబడినది. ఆపక్షిని శరణు వేడినది. శరణార్థులకు వారు వీరనునదేమున్నది? కనుపడిన వారినెల్ల నాయాపదను తొల గింపుడని అర్థింతురు. అటే అర్థించినది సీతామ తల్లికూడ. నన్ను రక్షింపకున్నను రామునకు వృత్తాంతమును తెలుపుమన్నది.

సృష్టి యందందరను స్వార్థపరులుండరు. దేవతలుసైతము మూగనోము పట్టి ఊరకుండగా అనాథయై ఆర్తస్వరమున ఎలుగెత్తి తనను అర్థించిన సీతను రక్షింప జటాయువు పూనుకొన్నది.

ఆ పక్షిరాజు అరువదివేల సంవత్సరముల నాటి వృద్ధ గృధ్రము. అయ్యును ఢీకొన్నది. తన యథాశక్తిగా పోరాడినది. రావణా! నాకన్నుల ఎదుట నీవుసీతను బలత్కారముగ గొనిపోవ సమర్థుడవు కావన్నది.

తమంతట తామై ఆవిర్భవించిన వేదములను కేవల తర్కముతో అందలి సిద్ధాంతములను కాదని వాదించువారిని వేదధర్మ కోవిదులెట్లు ఎదుర్కొందురో అట్లు నిన్ను నేను ఎదుర్కొందునని యుద్ధమునకు తలపడినది.

"వశక్తస్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః
హేతుభిర్న్యాయసంయుక్తైః ధృవాం వేదశ్రుతీమివ"

వేదములకును సీతకును పోల్చినది. వేదములు ఒకరిచే సృష్టించబడిన వాఙ్మయముకాదు. సీతయు అయోనిజ. రావణుడు ధర్మవాదికాదు. హేతువాది. వేద ధర్మములు హేతువాదుల చేతబడినప్పుడు ఆవేదవిదులు పోరాడి ధర్మస్థాపనకెట్లు ప్రయత్నింతురో అట్లునేను ప్రయత్నింతునన్నది. జటాయువు రావణునితో యుద్ధ మునకు పూనుకొన్నది. రెండు ఘడియలకాలము పోరాడినది. రావణుని చేతి ఖడ్గముచే రెక్కలు కొట్టబడి నేలకూలినది. దురదృష్టము పెద్దది. సీతకు జటాయు సాయము అక్కరకు రాలేదు.

అది అరువదివేల సంవత్సరములనాటి వృద్ధగృధ్రము. అయ్యును రావణునితో ఢీకొని సీతనురక్షింప యత్నించినది. అట్లే ఈ కలిపురుషుడు వేదసిద్ధాంతములను హేతువాదములతో ఖండింపయత్నింపగా వేదధర్మముల నుద్ధరింప యత్నించుట సనాతనుల బాధ్యత యనక తప్పదు. నేను అందులోని వాడనయ్యే రామాయణము వ్రాయదలచినాను నాయథాశక్తిగ.

ఇక కథాభాగము నందుకొందము.

రావణుని రథము జటాయువుచేత కూల్చబడినది. సారథియు చచ్చినాడు. సీతను చంకనెత్తుకొనియే రావణుడు లంకకు పయనించినాడు. ఆతని పయనము ఋష్యమూక పర్వతము మీదుగ సాగినది. సీత ఆపర్వతములపైన తన ఆభరణములు కొన్నిటిని ఉత్తరీయమున మూటగట్టి పడవైచినది. అది రావణునకు తెలియదు. అక్కడ ఐదుగురు వానరులుండుట గమనించియే ఆమె నగల నక్కడ వైచినది.

సీతాకాంత రావణునిచే లంకానగరమునకు చేర్చబడినది. అచ్చోట రహస్య స్థలమున బంధింపబడినది. రావణుడు కొందరు రాక్షసులను రాముని చంపుడని నియమించినాడు. మన మొక్కమారు కథాభాగమున వెనుకకు వత్తము. రాముని వృత్తాంతము తెలియును.

రాముడు మారీచుని హతమార్చినాడు. ఆతనికేదియో కొన్ని అపశకునములు సీతాపహరణమును చెప్పుచున్నవి. శంకితుడయ్యే రాముడు ముందుకు సాగినాడు. లక్ష్మణుడు కంటబడినాడు. రాముని హృదయము కలతబారినది. సీత ఏమైనదో?....

లక్ష్మణుని కలసినాడు. చిన్నబోయిన ముఖముతో లక్ష్మణుడు తనరాకకు కారణముల తెలిపినాడు. రాముడు లక్ష్మణుడు చెప్పిన కారణములకు తృప్తి పడలేదు. ఆడువారి కోపమును లెక్కచేసి నాఆజ్ఞను ఉల్లంఘించితివని లక్ష్మణుని దోషమును స్పష్టపరచినాడు.

భక్తునకు (లేక) సేవకునకు ఆజ్ఞాపాలనమే ప్రధానముగాని తన ఆత్మగౌరవము ముఖ్యముకాదని ఈ ఘట్టము తెల్పినది రాముని ముఖముగ. తరువాత? సంశయాత్ముడయ్యే రాముడు పర్ణశాలకు సోదరునితో వెళ్ళినాడు.

మన మిప్పుడు చూడబోవు రాముడు ఉన్మత్తుడు. మీరు వినబోవు కథా భాగము కావ్యాత్మయగు సీతారాముల వియోగ శృంగారము. ఇది నాయికా నాయికల వియోగము. లేక జీవేశ్వరుల వియోగము. రాముడు వియోగి.

అది రాముని పర్ణశాలాభ్యంతరము. పర్ణశాలయందు సీతలేదు. ఒక దర్భాసనము వేయబడియున్నది. కమండలమున్నది. ఆశ్రమాభ్యంతరము నందున్న పుష్పలతా నికుంజ వృక్షరాజములన్నియు వాడుసూపియున్నవి. ఆవనము శూన్యాగారమై యున్నది రాముని దుఃఖము పొంగినది. సీతఏమయ్యెను? సమాధానమిచ్చువారెవరు? ఆవనమందున్నవి చెట్లును, పుట్టలును, జంతువులును. రాముడు పిచ్చివాడై వాటినే పీకను మీరేమైన చూచితిరా? తెలుపగలరా? అని ఏడ్చుచు అడిగినాడు. రాముడిప్పుడెవడు? సామాన్యజీవుల కంటెకూడ దుఃఖభాగుడు కన్నీరు మున్నీరుగా ఏడ్చు వీరుడు.

రాముడు పీకడగుచో ఇట్లేలఏడ్చును? దేవుడు రాముడగుచో ఇట్లేడుచునా? సర్వవ్యాపకుడైన దేవుని కన్నులకు సీతకనుపడదా? రాముదెవ్వడో నేనిప్పుడు చెప్పను. చెప్పలేను. రామునితోకలసి వాల్మీకి ఏడ్చుచుండెనా? వాల్మీకియే ఏడ్చుచుండి రాముదేడ్చెనని తన కవితాప్రభావమును చాటుచుండెనా? ఇవన్నియు నా సందేహములు. ఈ సందేహములను తరువాత చూచుకొందము. రాముని శోకమును ఇంకకొంత గ్రహింతము.

తనలో తాను క్రుంగి కృశించుట శోకము. కన్నీరుకార్చుచు బయటకు ఏడ్చుచు మరొకరితో చెప్పుకొని బాధపడుట దుఃఖము. రామునికిప్పుడు దుఃఖ శోకములు రెండును ఏకమైనవి. లక్ష్మణునివైపు తిరిగి, సీత ఏమైయుండునని ఎలుగెత్తి రాముదేడ్వగా లక్ష్మణుడు ఓదార్చినాడు. ఈవనమధ్యము నందేమైన విహరించుచుండెనేమో? పువ్వులకోయబోయెనేమో? గోదావరికి స్నానముకేగినదేమో? నవ్వులాటకేమైన దాగినదేమో. అన్నా వెతుకుదము శోకింపకుము. ఏడ్చువారికి ఆదరించువారి అవసరము చాలయున్నది లక్ష్మణుని ఆదరవాక్యములు రామునకు కొంత ఆశను గొలిపినవి. రామలక్ష్మణు లిద్దరును కలసి వెతికినారు. సీత కనిపించలేదు. లక్ష్మణుడు కూడ బాధపడినాడు. అయ్యును ధైర్యమునే అవలంబించి రామునకు ధైర్యమును చెప్పినాడు. శ్రీ మహావిష్ణువు బలిని బంధించి భూమిని సంపాదించినట్లు సీతాపహర్తను బంధించుదమనినాడు. ఆ మాట రామునకుధైర్యము

నొనగలేదు. హా! ప్రియే! అని ఎలుగెత్తి బిగ్గరగఏడ్చినాడు. కొద్దిసేపు మాటలేదు. స్తంభించిన దుఃఖము. అంతరమునలేచిన అగ్నిజ్వాల. అంతలో ఆ అగ్నిబహిర్గతమగుట. మరలమరల ఏడ్చుట. అంతలో సీత రామునకెదురైనది. సీతను రాముడు కన్నులార చూచినాడు. హా! సీతా! అనినాడు. అంతలో సీత అంతర్ధానమైనది. దాగితివా? హాసీతా! అనిపిలిచినాడు. ఎదుటలేకయే ఉన్నటుల కనుపించిన సీతనే రాముడు చూచినది. ఇది మన్మథా వస్థలలోని ఒక అవస్థా విశేషము. మదనార్పితుడైన రాముని చిత్తవికారమున సీత కనుపించినది. సీత అవయవశోభలు రాముని స్మృతికి వచ్చినవి. అవిస్మృతిరూపములు. అంతలో రాముని శోకము అందలి మృగసమూహము మనసును కరిగించినది. అవి రామునకు తెలుపుదమను కున్నను సీతపోయిన మార్గమును నోటచెప్పలేకపోవుట ఒక దురదృష్టము కావచ్చును. కాని అవి కన్నులనీరుగార్చి రామునకేదియో చెప్పినవి. రాముడుగ్రహించి సీతఇకలేదని నిశ్చయించుకొనినాడు. రాముని ప్రస్తుత సీతా వియోగదుఃఖము మరికొన్ని తన దురదృష్టములను జ్ఞాపకమునకు తెచ్చినది.

రాజ్యమును కోల్పోవుట. బంధువియోగము. తండ్రిని కోల్పోవుట. తల్లి దూరమగుట. ఇవన్ని తలపునకురాగా శోకాగ్ని మరింత ప్రజ్వలించినది. లక్ష్మణునితో ఈమాట చెప్పుకొని ఏడ్చినాడు.

> "రాజ్య ప్రణాశస్స్వజనైర్వియోగః పితుర్వినాశో జననీ వియోగః
> ఏతాని మే లక్ష్మణ శోకవేగం ఆపూరయంతి ప్రవిచింతితాని"

ఇప్పుడు రాముడు తనదురదృష్టము నొకవిధముగ కొలుచు కొనదలచినాడు. కొలతబద్ద లేకపోయినది. ఇంతదుఃఖమును కల్పించినదెవరు? తన పూర్వకర్మయే. ఒకనాటి నాదుష్కృతమేనని నిశ్చయించుకొని ఏడ్చినాడు. రాముని ఏడుపులోని విశేషమిదియే. అంతలో రాముడొక శిలాతలమును చూచినాడు అది సీతతో అప్పుడప్పుడు కూర్చొని మాటాడు ప్రదేశము. ఆ ప్రదేశముననే కూర్చొని మరదిని హాస్యమాడుట రామునకు జ్ఞప్తికి వచ్చినది. లక్ష్మణునకది జ్ఞాపకమునుచేసి బాధపడినాడు. అంతలో గోదావరీనదియు,ఆనదిలోనికేగి సీత పువ్వులకోయదలచుటయు జ్ఞాపకమురాగా అదికాదని ఆతడే నిశ్చయించుకొనినాడు. తానులేక గోదావరికి విలాసముగపోవునది కాదనియే ఆతని నిశ్చయము. కావున గోదావరికేగి వెతకుట

మానినాడు. ఇది రాముని అంతరంగమున పొగలెగసిన మన్మథాగ్ని. శ్రోతలారా! ఆ రాముని అంతరంగమున సీతావియోగానలము జ్వాలాకీలము కాగా తనకిప్పుడు సీత ఏమైనదో జాడనుచెప్పువారెవ్వరను నది రామునకు ప్రశ్నయైనది. అంతలో ఆతని చూపొక్కమారు గగన మండలమున కేగినది.

ఈ సృష్టి ఖండమున జీవులు మనోవాక్కాయములచే జేయు ప్రతికర్మ కును సాక్షియై చూచువాడు సూర్యుడు. అతడా తనికీ విషయమును తెలుపవలసి యుండగా ఇంతవరకాతడు తన బాధ్యత ని నిర్వర్తించలేదు. కావున సూర్యుని సంబోధించినాడు తెలుపుమని. వాయువును కూడ సంబోధించినాడు. అంతలో లక్ష్మ ణుడు ఆశ్వాసించగా రాముని చూపు క్రిందకు వచ్చినది. అప్పుడే కొన్నిమృగములు రామునివంక చూచుచు ఆకాశమునకు తమ ముఖములను చూపుచు కన్నీటిధారల కార్చి దక్షిణదిశకు పయనించినవి. సీతపోయిన మార్గమదియేనని రాముడూహించి నాడు. రామ లక్ష్మణుల పయనమటు సాగినది. కొంతదూరముపోగా అక్కడొక పూలమాల క్రిందపడియున్నది. అది వాడు చూపలేదు. ఆ పువ్వులు రాముడు సీత కొరకై తెచ్చిన పూవులే. రాముడు గుర్తుపట్టినాడు. కాని ఆమాల ఎండకు ఎందుకు వాడలేదు? క్రిందపడి ఎందుకు నలగలేదు? గాలికి ఎందుకు దూరముకొట్టుకొని పోలేదు? సీత ఇటు పోయినదని చెప్పుటకే ఆమాల అట్లున్నది. సూర్యుడును, వాయువును, భూమియు ఆమాలనట్లుంచినారు. ఈ విషయమును రాముడూహించి నాడు.

అక్కడ ప్రస్రవణ పర్వతమున్నది. ఆ పర్వతమేమైన సీత పోయిన మార్గమును చెప్పునేమోయని రాముడు వెళ్ళినాడు. కామార్తులకు చేతనా చేతన వ్యవహారముంటునా? అయ్యును రాముడాపర్వతరాజును పలకరించి, సీత వార్తను చెప్పెదవా? లేదా? లేకున్న నిన్ను హతమార్చెదనని పర్వతరాజును భయపెట్టినాడు. ఆ పర్వత శ్రేష్ఠము రాముడాపని చేయగలడనుకొన్నదేమో సమాధానమిచ్చినది. నీచేత విడువబడిన సీత నాచేత చూడబడినదని. పర్వతమెట్లు చెప్పినదని మీరు భావించుచుంటిరా? పర్వతగుహలనుండి వచ్చిన ప్రతిధ్వనియే సమాధానమైనది. ఇక్కడ వాల్మీకి మహర్షివారి కవితను వినుడు.

"కచ్చిత్ క్షితిభృతాం నాథ దృష్టా సర్వాంగసుందరీ
రామా రమ్యవనోద్దేశే మయా విరహితా త్వయా

క్షితిభృత్ లన పర్వతములు. క్షితిభృతనరాజు. ఓపర్వతరాజమా! అని రాముడు సంబోధించగా ప్రతిధ్వని ఓ రాజా! అని వచ్చినది. నాచేవిరహితమైన సీతనీచే చూడబడినదా? అన్న మాటకు ప్రతిధ్వని నీ విరహితమైన సీత నాచే చూడబడిన దని అర్థము వచ్చినది. ఈ సందర్భమున రాముడు మృగము వెంట పోవుటను ఆపలేదు. వెళ్లుచునేయుండును. అంతలో రామునకొక దృశ్యము కనబడినది.

## జటాయు మోక్షము

అది యుద్ధభూమి. విరిగిపడిన రథము. తెగినతలలు. భగ్నములైనధనువులు. బాణసంచయము. అక్కడనే ఒక మహోన్నతమై కూలిన తనువు. రక్తసిక్తమగు నా ప్రదేశమును రాముడు కొంచెము దూరము నుంచే చూచినాడు. రథసారథికూడ అక్కడకూలియుండెను. రాముడిట్లూహించినాడు. రాక్షసులెవ్వరో ఇద్దరు కలసి కొట్లాడుకుని సీతను భక్షించియుండవచ్చునని ఊహించినాడు. రాముడు మారినాడు. రాముడిప్పుడు దశరథరాముడుకాడు. కాముకుడైన దీనుడుకాడు. తానెవ్వరై యుండెనో ఈ ఘట్టమున రాముడు చెప్పినాడు వినుడు. ధర్మము సీతను రక్షించని పక్షమున నేను ఊరుకొనెను. లక్ష్మణా! నేనెవ్వరనై సీతకొరకిక్కడ చరించు చుంటినో దేవతలకు తెలియుటలేదు. పెండ్లాము పై కోపోద్రేకము ఎక్కువైయున్న మానవునిగ దేవతలు తలచుచుండిరి. నేను సృష్టికర్తనై జగమును సృష్టించి దేవతల రక్షించుటకై ఇట్లువచ్చితినన్న మాటను దేవతలు మరచినారు. నా మెత్తనిమనసును దేవతలు సరిగ అర్థము చేసికొనలేరు. నా పరాక్రమమును వారు మరచినారు, అని తన దైవత్వమును తెలిపినాడు.

వింటిరా? శ్రోతలు? రాముడు దుఃఖించిన మాత్రమున మనము రాముడు మనుష్యమాత్రుడని కొనుట తప్పు. నాటకరంగమున ధృతరాష్ట్రుని వేషమువేసిన నటకుడు కన్నులమూయవలెను గాని తెరువకూడదు. అట్లే రాముడును తనపాత్రకు తగినట్లు నటించినాడు మనుష్య ధర్మముగ.

నేను సృష్టికర్తనే కాదు. లయకర్తనుకూడ. ఒక్క క్షణకాలముననే నేనీ దేవదానవ కిన్నెరకింపురుషాది గణమునంతను నాశము చేయగలను. నేను బాణము లెక్కపెట్టి విడుచుచో అది ఎన్నడును వ్యర్థముకాదు. ప్రకృతి సిద్ధములగు జరా జన్మ మృత్యువు లెట్టివో నా శరపాతమట్టిది. లక్ష్మణా! దేవతలందరును కలసి నా సీతను నాకివ్వనిచో ఈ మూడు లోకముల దగ్ధము గావింతునని నాడు. ఈ

మాటలు నా మాటలుగావు. రామాయణములోని శ్లోకములే. అందొక్క శ్లోకమును మీకు వినిపింతును.

"కర్తారమపి లోకానాం శూరం కరుణ వేదినం
అజ్ఞానాదవమన్యేరన్ సర్వభూతాని లక్ష్మణ.

విజ్ఞులెందరో రాముడు తాను దేవుడనని ఎక్కడను చెప్పలేదందురు. వాల్మీకి మున లేదందురు. సీత కొరకై దుఃఖించిన దుఃఖములోని భాగమే నేను సృష్టి కర్తనను ఈ నిర్వచనము. దీనినేమనవలెను? రాముడొక విధముగతన నిజ స్వరూపమునే చెప్పెను. భారతీయ గ్రంధము అందలి చరిత్రాంశములయందు భగవత్తత్త్వమిట్లే మెరుపు తీగెవలె మెరయును. కథకురందు. రాముని మహోగ్ర క్రోధమును లక్ష్మణుడు చూచినాడు. నిజమునకు ఇట్టి కోపము లక్ష్మణుడెన్నడును చూచి ఎరుగడు. "అదృష్ట పూర్వం సంక్రుద్ధం దృష్ట్వా రామంతు లక్ష్మణః" అనినారు వాల్మీకి. అప్పుడు లక్ష్మణుడు లేకున్న రాముని కోపము ఎటు పయనించెదియో? వెంటనే రామునికి లక్ష్మణుడు దోసిలి యొగ్గినాడు. ఎవడో ఒక్కని అపరాధమును ఆధారముగా గొని లోకమును నాశము గావింప నీకు తగదని వినమ్రుడై పలికి సీతను వెతకవలసిన ప్రదేశములన్నిటిని వెతకి దేవతలు దారి చూపనిచో ఈకృత్యమును అప్పుడు నెరవేర్తువుగాని యని ప్రణామ మాచరించినాడు. అంతేకాదు ఒకవిధముగ "త్వద్విధాహీనశోచంతి" అని ఊరడించినాడు. రాముడు శాంతించినాడు. అంతతో ఆఘట్టము ముగిసినది. రాముని క్రోధము మాత్రము చల్లారలేదు. మోపెట్టి యున్న రాముని ధనుర్బాణములతోడనే ఆ గిరిమర్గముల వెతుకదలచినారు. అన్న దమ్ములు.

అంతలో రాముని కంటబడినది పడియున్న ఒక పెద్ద శరీరము. అదియే జటాయువు. రాముడు దానిని చూచి సీతను భక్షించిన దిదియేనని భ్రాంతినొందినాడు. అంతలో ఆపక్షిరాజు ముఖమునుండి దీనస్వరము వినబడినది.

హే ఆయుష్మన్ నీవీ యరణ్యమున ఓషధిని వెదకువానివలె ఏ సీతను వెతకుచుంటివో ఆ సీతను, నా ప్రాణముల గూడ రావణు డపహరించినాడు. నీవులేని సమయమున సీతను రావణు డపహరించుటను చూచి నేనాతని అడ్డుకొనగా నన్నిక్కడ కూలవైచి తనరథ సాధనములు భగ్నము కాగా సీతను ఎత్తుకొని ఆకాశ మార్గమునపయనించినాడు. నారెక్కలు కూలి ఇక్కడ పడినానన్నది. నీబాణము చే నన్ను కొట్టవద్దన్నది. రాముడు మారినాడు. దుఃఖము రెట్టించినది. రాముని దుద్ధ

దృష్టమిప్పుడు మిన్నుముట్టినది. తన దురదృష్టము అగ్నిని కూడ తగలబెట్టు నను కొన్న రాముని మాట రూపొందినది. మొదటిది రాజ్య భ్రష్టము. రెండవది వనవాసము. మూడవది సీతా వియోగము. నాల్గవది పక్షిరాజు కూలుట. ఒకదానివెంట నొకటి ఇట్లు వరుసకాగా నా దురదృష్టము అగ్నిని తగలబెట్టుననినాడు రాముడు. మానవ జీవితమున దుఃఖము లిట్లు రాగా రామునివంటి ధీరుడే బ్రతుక గలడు. "ఈ దృశీయం మమా లక్ష్మీర్నిర్దహేదపిపావకం" అంతేకాదట. తన దురదృష్టమొక బడ బానలమట. ఇదిసముద్రుని శుష్కింప జేయునట. ఆహా! రామా! ఏమి! నీ మానవత్వ ప్రదర్శనము? వేవేగ వచ్చి ఆపక్షిరాజును కౌగలించుకొనినాడు. రక్తసిక్తమగు ఆపక్షి శరీర మాతనికి నింద్యము కాలేదు. పక్షిరాజు ఈ ఘట్టమున రామునకు దశరథునివలె కన్పట్టినాడు. సీతను రావణుడెత్తుకొని పోవుటను విపులముగ తెలుపుమనినాడు. జటాయువు రావణుడు సీతనెత్తుకొని దక్షిణదిశ కేగెనను నంతవరకు తెలిపి, ఇక నాప్రాణములు నిలువవని చెప్పుచునే రావణుడు విందముహూర్తమున సీత నపహరించెను. ఆమెవానికి దక్కదు. ఆ ముహూర్తమ నందెవ్వడు దొంగ తనమును చేయునో ఆవస్తువు యజమానికే దక్కునుగాని, చోరునకు దక్కదని ప్రశ్న భాగమును చెప్పుచునే ఆ జటాయువు అత్యంత దుర్ల భములగు తన ప్రాణములను వదలినది. రాముని దుఃఖమునకు మేరలేదు. ఇక్కడ రాముడొక దివ్యసందేశము నిచ్చినాడు.

లక్ష్మణా! ధర్మమూర్తులగు సాధువులు మానవ మాత్రులయందే ఉండుదను నియమములేదు. తిర్యగ్జంతువుల యందున కలరనుటకు ఈ పక్షిరాజే సాక్ష్యమని నాడు. శరణాగత రక్షణమున కంటె ధర్మమొక్కడున్నదని ఆ పక్షిరాజు యొక్క శౌర్యమును శరణాగత రక్షణమును ప్రశంసించి దహన సంస్కారముల గావించి నాడు. ఆసంస్కారము మంత్ర పూతమగు సంస్కారము. ఇదియే చిత్రము. అరువది వేల సంవత్సరములుగా సంతతిలేక పుత్రకామేష్టిని చేసిన దశరథునకు రాముని చేతిమీదుగ దహన సంస్కారము జరుగలేదు. అరణ్యమునందు పక్షికి ఆ అదృష్టము పట్టినది. అదియట్లుండ రాముని ప్రత్యేకత ఇక్కడ చూపబడినది. ఏమది? రాముడు సాక్షాన్నారాయణుడనుమాట. అతడు లోకనాథుడను విషయము.

రాముడిప్పుడు జటాయువును చితియందుంచి అన్నమాట ఇది

యాగతి ర్యజ్ఞశీలానాం ఆహితాగ్నేశ్చ యా గతిః
అపరావర్తినాం యా చ యా చ భూమి ప్రదాయినాం
మయాత్వం సమనుజ్ఞాతో గచ్ఛలోకా ననుత్తమాన్
గృధ్రరాజ మహాసత్వ సంస్కృతశ్చ మయా వ్రజ.

వైదికములగు యజ్ఞములను చేసిన వారే పుణ్యలోకములకేగుదురో, యుద్ధ రంగమునుండి తిరిగి రాక వెన్ను చూపని వీరులే వీరస్వర్గముల నలంకరింతురో, భూదానము నొసంగిన దాతలే పుణ్యలోకములకేగుదురో ఆలోకములకు నా అనుజ్ఞచే నీవు వెళ్ళుమని పలికినారు ఆపులుగును చితియందుంచి. ఈవలుకు నెవ్వరు పలుకుదురు? నా అనుజ్ఞయను పదమిక్కడ గమనింపదగు పదము. ఆతరువాత రామలక్ష్మణులు స్నానము నాచరించి ఉదక దానముల గావించి పిండ దానమును గూడ చేసినారు. ఇప్పుడు రాముడెవరు? నారాయణుడును మర్యాదా పురుషోత్తముడుకూడ.

అక్కడ నుండి బయలుదేరినారా రామ లక్ష్మణులు. మరికొందరను కడ తేర్చదగు అవసరమున్నది. కబంధుని కృతార్థుని కావింపవలెను. శబరికి పుణ్య లోకముల ప్రసాదింపవలెను.

జనస్థానమునకు మూడుక్రోసుల దూరమునందున్నది క్రౌంచారణ్యము. ఆ క్రౌంచారణ్యమును సమీపించినదే వేరొక అరణ్యము మతంగాశ్రమము కూడ. ఆ క్రౌంచారణ్య మతంగాశ్రమముల మధ్యనున్న ఆ అరణ్యము చాల గంభీ రమును గహనము కూడ. కాగా అందొక మహా రాక్షసి యున్నది. ఆరాక్షసికి అయోముఖి యని పేరు. ఆ రాక్షసికి లక్ష్మణునితోటి కామానుభవము కావలెనని పించి, లక్ష్మణునిపట్టుకొన్నది. లక్ష్మణుడా రాక్షసిని వికృతరూపిని గావించగా ఆరక్కసి పరుగెత్తినది. తరువాత వాడు కబంధుడు. ఆ రక్కసునకు పొట్టమీదనే నోరున్నది. ఆ రాక్షసుని బాహువులు మాత్రము ఒక యోజనముండును. ఆతని చేతికందిన జంతువులను గాని, మనుజులను గాని ఆతడాహారముగ తీసుకొనును. రామలక్ష్మణులాతని చేతికి చిక్కినారు.

కబంధున కది శాపవిమోక్షకాలము. అతడొకప్పుడు సుందర విగ్రహుండే. స్థూలశిరుడను ఋషిని అవమానపరచి వికృత రూపుడయ్యెను. తనవికృత రూపము నకు విముక్తిని ఆఋషిని కోరగా రామునిచే నీబాహువులు ఛేదించబడి నీవు ముక్తు డవు కాగలవని అనుగ్రహించినాడు. ఇంతలో ఆతడు తపస్సును చేసి దీర్ఘాయు ర్దాయమును సంపాదించుకొని దేవేంద్రునిమీదికి యుద్ధమునకు పోగా ఆదేవరాజు వజ్రాయుధముచే శిరమును ఖండించి ఊరుభాగమును కూడ లోపలికి త్రోసినాడు. కాని బ్రహ్మయిచ్చిన వరవిశేషముచే ఆతడు చావలేదు. ఆకలిబాధ పీడించగా

ఇంద్రుని అనుగ్రహమున పొట్టమీదనే ముఖము నుంచుట జరిగినది. అతడు దనువు యొక్క కొడుకు. అతని బాహుయుగ్మమున చిక్కిన రామ లక్ష్మణులాతని బాహువులను నరికివేయగా ఆతనికి పూర్వ స్మృతికలిగి తన చరిత్రను వారికి చెప్పుకొని తన్ను దహనము చేయుమని కోరినాడు. రామ లక్ష్మణులట్లే చేయగా ఆ రాక్షస దేహము పోయి అతనికి దివ్యదేహము వచ్చినది. అంతతో అతడు రామునకు రాబోవు శుభమునంతను చెప్పి, రాముని ఋష్యమూకమున కేగుమనియు, సుగ్రీవుని మిత్రునిగా గ్రహింపుమనియు అలోవలనే మతంగాశ్రమమున నీ కొరకై శబరియను మహా భక్తురాలు కనిపెట్టుకొని యున్నది గావున ఆమె అందించు ఆతిథ్యమును గ్రహించుమనియు చెప్పి ఆతడంతర్ధాన మొందినాడు.

రాముని పయనము అక్కడనుండి ఋష్యమూక పర్వత ప్రాంతమునకు సాగినది. మతంగ మహర్షుల ఆశ్రమమక్కడనే. శబరి ఆశ్రమము అదియే. రాముడు శబరి ఆతిథ్యమునందు కొనినాడు. భారత క్షేత్రమున శబరి మహనీయుల సేవచేసి కృతార్థురాలైన పుణ్యస్త్రీ యనక తప్పదు. ఆమె ఋషుల వంశమునకు చెందినదికాదు. వేద వేదాంగముల చదువలేదు. కాని ఆమె బ్రహ్మణ్యులైన మతంగ మహామునుల పాదముల నాశ్రయించి, కామక్రోధముల జయించి, గురు కటాక్షమునకు పాత్రురాలై రామ పాదారవిందముల తాకి ఆ బ్రహ్మణ్యునకు ఫలహారముల నందించి మహర్షు లందరును వెళ్ళదగు పుణ్యలోకములకు వెళ్ళిన ఆటవికస్త్రీ ఆమె రామునకు వన్యఫలములతో ఆతిథ్యము నొసంగి, ఆ రాముని ఎదుటనే ఒక చితిని ఏర్పరచుకొని, యోగ మార్గమున తన జీర్ణదేహమును దగ్ధము గావించుకొన్న యోగిని.

భారతీయ శాస్త్రములు గిరిజనులు మొదలగువారి మోక్షమును గురించి కన్నెత్తి చూడలేదనియు, ఒకనాటి ధార్మిక వర్గము వారిని దూరముగ త్రోసివేసిరనియు చెప్పువారినేమనవలెనో ?

శబరి ఆశ్రమ ప్రవేశముతో అరణ్యకాండ ముగిసినది. మహర్షుల ఆశ్రమ ప్రవేశముతో రామానుగ్రహము ప్రారంభమై శబరి జీవిత విమోక్షముతో అంతమైనది ఈకాండము. గీతాశాస్త్రములోని భక్తియోగసారమే ఈకాండము.

ఓమ్

# కిష్కింధ కాండము

శ్లో॥ రామం రాక్షసమర్దనం రఘువరం దైతేయ విధ్వంసనం
సుగ్రీవేప్సితరాజ్యదం సురపతేర్భృత్యంతరం శార్ఙిణం
భక్తానామభయప్రదం భయహరం పాపౌఘ విధ్వం
సకం
స్వామీరిస్తుత పాదపద్మయుగళం సీతాసమేతం భజే॥

## - రామ సుగ్రీవ మైత్రి -

ఆర్య మహాశయులారా !

మన మీనాటికి మన రామాయణమహా కావ్యమున మూడు కాండల గడచి నాము. నాల్గవది కిష్కింధకాండము. ఈకాండమునందలి ప్రాధాన్యములైన పాత్రలు వానరములు. ఈకావ్యమున మహానాయకుడగు రామునకును ఈ వానరములకును గల ప్రత్యేక సంబంధ మొక చరిత్రయై విలసిల్లినది. ఒక విధముగ విచారించుచో ఈవానరులకును రామునకును గల సంబంధము తాత్కాలిక మనుట రామాయణ మున కుదరదు. రాముడు మానవమాత్రుడేకాదు. దైవము మానుషరూపము నొంది వదన్న నే రామాయణకథ కుదురును. అట్లే ఈకిష్కింధ కాండయందలి వానరములు ప్రాకృత సృష్టిలోని వనుటయు కుదరదు. ప్రాకృత వానరశరీరములతో అప్రాకృత శక్తులు త్పన్నమగుట రామాయణ మహాకావ్య కథాభాగములోని ప్రత్యేకత. కాకున్న హనుమంతుని పాత్రను మనమెట్లు సమన్వయింతుము? హనుమంతుని తోటివారలే మిగిలిన వానరులుకూడ. రావణ సంహారమునకు శ్రీమహావిష్ణువు మనుష్య శరీరమును ధరించగా దేవతలును, దేవతాయోని విశేషులును వానరరూప ములతో భూమిపై కేతెంచినారు. ఇంద్రుడు వాలియైరాగా, సూర్యుడు సుగ్రీవు డయ్యెను. ఇట్లే అగ్ని నీలుడయ్యెను. వాయువు హనుమంతుడయ్యెను. దేవతా స్త్రీలును ఈవానర వత్నులై జన్మించినారు. వీరు కామరూపధరులు. ఎవ్వుడే రూపము

కొవలెనన్న ఆహూపములు ధరింతురు. ఈ భూఖండము నందెన్నియో పర్వతరాజము లున్నవి. అందొకటి ఋష్యమూకము. భూఖండము నందవతరించిన వానరరూప దేవతలకందరకును ఇదియే ప్రత్యేకమగు రాజధాని. ఈ ఋష్యమూక పర్వతాంత ర్భాగముననే కిష్కింధానగర సామ్రాజ్యము. భూఖండమునగల పర్వతరాజము లెన్నియో వానరశరీరధారులగు దేవతలచే ఆక్రమించబడినవి. మలయము, దర్దు రము మొదలగు పేర్లుగల పర్వతములు ఈ కాండమున వర్ణించబడినవి.

ఆ పర్వతము లిప్పుడెక్కడ యుండెనో నిర్ణయించుట కానిపని. ఈ పర్వత ములేకాదు. ఈకాండ యందెన్నియో భూగోళ విశేషములు వర్ణింపబడినవి. వాటిని నేడు ఈప్రదేశమది, ఈప్రదేశమిది అని నిర్ణయించుట కేవల ఊహా ప్రపంచము కాగలదు. రామాయణచరిత్ర ఇరువది ఎనిమిదవ మహాయుగమునందలి వైవస్వత మన్వంతరములోనిది. అయ్యును కొన్ని పర్వత ప్రదేశములును, నదులును, నగరములును సూత్రప్రాయములుగా నేడు కన్పట్టవచ్చును. ఒక విధముగ ఋష్య మూక పర్వతము దగ్గరనున్న పంపా సరోవరము నేటి హంపిక్షేత్రమని వాడుక యున్నది. కావచ్చును. లంకయెక్కడ? మహేంద్ర పర్వతమెక్కడ? అను ప్రశ్న లకు ఆనాటి ఆప్రదేశములను నేటి చరిత్రకారులు చెప్పెదరు. కాని వారు వారను కున్న ప్రదేశముల ననుసరించి, రామాయణకాలమును, ఆనాటి ఆచారములను తెలుపుచు ఆర్యనాగరికతను బయటకు లాగితిమను కొనుచుందురు ఆనాటి రామా యణము ఆర్యద్రావిడ చరిత్ర కావచ్చునని నీటిమీద గీతలవలె నిర్ధారణ గావింతురు కూడ. అది నాపనికాదు. పాశ్చాత్య చరిత్రల నాధారముగాగొని వ్రాయు ఆ పండిత ప్రవరులతో నాకు వివాదములేదు. భారతీయాధ్యాత్మిక తత్వజిజ్ఞాసువుల కందించు దగు విజ్ఞాన సూత్రములు వ్యాఖ్యానించిన వాల్మీకి సారస్వతమును మీ ముందుంచుట నాప్రయత్నము. కథాభాగమున ప్రవేశింతము. ఈనాటి ఉపన్యాసము రామసుగ్రీవ మైత్రి.

అది ఋశ్యమూకమను పర్వతరాజము. అక్కడనే పంపాసరోవరము. ఆ పర్వతమునకు సంబంధించినదే మతంగమహర్షివారి ఆశ్రమము. భూ సుందరికా పంపాసరోవర ప్రాంతమొక అమూల్యాభరణ మనకతప్పదు. ఆ సరోవరమును తిలకించు శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో....

లక్ష్మణా! ఒక విధముగ భరతుని వియోగదుఃఖము నన్ను క్రుంగదీయు చుండగా సీతావిరహము దానికి తోడైనది. ఈయుద్దరి విరహ వేదనమును కూడ భరింపజాలక తాపతప్తుడనై యుండగా అట్టినాపను ఈపంపాసరోవర భాగ్యలక్ష్మి శోభనుకూర్చుచున్నది. చూచితివా? అనినాడు. ఇక్కడ వాల్మీకిమహర్షివారు కావ్య సుందరికెంతయో సొగసును కూర్చుచు అందున్న వృక్షలతా నికుంజములను, అందుచరించు తుమ్మెదల రొదలను, పింఛముల విప్పియాడు నెమళ్లను వర్ణించి ప్రకృతి సుందరిని తీర్చిదిద్దినారు. ఇదియొక అపూర్వవర్ణనము. దీనినిట్లుంచుదము సమయము చాలదు.

రాముని విరహవర్ణనముకూడ చాల విస్తృతమైయున్నది. రాముడు పంపాస రస్తీరమున సీతావిరహ కాతరుడై శోకించుటను వాల్మీకి చాల వర్ణించినారు. కావ్య నిర్మాతలు కవితావిశేషమును చూపుటకు వియోగవర్ణనము విహారస్థలము. ప్రకృత మున మనమిప్పుడా రంగస్థలమును వదలి కథకు వత్తము.

రాముని విరహశోకము లక్ష్మణుని వైరాగ్యబోధచే ఉపశమించినది. నష్ట వస్తు సంపాదనము శోకమువలన ప్రాప్తించదు. అన్నా! ప్రయత్నము అవసరము. స్వస్థచిత్తుడవగు మనినాడు లక్ష్మణుడు. వెంటనే ధైర్యసాహసములా రఘువీరుని ముందు నిలిచినవి. రామలక్ష్మణులు సీతాన్వేషణ కార్యక్రమమున ప్రవేశించినారు.

వాలి సుగ్రీవులిద్దరును సోదరులు. వారిప్పుడు బద్ధశత్రువులు. వాలి చాల బలవంతుడు. సుగ్రీవుడును బలవంతుడే. కాని వాలి సుగ్రీవున కంటె మిక్కిలి బలవంతుడు. వాలిచే సుగ్రీవుడు రాజధానినుండి వెడలగొట్టబడినాడు. సుగ్రీవుని భార్య పేరు రుమ. రుమను వాలి తన స్వాధీనమునందుంచుకొని తమ్ముని తరిమి వేయగా సుగ్రీవుడిప్పుడు ఋశ్యమూక పర్వతమున దాగినాడు వాలిచేత చత్తునన్న భయముతో. వాలి ఆపర్వత ప్రాంతమున అడుగిడడు. అదియే సుగ్రీవునిధైర్యము. వాలికి మతంగాది మహర్షుల శాపమున్నది. కావుననే వాలి ఆప్రాంతమునకు రాడు. కాలము గడచుచున్నది.

ఒకనాటి ఘట్టము.

రామలక్ష్మణులా పంపాసరస్తీరముననే సీతాన్వేషణ గావించు సమయమది.

తీక్ష్ణకోదండములచేతబూని ఆపంపాసరస్తీర వృక్షాంతర్భాగములందెక్క డైన రావణుడు సీతను దాచెనేమోయని రామలక్ష్మణులు వెతుకుచుండిరి. ఆకాశము

బాహువులతో శత్రువులకు కన్నెత్తి చూడనలవికాని ఆపీరశిఖామణులను సుగ్రీవుడు చూచినాడు. సుగ్రీవుడా ఋశ్యమూక పర్వతసానువుల అటునిటు తిరుగుచున్న సమయమది. సుగ్రీవుని గుండె బ్రద్దలైనది. వాలి తన్ను చంపుటకు పంపిన గూఢ చారులు వీరు కావచ్చునని సుగ్రీవుడూహించినాడు. గూఢచారులవలన శత్రువుల నిర్మూలింపుటకూడ రాజనీతిలోని ఒకభాగముగదా?

సుగ్రీవుడొక్కడే ఋష్యమూకమున లేడు. ఆతని సచివులును కొందరుండిరి. ఆ సచివులం దొకడు హనుమంతుడు. ఇతడు మహానుభావుడు, వేద వేత్త, ఈశ్వరాంశ సంభూతుడు. కేసరియను వానరోత్తమునకు క్షేత్రజుడు. వాయు దేవునకు ఔరసుడు. అనగా కేసరి భార్యయగు అంజన యందు వాయువునకు జనించినవాడు. కావున వాయువునకు ఔరసుడును కేసరికి క్షేత్రజుడును అయ్యెను. తల్లిపేరు అంజనాదేవి కావున ఈయనకు ఆంజనేయుడని పేరు వచ్చినది. ఈతని ప్రభావమీ కిష్కింధ కాండమున ప్రారంభమై సుందరకాండ యందు విస్తరించును.

రామలక్ష్మణులను చూచి వాలిచే పంపబడు హంతకులు వీరని భయపడిన సుగ్రీవుడు పరుగు పరుగున ఆ పర్వత పైభాగమున కెగబ్రాకి అటునిటు తిరిగి ఒక్కచో కూర్చొనగా ఆతని సచివులును కొందరాతనినే అనుసరించి ఒక్కచో కూడిరి దోసిళ్ళనొగ్గి.

ప్రస్తుతమున సుగ్రీవుని సమస్య నేనిక్కడ వసించుటయా? మరెక్కడికైన వెళ్ళి ప్రాణముల నిలుపుకొనుటయా? అనునదే. ఆతని దరిజేరిన కపులను సార్థక నాములై యుండిరేగాని సలహాదారుడెవ్వడును కాలేదు.

హనుమంతుడు ఒక్కడే భయభ్రాంతుడై కూర్చొన్న మహారాజునకు ఏమాటలు చెప్పి భయమును తీర్చవలెనో ఏ సాయమునుచేసి ఆ రాజును కృతార్థుని గావింపవలెనో గుర్తెరిగిన సచివుడు. హనుమంతుడు సుగ్రీవుని మొదట "సంభ్రమస్త్యజ్యతాం" భయమును వీడమని వాక్రుచ్చి ఆతడు భయపడకుండుటకు ప్రధాన కారణమును ప్రతిపాదించినాడు. మహారాజా! వాలి ఇక్కడకు రాడుగదా? నీకేల భయము? అని సుగ్రీవుని మనస్సున చోటుచేసుకొన్న మృత్యుభయమును అవ్వలకు నెట్టినాడు. సుగ్రీవునిలోని చపలత్వమును తొలగించి, ముందు ధీరుడవై ఆలోచింపుమని, ఇది రాజధర్మమనినాడు. మరి సుగ్రీవుని సమాధానమేమి?

రామలక్ష్మణుల భయంకర ధనస్సులను వారి ఆకారములను కనుగొన్న ఎవరికి భయము కలుగదు ? ముందు వారెవ్వరో తెలియుట మనకవసరము గావున వారెవ్వరో తెలుసుకొని వారిని నా ఎదుటకు గొనిరమ్మని ఆంజనేయుని కోరినాడు.

ఇక్కడనుండి హనుమంతుని పాత్ర గూఢచారియై సత్యాన్వేషణమును గావించునదైనది. సత్యాన్వేషణ సామగ్రి ఆతనికి కొరతలేదు.

హనుమంతుడు కామరూపధరుడగుటచే సన్యాసివేషమును స్మరించినాడు. ఆతని కపిరూపము తొలగినది. సన్యాసిరూపము వచ్చినది. హనుమంతుడా పర్వతాగ్రము నుండి క్రింద కొక్కదూకు దూకినాడు. విచిత్రవేషములతో వచ్చు ధనుర్ధారులగు రామలక్ష్మణుల కెదురై నిలిచినాడు. హనుమంతుని హృదయము రామలక్ష్మణుల నిజస్వరూపమును చక్కగ తెలిపినది. కాని హనుమంతుడు వేషమును మార్చుకొనలేదు. సన్యాసి వేషధారియయ్యే యుండెను. తాను అధ్యయనము గావించిన వేదవేదాంగములసారమే ఈమూర్తులిద్దరునని నిశ్చయించుకొనినాడు. గగన మండలము నుండి దిగివచ్చిన సూర్యచంద్రులు కాకున్న వీరి రూపము లిట్లెందు కుండునని ఊహించినాడు.

వారిద్దరి విశాల వక్షములును వారి ఎగుభుజములును, ఆజానబాహువులను వారి ఆకర్ణాంత నేత్రములును, ఈ మూర్తుల దేహచ్ఛాయలును ఆతనికి ఆశ్చర్యమును గొలిపినవి. అందొక్కని దేహము వినీలవర్ణమున భాసించుచు మరొక్కని దేహకాంతి సువర్ణవర్ణమున వెలుగొందుచు దేహకాంతులు భిన్నములై యున్నను ఈ రెండు వర్ణములును లోకవిలక్షణములై అనిర్వచనీయములై యున్నవనియే ఆతడు భావించినాడు.

అంతలో హనుమంతుని చూపులు వారి ఆజానుబాహువులతో ధరించిన మహాప్రమాణ విస్తీర్ణములగు ధనస్సులపై బడగా, ఈ ధనస్సులు మానవమాత్రులు [illegible]రించునవి కావని ఆతనికి నిశ్చయమైనది. ఇక వారి చూపులను గమనించినాడు. [illegible]రి చూపులు ఏదో ఒక ముఖ్యమగు వస్తువును కోల్పోయినవారు ఆవస్తువుకొరకై వెతుకులాడుచున్నట్లున్నవి.

వీరు రాజవంశీకులు జడధారులై ఈ యరణ్యముల కేతెంచుట కేదియో యొక బలవత్కారణ ముండకపోదు. శత్రువు లెవ్వరును వీరిని అరణ్యములకు

పొరద్రోలలేము. మణి సువర్ణ భూషణాంబరముల ధరించదగు ఈ మంగళ విగ్రహ ములు చూడజాలని దురదృష్టవంతులెవ్వరో ! వీరి చేతనున్న ఆయుధము దేవరాజు చేతనుండు ఆయుధము. వీరు చతుస్సముద్ర ముద్రితమగు సీధరామండలమును ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలదగు వీరలు సుమా! అని నిశ్చయించుకొని, తానూహిం చిన భావములనే వ్యక్తపరచుచు ఆ రామలక్ష్మణుల ప్రశ్నించినాడు. ఇది హను మంతునిలోని ప్రత్యేకత.

రామలక్ష్మణుల నుండి సమాధానము హనుమంతునకు రాలేదు.

తానెవ్వడై వచ్చి అడుగుచుండెనో తన చరిత్రను చెప్పకయే వారు సమా ధానమిత్తురా? ఆ విషయమును గ్రహించిన హనుమంతుడు తన చరిత్రను చక్కగ విశదీకరించి తాను వచ్చిన పనినిగూడ రామలక్ష్మణులకు తెలిపినాడు.

రామునకు హనుమంతుని సంభాషణలోని ప్రత్యేకత అర్థమైనది. విషయ మును ప్రతిపాదించునప్పుడు శబ్దార్థమును, ఆ అర్థమునకు తగిన తాత్పర్య నిర్ణయ మును భిన్నములై లేకుండుట. ఉచ్చరించు ఉచ్చారణ యందు భావనిర్ణయము స్పష్టమై వినువానికి వ్యక్తమగుచుండుట. (స్పష్టమగు పలుకుబడి కలిగియుండుట) శబ్దోచ్చారణ కనుగుణ్యముగ అంగాభినయ ముండుట ఇవి వక్త కుండదగిన ప్రత్యేకతలు. ఇవి వేదశాస్త్రాధ్యయనమువల్ల గాని రావు. వ్యాకరణముచేత శబ్ద వ్యుత్పత్తియు, తర్కముచే పదార్థజ్ఞానమును, మీమాంసచే వాక్యాన్వయ జ్ఞానమును కలుగును. ఇది భారతీయ విజ్ఞానము.

రాముడు హనుమంతుని యందీ విషయములు పరిపూర్ణములై యుండుటను గ్రహించి, హనుమంతుని విద్యావిజ్ఞానమును కొనియాడి, తమ అవసరమును తెలుపుటకు లక్ష్మణుని ఆజ్ఞాపించినాడు.

లక్ష్మణుడు సుగ్రీవుని మైత్రి కోరియే యిచ్చటకు వచ్చెనని తెల్పినాడు. ఆ తెల్పుటయందే రాముడు సాక్షాన్నారాయణుడన్న భావమును నిగూఢముగ వ్యక్తము చేయుటను వాల్మీకి తెలిపినారు.

"లోకనాథః పురాభూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి"

ఒకప్పుడు లోకనాధుడైన రాముడిప్పుడు సుగ్రీవుని నాధుని గావించుకొను టకు వచ్చెననినాడు. ఇందలి లోకనాథ పదము భగవంతుని వ్యక్తీకరించుచు ప్రస్తు

తమున రాముడు చక్రవర్తియై కూడ మిత్రలాభమునకై ఇట్లువచ్చెననికూడ తెలియ వచ్చినది. వాల్మీకి కవిత్వములోని ప్రత్యేకత ఇదియే.

అది సుగ్రీవుడు వసించియున్న ఋష్యమూక పర్వత భాగము. హనుమ రామలక్ష్మణులను తన భుజస్కంధమున నిడుకొని సుగ్రీవుని వద్దకు తీసుకొని వెళ్ళినాడు సుగ్రీవుని భయము తీరినది. సుగ్రీవుడు వానర రూపమును వదలి మనుష్యరూపము ధరించినాడు. రామునకు మిత్రలాభము కలిగినది. ఇక వారి మైత్రి స్థిరము కావలెను. రామ సుగ్రీవులిద్దరును ఒకరిచేతి నొకరు కలుపుకొని మిత్రులము మనమిద్దర మనుకొనినారు.

ఇక వారిద్దరిమిత్రత్వమును తాత్కాలికముగాకుండ శాశ్వతము కావలెను. వారిద్దరిమధ్య నొక సాక్షి మధ్యవర్తికావలెను. అతడును శాశ్వతుడు కావలెను. భార్యాభర్తలమైత్రి కూడ ఇట్టిదే.

భారతీయ సిద్ధాంతమున అగ్నిసాక్షికము ముఖ్యము. కావున రామసుగ్రీవుల మైత్రి అగ్నిసాక్షికమైనది.

హనుమంతుడు భిక్షురూపమును వదలి కట్టెలుతెచ్చి అగ్నిని రగిల్చినాడు. వారిద్దరును ఆ అగ్నికి ప్రదక్షిణమాచరించి, ఒకరిపై నొకరు స్నేహభావమును ప్రకటించు చూపుల బరపుకొనుచు తమ స్నేహభావమును స్థిరీకరించు కొనినారు అదొకరికి శుభకారణముకాగా వేరొకరికి అశుభకారణమైనది. సీతకు రామసుగ్రీవుల మైత్రి కాలమున ఎడమకన్ను అదరినది. వాలికిని రావణునకును కూడ ఎడమకన్నే అదరినది. ఈ భాగము వారిద్దరిచావును సీత బంధవిమోక్షమును సూచించినది. తరువాతది రామ సుగ్రీవుల మిత్రభాషణము.

సమాన స్కంధముననే మిత్రత్వముండును. ఉండవలెను. ఉన్ననే ఆమైత్రి చెడదు. రామసుగ్రీవుల దుఃఖము లొక్కటే. సామర్థ్యములును అట్టివే. ఒకరి కొకరు తీసిపోని ధర్మమూర్తులు.

వ్యధ తెలియనివానితో తనవ్యధను చెప్పికొనగా అతడు దానిని కథగ వినును.

రామసుగ్రీవుల కిక్కడ కలిగిన దుఃఖము ఒకేరూపము. రామ సుగ్రీవు లిద్దరును తమ భార్యలను కోల్పోయిన వ్యక్తులు. వారిద్దరును తమ భార్యలను

సంపాదించుకొనవలెను. కావున ఒకరికథ నొకరు సఖ్యభావమున చెప్పుకొనినారు. సుగ్రీవుడు వాలి తన భార్యనపహరించెనని చెప్పగా రాముడు తన భార్యను రావణుడెత్తుకొని పోయెనని చెప్పినాడు ఈ ఘట్టమున రాముడు సుగ్రీవునకు సాయము గావింపగా రామునకు సుగ్రీవుడు సాయముచేయును. దీనినే వారిద్దరును నిశ్చయము గావించుకొనినారు. వాలిని వధించి నీ భార్యను నీకిత్తునని రాముడు ప్రతిజ్ఞను చేయగా వేదశ్రుతిని తెచ్చినట్లు సీతను తెచ్చి నీకిత్తునని సుగ్రీవుడు ప్రతిజ్ఞ చేసినాడు.

తరువాత ఒక సన్నివేశము జరిగినది.

రావణుడు సీతనెత్తుకు పోవునప్పుడు సీత తన ఆభరణముల మూటనీ ఋష్యమూకమున పడవైచినది. దానిని సుగ్రీవుడు జాగ్రత్తపరచినాడు. రావణుడెత్తుకొని పోవునపుడు హా! రామా! లక్ష్మణా! అన్నిఆక్రోసించిన స్త్రీ సీతయే అయి వుండునని ఊహించిన సుగ్రీవుడు, ఆ విషయమును రామునకు చెప్పి, తాను భద్రపరచిన నగలమూటను రాముని ముందుంచినాడు. అయిదుగురు వానరులతో కలసి రావణుడు సీతనెత్తుకుపోవుట నేను చూచితినని చెప్పుచు ఈ మూటను ముందుంచగా రాముడప్పుడెట్లుండును?

రాముని ముఖమండలమున దుఃఖముదయించగా ఆతని ముఖము మంచుచే ఆవరించబడిన చంద్రమండలమైనది. సీత ఆభరణములు రాముడెరుగనివికావు. ఆ పట్టు పుట్టము సీతదే. రాముని ధైర్యము కుంగినది. కన్నులవెంట నీరుకారినది ఆతడు మూర్ఛిల్లినాడు....

కొద్దికాలము గడచినది. తేరుకొనినాడు. లక్ష్మణుని వంకతిరిగి లక్ష్మణా! మీ వదినె ఆభరణములను గుర్తింపుమనినాడు.

ఆమె ధరించు ఆభరణములెవ్వియో లక్ష్మణుడేమి ఎరుగును! ఆతడెన్నడును సీతామాత ముఖమండలమును చూచి ఎరుగడు. ప్రతినిత్యమును లక్ష్మణుడా మాతృమూర్తి పాదపద్మములయందు దృష్టిని నిలిపి వందన మాచరించును కావున ఆమెకాలి అందియలను మాత్ర మాతడెరుగును. ఆ మాటనే అన్నగారికి చెప్పి అందెలు మాత్రము వదినవేననినాడు.

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురేత్వ భిజానామి నిత్యం పాదాభివందనాత్.

చెవికమ్మల నాతడెరుగడుట. కేయూరముల నాతడెరుగడట. (దండకడియములు) పరదారల యందు దృష్టిని నిల్పగూడని ప్రదేశము లివ్వి, ముఖము, వక్షస్థలము.

రాముడొక్కమాటుగ సుగ్రీవునివైపు తిరిగి సుగ్రీవా! రావణుడున్న ప్రదేశమెక్కడ? అని అడిగినాడు. సుగ్రీవుడు నేనెరుగనని సమాధానమిచ్చినాడు. నిజమునకు సుగ్రీవుడు రావణుని ఎరుగనివాడు కాడు. ఇది మిత్రద్రోహమా? అబద్ధమా! రెండును కాదు. ఇది సుగ్రీవుని దూరదృష్టి. సుగ్రీవుడప్పుడు రాముని కన్నీటి బిందువులతుడిచి ఆదరించగా వారిద్దరును మరల తమ తమ కర్తవ్యముల నెరవేర్చుటను గురించి ప్రతిజ్ఞలకావించుకొనినారు. రాముడు ముందు వాలిని వధించి సుగ్రీవుని కార్యము నెరవేర్చవలెను. అవి రేపు—

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

స్వస్తి ప్రజాభ్యః

# 2 వ రోజు

శ్లో॥ రామం రాక్షసమర్దనం రఘుపతిం శక్రారి విధ్వంసినం
సుగ్రీవేప్సిత రాజ్యదం సురపతేః పుత్రాంతకం
శార్ఙ్గిణమ్
భక్తానామభయప్రదం భయహరం పాపౌఘ
విధ్వంసనం
సీతా సేవిత పాదపద్మయుగళం రామంభజేశ్యామలం

## వాలి వధ—అందలి సంశయ నివారణము

ఆర్య మహాశయులారా !

నేటిది కిష్కింధ కాండయందలి రెండవ ఉపన్యాసము. చెట్టుచాటు నుండి వాలిని వధించుట రాముని పరాక్రమమునకు కళంకము కాదా? అన్న ప్రశ్నకు సమాధానము నేటి ఉపన్యాసములోని ముఖ్యాంశము.

కథా భాగము.

వాలి సుగ్రీవుల మైత్రి విన్నటి కథాభాగము. నేడు దాని తరువాతి కథాంశము.

రామసుగ్రీవు లొక ఏకాంత ప్రదేశమున చేరినారు. రామునకక్కడనే సుగ్రీవుడొక ఆసనమును కల్పించగా రాముడు సుఖాసీనుడయ్యెను. అప్పుడే సుగ్రీవుడు తన కష్టమును రామునకు విన్నవించుకొని భయార్తుడనైన నాకు అభయ ప్రదానమివ్వమని అర్థించగా రాముడభయదానమును గావించినాడు. అంతట సుగ్రీవుడు నా కష్టమును తీర్చు విధానమునకు కూడ నీకే స్వతంత్రము నిచ్చుచుంటినని సుగ్రీవుడు ఒప్పుదలకాగా రాముడు నీభార్యనపహరించిన వాలిని సంహరించి నీభయమును తీర్తునని సమాధానమిచ్చి తన బల సామర్థ్యములను కూడ తెలిపినాడు. ఆతరువాత రాముడు మీ ఇద్దరి వైరకారణమును చెప్పుమనినాడు మిత్రుని. సుగ్రీవుడు తనకును తన అన్నకును వచ్చిన విరోధకారణమును ప్రతిపాదించినాడు.

నేనిప్పుడు వాలి సుగ్రీవుల సంబంధమును, వారిద్దరి వైరకారణమును ప్రతి పాదించెదను. మొదటిది వాలి సుగ్రీవుల సంబంధము.

ఋక్ష రజసుడు బ్రహ్మమానసపుత్రుడు. ఆతడొకప్పుడు పార్వతిచే శపింప బడిన ఒక కొలనిలో దూకగా ఆతనికి ఆక్షణముననే స్త్రీత్వము వచ్చినది. అప్పు డామె వానరియే. కాని ఆమెది లోకోత్తర సౌందర్యము. ఆ వానరి సౌందర్యమునకు ఇంద్రుడును సూర్యుడును గూడ మోహించి ఆమెను కూడగా ఇంద్రుని వీర్యము ఆవానరి తోకయందును సూర్యుని వీర్యము ఆవానరి మెడయందును పడగా వాలముపై బడిన ఇంద్రుని వీర్యమునకు వాలియు మెడపై బడిన సూర్యుని వీర్య మునకు సుగ్రీవుడును పుట్టిరి. ఆ ఋక్షరజసుని శాపము తాత్కాలికము. వెంటనే ఆతడు పురుషుడయ్యెను. పురుషత్వము వచ్చిన వెంటనే ఋక్షరజసుడు జేష్ఠుడైన వాలికే కిష్కింధా రాజ్యము నిచ్చెను. కావున కిష్కింధారాజ్యము వాలిది. ఇది వాలి సుగ్రీవుల సంబంధము. తల్లి ఒక్కతి, తండ్రు లిద్దరు. ఈ సోదరులిద్దరును కిష్కింధా రాజ్యమునందే యుండిరి. వీరిదింత వరకు విరోధములేని సౌదర్యము.

మాయావియను వాడొక రాక్షసుడు. ఆతడు చాల బలవంతుడు. మాయావి కిని వాలికిని ఒక స్త్రీసంబంధముగ తగాదా వచ్చినది. అది వారిద్దరికిని యుద్ధకారణ మైనది. ఆయుద్ధమొక కొండగుహలో జరిగినది. ఆ సమయమున సుగ్రీవుడు వాలి ననుసరించినాడు. అప్పుడు వాలి సుగ్రీవుని వారిద్దరి యుద్ధము సాగుచున్న కొండ గుహకు వెలుపలి ద్వార రక్షకుని గావించుట జరిగినది. ఆయుద్ధము వారిద్దరికిని సంవత్సరకాలము జరిగినది. సుగ్రీవుడు ఆలోచనలో పడినాడు. ఇంతకాలమా? నా అన్న యుద్ధము? అని. అంతలో ఆగుహ లోపలనుండి నెత్తురు కాలవలుగా పారు టయు, దీనాలాపములు వినబడుటయు సుగ్రీవుని ఆలోచనకు బలము వచ్చినది. సుగ్రీవుని ఆలోచనలో అన్నగారికే ప్రమాదము జరిగి యుండవచ్చునని నిర్ణయ మైనది. శత్రువులతోటి యుద్ధము ఇంతకాల మక్కరలేదు. నేరది విపరీతమైనది. అదియే సుగ్రీవుని అనుమానమునకు కారణమైనది. సుగ్రీవుడు భ్రాంతుడై రాక్ష సుడు బయటకు రాకుండ ఆగుహకు ఒక రాయిని అడ్డమువేసి కిష్కింధ కేగినాడు. వాలి చచ్చినట్లు మాత్రమెవ్వరికి తెలుపలేదు. అయ్యును మంత్రులు తెలుసుకొని సుగ్రీవుని రాజునుచేసినారు.

వాలి యుద్ధము ముగిసినది. మాయావిని చంపి ఆతడు బయటకురాగా రాయి అడ్డమున్నది. సుగ్రీవుని పిలిచినాడు. ఆతడు పలుకలేదు. ఆబండను కాలితో తన్ని

బయటకు వచ్చినాడు వాలి. అటునిటు చూచి కిష్కింధ కేగినాడు. వెంటనే సుగ్రీవుడు సింహాసనమును దిగి వాలికి తన భ్రాంతిని తెలిపి, దోసిలియొగ్గి రాజ్యమును వప్ప చెప్పినాడు.

వాలి సమ్మతించక సుగ్రీవునియందు దోషారోపణగావించి అతని భార్యను లాక్కొని సుగ్రీవుని పైగుడ్డకూడ లాక్కొని తరిమి చంపుటకు రాగా సుగ్రీవుడా సమయమున వాలిని నిగ్రహించగల సమర్థుడయ్యును అన్నగదాయని వదలి ఈ ఋష్యమూకమున దాగినాడు. సుగ్రీవుడు రామునకు తన వైరకారణము నిట్లు ప్రతిపాదించినాడు. రాముడు విని వాలిని చంపుటకే నిశ్చయించుకొని వాలిని తప్పక వధింతునని సుగ్రీవునకు గట్టిమాటను ఇచ్చినాడు.

తరువాతి కథ.

సుగ్రీవుడు వాలిబలము తెలిసినవాడు. రాముడు చంపునన్న నమ్మకమాతనికి ఎట్లు కలుగును? సుగ్రీవుని ముఖమున ధైర్యచిహ్నము వెలువడలేదు. వాలిబలమును వర్ణించి చెప్పినాడు రామునకు.

ఒకప్పుడు వాలి వేయిఏనుగుల బలము కలిగిన దుందుభియను రాక్షసుని చంపి పైకి విసరెనట. వాలి సంధ్యావార్చుటకై ప్రొద్దునలేచి నాల్గుసముద్రముల చుట్టివచ్చునట ప్రతినిత్యమును. అతడొకప్పుడు ఉత్సాహమురాగా పర్వతములతో బంతులాడునట. ఇంతేగాక ఆపర్వతముపైగల సాలవృక్షములను చేతితో ఊపగా ఆచెట్ల ఆకులు జలజల రాలునట ఇంతటి బలవంతుడు వాలియని రామునకు తెలిపినాడు. రాముడు పరీక్ష ఇచ్చి తన బలమును సుగ్రీవునకు నిరూపించుకొనినాడు.

వాలి చంపి పడవైచిన దుందుభి శరీరమును కాలిబొటనవ్రేలితో తొలగించగా అది పదియోజనముల దూరమున పడినది. సుగ్రీవునకు ఆ ఘట్టము నమ్మకమును కలిగించలేదు. ఆపర్వతమునందున్న సాలవృక్షము నొకదానిని బాణముతో భేదింపుమని రామునికోరగా అట్లేబాణమును వదలినాడు. ఒక్క సాల వృక్షమునకై వదలిన బాణముయొక్క వేగము ఏడు సాలముల భేదించి భూమిలోనికి చొచ్చుకొనిపోయి మరలరాముని అమ్ములపొది యందు దూరినది.

సుగ్రీవునకు భయము తీరినది. వాలి నీతడు చంపగలడన్న ధైర్యము వచ్చినది. దృఢముగ విశ్వసించి రాముని ఆజ్ఞతో సుగ్రీవుడు వాలిని యుద్ధమున

కాహ్వానించి యుద్ధమొనర్చినాడు. కాని రాముడు వాలిని కొట్టలేదు. సుగ్రీవుడు వాలితో బాహాబాహి యుద్ధమొనర్చియు గెలువలేక ఎట్లో ప్రాణములను దక్కించుకొని బయటపడి ఋశ్యమూకమున కేతెంచి ప్రాణములను నిలుపుకొనినాడు. సుగ్రీవుడిక రాముని కలవలేదు. అతడేకాంతముగ కూర్చొనినాడు. రాముడే హనుమంతుని తీసికొని లక్ష్మణునితోకూడ సుగ్రీవుని దగ్గరకేగి, మిత్రుని వలకరించి తానెందుకు వాలిపై బాణమును వదలలేదో చెప్పినాడు. నీవును నీఅన్నయు ఒక్కపోలికయందుండి ఒకే విధముగ యుద్ధము చేయుటచే నా అమోఘబాణము నిన్నే చంపుచో నేను మిత్రఘాతకుడ నయ్యెడు వాడనని సత్యముచెప్పి, సుగ్రీవుని గుర్తుపట్టుటకు వీలుగ గజపుష్ప మాలాలంకృతుని గావించి రెండవసారి యుద్ధమున కాహ్వానింప జేసినాడు.

రెండవసారి సుగ్రీవుడు వాలిని యుద్ధమున కాహ్వానించినప్పుడు వాలిభార్య తార వాలిని యుద్ధమునకు వెళ్ళవద్దన్నది. అందుకు తగిన కారణములను ప్రతిపాదించినది. రామాయణమున వాలిభార్య తార పాత్ర చాల చిత్రమైనది. నాటి స్త్రీల ప్రజ్ఞా విశేషములు మీకీనాడు తెలియుట చాల అవసరము.

ముందు సుగ్రీవుడు ఇంతకు పూర్వమననే ఓడి మరల ఆహ్వానించుటను మొదటి కారణముగ చూపి నాధా! యుద్ధమునకిప్పుడు సమయము కాదన్నది. సుగ్రీవుని కంఠధ్వానమును రెండవ కారణముగ నిరూపించి ఆతడు ప్రత్యేక బలమును చేకూర్చుకొని నిన్నాహ్వానించుచుండెనని నిరూపించినది. ఇది నేను అనుమాన ప్రమాణముచే చెప్పుట కాదన్నది. అంగదుడు గూఢచారుల వలన విని నాకందించిన సమాచారమన్నది. అంతతో ఊరుకొనక సుగ్రీవునకెవ్వరు సహాయముగ నిలచెనో ఆరాముని వర్ణించినది.

ఇవి తార రాముని గురించి చెప్పినమాటలు.

నాధా! అని భర్తను తన కభిముఖుని గావించుకొనుటకై కౌగిలించి లాలనతో చెప్పిన మాటలివ్వి.

రాముని కోపము ప్రళయాగ్ని సదృశ్యమన్నది. అందుకని ఆతడు దుర్గ్రాహ్యుడు కాదన్నది. సాధువులగు వారికి ఆతడు నివాసవృక్షమన్నది. ఆపన్నులగు జీవులకాతడే గతి యన్నది. ఆర్తులకాతడు ఆశ్రయమన్నది. దిగంతములయందు

వ్యాపించదగు యశశ్చంద్రికల కాతడొక్కడే ఆధారమని రాముని ప్రత్యేకతను తెలిపినది. జ్ఞానవిజ్ఞానములను ఐశ్వర్యమాతని వరించినదన్నది. తండ్రిఆజ్ఞను పాలింపగా అతడడవులకు వచ్చిన ధర్మాత్ముడని అతని ధర్మమును నిరూపించినది. హిమవత్పర్వతము రత్నములకు స్థానమైనట్లు మహోన్నతములగు సుగుణముల కాతడు స్థానమన్నది. అతనితోటి విరోధము కూడదన్నది. మహానుభావుడగు రాముని బలహీనుడని భావించకుమని యుద్ధకర్మలయందాతడు అరితేరిన ధీశాలియన్నది.

ఇక్కడ తార రాముని సాధువులకు నివాసవృక్షమన్నది. నివాస గృహమని ఏలఅనలేదు? గృహము ఒకయాజమానియొక్క ఆధీనమునందుండును. వృక్షము సర్వులకును స్వతంత్రము. కావున రాముడు వీరికని వారికనికాక సమస్త భూతములకును ఆశ్రయమునిచ్చువాడని చెప్పినది.

దేవుడు అందరకును సమానుడుగదా? కొందరనే ఏల రక్షించుచుండెను? అనుచో చెట్టు నిష్పక్షపాతముగనే నీడను యిచ్చినను తనదగ్గరకు వచ్చువారికే ఇచ్చును. కావున భగవంతుడుకూడ తన్నాశ్రయించిన వారికే సాయముచేయును. అంతేకాదు. చెట్టు ముందు తాపమునుతీర్చి పుష్ప ఫలాదులచే ఇంద్రియ ప్రీతినిగూడ కల్పించును. భగవంతుడట్టివాడే. భగవంతుడు కూడ తన్నాశ్రయించిన వారికే సాయము చేయును. అందును ఆ భగవంతుని ఆశ్రయించు వారెవ్వరు? అన్నచో సాధుపుంగవులే ఆతనిని ఆశ్రయింతురుగావున సాధువులకు నివాస వృక్షమన్నది. ఇందొక ప్రత్యేకత కూడ యున్నది. అతనిని ఆశ్రయించుటచే సాధువగునా? సాధువయ్యే ఆశ్రయించవలెనా? రెండును కలవు. సాధువై ఆశ్రయించువాడు ఉత్తమోత్తముడు. ఆర్తుడైగాని లేక అర్థార్థియైగాని ఆశ్రయించియు సాధువగును. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని, వీరు నలుగురును పుణ్యాత్ములేననినారు గీతలో. తరువాత ఆపన్నులకు పరాగతియనియు ఆర్తులకు ఆశ్రయమనియు చెప్పినది. ఆర్తులన భౌతికైశ్వర్యమున భ్రష్టులై దానిని కోరువారు. ఆపన్నులన పరమార్థైశ్వర్యమును కోరువారు. అట్లే జ్ఞాన విజ్ఞాన సంపన్నుడని చెప్పినది. జ్ఞానమన ఆత్మజ్ఞానము. విజ్ఞానమన శిల్పాదిశాస్త్రములు (కళలు) ధర్మమును అడుగు దాటడనుటకు తండ్రి ఆజ్ఞచే ఇక్కడ కేతెంచెనని చెప్పినది. అడయట్లుండ సమస్తగుణములకును అతడే అధిష్ఠాతయని నిర్ణయించినది. అతని ఐశ్వర్యము అపారవారమన్నది. యుద్ధవిశారదుడనికూడ తెల్పి నిన్నెట్లు చంపవలెనో అతడెరుగునన్నది. కావున అతనితో విరోధము వద్దన్నది. అంతేకాదు. సుగ్రీవునితెచ్చి

పురమునందుంచి సౌదర్యమును నిలబెట్టి కొనమన్నది. వినిరా? తార అమృత బోధను? ముందుకు పోదము. వాలి తారమాటను తిరస్కరించి అతడు ధర్మాత్ముడగుచో ధర్మము తెలిసినవాడు నాతో యుద్ధమును ప్రకటించకయే నన్నెందుకు చంపును? అతడు నీవు అనుకొన్నంత ధర్మాత్ముడుకాడని అధునాతన పండితులవలెనే రాముని త్రోసిపుచ్చి యుద్ధమున కేతెంచినాడు. తారలోలోపల బాధపడుచు భర్తను పంపినది. వాలిసుగ్రీవులకు యుద్ధము ప్రారంభమైనది వారియుద్ధము బాహాబాహియే కాదు. ముష్టాముష్టియే కాదు, ఆ పర్వత శిఖరాగ్రములు కలంకారములై యున్న వృక్షములును వృక్షశాఖలును గూడ వారికి ఆయుధములు కాగా సాగినవి వారి యుద్ధము. కొంతసేపు సాగగా సుగ్రీవుని బలము మందగించినది. సుగ్రీవుని చూపులు రాముని వైపునకు తిరిగినవి. రాముడు గ్రహించినాడు. జీవుని బలము క్షీణించినగాని భగవంతుడనుగ్రహింపడు కాబోలు.

సుగ్రీవుడు తనకై ఎదురుచూచుటను రాముడెరిగి విల్లును ఎక్కుబెట్టి అల్లెత్రాటిని మ్రోగించగా ఆధ్వని ప్రళయకాల ధ్వనియై దిక్కుల పిక్కటిల్లజేసినది. ఆ ప్రళయధ్వని తరంగముల తోడనే రాముని బాణమును పయనించి, వాలి వక్షస్థలమును ఛేదించినది. వాలి ఆశ్వయుజ మాసమున ఇంద్రోత్సవమందలి పతాకవలె నేలకూలినాడు. ప్రాణములను కోల్పోవలేదు. నాటుకొన్న బాణము ఆ వీరుని వక్షస్థలముననే యున్నది. అప్పుడు సువర్ణకంఠాభరణములోని కాంతియు బాణతేజమును కంఠమాలలోని దివ్యతేజమును వాలి యందున్న సహజ తేజమును కలసి ఒక వినూత్న తేజము కాగా వాలి భూతలమున వెలుగొందుచు పడియుండెను. ఇంతవరకిది కథాంశము. తరువాత మనకు కావలసినది సందేహనివారణాంశము.

ఈ ఘట్టమున మామిత్రుడొకడు వాలి వధను గురించి నన్నడిగిన ప్రశ్నలను నేను చెప్పిన సమాధానములను వినిపింతును. మీకు సందేహనివారణమగును.

మామిత్రుడు : శాస్త్రిగారు! నిన్న మీ వాలి వధను గూర్చిన ఉపన్యాసమును కోల్పోయినాను. కొద్ది సమయమును నాకిచ్చి నా సందేహముల తీర్ప నా మనవి. అనినాడు. నేను ఒప్పుకొని అడుగుమనినాను. అతని మొదటి ప్రశ్న ఇది.

వీరశిఖామణియగు రాముడు వాలిని చాటునుండి ఏలకొట్టెను? అది యుద్ధ ధర్మమేనా?

నా ప్రశ్న : మీ అభిప్రాయమేమి?

మిత్రు : అది అధర్మమనియే నా నిశ్చయము.

నేను : అది ధర్మమేకాని అధర్మముకాదు. ధర్మాధర్మములు శాస్త్రాధీనములు.

మిత్రు : ఎట్లు?

నేను : ధర్మమే విగ్రహరూపము నొందిన రాము డధర్మము నెందుకుచేయును? ధర్మమునే ఆచరించును.

మిత్రు : యుద్ధమున శత్రువును చాటునుండి కొట్టుట ధర్మమేనందురా?

నేను : కాదు.

మిత్రు : మరి....

నేను : వాలివధ యుద్ధము కాదు. వాలితో రాముడు యుద్ధమును చేయలేదు. వాలి ఆచరించిన అధర్మమునకు శిక్ష విధించినాడు.

మిత్రు : ఆ శిక్ష వాలికి ఎదురుగ ఉండియే విధించుట ధర్మము గదా!

నేను : మృగముల శిక్షించుటకు ఎదురుగ వచ్చి చంపవలెనని గాని ఎదురుగ వచ్చియే కొట్టవలెనని గాని నియమములేదు. వరుగెత్తు మృగమును కొట్టవచ్చును. భయకంపితమైన మృగమును కొట్టవచ్చును. ఒక మృగము మరియొక మృగముతో యుద్ధము చేయుచున్నప్పుడు కొట్టవచ్చును. కావున రాముడు దానిని చాటునుండి కొట్టుట అధర్మము కాదు.

మిత్రు : వాలి మృగమగుచో నీవు ధర్మమునతిక్రమించితివి గావున నిన్ను శిక్షించితినని రాముడు సమాధాన మిచ్చెగదా? మృగములకు మనుష్యుల ధర్మశాస్త్రము లెట్లు వర్తించును?

నేను : వాలి ధర్మశాస్త్రముల నెరిగి రాముని ప్రశ్నించిన మృగము కావున వానిని మానవుల శిక్షాస్మృతుల ననుసరించి శిక్షించి, మృగధర్మమువనుసరించి చాటునుండి కొట్టినాడు. వాలిపైన రామునకు రెండధికారములున్నవి.

మిత్రు : వాలి అధర్మమేమందురు?

**నేను :** సోదరుని భార్యను బలాత్కారముగ తీసికొనుటే దోషము. ఆ దోషమునకు మరణ శిక్షయేగాని వేరొకశిక్ష లేదు శిక్షాస్మృతిలో.

**మిత్రు :** తారను సుగ్రీవుడును భవించెనుగదా? ఈ ధర్మము అక్కడేమైనది?

**నేను :** సుగ్రీవుని తన్ని వాలి బలాత్కారముగ రుమను తీసుకొనగా తార ఇష్టముపైన వాలి చచ్చిన తరువాత సుగ్రీవుడు గ్రహించినాడు. అట్లు పరిగ్రహించుట జాతిధర్మము.

**మిత్రు :** రాముడు ముందు వాలిని చంపి నీకు సాయము చేతునని ప్రతిజ్ఞను చేసి తరువాత మీ ఇద్దరి వైర కారణమును చెప్పుమనెను. నీవు చెప్పిన తరువాత మీ ఇద్దరి బలములననుసరించి నీకు సాయము చేసెదననెను. ఇక్కడ రాముని మాటకు సమన్వయము (సందర్భము) కుదిరినదా? బలాబలము లేమిటి?

**నేను :** కుదిరినది. ఒక న్యాయాధికారి తన కాళ్ళపై బడి ఒకడు రక్షింపుమని కోరగా నీ శత్రువును చంపియైనను నిన్ను రక్షింతు నులెమ్ము నాకట్టి అధికారమున్నదనును. అట్లే రాముడు శరణాగతుడై నాకష్టమును తీర్చుమని అడిగిన సుగ్రీవునకు మొదట వాలిని చంపి నీభయమును తీర్తునని తరువాత వైర కారణమునడిగెను. ఇక్కడ బలాబలములన వైరము ప్రబలమా? వైర కారణము ప్రబలమా? అనునది ప్రశ్న.

వైరము ప్రబలమగుచో అందొకరిని శిక్షింపక వేరొకరికి న్యాయమును కూర్చుట కుదరదు. వైరకారణము ప్రబలము గాక చిన్నదగుచో వాది ప్రతివాదుల నొక్కచో చేర్చి కారణమును సర్దవచ్చును. ఈ కారణము లచే రాముడు మొదటగ వాలిని చంపెదని తరువాత వైరకారణమును ప్రశ్నించినాడు. ప్రస్తుతమున రాముని దృష్టియందు సుగ్రీవుడు కూడ ఏదియోతప్పు చేయకున్న వాలి ఎందుకు విరోధియగును? అన్న ఊహ లేక పోలేదు. అయ్యును సుగ్రీవునిది స్వల్పదోషము. వాలిది ప్రబల దోషమైనది. ఎంత శత్రుత్వమున్నను భార్యనపహరించుట ప్రబలదోషము. కావున వాలికి మరణ శిక్షను విధించినాడు.

**మిత్రు :** ఇద్దరి మధ్య దోషమును విచారించి శిక్షించు నప్పుడు సాక్ష్యాధారము కావలెను. వాది ప్రతివాదుల నిద్దరచేర్చవలెను. రాముడట్లు చేసెనా?

నేను : చేసెను. రామునకు ఇక్కడకు రాకముందే కబంధుడు వీరిద్దరివృత్తాంతమును చెప్పినాడు. అది ప్రబల సాక్ష్యము హనుమంతుడు సుగ్రీవుని పక్షమున నిలిచినాడు. ఇదియొక సాక్ష్యము సుగ్రీవుడు ఒంటరివాడై యుండెను. ఇది ప్రత్యక్షసాక్ష్యము. నిజముగ వాలి ఈతని భార్యనపహరించెనా? అన్న సందేహమునకు తావులేదు.

మిత్రు : పర్యవసానమున రాముడుచేసిన వాలివధ ధర్మమును, నిర్దోషమునందురు.

నేను ; తప్పక. ధర్మముకాకున్నచో లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపునప్పుడు

"ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది
పౌరుషే చ అప్రతి ద్వంద్వశ్శరైనం జహి రావణిం"

అని కొట్టగా ఇంద్రజిత్తుచచ్చెను. రాముడు ధర్మాత్ముడనుటకు ఇంతకంటె సాక్ష్యముకావలెనా? ఇదిగాక వాలియే రామా నీవుచేసినది ధర్మము. నేను బాధచే నిందించితిని గాని అంతకంటె వేరులేదని ఒప్పుకొనెను. దెబ్బ తినిన వాలియే ఒప్పుకొనగా మీకెందుకు ఈ న్యాయవాదిత్వము? వాలి చివరకు దోసిలి ఒగ్గినాడు రామునకు.

మిత్రు : కవి వాలిచే అట్లు చెప్పించేనేమో? దోసిలి యెగ్గించెనేమో?

నేను : అప్పుడు కవిది దోషముగాని రామునిదేమి దోషము? వాలిని కొట్టించినవాడు కవి. చెప్పించిన వాడుకవి. ఇక్కడ రాముని ప్రసక్తియేమున్నది? ఇన్ని మాటలెందుకు? వాలి రాముని ధర్మాత్ముడనెను. వాలి భార్యతార అనెను. అంగదుడనెను. వాలికి రామునిపై కోపములేదు. అంగదుని వప్పచెప్పినాడు. మనకు రాముని విషయమున సందేహమెందుకు? రాక్షసులే రాముని ధర్మాత్ముడని ప్రశంసించగా వారికంటె క్రూరులము మనమెందుకు కావలెను? రాముని తలచి తరింతము.

మిత్రు : ధన్యుడను. నాసందేహములు చక్కగా తీరినవి.

శ్రోతలారా! మా సంభాషణ అంతతో ముగిసినది. ఇదియే వాలి వధయందలి సంశయ నివారణాంశము. తరువాత కథ.

వాలి నేలకూలెనని వానరులందరును భయచకితులై వాలి వృత్తాంతమును తారకు తెలిపినారు. తార పారిపోవు వానరుల నివారించి కిష్కింధనుండి దుఃఖ సంతప్తయై బయలుదేరినది. వాలి పడియుండుట చూచినది. పైబడి ఏడ్వసాగినది. తాను చెప్పిన మాటను కాదని భర్త ఇట్లయ్యెననునది ఆమె దుఃఖాగ్నిని రగుల్కొల్పగా హనుమంతుడు వేదాంతబోధచే ఓదార్చినాడు. తారకు అవి ఓదార్పుమాటలు మాత్రమే అయినవి. ఇక వాలితోడనే నాకు స్వర్గముకావలెనని కోరుకొన్నది. అంతలో వాలి ప్రాణము అతని దేహమునుండి వెడలిపోవుకాలము ఆసన్నమైనది.

ఆ సమయమున వాలి సుగ్రీవుని బిలచి, సుగ్రీవా! నీవే రాజువు. ఇదిగో ఇంద్రదత్తమగు మాల అని అతని మెడలో వేసినాడు. అది వాని ప్రాణములు పోవుచో తేజోవిహీనమగును. కావున వాలి ముందుగనే అట్లుచేసినాడు. అంగదుని పిలచి, వదలరాని ప్రేమ వీక్షణముల అతనిని వీక్షించి అతడు ముందు కాలము నందుండదగు నీతి విధానమును బోధించినాడు. అంతతో వాలి ఆత్మ అతని శరీరమును వదలినది. ఇప్పుడు వాలిది మృతకళేబరము. వాలిని చుట్టియుండి వాలికొరకై దుఃఖించువారు అతని బంధువులు. కోతి గుంపులన్నియు వాలి చుట్టుచేరి దుఃఖించగా సోదరుడగు సుగ్రీవునకెట్లు దుఃఖమాగును! ప్రకృతి స్వభావ మట్టిది. అన్నతోడనే తానును వెళ్ళదలచి రాముని ఆశ్రయించినాడు. రామునకును దుఃఖమాగలేదు. అతడును కన్నీరు కార్చినాడు. అది కరుణారసమునకు సంబంధించిన కన్నీరు. అప్పుడే రాముడు తారను ఓదార్చదలచి తారదగ్గరకేగినాడు. తార ఇప్పుడు రాముని ఎట్లు దర్శించినదనునది ప్రశ్న. ఈ సమయమున తార పాత్ర లోని ప్రత్యేకతను మనము దర్శించుట చాల అవసరము.

రాముడు తార దగ్గరకు వెళ్ళగనే అక్కడివారు తారను వాలినుండి విడదీసినారు. ఎట్టకేలకు భర్త శరీరమునువదలి తార తన చూపులను రామునిపై పునః ప్రతిష్ఠించినది. రాముడు ధనుర్ధారియైయే తార ఎదుట నిలిచినాడు. నిష్కళంక చంద్రుడగు రాముడు స్వప్రకాశమున వెలుగు సూర్యభగవానుని వలె భాసించగా తార రాముని …చినది. తారకు రాముడు తన భర్తను చంపిన క్రూరుడై కనబడలేదు. అపూర్వ …ఒక మహాతేజము ఇట్లు శరీర ధారియై నిలబడినదనిపించినది ఆమె అంతరాత్మ …ందు. ఆక్షణముననే తార నేత్రముల నావరించిన దుఃఖాశ్రువులు వైదొలగగా ఆమె నేత్రముల యందలి సహజ వైశాల్యము నేడు రాముని చూడ ముచ్చట

పడినవి. అప్పుడు కరుణా రసపూరణమున నిండి తొణికిసలాడు ఆరాముని నేత్ర ద్వంద్వముతో తార చూపులను స్నేహము చేసినవి. తార అంతరాత్మ అంతర్యామి రాముని దర్శించగా తార నేత్రద్వంద్వము కళ్యాణరాముని దర్శించి ఆనందించినది.

ఆసమయమున తార అంతర్రాత్మవేరై శరీరము వేరైనది. తార శరీరము తాత్కాలిక దుఃఖ చిహ్నములతో కూడియుండగా ఆమె అంతఃకరణము శుద్ధ సత్వ ప్రధానమై విశుద్ధాదర్శమువలె యైనది. ఆమె విశుద్ధాంతకరణమున రాముని నిజ తత్వము ప్రతిబింబించి వెలుపల నిలిచివున్న రాముడను నేనే అని ప్రబోధము నందించినది. ఈనా ఎదుట ధనుర్ధారియై నిలచినది సర్వ భూతాంతర్యామియని ఆమె నిర్ణయించుకొన్నది. ఇట్లు స్తుతించినది.

"త్వమప్రమేయశ్చ దురాసదశ్చ జితేంద్రియశ్చోత్తమ ధార్మికశ్చ.
అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః అన్నది.

ఈ శ్లోకము రాముని పరాపరతత్వమును తెలుపుశ్లోకము. ఈశ్లోకము నందలి ప్రథమ పాదము ఇంద్రియ వర్గము నంతను ప్రేరేపించు సద్రూపవస్తువును వర్ణించగా, రెండవ పాదమునుండి చివరి వరకును ధర్మ సంస్థాపనకై అవతరించిన అవతారమూర్తిలోని గుణములను వర్ణించినది. పర్యవసానముగ రాముని పరమాత్మనుగా నుతించి, అంతలో మరల దుఃఖమున ప్రవేశించి తనను గూడ ఒకే ఒక బాణమున నా భర్త దగ్గరకు పంపమన్నది. తారలోని ప్రత్యేకత ఏమి? రాముని పరమాత్మనుగ గుర్తించుటే.

రాముడు అట్లు మాట్లాడిన తారను సుఖ దుఃఖముల యొక్క అనిత్యతను చెప్పి ఓదార్చినాడు. నీపుత్రునకు యౌవరాజ్యము కూడ వచ్చునని వాలితోటి సహ గమనమును మాన్పినాడు. రామచంద్రులా ఘట్టమున తారనేకాదు సుగ్రీవాంగదు లను కూడ ఓదార్చినాడు తత్వ ప్రబోధమున. తరువాత సుగ్రీవుని వాలికి జరుపవలగు ప్రేత కార్యముల జరుపుమని ఆజ్ఞాపింపగా వాలికి దహన సంస్కారాదికములు జరిగినవి. తరువాత హనుమంతుడు సుగ్రీవుని పట్టాభిషిక్తుని గావింప కిష్కింధకే తెంచమనగా నేను పదునాలుగు సంవత్సరముల దనుకను నగర ప్రవేశమును గావింపనని చెప్పి, అంగదుని యువరాజును గావించుటకు సుగ్రీవుని రాజు గావించు టకును అనుజ్ఞనిచ్చినాడు.

తాను మాత్రము లక్ష్మణునితో గూడ ఆపర్వత గుహయందే వసింతునని నాడు. దానికి కారణము ప్రస్తుతమున వర్షఋతువు కావున ఇది యుద్ధయాత్రా కాలముకాదు అని సుగ్రీవాది వానరులను కిష్కింధకు పంపినాడు. ఇంతటితో ఈనాటి యువన్యాసము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 3 వ రోజు

శ్లో॥ అజ్ఞానసంభవ భవాంబుధి బాడబాగ్ని
రవ్యక్త తత్వ నికర ప్రణవాధిరూఢః
సీతాసమేత మనుజేన హృదంతరాళే
ప్రాణ ప్రయాణ సమయే మమసన్నిధత్తే॥

ఆర్య మహాశయులారా !

నేడు మన రామాయణమహాకావ్యమున జరుగుచున్న కథాభాగము కిష్కింధ కాండము. అందలి ముఖ్యఘట్టము వాలి వధ. ఈ కథాఘట్టమున రాముడు చెట్టు చాటునుండి వాలిని వధించుట అన్యాయము కాదా ? అను ప్రశ్నకు నిన్నటి యువన్యాసమున ధర్మసంరక్షణకై అవతరించిన అవతారమూర్తి చరిత్ర యందది కళంకము కాదనియు అది ఆతనుగావించదగు ధర్మరక్షణలోని భాగమనియు సమన్వయింప బడినది. నిన్నటి యువన్యాసముననే సుగ్రీవుడు పట్టాభిషిక్తుడు కూడ నయ్యెను. అది వర్షాకాల మగుటచే రాముడు రావణునిపై యుద్ధ యాత్రను సాగించక ఆ ఋశ్యమూకముననే వర్షఋతువు వలన కలుగు ప్రతిబంధకములు కలుగకుండునట్టి ఒకానొక గుహాభ్యంతరమున లక్ష్మణునితో వసించు చుండెననియు విన్న చెప్పినాను.

ఇక నేటి యుపన్యాసము :

సీతను రావణు డెత్తుకొని పోయెనని రామునకు తెలిసినది. కాని రావణు డున్న ప్రదేశమెక్కడ ? అతడు సీత నెక్కడుంచెను ? అనునది రామునకు తీరదగు సమస్య. ఆ సమస్యను తీర్చదగు ఆప్తమిత్రుడే సుగ్రీవుడు. సుగ్రీవునకు రాముని వలన జరుగదగు లాభము కలిగినది. సుగ్రీవుని వలన కలుగు ప్రత్యుపకారమును రాముడు పొందదగు కాలము ఆసన్నమైనది. వర్షఋతువు గడచినది. శరదృతు వేతెంచినది. ఇంతవరకు సుగ్రీవుడు రాముని కంటబడలేదు. రాముని కాల నిరీక్షణము సమాప్తమైనది.

కాముకుల కామము నుద్దీపింపజేయు వర్షాకాలము రాముని విరహాగ్నిని ప్రజ్వలింపచేయగా వినిర్మలాకాశమున వెలుగొందు రాకా సుధాకరుడును రాముని హృదయాకాశమున శీతకిరణుడై వెలుగొందక అగ్నిమండల మయ్యే భాసించినాడు. కావున రాముని అంతఃకరణమున సీతను గురించిన విరహాగ్ని చెలరేగినది. కాని లక్ష్మణుని ఉపశమన వాక్యములచే తాత్కాలికముగ శాంతించినది ఆ అగ్నిమండలము. రాముని మనసు నుండి తొలగలేదు. దాగినది. సీతా వియోగమను అగ్ని రాముని అంతఃకరణము నుండి వైదొలగుటకిది కాలము కాదు. అగ్నిపర్వతము బ్రద్దలగుటకు ప్రళయకాలము రావలెను. రాముడిప్పుడు అగ్నిపర్వతమువలె నిలిచినాడు. ఇదియే రావణుని దహించు అస్త్రము.

కథకు పోదము.

వాలి వధానంతరము సుగ్రీవుని తాను ఆజ్ఞాపించిన ఆజ్ఞ రాముని స్మృతికి వచ్చినది. సుగ్రీవుడు సీతను గురించి తనకు చేయదగు ప్రత్యుపకారమును మరచి స్వార్థపరుడయ్యెనని రాముడు భావించినాడు.

రాముడు కర్తవ్యపాలనము నందప్రమత్తుడు. తన కర్తవ్యములందు, లేక తానాచరించ వలసిన ఆచరణలయందు ఎవ్వడు జాగరూకుడై వర్తించునో ఆతడే తన భక్తుడు. సోమరిపోతు భక్తుల రాము డాదరింపడు. అర్థకామములు ధర్మబద్ధములు కాకున్న రాముడు సహింపడు. సుగ్రీవుని తలచగా రాముని కన్నులెర్రబడినవి. సుగ్రీవుడు కూడ వాలి వలెనే శిక్షార్హుడని కూడ అనిపించినది. కాని రాముడు తొందరపడడు. ఆతడు మహారాజు. శత్రుమిత్ర ఉదాసీనుల నెట్లు చూడవలెనో రాము డెరుగును. సామదానభేద దండోపాయము లాతని సొమ్ము. రాముడు లక్ష్మణునిచే సుగ్రీవుని మేల్కొలుప దలచినాడు. లక్ష్మణుని పిలచినాడు,

లక్ష్మణా ! సుగ్రీవు డింతవరకు మన కార్యమున ప్రవేశించ లేదు. అతడు నన్ను నాధునిగ తలచియుండ వచ్చును. రాజ్యహీనుడు రాముడు. భార్యా వియోగ మున క్రుంగిన దీనుడు. ఆత డెక్కడనుండియో వచ్చి నన్ను శరణు పొందినాడు గదా ? అని భావించెను కాబోలు. నన్నింతవర కాతడు పలకరింపలేదు. అతడు నాపట్ల కృతఘ్నుడయ్యెను.

నా వలన తనకు కావలసిన కార్యమును నెరవేర్చుకొని కృతార్థుడయ్యెను. నన్ను మరచెను. మిత్రత్వమునందిట్టి దుర్మార్గము నాచరించినవారి మృతదేహమును నక్కలుకూడ ముట్టవు. నీవిప్పుడు వేవేగ కిష్కింధకుపోయి నా మాటగ ఇట్లు చెప్పుమని బాధపడుచు చెప్పినాడు. తన మాటలను చెప్పుమనుటే కాదు. కార్య సాధనమును గావింపుమనుచు తన సందేశము నందింపుమనినాడు. ఆ సందేశమిది.

సుగ్రీవా ! నీ అన్నయగు వాలి చచ్చివెళ్ళిన మార్గమింకను మూయబడలేదు. అతడట్లు చచ్చుటకు కారణము నీవెరుగనిది కాదు. నీవొక ప్రతిజ్ఞను చేసితివను మాట నొక్కమాటు జ్ఞాపకమునకు తెచ్చుకొని ఆ ప్రతినను కాపాడుకొనుము. వాలిత్రోవ ననుసరింపకుము. ఒకవేళ నిన్నును వాలివలెనే ప్రయాణము చేయించ వలసి వచ్చుచో అతనిని పంపినట్లే నిన్ను పంపుదునని తలచకుము. వాలి నొక్క నినే స్వర్గమునకు పంపగా సత్యమును అతిక్రమించిన నిన్ను, నీ బంధువర్గముతో హతమార్చెద సుమా ! అని చెప్పుమనినాడు. ఇవి దండనార్హములగు మాటలు. కేవలముగ దండము నుపయోగించుటే రాముని లక్ష్యము కాదు.

అన్నగారి మనస్తాపము లక్ష్మణుని కలవర పెట్టినది. రాముడు సుగ్రీవున కందించమన్న సందేశము కాలహరణమని లక్ష్మణుడు భావించినాడు. ఎప్పుడో సుగ్రీవునకు దండమును విధించుట కాదు. అన్నా ! నేనిప్పుడే సుగ్రీవుని వాలి దగ్గరకు పంపుదు ననినాడు. అంతతో అతడు సుగ్రీవుని వదలలేదు. అన్నగారిని కూడ మందలించినాడు. "న రాజ్యమేవం విగుణస్య దేయం". రాజ్యము నిట్టి దుష్టులకు అందించుట అమాయకత్వమనినాడు.

లక్ష్మణుని ఆవేశము రాముడెరుగనిది కాదు. లక్ష్మణుని ఆవేశము అతనిని ముందు వెనుకల ఆలోచింప నివ్వదు. కావున లక్ష్మణుని శాంతుని గావించి తాను చెప్పుమన్న మాటను మాత్రమే చెప్పునట్లు శాసించవలెను. ఆ పనినే చేసినాడు రాముడు.

లక్ష్మణా! నీవంటి వారెవ్వరును ఇట్టి పాపమును చేయతలపెట్టరు. సుగ్రీవుడు మనకు ఆప్తమిత్రుడు. అతని పూర్వవృత్తము మనకిక్కడ స్మరణీయము. తనలోని బలపరాక్రమములు ఎవ్వరిపైనైన చంపుటకే పనికివచ్చుట పాపహేతువు. తాను చేయదలచిన పాపమునే ఉపసంహరించుట వీరపురుష లక్షణము. సుగ్రీవుడిప్పుడువధార్హుడుకాడు. అతనిపై మనమిప్పుడు వాడదగినది సామముగాని దండము కాదుఅనిబోధించి, సామము చేతనే నేను పంపించు కార్యమును సాధించుకొని రమ్మనినాడు. ఇక మనము లక్ష్మణునితో కిష్కింధకు పోదము.

అతడుమహోగ్రమూర్తియయ్యేకిష్కింధకుబయలుదేరినాడు. రాముని బాధను తలచుకొలదిని లక్ష్మణుని క్రోధాగ్నిజ్వాలలు సుగ్రీవునిపైకి నాలుకలు తెరచుచున్నవి. అతని గమనము మహావేగమైనది అతని గమన వేగమునకు కిష్కింధను ఆవరించియున్న వృక్షరాజములుగాని, పర్వత దుర్గములుగాని అడ్డుతగులుటలేదు. అవన్నియు అతనిధాటికి లోబడియే అతనికి దారినొసంగినవి. లక్ష్మణుడు కిష్కింధకు చేరినాడు. ఆనగర రాజమాతని కంటబడినది అరుణ కషాయనేత్రములతో పెదవు లదరగా ఆనగరమును దర్శించినాడు.

అది కిష్కింధకు బాహ్యప్రదేశము. ఆప్రదేశమున రక్షకభటులు లేక పోలేదు. వారును వానరులే. బాణపాణియై క్రోధమూర్తియై వచ్చిన లక్ష్మణుని చూడగనే ఆవానరులందు కొందరు పర్వత శిఖరములనెత్తగా మరికొందరు వృక్షముల పెకిలి చేతబట్టుకొనినారు. వారిప్రయత్నము లక్ష్మణుని తరిమివేయుటకే. లక్ష్మణుని క్రోధము రెట్టించినది. రెట్టించిన క్రోధముతోనున్న ఆ లక్ష్మణుని వానరులు దర్శించుటకే భయము కలుగగా వారందరును నలుదిక్కులకు పరుగులెత్తినారు. కొందరు సుగ్రీవభవనమునకు వెళ్ళి లక్ష్మణుని రాకను చెప్పినారు. సుగ్రీవుడప్పుడు వారిగోలను వినునట్టి స్థితియందులేడు ఆసమయము సుగ్రీవునకు తారతో సుఖ భోగములనుభవించు సమయము. లక్ష్మణునిచూచి భయపడిన వానరులు సామాన్యులుకారు. వారొక్కొక్కరు వేయి, ఇన్నూరు, మున్నూరు ఏనుగుల బలము కలిగిన వానరభటులు. వారు చెదిరి పారిపోవుటను అంగదుడు గమనించినాడు. రాజ్యమునకేదియో ప్రమాదము వచ్చినదని తలచినాడు. ద్వారదేశము లందున్న వానరుల నందర నొక్కచోకూర్చి, అతడు వచ్చినాడు లక్ష్మణుడున్న ప్రదేశమునకు. లక్ష్మణుని చూచినాడు. ఒక్కమాటుగ అంగదుని గుండె బ్రద్దలైనది. ఇక్కడ నిలబడినవాడు లక్ష్మణుడై కనపట్టలేదు. అప్పుడు లక్ష్మణుని ఆకృతి వడగ

విప్పిన త్రాచుపామువలెనున్నది. అది ఒకతల గల త్రాచు కాదు. అయిదుతలలు గల సర్పరాజము విషముగ్రక్కుచున్నట్లున్నది. లక్ష్మణుడు క్రోధ వేగమున విడుచు ఉచ్ఛ్వాస నిశ్వాసలు పంచాస్యపన్నగము విడుచు బుసలవలె వినబడగా ఆతడు ధరించిన శరాసనములోని బాణాగ్రములు ఫణీంద్రుని నాలుకలవలె కన్పట్టగా ఆతని దివ్యతేజము ముఖములనుండి వెడలివచ్చు విషసంఘాతమై వెలయగా అంగదుడును భయకంపితుడై లక్ష్మణుని ఎదుట నిలిచినాడు. అప్పుడు లక్ష్మణుడు అంగదుని ముఖముననే సుగ్రీవునకు తనరాకను తెలుపదలచినాడు. ఎర్రనైయున్న రక్తనేత్రములతోడనే అంగదునిచూచి, వత్సా! అని సంబోధించి సుగ్రీవునకు నారాకను చెప్పుమనినాడు. నారాకకు కారణము నా అన్నగారియొక్క బాధయేనని చెప్పుమనినాడు. చెప్పుటమాత్రమేకాదు, చెప్పి అతిశీఘ్రముగా తిరిగివచ్చి సమాధానమును కూడ ఇవ్వమని రామాజ్ఞగ తాను ఆజ్ఞాపించినాడు. అంగదుడు చాల భయపడినాడు. వేవేగ సుగ్రీవుని యొద్దకేగి లక్ష్మణుని రాకను విన్నవించినాడు. సుగ్రీవుని సమాధానము తిరిగివచ్చి లక్ష్మణున కందించునట్లులేదు. పినతండ్రి పాదములకు మ్రొక్కి తారకును, రుమకును గూడ వందన మాచరించి లక్ష్మణుని రాకలోని ఆంతర్యమును వెలిబుచ్చినాడు.

సుగ్రీవుడు ఒడలెరిగిలేడు. కామసుఖానుభవమునందున్మత్తుడై నిద్రామదమున తూగుచున్న సమయమది. సరాసరిగ సుగ్రీవుని ఆఘట్టమునుండి మేల్కొలుపుట కెవ్వరికినిగుండెలేదు. కావున వానరులందరొక్కచోచేరి లక్ష్మణుని ప్రసన్నము గావించి సింహనాదమును గావించినారు. సుగ్రీవునకు మెలకువ వచ్చినది. ఆసనమును వదలినాడు ధైర్యముతోడనే.

రాజుయొక్క ప్రమాదమును సర్ది రాజును రక్షించదగువారు మంత్రులు. సుగ్రీవుని మంత్రులిద్దరు. వారిద్దరును లక్ష్మణునిరాకను, అంగదుని ఆతురతను సుగ్రీవునకు తెలిపి లక్ష్మణుని శాంతింపజేయుట చాల అవసరమని వినయ పూర్వకముగ సలహానిచ్చినారు.

విజమునకొక విధముగ సుగ్రీవుడు రాముని ఉపకారమును మరువలేదు. రామునకు తానుచేయదగు ఉపకారము రాముడు తనకుచేసిన ఉపకారముకంటె చాల చిన్నదనియే సుగ్రీవుని భావముకూడ. కాని కామోపభోగములలోపడి కాలమును మరచినాడు. రాముని క్రోధమునకు తన కాలవిస్మరణయే కారణమనుమాట ఆతనికి

తోచలేదు. మంత్రులు రామలక్ష్మణుల క్రోధము తెలుపగనే ఆతని హృదయమొక విధమగు శంకను, ఒక విధమగు భయమునకును చోటుచేసుకొన్నది. ఆతని శంక ఏమి? రామలక్ష్మణులకేదియో తనకుగల శత్రువర్గము తనపై నేరములు చెప్పుటే ఆతని క్రోధమునకు కారణమైయుండవచ్చునని శంకించినాడు. ఇక భయమెందు కందురా? రాముడు తనను చంపునన్న భయముకాదు. రామునితోటి చెలిమి చెడిపోవు నేమోనను భయము సుగ్రీవునకు కలిగినది.

“సర్వథాసుకరం మిత్రం దుష్కరం పరిపాలనం”.

మిత్రత్వమును సంపాదించుట కష్టముకాదు. ఆమిత్రత్వము చెడకుండ పరిపాలించుకొనుట చాలకష్టము. దీనికే భయపడినాడు సుగ్రీవుడు. ఇట్టి సమయమున అతనికి నిజమగు కారణము తెలియవలెను. ఎవరు చెప్పుదురు? రామ సుగ్రీవ మైత్రికి కారణభూతుడగు హనుమంతుడచ్చటనే యుండెను. అతడు మహాపండితుడు. నేర్పరి. సుగ్రీవునకు సత్యమును చెప్పినాడు. యుద్ధోద్యోగమునకు తగుకాలము వచ్చినదన్న మాటను నీవు మరచుటే రాముని క్రోధమునకు కారణముగాని వేరొక కారణము కాదనినాడు. ప్రస్తుతముగ లక్ష్మణునకు దోసిలియొగ్గి నీఅపరాధమును క్షమింపవేడుటయే కర్తవ్యమని నిర్దేశించినాడు. రామునికి నీపైవచ్చిన క్రోధము నీపై నగల స్నేహభావమున కలిగిన క్రోధమేగాని స్నేహభంగమగు క్రోధము కాదని నిర్దేశించినాడు.

సుగ్రీవుడు కన్ను తెరచినాడు. లక్ష్మణుని తన గుహాభ్యంతరమునకు తోడ్కొని వచ్చుటకు వానరుల నాజ్ఞాపించినాడు. వానరులందరును దోసిళ్ళనొగ్గి తన కభిముఖులుకాగా సుగ్రీవుని రత్నమయ గుహాభ్యంతరమున కేగినాడు లక్ష్మణుడు.

అది కేవలమగు జాతివానరులు వసించు ప్రదేశము కాదు. దేవతాశక్తులు రావణ సంహారమునకై వానరాకారముల దాల్చి తమ తమ మహదైశ్వర్యములతో భూఖండమున కేతెంచగా వారందరకు రాజైన సుగ్రీవుని గుహాద్వారమది. ఆ గుహ కలంకారమును చేకూర్చు సుందరోద్యాన వనములతో సుగ్రీవుని గుహాభ్యంతరము చూడముచ్చటయై యుండుటే కాదు, అనేకములగు రత్నమయ స్తంభ వినిర్మితమై కూడ దేవతల ఐశ్వర్యమును ప్రదర్శించు చున్నది. ఆ ప్రదేశము నందనేక

హర్మ్య ప్రాసాదములు కూడ కట్టబడి అంగదాది ప్రముఖవానరుల గృహములును అందున్నవి. దేవ గంధర్వ స్త్రీలు తమ తమ కామరూపములతో విహరించుట అందలి ప్రత్యేకత. వారు నేటి పండితమ్మన్యులు భావింపు, వానరాకారముగనున్న మనుష్యులుగావి వానరములుగాని కారు. ముందుకు పోదము. సప్త ప్రాకారముల దాటి, లక్ష్మణు డక్కడి సుందర సుకుమార దృశ్యముల చూచుచునే సుగ్రీవుని గుహాద్వారమున కేగినాడు. లక్ష్మణునకుమాత్రమా దృశ్యములు నేత్రోత్సవములై లేవు. పై పెచ్చు ఆతని క్రోధమునకు ఉద్దీపనములై నవి కూడ. అంతే కాదు. అచ్చటి వానరస్త్రీల విహారము లాతనిని సిగ్గును గొలిపిన వనినారు వాల్మీకి. ఆ ద్వారదేశమున కేగిన లక్ష్మణుడేమి చేసెను? క్రోధోద్దీప్తమానసుడై జ్యావల్లిని సారించి ధనుష్టంకారమును చేసినాడు. సుగ్రీవుని గుండెలదరినవి. తానప్పుడు లక్ష్మణుని కెదురగుట యుక్తము కాదని తలచినాడు సుగ్రీవుడు. మరేమి చేయ వలెను? క్రోధముపశమించిన లక్ష్మణుని ఆతడు దర్శించవలెను.

తార చాల వ్యవహారదక్షత గల వ్యక్తి. మాటకారి. లక్ష్మణుని క్రోధమును చల్లార్చగలదు. కాక మహనీయుల క్రోధదృష్టులు స్త్రీలపై కార్యరూపమును ధరించవు. ఈ భావమును దృష్టియందుంచుకొని సుగ్రీవుడు లక్ష్మణుని వద్దకు తారను పంపినాడు.

మద్యపానమున మత్తిల్లిన తార సిగ్గునువదలి లక్ష్మణునితో మాట్లాడవచ్చి నది. రాజపుత్రుడైనను లక్ష్మణు డామెనుచూచి తలవంచినాడు. తార ముందుగనే లక్ష్మణుని పలకరించి తన చతురవచనములతో ఆతని క్రోధమును ఉపశమింపజేయ యత్నించి తన దృష్టియందాతడు ప్రసన్నుడయ్యెనని భావించిన తరువాత నీవంటి మహనీయులు మా అంతఃపురమునకు రావచ్చునని లక్ష్మణుని లోపలకు గొంపోయినది.

లక్ష్మణుడు లోపలి కేగినాడు. సుగ్రీవుని చూడగనే ఆతనికి కోపమాగలేదు. రాముడు చెప్పమన్న మాటను తు, చ, తప్పకుండ చెప్పినాడు.

సుగ్రీవుడును లక్ష్మణుడును మాట్లాడుకొనినప్పుడు హనుమంతుడక్కడనే యుండెను. హనుమంతుడు సుగ్రీవునకు సచివుడు. వెంటనే హనుమంతునకు అనేక పర్వత ప్రాంతములందును, పర్వత గుహలయందును గల వానరవీరులను పిలిపింపుమని సుగ్రీవు డాజ్ఞాపించినాడు. పర్వత ప్రాంతములే కాదు. సముద్ర

తీరములందును కపి ప్రవరులాక్రమించి యుండిరని చెప్పినాడు సుగ్రీవుడు. ఆ కపులలోని తారతామ్యముల కూడ వర్ణించిన వర్ణనలను గమనించుచో వారందరును దేవతాయోని విశేషులనుటకు మనము సందేహింపము.

సుగ్రీవాజ్ఞ యను మాట నేటికిని అంతరించలేదు. ఆతని ఆజ్ఞను శిరసావహించి అనేక దివ్యౌషధ రసాయన ఫలమూలములను ఉపాయనముగ తీసికొని వానర సమూహమంతయు సుగ్రీవుని చుట్టుముట్టినది. ఇక కావలసిన దేమున్నది? రాముని కార్యము సిద్ధించిన దనియే సుగ్రీవుడు తలచినాడు.

అది రాముడు వసించు ఋష్యమూక పర్వత గుహాంతర్భాగము. ఇప్పుడు రాముడు ఒంటరివాడు కాడు. సుగ్రీవుని వద్దకు పంపిన లక్ష్మణుడు ఆ ప్రమిత్రుడగు సుగ్రీవునితో గూడ మేనాను దిగినాడు. కపి సైన్యమును వారివెంటవచ్చి గుంపులు గుంపులుగ నిలచినది.

వాలి వధానంతరము సుగ్రీవుడిప్పుడే రాముని కలసినాడు. సుగ్రీవునిపై కోపించి లక్ష్మణునిచే సందేశము పంపిన రాముడేనా? ఇతడు? అవును. సుగ్రీవుని భార్యయగు రుమను అనుభవించిన వాలికి మరణశిక్షను విధించిన రాముడు తారను తన దానిని గావించుకొని కామసుఖానుభవమున మత్తుడైన సుగ్రీవు నేమి చేసెను? అనునది ప్రశ్న కాకపోదు. సుగ్రీవుని శిక్షించెనా?

రామునకు పక్షపాతము లేదు. సుగ్రీవుని కూడ శిక్షించినాడు. శిక్షావిధానము కర్త చేయు దోషములపైన ఆధారపడి యుండుననను సిద్ధాంతమును మృచ్ఛకులు మరువరాదు. వాలి సుగ్రీవునిభార్యను బలాత్కరించి సుగ్రీవుని తరిమివైచి అనుభవించగా సుగ్రీవుడు వానరజాతి ధర్మము ననుసరించి తార ఇష్టముమీద పరిగ్రహించుట ఇచ్చటి ప్రత్యేకత. కావున సుగ్రీవునకు లక్ష్మణుని ముఖముగ వాగ్దండనమును విధించి, ఇప్పుడు సుగ్రీవుని కౌగలించుకొని ఉపదేశపూర్వకముగ సుగ్రీవుని దోషమును ఉద్ఘాటించి మిత్రుని దండించినాడు. ఇది మిత్రదండనము. అంతే కాదు. తన బాధను కోర్టునకు విన్నవించుకొన్న గాని న్యాయాధికారి శిక్షింపడు. రామునకు తన బాధను సుగ్రీవుడు విన్నవించుట అక్కడివిషయము. ఇక్కడ రాజగువాడు ధర్మార్థకామముల సక్రమముగ నెరవేర్పకుండుట ఇక్కడి విషయము. కావున సుగ్రీవునకు రాముడు ఉపదేశపూర్వకముగ ఆతని దోషము చెప్పినాడు.

"ధర్మ మర్ధంచ కామంచయస్తు కాలేనిషేవతే.
విభజ్య సతతం వీర సరాజాహరిసత్తమ.
హిత్వాధర్మం తధార్ధంచ కామంయస్తునిషేవతే.
సవృక్షాగ్రే యధాసుప్తః పతితః ప్రతిబుధ్యతే.

సుగ్రీవా! ధర్మార్థ కామములను ప్రాతఃకాల మధ్యాహ్న సాయంకాలముల ననుభవింపుమని శాస్త్రము విధింపగా అట్లుగాక ధర్మమును వదలి అర్ధకామముల సేవింపుచో చెట్టుచివ్వర పరుండి నిద్రించుట వంటిదని చెప్పినాడు. అచ్చటి నుండి పడుచో వాడెట్లు బ్రతుకును? పడకుండుటెట్లు? అని భోధించి తరువాత తన కార్యమును గురించి ఆలోచింపుమనినాడు. ఇదియే సుగ్రీవున కిడినశిక్ష. తరువాతి కథ.

సుగ్రీవాజ్ఞచే అనేకమంది వానరులు రామునివద్దకే తెంచినారు. సుగ్రీవుడును వారిని రామునకు వప్పచెప్పగా రాముడు వారికోటి కాదగు కార్యమును నీవే చేయుమని సుగ్రీవునకే వదలుట జరిగినవి. సుగ్రీవుడు వానరులనందర విభాగించి అందొక్కొక్కని నాయకుని గావించి ఆ నాయకునికి సహాయముగనుండ దగు వారల నియమించి నలుదిక్కులకును పంపినాడు. తూర్పుదిక్కునకు పంపువారికి ఆదిక్కున గల ప్రదేశములనన్నిటిని తెలిపి తూర్పు సముద్రము వరకును వెతుకుడనినాడు. ఆతరువాత మీరు వెళ్ళుటకు సాధ్యముకాదని తెలిపినాడు. అట్లే దక్షిణ పశ్చిమో త్తరము లందలి విశేషముల తెలిపి సముద్ర పర్యంత ప్రదేశమును వర్ణించినాడు.

ఇందొక విషయమును మీకు చెప్పవలసియున్నది.

వాల్మీకి చెప్పిన నదీ నద పర్వతములును నగర రాజములును నేటికివి ఆనామములతోడనే ఆమార్గానుసరణముగ నయ్యే ఆయాస్థలములయందే యుండెనా? అవి మనకిప్పుడు కనుగొన సాధ్యములేనా? అను ప్రశ్నను చాలమంది యుదురు. ఈప్రశ్నకు సరియగు సమాధానము రావలెనన్న నాకుసాధ్యముకాదు. ఎణుమవ కెవ్వరికివి సాధ్యముకాదు. అనేకవేల సంవత్సరములుగా పరిణమించిన భూభాగములలోని విషయములను సరాసరిగ సప్రమాణముగ నిరూపించుట ఎట్లు ఎవరికి సాధ్యమగును?

నాడు కవి వర్ణించిన ముఖ్యములగు నదీ నదములును పర్వతాదులును నేటికిని ఆయా పేర్లతో పేర్కొనబడియే వ్యవహరింపబడుచున్నవి. రామాయణ

మున వర్ణితములగు ఆయా పేర్లతో పిలువబడు ప్రదేశము లివ్వియేనని నొక్కి వక్కాణించుట కుదరని పని యనక తప్పదు. మహేంద్ర పర్వతమేదియో ఎవరు నిర్ణయింతురు ? లంకలోని విశేషములనుబట్టి లంక ఈనాటి సింహళమనుట ఎట్లు కుదురును ? లంకలోని కొన్ని వర్ణనలను ఇవి కవి యొక్క ఉత్ప్రేక్షలు మాత్రమే అయి యుండవచ్చునని క్రీస్తుశకము ననుసరించిన చరిత్రలతో అన్వయించుట తగనిదని. కావున ఈ రామాయణమున వాల్మీకి వర్ణించిన వర్ణనలను మీముందుంతును. మీకే ఆయా స్థల నిర్ణయముల వదలుదును.

నలుదిక్కులకును పంపబడిన వానరులెవరో వారికి ఆయాదిక్కులలోని విశేషములను సుగ్రీవుడు ఎట్లు తెలిపెనో ఆయా ఘట్టములను కొన్నింటిని తెలిపెదను.

తూర్పుదిక్కునకు వినతుని, దక్షిణమునకు నీలుని, హనుమంతుని, జాంబవంతుని గజ గవయ గవాక్ష గంధ మాధనులను అంగదుని పంపినాడు. పడమటకు సుషేణుని పంపి, ఉత్తరమునకు శతవలిని పంపినాడు. వీరందరును కొన్ని కోట్ల వానరులతో సీతను వెతకుట కేగినారు. ప్రస్తుతమున వీరి కర్తవ్యము రావణుని గృహ మెక్కడుండెను ? అందు సీత బ్రతికి యుండెనా ? లేదా ? అను విషయముల తెలిసికొని వచ్చుట మాత్రమే.

సుగ్రీవుడు తూర్పునగల విశేషముల కొన్నిటి నిట్లు చెప్పినాడు.

సరయూనదీ, గంగ, కౌశికి, సింధువు మొదలగు నదులను చెప్పి, ప్రాక్పశ్చిమముల పారునదులనన్నిటిని వెతుకుమనినాడు. ఆ తరువాత కొన్ని దేశములను చెప్పినాడు. కాలమహి, బ్రహ్మమాల, విదేహము, మాళవము, కౌశికాపురము, మగధదేశ గ్రామాలు వర్ణింపబడినవి. ఆతరువాత సముద్రమునందుండు కొండలును, పత్తనములను, ఆ పర్వతముల వసించు జనులను వర్ణించినాడు. ఒక పర్వతము పైన పెదవులనంటు చెవులు గల వారుండిరట, లోహముఖులుండిరట, ఒంటికాలి వారుండిరట, మనష్యులను తిను వారుండిరట. పచ్చిచేపలను తిను వారుండిరట, బంగారు వర్ణముగల వారుండిరట. ఇట్లెన్నియో విశేషములను చెప్పినాడు.

ఆతడీ దేశములను నదులను కిష్కింధ నాధారముగా గొనెనో భూమధ్య రేఖ నాధారముగా గొనెనో తెలియదు. భూమధ్య రేఖ గూడ ఒక నిశ్చయమై

ఎక్కడున్నది? ఉజ్జయినిని ఆధారముగా గొని మన జ్యోతిశ్శాస్త్ర మెకప్పుడు దైవజ్ఞులచే వర్ణింపబడగా ఈనాడు అనగా క్రీస్తుశకమున గ్రీన్‌విచ్చుని ఆధారముగా గొని నడచుచున్నది. ఉజ్జయినికి పూర్వము శరావతీ నదిని ఆధారముగా గొని భూభాగము విభక్తమైనట్లు కొన్ని గ్రంథములు వర్ణించినవి. ఈ శరావతీ నది వింధ్యమునకును హిమాలయమునకును నడుమ ఆర్యావర్తమున కలదని అమర కోశమున వర్ణితమైనది. కావున నేను దేశ నిర్ణయమునకు పూనుకొనలేదు. తూర్పు దిశను దాటిపోవుటకు వీలుగాని ప్రదేశము వరకును చెప్పినాడు. నేను దేశ విభాగమును పరిశీలించుటను లక్ష్యముగా గొనలేదు. దక్షిణమున కేగువారికి గూడ ఇట్లే చెప్పినాడు. ఈ దక్షిణ దిక్కున వర్ణించిన వాటినిగూడ కొన్నిటిని తెలిపెదను.

ఉత్కల, దశార్ణ, అశ్వవంతి, అవంతి, విదర్భ, మహిషి, వంగ, కాశీ, కళింగ, అంగ, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ దేశములను వర్ణించెను. మలయ, మహేంద్ర పర్వతములను చెప్పి, ఆయా పర్వతములందు గల విశేషముల చెప్పి లంకాపురి కూడ ఆ దిక్కునే కలదని చెప్పినాడు. ఇంకెన్నియో విశేషముల చెప్పినాడు ఇట్లే పశ్చిమమునకు సుషేణుని పంపుచు, ఆ దిక్కున సురాష్ట్ర, బాహ్లీక, శూరసేన, భీమ దేశములను కొన్ని అడవులను, హేమ, వజ్రధరమను పర్వతములను వర్ణించి సముద్రపర్యంత ప్రదేశములను తెలిపినాడు. తరువాతది ఉత్తరదిశ గదా? ఆదిక్కునకు శతవలిని పంపినాడు. ఆదిశ యందున్న హిమాలయ వర్ణనను గావించి శూరసేన, పుళింద, ప్రస్థల, మద్రక, భరత, కాంభోజ, యవన, శక దేశములను వర్ణించినాడు. ఈ దిక్కుననే మ్లేచ్ఛ దేశములు కూడా వర్ణింపబడినవి. మ్లేచ్ఛదేశము లనగానేమి?

ప్రత్యంతో మ్లేచ్ఛ దేశస్స్యాత్ అని అమరము. భారతవర్షమునకు చివరి యందు శిష్టాచార రహితమై స్వేచ్ఛాచారములు గల దేశము.

చాతుర్వర్ణ్య వ్యవస్థానం యస్మిన్ దేశే నవిద్యతే మ్లేచ్ఛ దేశ స్సవిజ్ఞేయ ఆర్యావర్త స్తతః పరం.

ఆర్యావర్తమున కావలది మ్లేచ్ఛదేశము. ఈ మ్లేచ్ఛదేశమును వర్ణించిన బోధాయనుని వాక్యమిది.

గోమాంస భక్షకోయస్తు విరుద్ధం బహుభాషతే
సర్వాచార విహీనశ్చ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే.

గోమాంస భక్షకులై విరుద్ధ భాషణముల భాషించెడువారు మ్లేచ్ఛులట. క్రౌంచపర్వతము,మానసమను పర్వతము కూడ ఈదిక్కున వర్ణించబడినవి. పర్యవసానముగ ఈ దిశయందెన్నియో దివ్యస్థలములు వర్ణింపబడి ఉత్తర కురుభూములు కూడా వర్ణింపబడినవి. మనమిక కథకు పోదము

ఈ సీతాన్వేషణ మహాకార్యమునకు హనుమంతునే ప్రధాన పాత్రను గావించుట జరిగినది. వీరందరకును ఒక్కమాసమాత్ర కాలమును అవధినొసంగినాడు. అంతియే.

శ్రీరామచంద్రునకు గూడ హనుమంతునే జూపి ఈతడే నీ కార్యమును నెరవేర్ప సమర్థుడని చెప్పగా రాఘవేశ్వరుడును హనుమంతుని పూర్వ కార్యములను తలచి అట్లే నిశ్చయించుకొని, తనచేతి ఉంగరమును హనుమంతునకే యిచ్చినాడు. సీత కనబడుచో దీనిని ఆమెకు గుర్తుగ ఈయవలసినదని. కాని శ్రోతలకిక్కడ ఒక సందేహము కలుగవచ్చును. రాముడరణ్యమునకు వచ్చునపుడు సమస్తమును వదలెనుగదా? ఉంగరమెక్కడిది? అని. ఇది వివాహకాలమందలి ఉంగరము. కావున దీనిని వదలలేదు. కథకురందు .

వానరుల పయనము సాగినది. సీతను తెచ్చెదము, రావణుని చీల్చెదమను నినాదములతో నాలుదిక్కుల నావరించినారు వానరులు. నెలయైనది. తూర్పు,పడమర ఉత్తర దిక్కుల కేగిన వానరులేతెంచినారు. సీత కనబడలేదను వార్త రామసుగ్రీవులకందినది. దక్షిణదిశకేగిన జాంబవదాదులు మాత్రము రాలేదు.

దక్షిణదిశకేగిన హనుమదాదులకు ప్రధానమగు ప్రదేశము వింధ్యపర్వతమైనది. అవిచాల విస్తారము. ఆ ప్రదేశమునంతను వానరులు కలయదిరుగక పోలేదు.

ఆ పర్వతము నాధారముగా గొనియున్న కీకసారణ్యములన్నియు హనుమదాదులచే వెదకబడినవి. వారి అన్వేషణము ఫలవంతముకాలేదు. నిరాశవారిని వరించినది. వారందరును విస్పృహులయ్యె. ఒకచో తూలబడినారు. వారు తూలబడిన ప్రదేశము కూడ వింధ్యపర్వతములోని భాగమే.

మనము చేయు ప్రతి ప్రయత్నమును క్షణక్షణ పరిణామమునొందుటను మనము గమనింపజాలము. ఇక ఈ కార్యమును గురించిన నా ప్రయత్నము సమాప్తమైనదని కాళ్లసాచిన మరుక్షణముననే ఆశాజనకములగు కొన్ని నన్ని వేశములు పొడచూపుట సృష్టిలోని వైచిత్ర్యమనక తప్పదు. విరాగానిస్పృహలతో వింధ్యాద్రియందు చతికిలబడి దప్పికగొనిన వానరులకొక దృశ్యము కంటబడినది. వారు కూర్చున్న ప్రదేశమునందొక మహాబిలమున్నది. (గుహ) ఆగుహకు ప్రవేశద్వారము మాత్రము వారికంటబడలేదు. ఆగుహాంతర్భాగమున సరస్సుఉంటునని వారెట్లు నిర్ణయింతురు? అట్టి ఘట్టములయందే అనుమాన ప్రమాణము కావలసివచ్చును. అనుమాన ప్రమాణమన కొన్ని హేతువులను బట్టి అచ్చటి యదార్థస్థితిని కనుకొనుటకు సాధనము. పొగను బట్టి ఆ పొగవచ్చు ప్రదేశమున నిప్పు ఉండుటను నిర్ణయించుకొనుటకు అనుమాన ప్రమాణమని పేరు.

ప్రస్తుతమున ఈ వానర సమూహమున హనుమంతుడు బుద్ధి వైశద్యము కలవాడనుటకు ఒప్పుకొనని వారుండరు.

హనుమంతుని దృక్పథమునందొకదృశ్యము ప్రత్యక్షమైనది. ప్రత్యక్షము లేక అనుమానమునకు తావులేదు. పొగప్రత్యక్షమగుచున్న అక్కడ కంటికి కనబడని నిప్పునెట్లు ఊహింతుము?

కొన్ని పక్షులు ఆగుహాంతర్భాగమునుండి బయటకు వచ్చుచున్నవి. అవి హంసలు, బెగ్గురు పక్షులు మొదలైనవగుటచే అందొక సరస్సు ఉండియుండునని అతడూహించినాడు. అంతేకాదు ఆగుహకు ముందు భాగమున కొన్ని వృక్షరాజము లను గూడ నాధారముగాకొని ఆగుహాంతర్భాగమున ఒక సరస్సు ఉండియుండునని అతడూహించినాడు.

ఆ వానరులందరును హనుమంతుని ఊహను ప్రమాణముగాగొని ఆగుహను కూడ వెదుకుట అవసరమని నిశ్చయించుకొనినారు. ఆగుహకు స్వయంప్రభా బిలమని పేరు. అంగదాదివీరవరులందరును హనుమంతుని ఊహననుసరించి ఆగుహలోపలకు పోవ ప్రారంభించినారు అది అంధకారబంధురము. ఒక్కొక్కరు ఎవరికి వారై పోవక ఒకరిచేతినొకరు ఆధారముగాగొని ఆగుహాంతర్భాగమున పయనమును సాగించినారు. వారి పయనము కొంతదూరము సాగినది. అక్కడ గుహాభ్యంతరమున గల గాఢాంధకారమంతయు మటుమాయమైనది. వారక్కడొక కాంతి పుంజ

మును దర్శించినారు. ఆ కాంతి దివ్యమణుల మహాప్రకాశము. అందొకమణిమయ సౌధముకూడ వారికంపబడినది. అక్కడనే వారొక తపస్వినిని కూడ చూచినారు. ఆమె చాల వయోవృద్ధ. ఆమె దర్శనము వారికొక మహాభాగ్యమైనది. అంతలోఆమె వారిదగ్గరకేతెంచినది. వీరెవ్వరో ఆమెకు తెలియదు. వారిని అడిగి తెలుసుకొన్నది ఆతపస్విని. ఆతరువాత వారికి ఆమెవలన ఆతిధ్యము దొరికినది. ఆమె అందించిన ఫలాహారములగొని ఆమె అందించిన మధురశీతోదకములచే దప్పిని తీర్చుకొని, అక్కడ సీతలేదని ఆస్వయంప్రభవల్లనే తెలుసుకొనినారు. అప్పటికి సుగ్రీవుడు వారికొసగిన కాలము గడచిపోయినది. అందుండివారు బయటకు పోవలెను. అది వారికి సాధ్యమగుపనికాదు. అక్కడికేగిన వారెవ్వరను ప్రతికిబయటకు పోవరని తెలిపినది ఆస్వయంప్రభ. ఆగుహాంతర్భాగమున అట్టి నిర్మాణము గావించినవాడు మయుడు. దానవశిల్పి. మయుని పుత్రికకు స్వయంప్రభ స్నేహితురాలు. ఆమె ఈమెకు వప్పచెప్పగా ఇది ఈమెకు సంక్రమించినది. అప్పుడు వారికి దిక్కేమి? స్వయంప్రభయే వారికి దిక్కును కల్పించవలెను. ఆమెయే వారికి సంగతినితెలిపి, వారందరను కన్నుల మూయించి తన యోగశక్తిచే వారిని వింధ్యాద్రియందొక ప్రదేశమునకు చేర్చినది. అది వారు బిలప్రవేశమునకు ముందువసించిన ప్రదేశము కాదు. వారు సాధించదగిన మహాకార్యమును సాధించుటకు దారి తీయదగు ప్రదేశము. అది ఆతపస్విని అనుగ్రహము.

ఇప్పటికి దక్షిణదిశకు బయలుదేరిన వానరుల అన్వేషణకిదియొక తుది ఘట్టము.

అంగదుడు వీరికినాయకుడు. ఇతడు యువరాజుకూడ. ఈసందర్భమున ఆతడొక నిశ్చయమునకు వచ్చినాడు. తన నిశ్చయమును తనతోటి వానరుల కందరకు తెలుప నిశ్చయించినాడు.

అంగదుని నిశ్చయమేమి?

సుగ్రీవుడు చండశాసనుడు. సీతాన్వేషణకై తమకు ఇచ్చిన మాసము గడువును గడచినది. సీతజాడను కనుగొనకయే కాలము గడచినది. ఇక కిష్కింధకు పోయిన వానరులకు శిక్ష తప్పదు. అది మరణశిక్షయే. అందు తానే మొదటి వాడనని ఆతడు నిశ్చయించుకొనినాడు. కావున తానిప్పుడేమి చేయదలచినాడు?

ప్రాయోపవేశమును గావింపదలచినాడు. ప్రాయోపవేశమన కూడును, నీళ్ళను ముట్టక మరణింపవలయునని పండుకొనుట, ప్రాయమన ఆహారములేని వ్రతము. మరికొన్ని అర్థములీ పదమునకున్నను ఈ అర్థమిక్కడ వచ్చును. ఈ విషయమునే ఎదుటివారికి జాలి కలిగించు ధ్వనితో సుగ్రీవుని దయమాలిన వానినిగా నిర్వచించి తోటి వానరులను ఒప్పించినాడు. వారు ఒప్పుకొనిరిగాని చావునకు భయపడని వారుందురా? వారొక విధముగ మరణభయ కంపితులగుట మాత్రము వారి ముఖముల కన్పట్టక తప్పలేదు. అంగదుడు చాలమేధావి. ఒక్కమాటుగ తన ప్రాయోపవేశ నిశ్చయమును మార్చుకొని, 'స్వయంప్రభా బిలమున వసించి సుగ్రీవుని మరణదండమును తప్పించుకొందమని వారిభయమును తీర్చినాడు. పర్యవసానముగ అంగదుని భావము కిష్కింధకు పోకుండ కొందరు వానరులతో తానిక్కడ వసించుటకు నిశ్చయించినాడు.

మన హనుమంతుడు కనుగొనజాలని ఊహాప్రపంచము నెవ్వరును సృష్టింపజాలరు. అంగదుని ఊహాప్రపంచమొక నూతన సృష్టయని హనుమంతుడు గ్రహించినాడు. అంగదుడొక నూతన సామ్రాజ్యమును సృష్టించు యత్నమును గావించుచుండెనని అంగదుని మాటలనుబట్టి హనుమంతునకు నిర్ణయమైనది. "అథమేనేహృతం రాజ్యం హనూమాన్ అంగదేనతత్". నూతన సామ్రాజ్య స్థాపనకుండదగు సాధనసామగ్రి అంగదునకు కలదని హనుమంతునకు తెలుసును. అంగదునకున్న అర్హతలను హనుమంతుడిట్లు వర్ణించినాడు.

ఎనిమిది అంగములతో కూడిన బుద్ధికలిగి, నాలుగుబలములతో కూడి పదునాలుగు గుణములు కలవాడట అంగదుడు.

అష్టాంగము లెవ్వి? నాలుగు బలములును, పదునాల్గుగుణములును ఏవియో మీకు సవిస్తరముగ తెలిపెదను.

చెప్పెడిదానిని చక్కగవినుట దీనికి గ్రహణమని పేరు. విన్నదానిని తనలో నిలుపుకొను యత్నము. దీనికి ధారణ యని పేరు. మరల మరల విన్న విషయమును స్మరించుట స్మరణము. దానిని ఇతరులకు ప్రతిపాదించు సామర్థ్యము ప్రతిపాదనము. స్వీయములగు ఊహాపోహలు కలిగి విషయమును అర్థము చేసికొనగలుగుట తత్వమును గ్రహించుశక్తి. ఇవి ఎనిమిది గుణములు.

తరువాతవి నాలుగు బలములు. బాహుబల, మనోబల, ఉపాయబల బంధుబలములు. బంధుబలమన తాను నమ్మదగిన సంఘబలము. ఇక పదునాల్గు గుణములు.

దేశకాలముల గుర్తెరుగుట, శక్తి, కష్టములను ఓర్చగలుగుట, శిల్పాది శాస్త్రములను గురించిన జ్ఞానము, ఉదారబుద్ధి, ధనసంపద, ఆలోచనను దాచుట, భ్రమజ్ఞానము లేకుండుట, పరాక్రమము, ఎదిరి శక్తిని గ్రహింప గలుగుట, చేసిన మేలును మరువకుండుట, శరణాగతులపై వాత్సల్యము, సమయమును గుర్తెరిగిన క్రోధము, చంచలత్వము లేకుండుట అను గుణములు పదునాలుగు. ఇవన్నియు అంగదుని యందుండుట వలన ఇతడు క్రొత్త సామ్రాజ్యమును స్థాపించగలడని నిశ్చయించినాడు హనుమంతుడు. నిశ్చయించి ఏమిచేసెను? అంగదుడు తనతో కూడ గట్టుకొన్న వానరులను, అంగదుని నుండి భేదింపజేసినాడు. కారణమేమి? అంగదుడు కాళించు ఈభేదముచే సుగ్రీవుని రాజ్యము చీలగా రాముని కార్యము చెడిపోవును. ఇదియే హనుమంతుని ముఖ్యమగు అభిప్రాయము. ఎట్లు భేదించెను?

అంగదుని దృష్టియందు స్వయంప్రభా బిలము సుగ్రీవునకు అప్రభేద్యము. కావున మనమిక్కడ స్థానము నేర్పరచుకొన్నచో సుగ్రీవుడు మనల శిక్షింపడని తనవారికిచెప్పి, సుగ్రీవుని వలన భయము తీర్చినాడు అంగదుడు. దానిని చక్కగ ఖండించినాడు హనుమంతుడు. లక్ష్మణుని బాణములకిది భేదింపరానిది కాదు గావున మీరు భయరహితులై ఇందుండ సమర్థులు కారనినాడు. ఈమాటతో అంగదుని బలము నాధారముగొన్న వానరుల ధైర్యము భంగినది. తరువాత అంగదుడు ఈ వానరులనందరును నమ్ముటయందలి దోషమును వ్రేలుబెట్టి చూపినాడు.

అంగదా! నీవెవరిని నమ్మితివో వారు సహజముగ చపలులు. అదిగాక తమ తమ భార్యాబిడ్డలపై గాలిమళ్ళగా వారందరును నీఆజ్ఞయందేల వర్తింతురు? అప్పుడు నీకు బంధుబలము భంగును. స్థిరబుద్ధి గలిగిన జాంబవంతుడును నేమును ఇంత కొందరుమ నీవారముగాము. మేము వెళ్ళి మీరున్న రహస్య ప్రదేశమును రామలక్ష్మణుల కెరింగింతుము. అప్పుడైనను నీచావు తప్పదు. కావున ఈ కార్యమును విరమించుము. సుగ్రీవుడు నీవనుకొన్నట్లు దుర్మార్గుడు కాడు అని నిర్ధారణగ చెప్పినాడు.

అంగదుడీ సందర్భమున సుగ్రీవుడు దుర్మార్గుడు కాదనుటను ఒప్పుకొనక సుగ్రీవుని యందలి దోషములనే ఉద్ఘాటించినాడు.

హనుమంతుడు అంగదునకు మరల ఏమియు సమాధానమివ్వక మౌనమును వహించినాడు.

అంగదుడు సుగ్రీవుడు తప్పక తన్ను చంపుననుటనే బలపరచుకొని తాను మాత్రము ప్రాయోపవేశమును చేయుటకే సిద్ధుడయ్యెను. ఆ సమయమున అంగదుని నిశ్చయము మిగిలిన వానరుల హృదయములను కరగించినది. వారును అంగదుని అనుకరించుటకే నిశ్చయించుకొనినారు. వానరుల ప్రాయోపవేశకార్యము స్థిరపడినది. మృత్యుముఖమున ప్రవేశించుటకే వారు నిశ్చయించుకొనినారు.

భగవంతుడు తనను గురించి ఏమని నిశ్చయించెనో వారెరుగరు. ఎవ్వరును ఎరుగరు. కాలముచే పరిపక్వములై కాలచక్రమున పరిభ్రమించు జీవుల కర్మ ఫలములు భగవానుని స్వాధీనము నందుండును.

వానరులు ప్రాయోపవేశము చేయ నిశ్చయించుకొన్న ప్రదేశముననే ఒక గుహాంతర్భాగమున సంపాతి యను పక్షిరాజు వసించుచుండెను. అది జటాయువునకు సోదరుడు. వీరిద్దరును చతుర్ముఖుని సృష్టికి మొదటి భాగములోని వారే. మనమొక్కమారు వానరుల యొద్దకు వత్తము.

అంగదుడు దక్షిణాగ్రముగ దర్భల పరచినాడు. తూర్పు మొగమై ఆ దర్భలయందు కూర్చొనినాడు. తన మరణము నెవ్వరెవ్వరికి తెలుపవలెనో వారందరి పేర్లను తన మిత్రులకు తెలిపినాడు. అది ఆతని మిత్రులకు భయంకర దృశ్యము కాకపోవుటెట్లు? మిగిలిన వానరులును అంగదునే అనుసరించి దర్భల పరచుకొని ప్రాయోపవేశమునకు సిద్ధమైరి. అందు కన్నీరు కార్చనివారు లేరు. సుగ్రీవుని నిందించని వారును, వాలిని పొగడని వారును లేరు. వారు సామాన్యముగ కన్నీరు కార్చుట కాదు. ఎలుగెత్తి ఏడ్చినారు. వారి దుఃఖధ్వానము మేఘము ఉరిమినట్లైనది.

అప్పుడే సంపాతి గుహాంతర్భాగము నుండి బయటకు వచ్చినది. వీరి శరీరములు సంపాతి ఆహారమునకు పనికివచ్చునట్లున్నవి.

ఆ మాటనే సంపాతి నిర్ణయించుకొన్నది. ఆ సంపాతియే వీరి కంటబడినది. సంపాతి భగవంతుడు నొసగిన ఆహారమే ఈ మృగశరీరములని అనుకొన్న మాటయు వీరి చెవిన బడినది.

అంగదుని ఒడలు వణకినవి. బ్రతికియుండగనే ఈ పక్షికి ఆహారమగుట అంగదునికి భయకారణ మైనది. మరణ భయమెవ్వరిని ఒణికించదు ? అంగదు డాంజనేయునివైపుకు దిరిగినాడు. ఆతనిని పేరుబెట్టి పిలిచినాడు. రాముడరణ్యము నకు బయలుదేరుటే తమ చావుకు కారణమని పించినది అంగదునకు. ఆంజ నేయునకు తన ఆవేదనను వ్యక్తపరచినాడు. రాము డరణ్యమునకు బయలుదేరుటతో ప్రారంభించి ఇంతవరకును జరిగిన కథాభాగము నంతను ఏకరువు బెట్టినాడు. అందులోనిదే దండకారణ్యమున జటాయుపక్షి మరణ వృత్తాంతము. ఆ సందర్భముననే అంగదునిచే జటాయువు యొక్క అదృష్టము కూడ కొనియాడబడినది. రామునిచేత మరణ సంస్కారము జరుగుట జటాయువు మహాభాగ్యమని ఏడ్చుచు, తమ దురదృష్టమును తలపోసికొని సీతను కనుగొనలేక పోవుటకు వాపోయినాడు.

ఈ కథాభాగము సంపాతి చెవిని బడినది.

సంపాతిహృదయ మొక్కమారు తారుమారైనది. తన తమ్ముని మరణ వార్త సంపాతిని కదలించినది. తనతమ్ముని మరణవార్త తెలియక ఎంత కాలమై నదో, సంపాతి ఇప్పుడు వానరులకు మృత్యువు కాదు. ప్రాణదాత కానున్నది. ఇదియే కాలచక్ర భ్రమణమున కలుగు చిత్రము.

సంపాతి వానరులను తన్ను కొంచెము దగ్గరకు చేర్పుమన్నది. నా రెక్కలు నొకప్పుడు కోల్పోతి నన్నది. తమ్ముని మరణవార్తను విన్న దుఃఖముతోడనే దీనస్వరమున పలికినది. వానరులెట్లు నమ్ముదురు ? ఎట్టకేలకు చావునకే నిశ్చ యించుకొన్న మన కెందుకీ భయమని కొందరు ధైర్యముచేసి సంపాతి వచనముల నమ్మి క్రిందకు దింపినారు.

సంపాతి తనరెక్కలు కాలిపోవుటకు కారణమునుచెప్పినది. నా తమ్ముడగు జటాయువును నేనును మా వేగమును తెలిసికొనుటకు ఆకాశమున ఎగురుచుండగా అది మధ్యాహ్న కాలమగుటచే సూర్యకిరణముల తాకిడికి నాతమ్ముడు జంకు గొని నాడు. వాని బాధను మాలేక నా రెక్కలచే ఆతని కప్పగా నా రెక్కలు కాలి నే నిక్కడ పడితినని చెప్పి జటాయువు వృత్తాంతము మీ వలన వింటినన్నది,

అంగదుడు నిజముగ నీవు జటాయువు తమ్ముడవగుచో రావణుని నివాస ప్రదేశ మిక్కడికెంత దూరమున్నదో తెలుపు మనినాడు.

సంపాతికి కూడ తనతమ్మునివలెనె రామకార్యమునకు తోడ్పడి పుణ్యమును సంపాదించుకొను కాలము వచ్చినది. ఈ విషయమునే సంపాతియు తలచి ఆనందించి పక్షులయందగ్రగణ్యమగు మా జాతికి చాల దూరదృష్టి కలదని సీత రావణుని లంకయందుండెనని వాక్సాహాయ్యమును చేసినది రామ కార్యమున. ఆ లంక ఈ సముద్రమున నూరు యోజనముల దాటుచో దొరకు నన్నది. అంతియేగాక రావణుడొక త్రిలోకసుందరి నెత్తుకొనిపోవుచుండగా చూచితినన్నది. నా జ్ఞానదృష్టిచే చూచి మీరు సీతనుచూచి శుభమును బడయగలరని కూడ చెప్పుచుంటి నన్నది.

శ్రోతలారా! వానరుల సంతోషమునకు మేర ఎక్కడ? వారందరును లేచి గంతులు వైచినారు. అంతలో తన తమ్మునకు తర్పణ గావించుటకై తన్ను సముద్రము దగ్గరకు గొంపొమ్మని సంపాతి వానరుల నర్థించగా వారట్లే చేసినారు. సంపాతిచరిత్ర నింతటితో వదలుదము. ఆ సంపాతికి రెక్కలు వచ్చిన చరిత్ర కలదుగాని అది ప్రక్షిప్తమని వ్యాఖ్యాతలు వ్రాసినారు. ఏది ఏమైనను మన ముఖ్యమగు కథాభాగమున కేగుదము.

వానరులందరును ఆ దక్షిణ సముద్రమునకు తీరపు ఒడ్డుకు చేరినారు. ఇక వారు సముద్రమును దాటవలెను.

అదిచూచు వారికి ఒడలు పులకరింపదగు జలప్రదేశము. సృష్టి ఖండమున భూమికిదియొక సరిహద్దు. అందొక ప్రదేశమున జలము నిద్రించుచున్నట్లు కదలబారక యుండగా ఇంకొకచో మహోత్తుంగ తరంగములు పెల్లుమీరుచు ఆకాశమునందు కొనుచుండెను. దానివైశాల్యమును ఆకాశమునకు పోల్చవలెను. దాని అడుగుభాగము రాక్షసాక్రాంతము. అట్టి మహా సముద్రమును తిలకించినారు వానరులు. ఆ వానర భటుల గుండెలొక్కమాటుగ అదరి పోయినవి. ఈ మహా సముద్రమును దాటుటెట్లు? అని. అంగదుడు యువరాజు. దడిసిన వానరుల నందర నొక్కచోచేర్చి ధైర్యవచనములచే వారికి ధైర్యమును పురిగొలిపినాడు. ఆ

తరువాత వారందర నుద్దేశించి ఎవరెవరు ఎంతెంత దూరము లంఘించగలరో చెప్పు మనినాడు.

అందుకొందరు పదియోజనములును మరికొందరు ఇరువది ముప్పదియోజన ముల చెప్పిరేగాని ఏఒక్కరును నూరు యోజనముల సముద్రమును దాటగల మన్నవారు లేరు. జాంబవంతుడు మాత్రము నేనొకకాలమున త్రివిక్రమావ తారమునెత్తిన విష్ణువునకు వేగముగ ప్రదక్షిణము గావించితినని చెప్పి ఆవయసు గడవగా ఇప్పుడు నేను ముసలి నైతిననినాడు అయ్యును ఇప్పుడు నేను తొంబది యోజనముల దూరము దాటగలననినాడు. వానరుల కాశ్చర్యము కలిగి జాంబవంతుని ప్రశంసించినారు. చివరిలో అంగదుడు లంకకు పోగలనని చెప్పినాడు. కాని జాంబవంతు డొప్పుకొనలేదు కారణమేమి? నీవుమాకు స్వామివి. స్వామి ఎప్పుడును ప్రజలచే చేయించవలెనుగాని తాను చేయరాదని నివారించినాడు. ఇందొక రహస్యము లేకపోలేదు. యజమాని శత్రుస్థలమున పట్టుబడుచో అసలుకు మోసము వచ్చును. కావున దూతలనే శత్రు క్షేత్రములకు పంపవలెను గాని నాయకుడు పోగూడదు. అంగదునకేమియు తోచలేదు. మరల ప్రాయోపవేశమే గతి యనినాడు. కాని ఆలోచనయందు హనుమంతుడుండెనా? లేదు. అతడొక చోట సుఖాసీనుడై యుండెను.

జాంబవంతుని దృష్టి హనుమంతుని పైకి ప్రసరించినది. ఒకవేళ వీరిలో ఎవ్వరైన సముద్రమును దాటి లంక కేగినను అచ్చట సీతను వెతుకవలెను. రాక్ష సులతోటి యుద్ధము వచ్చుచో వారిని జయించవలెను గదా? అందుకు సమర్థుడు హనుమంతు డొక్కడేనని జాంబవంతుడు నిశ్చయించుకొనినాడు. ఎవ్వరైన ప్రోత్సహించిననే గాని ఆతని శక్తిని ఆతడు గ్రహింపజాలడు. జాంబవంతుడు హనుమంతుని సమీపించి ఆ మహనీయుని జనన ప్రకారమును, ఆతని అమోఘ ప్రభావ సంపన్నత్వమును వర్ణించి లంకకేగుటకు ప్రోత్సహించినాడు. జాంబ వంతుని ప్రోత్సాహ సమయమున ఆతడెట్లుండెను?

తతస్తు వై జాంబవంతా ప్రచోదితః
ప్రతీతవేగః పవనాత్మజః కపిః
ప్రహర్షయం స్తాం హరివీర వాహినీం
చకార రూపం మహదాత్మన స్తదా.

జాంబవంతుని చేత ప్రబోధితుడైన వాయుసూనుడు తనతోటి వానరుల నందర నమితోత్సాహము కలవారిగ కావించుచు మహోన్నతమగు రూపమును ధరించినాడట. అంతేకాదు. హనుమంతుడు తాను వెళ్ళదగిన మార్గమును, వెళ్ళి చేయతగిన కార్యమును కూడ తన మనః ఫలకమున దర్శించి వానరుల నందర నుత్సాహ పరచినాడు. వారును మహోత్సాహము కలిగి నీవు సీతా దర్శనము చేసి వచ్చువరకును ఒంటికాలిపైన నిలబడి ఎదురుచూతుమని ఉత్సాహముగ పలికినారు. హనుమంతుడు లంకకు వెళ్ళెననియే మనము తలచవలెను. "జగామలంకాం మనసా తరస్వీ". ఇంతతో కిష్కింధ కాండ పూర్తియైనది.

మధురాతి మధురమైన రామాయణ మహామాలా రత్న ప్రభల ప్రసరింపజేయు సుందరకాండ యొక్క ప్రారంభము రేపు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.